# ANTARANI VASANTAM
## G. KALYANA RAO

మొదటి ముద్రణ : ఏప్రిల్, 2000

కాపీలు : 1000

వెల : రూ. 50/-

కవర్ డిజైన్ · జి. గోపి

ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

ప్రతులకు :
వి. చెంచయ్య, 6-5-13, పిన్నంరాజువారి వీధి, కావలి.
నవయుగ బుక్ హౌస్, కాచిగూడ, హైద్రాబాద్
దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైద్రాబాద్
ప్రగతి బుక్ హౌస్, మ్యూజియం రోడ్, విజయవాడ
నవోదయ, అరండల్ పేట, గుంటూరు

ముద్రణ :
నాగేంద్ర ప్రెస్, ఫోన్ · 434267
విజయవాడ -2

అమ్మ
నాన్న

శ్యాం
మహేష్
మురళి
లక్ష్మీరాజ్యం

– ఈ వసంతాన్ని మీకు ప్రేమతో

# ముందుమాట

ఈ వసంతం అప్పుడూ నిషేధమే,
ఇప్పుడూ నిషేధమే.

పుట్టిన కులం నిషిద్ధం. కోరుకొన్న
పోరాటం నిషిద్ధం.

అది నిన్న కావచ్చు. ఈ రోజు కావచ్చు.
కాలం ఏదైనా కావచ్చు.

ఈ వసంతం అప్పుడూ నిషేధమే.
ఇప్పుడూ నిషేధమే.

# 1

*మొదటగా మీకు రూతును పరిచయం చేస్తాను. తర్వాత కథలోకి వెళ్తాను.*

*ఆమెని రచయిత్రిగా ఎరిగినవాళ్ళు మా అభిమాన రచయిత్రిని మాకు కొత్తగా పరిచయం చేయాల్సిన సాహసం చెయ్యొద్దనొచ్చు. నిజమే. ఆమె బోలెడు కథలు రాసింది. కవితలు రాసింది. అయితే నేను యిప్పుడు పరిచయం చేస్తోంది రచయిత్రి రూతుని, ఆమె రచనల్ని కాదు. కేవలం రూతుని. నాకు తెలిసిన రూతుని.*

రూతు రోజూ ఒంటరిగా కూర్చొంటుంది. రూబేను మరణించాక ఒంటరిగా కూర్చోవడం చాలా ఏళ్ళుగా చేస్తోంది.

అట్టా ఒంటరిగా కూర్చొని ఆకాశంలోకి చూస్తుంది. ఆకాశంలో ఓ ఒంటరి చుక్క మాత్రమే కన్పిస్తుంది. తక్కిన చుక్కలన్నీ ఆమెతో తమకు సంబంధం లేనట్టు అదృశ్యమైపోతాయి. ఆ తర్వాత తన కళ్ళ ముందు సగం విరిగిన ఎత్తయిన గోడమీద శిలువపైని జీసస్ వర్ణచిత్రం కన్పిస్తుంది.

అప్పుడు ఆ ప్రాంతం అందంగా వుండేది. మందులకన్నా ముందు ఆ వాతావరణమే రోగిని బతికించేది. అక్కడ తాను నర్సుగా వుండేది. తన రూబేను ఆస్పత్రి బోధకుడుగా వుండేవాడు.

గతం వెళ్ళిపోతుంది. వర్తమానం ముందు నిలుస్తుంది. వెళ్ళిన గతంలో గూడు కట్టుకొని కూర్చుంటే వర్తమానం కూడా గతమౌతుంది. కాని తన జ్ఞాపకం గతం కాదంటుంది రూతు. రూబేను తనకు ఎప్పుడూ వర్తమానమేనంటుంది.

రూబేను తన జీవితంలోకి ఎంత నిశ్శబ్దంగా వచ్చాడో అంతే నిశ్శబ్దంగా వెళ్ళాడు. వెళ్ళినవాడు వుట్టినే వెళ్ళలేదు. బోలెడు వసంతాన్ని బతుకంతా వర్షించి వెళ్ళాడు. మలుపు మలుపుకు ఓ జ్ఞాపకం పూసినట్టు, పూసేరాలినట్టు ఎన్నో చెప్పాడు. కథలు చెప్పాడు. కవితలు అల్లాడు. కల్లోలం సృష్టించి ఈ జ్ఞాపకం నీ గుండెల్లో దాచుకోమని వెళ్ళాడు. నిజానికది జ్ఞాపకం కాదు. ప్రవాహం. ఎట్టా దాచుకోవడం ఆ ప్రవాహాన్ని.

ఓ వెన్నెల రాత్రి చెప్పడం మొదలెట్టాడు. అనేక రాత్రులు పొడిగించాడు. చెప్పిందే చెప్పాడు. చెబుతూనే నవ్వాడు. చెబుతూనే ఏడ్చాడు. అప్పుడు అతని కళ్ళు మెరిసేవి.

అప్పుడు అతని కళ్ళు తడిసేవి. ఆ మెరుపు తన కళ్ళల్లో దాచుకొంది. ఆ 'తడి' తన కంటిరెప్పలకి రాసుకొంది. నిజానికవి అతను పంచిన జ్ఞాపకాలు మాత్రమే కావు. తడిసిన కళ్ళు. గుండెల్ని పిండుతాయి. వెన్ను తాకుతాయి. వెన్నాడుతాయి

అతను, అతని పూర్వీకులు క్రూరంగా ప్రవహించే వరద నీటిలో ఈదారు. కొందరు కొట్టుకుపోయారు. కొందరు అలసిపోని సరంగుల్లా తీరాలు వెతికారు. ఎట్టాంటివాడు తన రూబేను. ఎంత అద్భుతమైనవాడు ఆ అందమైన అంటరానివాడు. ఈ మాటలు వింతగా వుండొచ్చు. కాని రూతు ఆ మాటలు చాలా సహజంగానే, మామూలుగానే అంటుంది. రూబేనుతోనే ఆ మాటలు అనేది. "నా అందమైన అంటరానివాడా" అని పదే పదే పిల్చేది. అప్పుడు రూబేను చిన్న పిల్లాడిలా చూసేవాడు. కళ్ళనిండా అమాయకత్వం నిండి వుండేది.

చాలా ఏళ్ళనాటి మాట. నిన్న జరిగినట్టు వుంది. నిన్న కాదు తన కళ్ళముందు యిప్పుడే జరుగుతున్నట్టు ఉంది. తన తాతల ఊరు చూపుతానంటే అతన్తో బయలుదేరింది. కాలినడక. పెళ్ళయిన కొత్త రోజులు. పెళ్ళయ్యాక అతన్తో ఒంటరిగా నడవడం అదే మొదటిసారి. ఏటిగట్టు మీది నడక. ఆకాశం పంచుతున్న వెన్నెల. ఏట్లో ఎగిరిపడే చిన్ని చిన్ని చేపల అలజడి. అతని పక్కనే నడుస్తున్నప్పుడు యిద్దరితో కూడిన ఒంటరితనం. విచిత్రమైన ఒంటరి అనుభవం.

అప్పుడు మొదలెట్టాడు చెప్పటం.
వలవలా కురిసే వెన్నెల వానని.
జలజలాపారే సెలయేటి కదలికని.
అంటరాని వసంతాన్ని.

"చాలా దూరం నడిచాం. యింకా యింత నడవాలి. ఈ రాత్రంతా పట్టొచ్చు. ఎట్టా వుంది. అలసటగా వుందా"

"లేదు. కొత్తగా వుంది. వింతగా వుంది'

"కథ చెప్పనా"

"చెప్పు"

రూబేన్ కథ యింకా మొదలెట్టలేదు. ఏమొచ్చిందో తెలీదు. రాత్రి పిట్ట రొద చేస్తూ పక్కనుంచి దూసుకపోయింది. వెన్నెల్లో అది కన్పించినంత దూరం చూస్తూ వుండిపొయ్యారు. దాని కూత మాత్రం యింకా విన్పిస్తూనే వుంది.

"ఎన్నెల పిట్ట, ఎప్పుడూ అంతే. ఏదో ముంచుకొచ్చినట్టు అరుస్తుంది. ఎవరో తరుము తున్నట్టు పరుగెత్తుతుంది. మళ్ళా కన్పించదు. మళ్ళీ విన్పించదు."

ఆ మాటలు రూబేను యిప్పుడంటే రూతు వొప్పుకోదు. అది తన జ్ఞాపకాల్లో ఎప్పుడూ కన్పిస్తుంది. ఎప్పుడూ విన్పిస్తుంది. రూబేను చెప్పిన కథ గుర్తొచ్చినప్పుడల్లా ఎన్నెల పిట్ట గుర్తొస్తుంది.

రూబేను తాతకు వాళ్ళ తాత చెప్పిన కథ. ఆ కథలో శివుడు వుంటాడు. పార్వతి వుంటుంది. వాళ్ళకో కామధేనువు వుంటుంది. అది తేనెలూరే పాలు యిస్తుంది. సహజంగా ఆవు పాలు తేనెలూరవు. కాని కామధేనువు పాలు తేనెలూరుతాయి. ఆ పాలతో పార్వతి దేవతలకు దేవుళ్ళకు విందుచేస్తుంది. ఆ విందుకు దేవతలు మాత్రమే అర్హులు. ఋషులు మాత్రమే ప్రత్యేక ఆహ్వానితులు.

ఆ మహిమ గల కామధేనువును కాయడానికి ఓ కుర్రాడు వుంటాడు. పేరు చెన్నయ్య. ఓ రోజు ఆ కుర్రాడికి ఆ తేనెలూరే పాలు తాగాలనిపిస్తుంది. తన కోర్కెని పార్వతితో చెప్పుకుంటాడు. పార్వతి అతని కోర్కెని కాదంటుంది. కాని ఆ కుర్రాడు తన కోర్కెను చంపుకోలేదు. పదే పదే పార్వతితో వెల్లడిస్తాడు. పార్వతి ఆ కోర్కెను కామధేనువుతోనే చెప్పుకోరా చెన్నా అని అంటుంది. వాడు అట్టాగే చేస్తాడు. తన కోర్కెను కామధేనువుతో చెబుతాడు. విచిత్రం. ఆ కోర్కె వినగానే కామధేనువు నేల మీద కుప్పకూలుతుంది. చచ్చి వూరుకుంటుంది.

కామధేనువు చచ్చిన సంగతి శివపార్వతికి తెలుస్తుంది. దేవుళ్ళకి దేవతలకి కబురు వెళ్తుంది. కామధేనువు మాంసం వండి దేవుళ్ళకి దేవతలకి విందు చెయ్యాలని శివపార్వతులు అనుకొంటారు. కామధేనువు పాలే తేనెలూరుతాయి. యిక దాని మాంసం ఎట్టా వుంటుందో అని సమస్త దేవతలు, దేవుళ్ళు, ఋషులు లొట్టలు వేస్తూ చచ్చిన కామధేనువు చుట్టూ మూగారు.

అప్పుడో చిక్కొచ్చింది. కామధేనువును అది చచ్చిపడివున్న చోటునుంచి యింకో చోటుకు చేర్చాలి. అది ఆచారమన్నారు దేవుళ్ళు దేవతలు అట్టా చెయ్యకపోతే శాస్త్రం వొప్పుకోదన్నారు ఋషులు. సరేనంటే సరేనన్నారు. కాని ఆ చచ్చిన కామధేనువును కదిలించడానికి సకల దేవతలకి దేవుళ్ళకి శక్తి చాలలేదు. చివ్వరకు ఋషులు సలహా యిచ్చారు. దాన్ని కదిలించే శక్తి జాంబవంతుడికి ఒక్కడికే ఉందన్నారు. శివుడు చెన్నయ్యని పిలిచాడు. జాంబవంతుణ్ని పిలవమని ఆజ్ఞాపించాడు.

"తాతా.................... మహా ......................... దిగిరా"

చెన్నయ్య భూ దిగంతాలు విన్పించేలా కేకపెట్టాడు. జాంబవంతుడు ఆకాశం నుండి దిగివచ్చాడో, భూలోకం నుండి పైకి ఎక్కివచ్చాడో, తెలీదు. ముల్లోకాల్లో ఎక్కడో ఒకచోట నుండి మాత్రం వచ్చాడు. కామధేనువును చూశాడు. దేవుళ్ళని దేవతలని చూశాడు. ఋషుల్ని పలకరించాడు. వాళ్ళంతా అతను ఏం చెయ్యాలో చెప్పారు. అంతే. కామధేనువును జాంబవంతుడు ఎడమచేత్తో ఎత్తాడు. దేవతలు, దేవుళ్ళు జాంబవంతుణ్ని దీవించారు. ఋషులు జయ జయ ధ్వానాలు చేశారు. అట్టాంటి సందర్భాల్లో దేవుళ్ళు, దేవతలు, ఋషులు అట్టాగే చేస్తారు. అది ఆచారం కావచ్చు. ఆ తర్వాత ఆ కామధేనువును ఎంత దూరం తీసుకవెళ్ళాలో, ఎక్కడ వుంచాలో చెప్పారు. సమస్త దేవతలు, దేవుళ్ళు, ఋషులు వెంటరాగా జాంబవంతుడు కామధేనువును వాళ్ళు వుంచమన్నచోట వుంచాడు.

దేవతలు ఆ ఆవును కోశారు. తోలు వలిచారు. ఈ తర్వాత కోసిన ఆవు మాంసాన్ని రెండు భాగాలు చెయ్యమని జాంబవంతుడికి చెప్పారు. రెండు భాగాల్లో ఒక భాగాన్ని మాత్రం వండమన్నారు రెండో భాగాన్ని మంత్రించి మళ్ళీ కామధేనువు బతికేలా చేస్తామన్నారు. అక్కడ నుంచి వెళ్ళిపోయారు. తినబోయే ఆవు మాంసం రుచిపైన తర్జనభర్జనల్లో మునిగిపోయారు.

జాంబవంతుడు వాళ్ళు కోరినట్టు కామధేనువు మాంసాన్ని రెండు భాగాలు చేయలేదు. మొత్తం మాంసాన్ని వండటం మొదలెట్టాడు. కలబెట్టేటప్పుడు వుడుకుతున్న మాంసం ముక్క ఒకటి నేలమీద పడింది. మట్టి కొట్టుకుంది. ఆ ముక్క అశుభ్రమౌతుంది. చెన్నయ్య ఆ ముక్కను శుభ్రం చేశాడు. ఉడికే మాంసంలో వేశాడు.

ఈ విషయం శివపార్వతులకు తెలుస్తుంది. మాంసాన్ని రెండు భాగాలు చెయ్యనందుకు దేవతలకి, దేవుళ్ళకి జాంబవంతుడి మీద కోపం వస్తుంది. అశుభ్రమైన మాంసం ముక్కని మళ్ళీ వుడికే మాంసంలో వేసినందుకు చెన్నయ్యమీద కోపం వస్తుంది. కోపం వస్తే శివుడికే కాదు ఏ దేవుడికైనా చాతనైంది శపించడం. శివుడు శపిస్తాడు. కలియుగంలో చచ్చిన గొడ్లని తింటూ, బజార్లు ఊడుస్తూ బతకండని జాంబవంతుణ్ణి, చెన్నయ్యని శపిస్తాడు. ఆ శాపం చిరకాలం వర్థిల్లుగాక అని సమస్త దేవతలు, దేవుళ్ళు, ఋషులు వంతపాడుతారు.

జాంబవంతుడు, చెన్నయ్యలు వండిన మాంసం తింటారు. కలియుగంలో జాంబవంతుడి సంతానం మాదిగలయ్యారు. చెన్నయ్య సంతానం మాలలయ్యారు.

కథ చెప్పటం పూర్తయినట్టు రూబేను తనకేసి చూశాడు. తానేమీ మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

"ఎట్టా వుంది కట్టుకథ" నవ్వుతూనే అన్నాడు.

"మా తాత నమ్మించేలా చెప్పాడు. వాళ్ళ తాత నమ్మకమైన సత్యంలా చెప్పాడు. నువ్వూ నేనూ పుట్టిన కథ. మన పుట్టుక ఎక్కడుంది. శాపంలో వుంది. దేవతల ఆగ్రహంలో వుంది. ఎగిరిపడ్డ మాంసం ముక్కలో వుంది. ఎందుకుంది ?" నిలదీసి అడిగినట్టు అడిగినా అతను ఆ మాటలు కోపంగా అనటం లేదు. నవ్వుతూనే అంటున్నాడు. తాను మాత్రం అప్పటికీ ఏమీ చెప్పలేదు. ఎన్నెల పిట్టకోసం వెతికింది. అది రొద చేస్తూ వెళ్తే బాగుండని అనిపించింది. అదే మాట రూబేనుతో అంది. ఎన్నెల పిట్టని పిలుస్తానన్నాడు. అచ్చు అలాగే దాదాపు ఎన్నెలపిట్టలాగే అరచాడు. నిశ్శబ్దాన్ని చీలుస్తో అతని అరుపు చాలా దూరం విన్పించి వుంటుంది. చాలా దూరం ప్రతిధ్వనించి వుంటుంది.

అప్పట్లో అయితే ఆ కథ వింతగా అన్పించింది తప్ప మరోలా అన్పించలేదు. ఇప్పుడు మాత్రం అట్టా వింతగా అన్పించదు. వికృతంగా అన్పిస్తుంది. అంతకన్నా దుర్మార్గమైన కథ మరొకటి లేదనిపిస్తుంది. ఆ రోజు రూబేన్ నవ్విన నవ్వులో ఆ కథ పట్ల

తిరస్కారం హేళన వున్నాయనిపిస్తోంది. గుర్తొస్తోంది. యిప్పుడు ప్రతి అంశాన్ని తరచి చూసుకొంటే తాను అనాలోచితంగా ఆ రోజు ఎన్నెలపిట్ట మాట అన్నప్పుడు రూబేను దాన్ని అనుకరించాడు. యిప్పుడనిపిస్తోంది. అది అనుకరణ కాదనిపిస్తోంది. ఓ మనిషి ఆక్రందన ఆ రోజు ఆ అనుకరణలో వినలేకపోయింది. నిజంగా అది ఓ అంటరానివాడి ఆక్రందనే. తన పుట్టుకని అంత దుర్మార్గంగా చిత్రించినందుకు, చరిత్రలో తనకు జరిగిన ద్రోహానికి అదో నిరసన. నిజంగా నిరసనే. తిరస్కారమే.

అందుకే తన జ్ఞాపకం గతం కాదంటుంది రూతు. అదో అంటరాని వసంత మంటుంది. అలలు అలలుగా మొదలై ఆకాశాన్ని అంటుకొని అక్కడే విరిగి విరుచుకపడే సముద్ర కెరటం తాలూకూ ప్రచండ ఘోష అంటుంది. ఆ వసంతానికి కొసమెరుపు లేదు. వున్నదల్లా కొనసాగింపే....పాటలా....కవితలా అగాధాలని తవ్వుతో, అంతరంగాల్ని తొలుస్తో.....

## 2

రూతు జ్ఞాపకాలకి ఎన్నో ఏళ్ళ వయసుంది. అందులో కొన్ని రూబేనుతో పంచుకొన్నవి. కొన్ని రూబేను తనను కలుసుకోక ముందువి. రూబేను తనకు పరిచయం చేసిన అతని పూర్వీకులవి. రూతు ముద్దుగా అనుకొనే ఎన్నెలపిట్టవి. ఎన్నెలపిట్ట రాత్రి గొంతు తట్టిలేపే ఎన్నెల దిన్నివి.

ఎన్నెలదిన్ని అనుకుంటే అంటరానివాడి పెదాల మధ్య ప్రాణం పోసుకొనే పిల్లన గ్రోవినాదం గుర్తొస్తుందంటాడు రూబేను. అక్కడే రూబేను తాత ఎల్లన్న పుట్టాడు. అక్కడే పెరిగాడు. పాటలు పాడాడు. ఆటలు ఆడాడు.

ఎల్లన్న పాటలు రాయలేదు. రాయడానికి అక్షరాలు రావు. వున్నదల్లా స్పందించే గుండె, పంచగలగే అనుభవం, వర్షించే కళ్ళు, వుప్పొంగే నరాలు, అల్లకల్లోలమైన నెత్తుటినది....చాలు పాట దానంతటదే అల్లుకుపోతుంది. అట్టా అల్లాడు పాటని. పాట అల్లడమే కాదు ఆట కూడా ఆడాడు. అతన్ని పాటలెల్లడన్నారు. ఆటలెల్లడన్నారు. కాని అతని మేనత్త బూదేవి మాత్రం 'ఎల్లన్నా' అనేది.

ఎల్లన్న ఆటనీ పాటనీ గుర్తు తెచ్చుకొని రూబేను బోలెడు గొప్పలు పొయ్యేవాడు. చివ్వరి రోజుల్లో అవే సంగతులు పదే పదే చెప్పేవాడు. అప్పుడు పిల్లాడిలా మారేవాడు. ఎల్లన్న హిరణ్యకశిపుడి వేషం వేస్తే గర్భిణీ స్త్రీలు నాటకం చూడటానికి రావద్దని దండోరా వేసేవారట ! నిజమే ఆ మాట ఆ పల్లెలో యిప్పటికీ చెప్పుకొంటారు. ఎల్లన్న పాడిన పాటలు పాడి విన్పించారు. ఆ పాట నిండా పల్లె జీవితం తొంగిచూస్తుంది. ఆకలి అంటరానితనం కలిసి గుండెల్ని పిండే రాగం విన్పిస్తుంది. చెంచులక్ష్మిలో నరసింహస్వామిని ఎల్లన్న కళ్ళ ముందు బొమ్మకట్టేవాడని ఎన్నెలదిన్ని పెద్దలు వాళ్ళ పెద్దలు చెప్పినట్టు చెప్పారు. ఆ మాటలు విన్నప్పుడు రూతుకు ఎక్కడో ఏదో మూల దాగి ఆగివున్న ఆనందం కళ్ళల్లోకి జారింది. ఎల్లన్న గొప్ప కళాకారుడు. రూబేను గొప్ప కళాకారుడి యింట పుట్టాడు. ఆ యింటికి యిప్పుడు తాను వారసురాలైంది.

ఎన్నెలదిన్నె ఎల్లన్న తాలూకూ ఆట పాట మాత్రమే తన గుండెల్లో దాచుకోమంటే ఎంత బాగుండు. ఎంత పదిలంగా దాచుకునేది. ఎన్నిసార్లు మళ్ళీ మళ్ళీ గుర్తు తెచ్చుకొని ఆ పాటకి పల్లవిగా మిగిలేది. ఆ ఆటకి తాళంగా మోగేది. కాని ఆ పాట తాలూకూ నేపథ్యం

ముందు నిలుస్తోంది. ఆ ఆటతో లయ కలిపిన కాలం పిశాచి పదఘట్టన కళ్ళ ముందు నర్తిస్తోంది.

ఎన్నెలదిన్ని అంత గొప్పదికాదు. అట్టా అని తక్కువగా అనుకోడానికీ వీలులేదు. ఓ ముప్పయి రెడ్లయిళ్ళు వుండొచ్చు. ఒకేవక్క బ్రాహ్మణ యిల్లు. అదే కరణం యిల్లు. చాకలి, మంగలి, బలిజ, యాదవ, కమ్మరి మొత్తం కలిసి అన్నే యిళ్ళు వుండొచ్చు. రెడ్డి దిబ్బ మీద రెండు, అయ్యగార్ల చెరువుగట్టున రెండు యానాదుల యిళ్ళు. దూరంలో యిరవై మాలల యిళ్ళు. యింకాస్త దూరంలో అంతేవున్న మాదిగల యిళ్ళు. చాతుర్వర్ణంలో భాగమైన కులాలుండే భాగమంతా ఊరు. మాలలుండే చోటు మాలపల్లి. మాదిగలుండే చోటు మాదిగపల్లి. విచిత్రమేమిటంటే మొత్తంగా కలిపి ఎన్నెలదిన్ని.

ఓ సామెత వుంది. "ఊరుంటే పల వుండదా" అని. ఆ సామెతని ముందు పెట్టుకొని రూతు అప్పుడప్పుడూ ఆలోచిస్తుంది. ఆలోచిస్తూపోతే ఈ దేశం జనజీవనంలో దారుణమైన అడ్డుగీత కన్పిస్తుంది. ఆ అడ్డుగీతకి అటువైపు అంటదగ్గవాళ్ళు, యిటువైపు అంటరానివాళ్ళు. అటువైపు ఖచ్చితంగా పైభాగమే. యిటువైపు నిక్కచ్చిగా కింది భాగమే. ఎన్నెలదిన్ని ఈ గీతకు దూరం కాదు. ఈ గీత లేకుండా దాని ముఖ చిత్రం గియ్యలేము.

అడ్డు గీతకి యిటువైపు బతుకు ఎల్లన్నది. అతని పూర్వీకులు ఎప్పుడు ఆ గీతకు యిటువైపు నెట్టబడ్డారో తెలీదు. భూమ్మీద క్షణానికి కొన్ని వందల మంది పుట్టొచ్చు. వేలమంది పుట్టొచ్చు. యింకా ఎక్కువే కావచ్చు. ఎల్లన్న కూడా అట్టాగే పుట్టాడు. అందరిలాగే పుట్టాడు. తల్లి పేగు తెంచుకొని కెవ్వున కేకతోనే పుట్టాడు. ఆ కేకలో "అగ్రకులీకులారా ! అంటరానివాణ్ణి మీ పవిత్ర రాజవీధుల వెంట వస్తున్నాను. తప్పుకోండి. తప్పుకోండి." అంటో వింత హెచ్చరిక లేదు. అందరిలాగే అరిచాడు. అందరిలాగే తన ఉనికిని చాటాడు.

అందరి తండ్రుల్లాగే వాడి ఉనికి వాడి తండ్రి గుండెల్ని కూడా తాకింది. "మగోడు' ' అంటూ కుల పెద్దని కేకేశాడు. కుల పెద్ద కడుపు నిండా కల్లునింపి సంబరపడ్డాడు. అందరి తల్లులలాగే వాడి తల్లి కూడా అలసటలో వాడి కేక విన్నదో లేదో తెలీదు. అలసి వున్న లింగాలు మొఖంలోకి, కేకేసిన పిల్లాడి బుల్లి శరీరంలోకి బూదేవి మాత్రం పదే పదే చూసింది. కూత మా దొడ్డదంది మంత్రసాని. అంతటితో ఆగలేదు. పిల్లాడు మేనత్త ముక్కుతో వూడిపడ్డాడని బూదేవిని చూస్తూ అంది. అప్పుడు చూసింది బూదేవి. ఆ చిన్నాడిలో తన రూపం వెతికింది. ముక్కు దగ్గర ఆగింది. మంత్రసాని మాటలు మళ్ళీ వినాలనుకొంది.

తల్లికీ బిడ్డకీ నీళ్ళు పోసిన రోజు పేరు పెట్టారు. ఎర్రెంకడు తన తాత పేరు పెడ్తానన్నాడు. భూదేవి అయ్య పేరు పెడ్దామంది. ఎర్రెంకడు ఎదురు చెప్పలేదు. చెల్లెలు మాటకి ఎర్రెంకడు యిప్పుడే కాదు ఎప్పుడూ ఎదురు చెప్పలేదు. దానికి కారణం లేకపోలేదు. ఎర్రెంకడికి ముందు యిద్దరు పుట్టారు. బూదేవికి తర్వాత యిద్దరు పుట్టారు. ఆ నలుగురు తోబుట్టువులు దూముకొట్టి మట్టిలో కలిశారు. యిద్దరే మిగిలారు. ఎన్నెలదిన్నిలో నాకు నువ్వు నీకు నేనూ అంటూ పెరిగారు. వాళ్ళ అయ్య బూదేవిని కోళ్ళదిన్ని యిద్దామన్నాడు.

ఎర్రెంకడు వొప్పుకోలేదు. అప్పు చెల్లెల్ని ఎన్నెలదిన్నిలోనే యిద్దామన్నాడు. బాడవ చేను అరకుంట కాపుగారి కమతంలో కలిపి బూదేవి పెళ్ళి కానిచ్చారు. ఉన్న బాడవచెక్క తోబుట్టినదాని పెళ్ళికి ఖర్చయినా ఎర్రెంకడు దిగులుపడలేదు. తోబుట్టు కాపురం ఎన్నెలదిన్నిలో వుంది. తన యింటి పక్కనే వుంది. అంతేచాలనుకొన్నాడు.

ఎర్రెంకడు బావమరిది ఎంకటనరుసు తీసెయ్యాల్సిన మనిషేంకాదు. నిజానికి అతన్ది ఎన్నెలదిన్ని కాదు. ఎంకటనర్సు పూర్వీకులు చీరాల పేరాల ప్రాంతంవాళ్ళు. ఎంకటనర్సు తాత ఎన్నెలదిన్ని వచ్చాడు. వచ్చేప్పుడు మగ్గం కూడా తెచ్చాడు. మగ్గం గుంటలో కూర్చొని వాళ్ళ తాత మగ్గం నేస్తుంటే ఎన్నెలదిన్నిలో వింతగా చూసేవాళ్ళు. ఆ ముసలాడు కాలం చెశాక ఎంకటనర్సు అయ్య కొంత కాలం నేశాడు. ఆ తర్వాత ఆయనా కాలం చెశాక మగ్గం గుంట గుర్తుకు మిగిలింది. మగ్గం మచ్చెక్కింది. ఎంకటనర్సు మాత్రం మగ్గం నెయ్యకపోయినా చీరాల పేరాల వెళ్ళటం అక్కడ నేసిన దుప్పట్లు, ముతక పంచలు మూటకట్టుకొని ఊళ్ళ మీద తిరిగి అమ్మటం మానలేదు. అట్టా సంవత్సరంలో రెండు మూడు నెల్లు వూళ్ళ మీదే వుండేవాడు.

యింట్లో గింజకు కరువులేదు. కొత్తా పాత సంధుల్లో యిబ్బందిపడ్డా మొత్తం మీద నెట్టుకపోవచ్చు. బొడ్లో రూపాయలు కాకపోయినా అణాలు బేడలు వుండేవి. తమలపాకు, వక్కా ఒకరికి పెట్టాల్సిందేగాని యింకొకరు కొరికిన వక్క పలుకు నోట్లో వేసుకుని ఎరగదు బూదేవి. దానికేమమ్మా మొగుడు వూళ్ళెంట వెళ్ళి తెస్తాడు యిది నట్టింట మంచమేసు క్కూర్చుంటుందని గిట్టనివాళ్ళు అయిష్టంగా, గిట్టినవాళ్ళు యిష్టంగా అనుకొంటారు.

ఎవరు ఎట్టా అనుకొన్నా ఎర్రెంకడు మాత్రం చెల్లెలు ఎట్టా చెబితే అట్టాగే చేసేవాడు. లింగాలును చేసుకొనేటప్పుడు కూడా బూదేవినే చూసిరమ్మన్నాడు. అదేంట్రా చేసుకునేది నువ్వా అదా అని ఎంకటనర్సు అంటే అమ్మికి నచ్చితే నాకు నచ్చినట్టేనన్నాడు.

బూదేవి లింగాలును చూసొచ్చి ఆ రోజంతా చెప్పింది. పిల్ల బాగుందిరా అన్నా అంది. అయిదు గొడ్ల గడ్డి ఒక్క వూపులో మోస్తదిరా అంది. మగనలుసు లేని యిల్లు, బతికి పోతావురా అంది. పిల్లరివటలా వుందని చెప్పింది. బూదేవి అబద్ధం చెప్పలేదు. లింగాలు అట్టాంటి యిట్టాంటి మనిషి కాదు. నిలబడితే చూరుకప్పు దాటేట్టు వుంది. "వాకిలి ఎత్తు లేపాలా అన్నా" అంది బూదేవి.

వాకిలి ఎత్తు లేపితే కాపుల కళ్ళు, కరణాల కళ్ళు మండిపోవా అని ఎర్రెంకడన్నాడు. ఆ సంగతి బూదేవికి తెలియంది కాదు. మాలాడి వాకిలి వంగకుండా వెళ్ళేలావున్న దంటే ఆ సమాచారం ఎట్టాగో పోతుంది. ఆ తర్కం శాస్త్రం దగ్గర ఆగుతుంది. రాంమ్మందిరం పెద్దల్లో మాలాడి మాట పడకూడదు. పడిందంటే పది కాలాలు అనుభవించాల్సి వుంటుంది. వాకిలి చూరు ఎత్తు లేపలేదు కాని లింగాలు ఎన్నెలదిన్ని కోడలైంది. కాని లింగాలు వంగి యింట్లోకి వెళ్ళేప్పుడల్లా బూదేవి అంటూనే వుంటుంది. వాకిలి ఎత్తులేపితే బాగుంటదిరా అన్నా అని.

బూదేవి చెప్పిన ఆ ఒక్క పని మాత్రం ఎర్రెంకడు చెయ్యలేకపోతున్నాడు. మిగతావి చెల్లెలు ఏది చెబితే అది చెయ్యాల్సిందే. పిల్లాడికి తాత పేరు పెడ్దామనుకొన్నాడు. బూదేవి అయ్య పేరు పెడ్దామన్నప్పుడు ఎదురు చెప్పలేదు.

కుల పెద్ద పిల్లాడికేసి చూసి "సినసుబ్బా" అన్నాడు సినసుబ్బడు కాదు ఎల్లడు అని ఎర్రెంకడన్నాడు. ఎల్లడు కాదు ఎల్లన్న అని బూదేవి అంది. అబ్బంటే దీనికి మాయిదిరా ఎర్రెంకా అని కులపెద్ద అన్నాడు.

బూదేవి మేనల్లుడ్ని పైకెత్తింది. 'అయ్యా' అంది. 'ఎల్లయ్యా' అంది 'ఎల్లన్నా' అంది. ఆ పిలుపులో తన ప్రపంచం ఏదో తాను నిర్మించుకొంది. ఆ ప్రపంచంలో తన పని తాను చేసుకపోవడానికి తొందరపడ్తున్నట్టు కన్పించింది. మేనల్లుడు తన ముక్కు కొలుచుకు పుట్టాడు. ఆ చిన్ని చేతి వేళ్ళతో తన ముక్కు కొలుచుకొంది.

ఊళ్ళో పెద్ద కరణం చస్తూ పిల్ల కరణానికి యాభై ఎకరాల మాగాణి యిచ్చాడు. రెండు మావిడి తోటలిచ్చాడు. అయిదు ఎకరాల వేరుసెనగ దిబ్బ యిచ్చాడు. యిరవై బార్ల తాటి తోపు యిచ్చాడు. బీడు ఎంతుందో లెక్కలేదు. అంతటితో ఆగలేదు. అయిదు ఊళ్ళ కరణీకం కొడుకు చేతిలో పెట్టి మరీ చచ్చాడు. పల్లెలో తన అయ్య చస్తూ ముక్కు మాత్రం యిచ్చాడు. అదీ కొడుక్కి యివ్వలేదు. కూతురుకిచ్చాడు. యిప్పుడు అది మనవడు లాగేసుకొన్నాడు. నా యింటి ఆస్తి నాదేనే అత్తా అంటూ కడుపులోనే కొలతేసుకొని పుట్టాడు. వీడు అయ్య చాటు బిడ్డకాదు. అమ్మ చాటు బిడ్డ కాదు. అత్త చాటు బిడ్డ. మేనత్త బూదేవి చాటు బిడ్డ. మాలచ్చి చెట్టు సాక్షి. ఎల్లమ్మ తల్లి సాక్షి. పొలిమేరలో వున్న ముంగమూరమ్మ సాక్షి. మేనత్త చాటు బిడ్డ. అట్టా అనుకొంటూ తన భవిషత్ ప్రపంచాన్నంతా ఒక్క సూత్రం మీద నిలబెట్టుకొంది బూదేవి.

బిడ్డకి మేనమామ పంచె కట్టమన్నాడు కులపెద్ద. బూదేవి మొగుడు ఎంకటనర్సు ముందుకొచ్చాడు. మేనమామ పంచె అంటే పట్టు పీతాంబరం కాదు. నల్లటి గోసిగుడ్డ. ఎంకటనర్సు బిడ్డకి గోసె పెట్టాడు. బిడ్డ కాళ్ళు రెండూ జాడిచ్చి బూదేవి ముక్కుమీద తన్నాడు. గోసిగుడ్డ లోంచి ఉచ్చ బొట్లు ఎంకటనర్సు మీద పడ్డాయి. "దాని నోట్లో పొయ్యరా ఎదవ ......" బూతు మాట అలవాటుగానే అన్నాడు. అయ్య పేరు పెట్టాం అట్టా అనొద్దు అంది బూదేవి.

బూదేవి అల్లుడ్ని ఆటల్తోనే పెంచింది. పాటల్తోనే పెంచింది. అల్లుడ్ని కాళ్ళ మీద పడుకోపెట్టుకొని నీళ్ళు పోస్తూ కామమ్మ కథ పాడింది. జోకొడుతూ లక్ష్మమ్మ కథ పాడింది. వాడు పాట వింటూ ఆడాడు. పాట వింటూ తిన్నాడు. పాటతోనే నిద్ర పొయ్యాడు. కన్న తల్లి లింగాలు బిడ్డని బూదేవి దగ్గరే వదిలేసింది. బూదేవికి కడుపు కాయలేదు. అల్లుడే బిడ్డనుకొంది.

పనీ పాట లేని రోజుల్లో ఆడాళ్ళంతా పెందలాడే ఉన్నదేదోతిని తిళ్ళిక కొండెక్కించి

ఎన్నెట్లో బూదేవి యింటి ముందు చేరేవాళ్ళు. బూదేవి "నల్లతంగ" కథ మొదలెట్టేది. "దైవరాయ - దైవారాయా" అంటూ మొదలెట్టేది. "కాశ్య పూరి పట్నామందో" అంటో సాగే ఆ పాట అర్ధరాత్రి వెన్నెల మసక బారిందాకా సాగేది. ఆ పాటకి వంత "తోంతద్దిందక్క". ఆ వంత తక్కిన ఆడవాళ్ళు యిచ్చేవాళ్ళు. ఆడాళ్ళ మధ్య అత్త వొళ్ళో ఎల్లన్న కూర్చునేవాడు. నిద్రని ఆపుకొంటో, ఆవులిస్తో ''తోంతద్దిందక్క''అనేవాడం. అట్టావాడం అంటున్నప్పుడుబూదేవికి ముచ్చటేసేది. అల్లుడ్ని ముద్దాడి వొళ్ళో పడుకో బెట్టుకొనేది. వాడు నిద్రలో మధ్య మధ్య "తోంతద్దిందక్క" అంటూనే వుండేవాడు.

ఎదిగే ఎల్లన్న అత్త ఏ రాగం తీస్తే ఆ రాగం తీశాడు. ఏ పాట పాడితే ఆ పాట పాడాడు. అత్త చంకలో కూర్చొని తోలుబొమ్మలాట చూసేవాడు. తెల్లారి కేతుగాడిలా ఎగిరేవాడు. అత్తా నువ్వు బంగారక్కవే అని అనేవాడు. బూదేవి మురిసిపొయ్యేది.

ఊళ్ళోకి ఎర్ర గొల్లలు వచ్చారంటే వూరంతా సందడే. వాళ్ళు వరుసగా పదీ పదిహేను రోజులు వీధి నాటకాలు ఆడేవాళ్ళు. అన్నింటిలో చెంచు నాటకమంటే బూదేవికి ఎక్కడ లేని యిష్టం. అల్లుణ్ణి తీసుకొని ఆటకెళ్ళేది.

ఎర్ర గొల్లలు ఊరి బయట ఆడేవాళ్ళు. అటో తాటిమాను, యిటో తాటిమాను నిలేసేవాళ్ళు. రెంటినీ కలుపుతూ మరో తాటి బద్ద కట్టేవాళ్ళు. పెద్ద బల్లవేసేవాళ్ళు. ఆ బల్ల మీద తబలా, హార్మోనియం వాయిద్యగాళ్ళు కూర్చొనేవాళ్ళు. బల్ల చుట్టూ వంత పాడేవాళ్ళు తాళాలతో నిలబడి వుండేవాళ్ళు. ఆడేవాళ్ళు బల్లముందు ఖాళీ స్థలంలో ఆడేవాళ్ళు. ఆడినంతసేపూ ఆముదపుకాగడాలు, దిండిగవిత్తనాల దీపాలు వెలుగుతూ వుండేవి.

కరణాలు, కాపులు ఆడేవాళ్ళకు దగ్గర్లో కూర్చొనేవాళ్ళు. వాళ్ళ వెనకాల చాకలి, మంగలి, కుమ్మరి అట్టా మిగతా కులాలవాళ్ళు కూర్చొనేవాళ్ళు. మాలల దిబ్బమీద మాలలు కూర్చొనేవాళ్ళు. మాదిగల దిబ్బ మీద మాదిగలు కూర్చొనేవాళ్ళు. అవి రెండూ ఆట ఆడే చోటుకు చాలా దూరంలో వుండేవి. అట్టా కూర్చోవడంలో వాళ్ళు గ్రామ పెద్దలకి, యితర కులాల పెద్దలకి కన్పించేవాళ్ళు కారు. ఆట మొదలుకాక ముందు ఆ దిబ్బల మీదికి వచ్చేవాళ్ళు కాదు. సహజంగా కరణం, పెదకాపులు రాందే ఆట మొదలయ్యేదికాదు. పెదకాపులు వచ్చాక, యింకాస్త నింపాదిగా కరణం వచ్చేవాడు. కరణంగారు రాగానే కరణాన్ని పెద్ద ఎత్తున పొగిడేవాళ్ళు. అప్పుడు సూత్రధారుడు ఆట మొదలెట్టేవాడు. కరణం కూడా వచ్చాడని తెలుసుకున్నాక మాలా మాదిగలు దిబ్బల మీదికి చేరేవాళ్ళు. పొరపాటున ముందువస్తే పెద్దలు తప్పు పట్టేవాళ్ళు.

ఎల్లన్న "కన్పించలేదే అత్తా" అనేవాడు. ఎత్తుకొని నిలబడితే కాపులకంట పడొచ్చు. కరణం కంట పడొచ్చు. సహజంగా వాళ్ళు వెనక్కి చూడరు. పొరపాటున చూశారంటే యిబ్బంది కొనక్కొచ్చుకొన్నట్టే. అయినా అల్లుడి కోసం తెగించి నిలబడేది. ఆట తెల్లవార్లూ వుండేది. ఆటతో పాటు ఎల్లడూ నిద్ర కాసేవాడు.

తెల్లారి "చెట్టు లెక్కగలనే - ఓ చెంచిత పుట్ట లెక్కగలనే" అని అత్త వీపు తట్టేవాడు. బూదేవికి కొండెక్కినంత సంబరమయ్యేది. అంతటితో ఆగేవాడు కాదు. అదే వరసలో సొంత పాట అల్లేవాడు "కూడు వండగలవా బూదేవి కూరలొండగలవా కూరలు వండి ఎల్లడి పొట్టకు అంత పెట్టగలవా" అని పాడేవాడు. బూదేవి వాడికేసి విచిత్రంగా చూసేది. అత్త వింతగా చూస్తుంటే పాట వరస మార్చేవాడు. మరొకటి కొత్తగా అల్లేవాడు. "అట్టా సూత్తవేందే - వోయత్త యట్టావుందె పాట" అంటో పాడేవాడు. బూదేవి నవ్వేది. విరగబడి నవ్వేది. నవ్వుతూనే వాణ్ణి లింగాలు దగ్గరకి లాక్కెళ్ళేది. ఎల్లన్న ఎట్టా ఆడేడో, ఎట్టా పాడేడో చెప్పేది. లింగాలు ఆడబిడ్డ కేసి ఎగా దిగా చూసేది.

ఓ రోజు ఎల్లన్న కది కొత్త అనుభవం. అది బూదేవికి కొత్తకాదు. బూదేవి అన్నకి కొత్త కాదు. ఆడబిడ్డకి కొత్త కాదు. ఎన్నొలదిన్నిలో పుట్టి పెరిగిన పెద్దలకి కొత్త కాదు. ప్రపంచాన్ని అప్పుడే చూస్తున్న ఎల్లన్నకి కొత్త.

రాత్రి నాటకం చూశాక తెల్లారి ఎర్రగొల్లలుండే ఊరి బయటిడేరాలకేసి వెళ్ళాలనిపించింది ఎల్లన్నకి. అత్తతో అంటే వద్దంది. అత్త ఎందుకు వద్దంటుందో వాడికి అర్థం కాలేదు. అసలు ఆట దగ్గరగా చూడాలనుకొనేవాడు. దగ్గరకెళ్ళి చూద్దామే అత్తా అంటే వద్దురా యిక్కడే వుందామంటుంది.

చద్దిపెట్టి గంప తీసుకొని అత్త దిండిగ చమురు విత్తనాల కోసం వెళ్ళింది. అత్త వచ్చేలోపు ఎర్రగొల్లల దగ్గరికి వెళ్ళి రావాలనుకొన్నాడు. అంతే చేశాడు.

ఎర్రగొల్లల గుడారాల దగ్గర తనలాగే చాలామంది వున్నారు. వాళ్ళు బాగుచేసుకొనే కిరీటాలను వింతగా చూస్తున్నారు. అట్టా వింతగా చూసే గుంపులో తానూ దూరాడు. నిజంగా ఆ కిరీటాలు వింతగా వున్నాయి. యింతలో ఎవరో తనవైపు చూడటం గమనించాడు. అట్టా చూసినవాడు చూస్తూ వుట్టినే వుండలేదు. మాటలు కలిపాడు.

"నువ్వు మాలాడివికదరా"

"ఎర్రెంకడి కొడుకుని"

పక్కనున్న వాళ్లంతా ఎల్లన్నవైపు చూశారు. అడిగినవాడు అడిగినట్టు వూరుకోలేరు. వీపు మీద తాటి మట్టతో బాదటం మొదలెట్టాడు. ఎల్లన్నకు ఏం జరుగుతుందో అర్థమయ్యేలోపు అక్కడ వున్నవాళ్లంతా తన మీద విరుచుకుపడ్డట్టు అన్పించింది. అనాలోచితంగానే పరుగు తీశాడు. వెంట తరుముతున్నట్టనిపించింది. రాళ్ళు రువ్వుతున్నారులాగుంది. తన పక్కన పడ్తున్నాయి. ఒక రాయి బలంగా తగిలింది. పరుగు మాత్రం ఆపలేదు. పరుగు తీస్తూనే వున్నాడు. ఎటు పరుగు తీస్తున్నాడో తెలీడం లేదు. పరుగు మాత్రం ఆపలేదు. చాలా దూరం. దాదాపు వూరు కన్పించనంత దూరం......పరుగు తీస్తూనే వున్నాడు. పొదలు దూకాడు. పిచ్చిముళ్ళ కంప మొక్కల దిబ్బలు దూకాడు.

దుక్కులకడ్డం పడ్డాడు. బండరాళ్ళు ఎదురు తగిలితే బోర్లపడ్డాడు. ముక్కు పగిలింది. నెత్తురు కారింది. మోకాళ్ళు దోక్కుపొయ్యాయి. పాదాలు పాదాలులా లేవు. తెగిన ఎర్రచందనం ముక్కల్లా వున్నాయి.

అయినా పరుగు ఆపలేదు.

ఏరు అడ్డం వచ్చింది.

ఆగటానికి వీలులేదు. ఆ పరుగుతోనే నీళ్ళలో దూకాడు. నీళ్ళు మొలదాకా వచ్చాయి. ముందుకే పోతున్నాడు. చాతీ దాటాయి. విచిత్రంగా వుంది. తన చుట్టూ నీళ్ళు ఎర్రగా వున్నాయి. నల్లటి బుజాల మీది ఎర్రటి చారికలు, ఎండలో వికృతంగా వున్నాయి. యింకా లోతుకు వెళ్తున్నాడు. చేతులు పైకెత్తాడు. అతని కంఠం చుట్టూ నెత్తుటి వృత్తం. క్రమంగా ఏదో మార్పు. ఒక్కసారిగా గట్టు ఎక్కినట్టు.....నీళ్ళు చాతీకి కిందుగా, ఆ తర్వాత మొలకి కిందుగా....గట్టు చేరాడు. గట్టు చేరాక చూస్తే మొలకి గుడ్డలేదు. అది నీళ్ళలో ఎప్పుడు కొట్టుకపోయిందో తెలీదు. వెర్రిగా చూశాడు. దిసమొలతోనే ఏటిగట్టున నడుస్తున్నాడు.

ఏటికి ఈ వైపున ఎన్నెలదిన్ని, ఆ వైపున ఏది వుందో తెలీదు. బాట మాత్రం వుంది. ఆ బాటలో తాను నడవొచ్చో లేదో తెలీదు.

# 3

చెబుతారు. చాలామంది పెద్దలు. ఆ పెద్దల్లో ప్రవక్తలుంటారు. సన్యాసులుంటారు. తత్వవేత్తలుంటారు. వాళ్ళంతా విసుగు లేకుండా చెబుతారు. పుట్టినప్పుడే ఈ మనిషి జీవితం యిట్లావుంటుందని ఆ మనిషి మొహం మీద రాసి వుంటుందని, రాసినట్టే జరుగుతుందని, మరోలా అనుకొన్నా కుదరదని.

తత్వాలు ఓ అడుగు ముందుకు వేశాయి. అక్కడ "గూడు" వుంటుంది. గూటిలోకి చిలక వస్తుంది. కొంతకాలం తర్వాత ఆ చిలక గూటిని తన్నేసి వెళ్ళిపోతుంది. ఎక్కడికి వెళ్తుందో తెలీదు. అనంతాలకంటారు.

కాకపోతే చిలక వుండి వెళ్ళిన గూడు విశాలమైన రంగస్థలం మీద వుంటుంది. ఆ రంగస్థలంమీద అనేక ఆగమనాలు. అనేక నిష్క్రమణలు. ఒకదాని వెంట ఒకటి. అవనిక వెనుక దర్శకుడి సూచనల మేరకు. తెరమీది తోలుబొమ్మల్లా.

బొమ్మలు ఏడుస్తాయి. బొమ్మలు నవ్వుతాయి. ఓ చిలక బొమ్మ దారుణంగా నరకబడి ప్రాణం విడుస్తుంది. ఓ పాప చిలక అప్పుడే పుట్టి తన పీలగొంతుతో ప్రపంచానికి తనని తాను పరిచయం చేసుకొంటుంది. అన్నీ చిలకలే. అంతా మనుషులే. భూమంతా పరచుకొని. రంగస్థలమంతా ఆక్రమించుకొని.

ఇదంతా వేదాంతం. నానటి గీత సిద్ధాంతం. ఆదిలేనిది. అంతం లేనిది. అనంతమైంది. అర్థం చేసుకోలేనిది. కేవలం కొందరు మాత్రమే అర్థం చేసుకోగలిగేది. వాళ్ళు మాత్రమే చెప్పగలగేది.

చావనీండి. ఆ కొందరు మాత్రమే రంగస్థలం మీద వాగివాగి గొంతు ఎండి చావనీండి. అఖ్ఖర్లేదు. రూతుకు యివన్నీ అఖ్ఖర్లేదు.

ఈ వేదాంతాలు, మోసాలు, చిలకలు, బొమ్మలు, రంగస్థలాలు అక్కర్లేదు. ఆమెకు కావాల్సింది జీవితాలు. ఆమెకు కావాల్సింది వాస్తవాలు. తన జ్ఞాపకాల్లో ప్రాణాలుచేతుల్లో పట్టుకొని పరుగెత్తే ఎల్లన్నలు.

అనుకొంటే రూతుకు అంతా అదోలా వుంటుంది.

రూబేను పూర్వీకుడు ఎల్లన్నని అనుకుంటే, చాలా ఏళ్ళ క్రితం పిల్లాడిగా అతను తీసిన పరుగు అనుకొంటే, ఆ మోసం భూమిలో పుట్టి ఆకాశాన్ని చీల్చుకొని అందనంత ఎత్తుకు వున్నట్టనిపిస్తోంది.

ఎదురుపడ్డ బాటకేసి ఓ క్షణం చూసి మళ్ళీ వెనుక్కి తిరగకుండా ఎల్లన్న నడచిన నడక ఆశ్చర్యంగా అన్పిస్తుంది. ఆ కుర్రాడు అట్టా ఎట్టా నడవగలిగాడో అర్థం కాదు. భయం ఆ శక్తిని యిచ్చి వుంటుంది. నిజానికి చాలా దూరమే నడిచాడు. సూర్యుడు నడినెత్తికి ఎప్పుడు వచ్చాడో, ఎప్పుడు అంచుకిందికి జారి అదృశ్యమయ్యాడో తెలీదు. సందె చీకట్లు మాత్రం పల్చగా మొదలై చిక్కగా మిగిలాయి. అప్పుడు ఎల్లన్న చీకటితో కలిసి నడిచాడు. చీకట్లో తాను ఎవ్వరికీ కన్పించననే నమ్మకం కుదిరింది. ఆ నమ్మకం కుదిరాక భయం పోయింది. కూర్చోవాలనిపించింది. కూర్చునేంత స్వేచ్ఛ దొరికిందనిపించింది. కూర్చొన్నాడు. యిసుక దిబ్బమీద పడుకొన్నాడు. పైకి చూస్తే ఆకాశం. అక్కడో చుక్క యిక్కడో చుక్క.

అవునూ !

ఈ సన్నివేశం ఏ రంగస్థలం మీద జరిగింది. రూతు జ్ఞాపకం ప్రాణం పోసుకొన్న ఆ నిషిద్ధ రంగ స్థలం ఎవడి సృష్టి.

ఎవడా సృష్టికర్త. సగం మనిషి. సగం జంతువు దేవుడు కాదు. దెయ్యం కాదు. నరుడు కాదు. వానరుడు కాదు. సృష్టిలో ఏ ప్రాణికీ లేనంత అష్టావక్ర రూపం.

ఎల్లన్న కోసం ఆ సన్నివేశాన్ని దాని రంగస్థలాన్ని ఏర్పాటు చేసిన ఆ అష్టావక్ర రూపం ఎవరు. ఎర్రగొల్లలు అయితే ఎల్లన్న విషయంలో అంటు పాటించరు. వాళ్ళని చూడటానికి వెళ్ళినప్పుడు, చూస్తూ వున్న గుంపులోకి జొరబడినప్పుడు, ఆ గుంపు అగ్రవర్ణాలైనప్పుడు, ఆ గుంపులో ఎల్లన్న వుండకూడదని అట్టా వుంటే తాటిబద్దలతో వీపు చిరిగేలా కొట్టబడతాడని, నెత్తురుకారేలా తరమబడతాడని, దిసమొలతో చీకటి దుప్పటి కప్పుకొని వుండాల్సి వుంటుందని ... ఎల్లన్న మొహం మీద వాడి బతుకు మీద గీతగీసిన ఆ సగం మనిషి ఎవడు. ఆ సగం జంతువు ఎవడు. అతి భయంకరమైన అష్టావక్ర పేరు ఏదైన వుంటుంది. జవాబు స్పష్టంగానే వుంది. కాయితాల రూపంలోనే వుంది. వాడి పేరుకు స్మృతి అని కూడా తగిలించి వుంది.

ఆ సగం జంతువు మనువు. ఆ అష్టావక్రమనువు. వాడు ధర్మాలు చెప్పాడు. విశేష ధర్మాలు చెప్పాడు. వర్ణాశ్రమ ధర్మాలు చెప్పాడు. వాడు ఒక్కడే నంటారు. వాడు ఒక్కడుకాడు పదుగురని పురాణాలు అంటాయి. వాడి వల్ల పుట్టినవారు మానవులని అంటారు. అయితే వాడు ఎల్లన్నని మానవుడిగా ఎందుకు చూడలేకపోయాడు.

వాడు చెప్పాడు. మనువు అనేవాడు చెప్పాడు. వాడి ధర్మం చెప్పింది. బ్రాహ్మణుణ్ని చంపితే చండాలుడుగా పుడతాడని. అదే నిజమైతే ఎంతమంది బ్రాహ్మణులను చంపితే ఎన్నిలదిన్నిలో అంతమంది మాలా మాదిగలు పుట్టారు. ఎల్లన్న చంపిన బ్రాహ్మణుడి పేరు మనువు చెప్పాలి. చెప్పి తీరాలి. వాడు చెప్పకపోతే వాడి ధర్మాన్ని కాపాడుతున్న వర్ణాలు చెప్పాలి. అగ్రవర్ణాలు చెప్పాలి.

కసి, కోపం, కన్నీళ్ళు. రూతు గుండెల నిండా రూతు ఆలోచనల నిండా .....

యిన్ని సంవత్సరాల తర్వాత .. .. తరాల తర్వాత....... యింత విషాదం వాగ్గై వలయం అవుతున్నప్పుడు.

ఎల్లన్నని అనుకొన్నప్పుడు, బూదేవిని అనుకొన్నప్పుడు ఎన్నెలదిన్నిని అక్కడి వెలివేయబడ్డ బతుకుల్ని అనుకొన్నప్పుడు అట్టాంటి సందర్భాలు గుర్తొచ్చినప్పుడు రూతు అగ్ని పర్వతమౌతుంది. తన జ్ఞాపకాల గుడారం నిండా వుక్కపోస్తుంది. ఊపిరి ఆడదు. జ్ఞాపకమంతా కరిగి లావాలా పారినట్టు వుంటుంది. ఉద్రేకం ముంచుకొచ్చి జ్ఞాపకం క్రమం తప్పుతుంది. క్రమం కోసం మళ్ళీ వెతుకులాట. చిమ్మచీకట్లో ఇసుక దిబ్బమీద, చుక్కల్ని చూస్తో ఒక్కడిగా పడుకొన్న ఎల్లన్న రూపం గుర్తురావడానికి చాలా ప్రయత్నమే చెయ్యాల్సి వుంటుంది.

మొదటైతే ఎల్లన్న చావుభయం లేదనే ధీమాతో చుక్కల్ని చూస్తూ వుండిపోయాడు. ఆ తర్వాత ఆకలి గుర్తొచ్చింది. ఆకలితో పాటు అత్త గుర్తొచ్చింది వుట్టి మీద కుండలో ఎండు చేప కాల్చి వుంచింది. కూట్లో నంజుకొని తినమంది. యింటికి తడిక కట్టి పందిట్లో పడుకోమంది. వచ్చిందాకా ఎక్కడికీ వెళ్ళొద్దంది. కాని అత్త మాట వినలేదు. అసలు అత్తతోపాటు దిండిగ విత్తనాలకి వెళ్ళినా బాగుండేది యిట్టా అవుతుందను కోలేదు. అక్కడికి వెళ్ళటం అంత నేరమౌతుందని అనుకోలేదు. అత్త ఎందుకు వద్దన్నదో యిప్పుడు అర్థమౌతోంది. కాని ఎందుకు వెళ్ళకూడదు. లేతమనసులో అలజడి రేపిన ప్రశ్న అది.

అత్త యిప్పుడు తన కోసం వెతుకుతుంది. పిచ్చిది. వెతికి వెతికి ఏడుస్తుంది. వెనక్కి తిరిగి వెళ్ళాలనుకొన్నాడు. అత్త కోసం వెళ్ళాలనుకొన్నాడు. పడుకొనే ముందు అత్త పాటలు పాడటమే కాదు. కథలు కూడా చెబుతుంది. రాత్రి కథ చెప్తుంటే నిద్రొస్తుందే అత్తా అని నిద్రపోయాడు. గుర్తెట్టుకోరా ఎల్లన్నా.....రాకుమారుడు పేదరాసి పెద్దమ్మ యింటి కొచ్చాడు. రేపు మళ్ళీ మొదట్నుంచి చెప్పమంటే నాకు కుదరదని అంది అత్త. పేదరాసి పెద్దమ్మ ఎట్టా వుంటుందో చెప్పించుకుంటే బాగుండేది. మంచిదై వుంటుంది. అత్తలాగే మంచిదై వుంటుంది. పాటలు పాడుతుంది. కథలు చెబుతుంది. రాకుమారుడికి ఎన్ని కథలు చెప్పిందో...

ఏడ్పు ముంచుకొచ్చింది. ఆకలి....అత్త.....వెనక్కి వెళ్ళాలని మరోసారి అనుకొన్నాడు. కాని తాను యిప్పుడు ఎక్కడున్నాడు. ఎన్నెలదిన్నికి ఎంత దూరంలో వున్నాడు. అంతా చీకటి... ఏ దారో అంతు చిక్కటం లేదు.

అలసిన చూపుల్తో దూరాల్ని వెతుకుతున్నాడు. చీకట్లో గుచ్చి గుచ్చి చూస్తున్నాడు. కళ్ళు నొప్పులనిపించాయి. లాభం లేదు. ఈ రాత్రంతా యిక్కడే గడిపి తెల్లారి వెళ్ళాలనుకొన్నాడు. యింక ఎప్పుడూ అట్టా వెళ్ళనని అత్తతో చెప్పాలనుకొన్నాడు.

చీకటి వీస్తోందో, గాలి వీస్తోందో తెలీటం లేదు దూరాల నుంచి చల్లదనాన్ని మోసుకొస్తున్నట్టు అన్పించింది. గాలి చల్లగా తగులుతోంది. గాలి చల్లదనాన్నే కాదు, ఓ లయబద్ధమైన శబ్దాన్ని కూడా మోసుకొచ్చింది. ఆ శబ్దం వస్తున్న వైపుకు చూశాడు.

తనకు దూరంగా వెలుతురు కన్పిస్తోంది. ఎత్తయిన యిసుక దిబ్బమీద తాటి చెట్ల మధ్య బలహీనంగా తొంగిచూస్తున్న వెలుతురు అది. అక్కడ ఏదో పల్లె వున్నట్టుంది. ఏదై వుంటుందో తెలీదు. అది పక్కెలదిన్ని అని అక్కడ గంగజాతర జరుగుతోందని ఎల్లన్నకి తెలీదు

రాత్రి సమయంలో యింట్లో దీపం వెలుతురు, ఆకాశంలో చుక్కల వెలుతురు, ఎన్నెట్లో చందమామ పరుగు తప్ప విశాలమైన యిసుక ఎడారి లాంటి ఒంటరితనం తెలీదు. కొత్తగా వుంది. నడక ఆపలేదు. వెల్తురు దాగిపోతున్నట్టనిపిస్తోంది దూరంగా చీకటి పులుముకొన్న చెట్ల మధ్య దిబ్బ ఎత్తుగా వుందనే ఆలోచనే రాలేదు. యింకాస్త ముందుకు నడిచి చూస్తే అసలు వెలుతురే కన్పించటం లేదు.

ఎల్లన్న దిసమొలతోనే వున్నాడు. నిజంగా ప్రకృతి బాలుడే యిప్పుడు. దిసమొల ఎల్లన్న. ఆడుకొనే వెలుతురు. అలుముకొన్న చీకటి. చిరిగిన దుప్పటి మీద సందుల్లా చుక్కలు. యిసుక దిబ్బలు. ఏదీ వంటరిగా లేదు. అంతా కలిసి ప్రకృతి. అంతా కలిసి చలనం. ఈ చలనానికి అంటు లేదు. ఈ కలయికలో అంటరానితనం లేదు. ఈ చలనంలో కులం లేదు. దాని లోపలి నాలుగు భాగాలు, బయటి పంచమ భాగం లేవు. వందలాది ఉపకులాలు లేవు. ఆ కులాల తాలూకూ గౌరవాలు, స్థానాలు, అగౌరవాలు నీచాలు లేవు. ఈ చలనం హేయం కాదు. ఈ చలనం అన్యాయం కాదు.

చీకటి. దడి కట్టినట్టు, రక్షణ వలయంలా తనని కాపాడుతున్నట్టు చీకటి. స్వేచ్ఛగా వున్నట్టు అన్పిస్తోంది. ఆకలి, అత్త రెండూ దూరంగా జరుగుతున్నట్టు, తన గుండె లోతుల్లోంచి తన స్వేచ్ఛని ప్రకటించే ప్రకంపనాలు ఉబికి వస్తున్నట్టు అన్పిస్తోంది. ఆ ప్రకంపనం పాట కావచ్చు. ఆ పాట భయం కావచ్చు. ఆకలి కావచ్చు. అత్త కావచ్చు. అన్నిటికన్నా మించి అందిన స్వేచ్ఛ తాలూకూ ప్రకటన కావచ్చు. యిప్పుడు ఎల్లన్న చీకటితోనే కాదు, పాటతోనూ నడుస్తున్నాడు.

గాలికి సహజత్వం వుంది. ఎక్కడ తాకితే అక్కడ దాని భావం స్వచ్ఛంగా, అచ్చు అక్కడి భావంలా పలుకుతుంది. ఎల్లన్న పాట కూడా అంతే అట్టాగే పుడుతుంది. అట్టాగే అల్లుకుంటూ సాగిపోతుంది. చెప్పటం కష్టం. పాట ఎల్లన్నని నడిపిస్తుందో, పాటతో ఎల్లన్న నడుస్తున్నాడో విడదీసి చూపటం వీలుపడక పోవచ్చు. పాట ఆపిచూశాడు. లయబద్ధమైన

శబ్దం దగ్గరౌతోంది.

అదృశ్యమైన వెలుతురు పరుచుకొంటూ ముందుకు వస్తోంది. యిప్పుడది తాటిచెట్ల మధ్య లేదు. ఊరి బయట మంటలా వుంది. మంటచుట్టూ మనుషులు. ఎల్లన్న అడుగులు తెలీకుండానే తొందర పడ్తున్నాయి. శబ్దాలు, వెలుతురూ పెనవేసుకొని దగ్గరౌతున్నాయి.

శబ్దాల మధ్య వెలుతుర్లు పగులుతున్న మేఘాల మధ్య పరుగులెత్తే మెరుపుల్లా వున్నాయి ఎల్లన్నని ఆవేశం నడిపిస్తోంది. అది నడక కాదు పరుగు. బలంగా తోస్తున్న తరతరాల స్పందన. కళాకారుడి గుండె కదలిక.

దృశ్యం చాలా దగ్గరగా వుంది. అద్భుతంగా వుంది. అక్కడ ఆ మంట చుట్టూ ప్రళయం నర్తిస్తోంది. ఉద్వేగం, ఉరుము, మెరుపు, మేఘం ఎక్కడో విరిగి, ఎక్కడో పిడుగులా పడుతో ఓ బీభత్స సన్నివేశం.... ఎల్లన్న లేత గుండెల్లో అలజడి

మంట చుట్టూ వలయంలా కూర్చున్న జనం. జనం మధ్యకి తోసుకొచ్చాడు. జనం మధ్య మంటకు దగ్గర్లో ప్రకంపనం పుడుతోంది. ప్రళయం అక్కడి నుంచే విన్పిస్తోంది.

ఎల్లన్న కళ్ళనిండా ఆవేశం. ఆవేశంగానే తనకు ఎదురుగా ఉరుముల మీద ప్రళయ గర్జన సృష్టిస్తున్న వాళ్ళకేసి చూశాడు. వాళ్ళ వేషాలు గొప్పగా వున్నాయి. నరసింహస్వామి కన్నా బాగున్నాయి. చెంచులక్ష్మి కన్నా బాగున్నాయి. తలకి చుట్టిన అందమైన రంగుల కండువాలు. మెళ్ళో కాసులదండలు. కప్పుకున్న శాలువాలు. కొన్ని ఎర్రగా, కొన్ని పచ్చగా, నిలువు అంగీలు. ఉరుములకు బిగించిన చర్మం మూతలమీద కదులుతున్న కదరు పుల్లలు. మరోవైపు పేము పుల్లతో చేస్తున్న రాపిడి. పుట్టుకొస్తున్న ప్రచండ ఘోష. వలయాకార విన్యాసం. అతి భయంకర శబ్దం. అతి గంభీర నాట్యం.

మాలల ఉరుముల నృత్యం.

ఎల్లన్న కాళ్ళు కదులుతున్నాయి. కాళ్ళు అదురుతున్నాయి. కాళ్ళు భూమ్మీద ఆగటం లేదు. ఏదో ఆవేశం, మరెక్కడో అలజడి. శబ్దం ఆగింది. ఎల్లన్న గుండె ఒక్కసారి ఆగింది.

గానం మొదలైంది.

ఉరుముల వాయిద్యగాళ్ళు గానం మొదలెట్టారు. గానంలో గంగ ముంచుకొస్తోంది. దారంతా ఎండి నెర్రెలు కట్టుంది. నీటికోసం అర్రులు చాస్తోంది. ఎండిన గంగలో గంగ పుట్టాల. నెర్రెలు ఆవురావురుమని తాగాల. గంగ నిండాల. గంగ పొంగాల. గంగ సమస్త లోకాల్నితాకాల. అందాకా ఉరుము ఆగదు. నాట్యం ఆగదు. గానం ఆగదు.

గానం సాగిపోతోంది.

యుగం పుట్టలా.జగం పుట్టలా. గంగ పుట్టింది. అది మచ్చు మాయల గంగ. అది సుప్పనాతి గంగ. అది పీనుగలు తినే పిశాచి. తిట్లు. శాపనార్థాలు. అలగటాలు. గంగమీద.

గుక్కెడు నీళ్ళకోసం. గుంటడు చేలు తడవటం కోసం. అయినా నరుడికి ముందు, నారాయణుడికి ముందు పుట్టిన గంగ, దొనకొండ గంగ, భూమంతా నిండిన గంగ..... మాటిచ్చింది. మనిషికి మాటిచ్చింది. పెద్దల కిచ్చిన మాట చిన్నలకి తప్పనంది. చిన్నల కిచ్చిన మాట శిశుబాలలకి తప్పనంది. శిశుబాలల కిచ్చినమాట కసికందులకు తప్పనంది....... గానం సాగిపోతూనే వుంది. గంగమీద, గంగ మాటమీద, గంగ జనముమీద.

మధ్యలో కొద్ది విరామం.

ఆ విరామాన్ని భగ్నం చేస్తో మళ్ళీ శబ్దం. ముక్తాయింపులో, విరుచుకుపడే శబ్దం. శబ్దాన్ని సొంతం చేసుకొంటో లయబద్ధమైన నృత్యం. వలయాకారంగా వుంటో, రెండు కాళ్ళను పెనవేసుకొంటో, శరీరాన్నంతా వూపుతో, ఎగురుతో, వీరుల్లా, గంగను భూమ్మీదికి దించే శ్రామికుల్లా.... ఒక్కో ధ్వనికి ఒక్కో ఎగురు. ఒక్కో ఎగురుకు ఒక్కో అరుపు అంతా ఉధృతం. అంతా ప్రళయం. ఆడవిడుపు. ఆట మొదలు.

ఎల్లన్న ఆగలేకపోతున్నాడు.

వెన్నెలదిన్ని గుర్తు లేదు. బూదేవి గుర్తులేదు. తాటిబద్దలు దెబ్బలు గుర్తులేవు...... ప్రాణభయం, పరుగు, నెత్తుటి వలయంతో ఏరుదాటటం...... తెలీని ప్రాంతాలకు నడవటం. ... చీకటి..... ఆకలి......అత్త..... చుక్కలు ఏవీ గుర్తు లేవు.

తన ముందు తనదైనదేదో జరుగుతోంది. తన తలమీద రంగుల రుమాలు. తన మెడలో జీరాడే శాలువా..... వంటినిండా అంగి...... మెడలో ఉరుము.....

ఓ భావన.

ఒకవైపు కదురు పుల్లల లయవిన్యాసం, మరోవైపు పేముకర్రల రాపిడి రొద...... వలయంలో తాను. గానంలో తాను...... నాట్యంలో తాను. తన సమస్తం యిక్కడ పుట్టి యిక్కడ పెరుగుతోంది.

కుంకాల ఆట మొదలైంది.

బావినీళ్ళు నెత్తినిండా పోసుకొన్నవాళ్ళు. నెమలి ఈకల మండలు రెండు చేతుల్తో తలమీద పెట్టుకొన్నవాళ్ళు. ఉరుముల హోరు కళ్ళు మూసుకొని వింటున్నవాళ్ళు. ఛాతీలమీద పసుపు రాసి, నుదిటిమీద కుంకుమ రుద్ది, ఊగుతున్నవాళ్లు..... ఉరుముల శబ్దం యిచ్చే ఆవేశాన్ని అప్పటిదాకా అతి కష్టంమీద అణుచుకొన్నవాళ్ళు... చుట్టూ జనం. అలగాజనం. అంటరాని జనం. మాలామాదిగ జనం. బండారు కుంకుమ చల్లుతుంటే 'హరోం హరోం హర...... హర హర హర' అంటో పూనకంతో వూగుతో శివుడిలా అడుగులు వేస్తో......

కుంకాలాట...

ఓ రౌద్రబూమి. రక్తసిక్తం. నాట్యం. యుద్ధం జరుగుతున్నట్టు. ప్రపంచ యుద్ధరంగం కాక మరేమీ కాదన్నట్టు. కత్తులు గుండెలకు కొట్టుకొంటో, గంగ కోసం, గుక్కెడు నీళ్ళకోసం, భంగిమలు, రౌద్రంగా అనేకమంది శివుళ్ళు, ప్రళయ తాండవం ఆడుతున్నట్టు... భ్రమ,

వాస్తవం, నృత్యం, యుద్ధం, బీభత్సం, జీవితం, నాట్యంగా, గానంగా....... ఉరుముల నృత్యం.

అంటరానివాళ్ళ మహోన్నత ఉరుముల వసంతం. అన్నీ దొంగిలించబడ్డట్టే, భూమి బతుకు దొంగిలించబడ్డట్టే. దొంగిలించబడి దేవాలయాల్లో పేరిణీ నృత్యంలా అగ్రవర్ణాలు దాచుకొన్న ఉరుముల లయ విన్యాసం.

విన్యాసం భీకరంగా సాగుతోంది. తట్టుకోలేనివాళ్ళు, బలహీనులు వెనక్కి జరుగుతున్నారు. ఎల్లన్న వెనక్కి తగ్గలేదు. ముందుకే వచ్చాడు. చాలా ముందుకే వచ్చాడు. "హరోం హర, హర హర" అన్నాడు. గుండె చించుకవచ్చిన గొంతు. "హరోం హరహర".

శబ్దం ఆగింది. ఉరుముల నాగన్న ఆ అరుపుకేసి, అరచిన ఎల్లన్న కేసి చూశాడు. నిశ్శబ్దం శబ్దం కన్నా భీకరంగా వుంది. దిసమొల శివుడు ఎల్లన్న. తీక్షణంగా చూస్తున్నాడు. నెత్తిమీద వేపమండలు. వంటిమీద జనం విసిరిన కుంకుమ నెత్తుర్లు.

ఉరుముల నాగన్న అట్టాగే చూశాడు.

ఎదురుగా నిలబడ్డ బాలశివుడికేసి చూశాడు.

శివుడు మూడో కన్ను బాలశివుడు రెండు కన్నుల్లో చూశాడు. బాలశివుడి పాదాలు చూశాడు. తీర్చిదిద్దినట్టు, అద్భుతంగా, అందంగా, నాట్యంకోసం పుట్టినట్టు... ... అట్టాగే చూస్తూ ఉరుముల వాళ్ళకేసి సైగ చేశాడు. శబ్దం లయబద్ధమైంది. నాట్యం బాలశివుడి రూపమైంది. భూమిని తాకుతో, ఎగురుతో, అందమైన పాదాలు, ఊగుతున్న నడుము. స్పందనలని పంచుతోన్న విశాలమైన కళ్ళు. సూటిగా గీత గీసినట్టు ముక్కు.... శివుడు పిల్లవాడు. శివుడి రంగు నలుపు..... శివుడు ఎల్లన్న.

ఉరుముల నాగన్న అట్లాగే చూస్తున్నాడు.,

"ఎవర్రా నువ్వు బిడ్డా" నాగన్న అన్నాడు

"ఎన్నెల దిన్ని మాలోడ్ని" బాలశివుడన్నాడు.

"పేరేంటి"

"ఎల్లన్న"

శబ్దం మళ్ళీ హోరెత్తింది. బాలశివుడు అలసి సోలి పొయ్యేదాకా..... ఉరుములు విన్పిస్తూనే వున్నాయి. మంగళం పాడాక. గంగమ్మకు దండాలు పెట్టాక శబ్దం పూర్తిగా ఆగింది. ప్రళయం. తర్వాత ప్రశాంతత. యిప్పుడు ఎల్లన్న ఉరుముల నాగన్న గుండెలమీద పడుకుని తలని అతని భుజాల మీద వుంచాడు.

ఎల్లన్న వీపుని ఉరుముల నాగన్న మొరటి చేతులు ఆప్యాయంగా నిమురుతున్నాయి. కళ్ళు తెరవకుండానే ఎల్లన్న "యిదే వూరు" అని అడిగాడు. "వక్కెలదిన్ని మాలపల్లి" అని చెబుతూ నాగన్న నడుస్తున్నాడు.

ఎన్నెలదిన్నిలో బూదేవికి ఈ సన్నివేశం తెలీదు.

## 4

ఎల్లన్న ఆదమరచి నిద్రపోతున్నాడు. ఉరుముల నాగన్నకు నిద్రపట్టడం లేదు. ఎల్లన్న రాక అతన్లో ఏదో అలజడి రేపినట్టుంది. మర్చిపోయిన దేదోముందుకు తోసుకొచ్చినట్టుంది. పంచ బయటకొచ్చాడు.

వేగుచుక్క అప్పుడే పొడిచింది. జాముకోడి వళ్ళు విరిచి మరీ కూసింది. కట్టు మడి దగ్గర కోడెదూడ తల్లి పాలకోసం పలుపు లాక్కొంటుంది.

నాగన్న "పక్కెల దిన్ని' వచ్చి మూడు రోజులైంది. రాత్రితో గంగమ్మ జాతర అయిపోయింది. పెద్దమాల ఆటకట్నం యిస్తే అనంతపురం తిరుగు ప్రయాణం ఈ రోజే చేస్తాడు. తన తోటి వచ్చిన ఉరుము నృత్యం ఆటగాళ్ళు రాత్రే వెళ్ళారు. ఆట కట్నం తీసుకోడానికి తను ఆగిపోయాడు. కట్నం తీసుకొని వెళ్ళేప్పుడు ఎల్లన్నని ఏమి చెయ్యాలో అర్థం కాలేదు.

నాట్యం చేసి అలసిపోయిన ఎల్లన్న అట్టాగే నిద్రపోబోతే నిద్రలేపి వంటినిండా నీళ్ళు పోశాడు. కట్టుకోను గుడ్డిచ్చాడు. అన్నం పెట్టిస్తే ఆవురావురుమని తిన్నాడు. "ఎందుకు తరిమింది రా నిన్ను ఎన్నెల దిన్ని" అంటే కళ్ళనిండా నీళ్లు పెట్టుకొన్నాడు. దగ్గరకు తీసుకొంటే బోరున ఏడ్చాడు. ఆ తర్వాత చెప్పాడు. పాత కథే. మామూలు కథే. భయపెట్టే 'కథే. ఏడ్పించే కథే. కాని తప్పదు. అట్టాంటి కథ ఎల్లన్న కేనా వుంది. తనకి లేదూ ? అంతకన్నా ఘోరమైన కథ. అదే ఎన్నెల దిన్నిలో.

ధర్మారం ఉరుముల నాగన్న అంటే అనంతపురం ప్రాంతాల్లోనే కాదు, కోస్తాలో కూడా పెద్ద పేరుంది. నాగన్న జట్టు లేందే, ఆ జట్టు ఉరుముల మోత లేందే గంగమ్మ తనకి జాతరే వద్దంటుంది. శ్రీశైలం మల్లన్న కేసి చూపిస్తూ నాగన్న భుజానికి ఉరుము తొడిగాడు మొదటిసారి ఉరుముల చంద్రప్ప.

ఉరుముల చంద్రప్ప ఎవరు ? నాగన్నకేమౌతాడు. ఉరుములు వాయించడంలో నాగన్నకి మెలుకువలు నేర్పాడు. గంగ పాటలో లోతుల్ని కోతల్ని, రౌద్రాన్ని తన గొంతులో ఎట్టా పలికించాలో నేర్పాడు. అడుగుల లయ దాచుకోకుండా నేర్పాడు. అంతేకాదు "పురాణం రహస్యాలు చెప్తారా నాగా" అంటో బోలెడు రహస్యాలు చెప్పాడు. "బాపనాళ్ళు యివ్వన్ని అట్టా చెప్పలేదు. యిట్టా సెప్పారు. అంతా తప్పులు సెప్పారు" అని తనలో తాను అను కొన్నట్టు చెప్పాడు. నాగన్నకి బతుకునిచ్చాడు. ఉరుముల నాగన్నగా ప్రపంచానికి పరిచయం

చేసి వెళ్ళిపొయ్యాడు.

రూతు జ్ఞాపకాలలో నాగన్నకి ప్రత్యేక స్థానముంది. రూబేను ఎల్లన్నని గూర్చి చెప్పేటప్పుడు ఎంత ఉద్రేకానికి గురయ్యేవాడో అంతే ఉద్రేకానికి నాగన్నని చెప్పేటప్పుడూ గురయ్యేవాడు. నిజంగా అన్పిస్తుంది ఆ అంటరాని శరీరం ఎంత అద్భుతమైన సజీవ కళకు నిలయం అని. అట్టా అనుకొన్నప్పుడు వర్షించేవి కళ్ళు కాదు. ఆమె గుండె. ఆమె జీవితం మొత్తం.

నిజంగా నాగన్నకు చంద్రప్ప ఏమౌతాడు ? నాగన్న తల్లి లచ్చిమి అయితే "ఆడు నీకు సిన్నబ్బరా నాగా" అంది. అట్టాగే పిల్చాడు. సిన్నబ్బా అని పిల్చాడు. చంద్రప్ప బతికి వున్నంతకాలం సినబ్బా అని మాత్రమే పిల్చాడు. కాని చంద్రప్ప చచ్చిపోయే రోజు మాత్రం "నన్ను అప్పా" అని పిలవరా నాగా" అన్నాడు. అట్టాగే పిలుద్దామని గొంతెత్తాడు. ఆ ముసలాడు నవ్వుతూ వెళ్ళాడు. 'అప్పా' 'అప్పా' అని పదే పదే పిలిచాడు. వినేందుకు చంద్రప్ప లేడు.

ఆచారం ప్రకారం చంద్రప్పకి అన్నీ చేశాడు. ఉరుముల మాన్యం అరకుంటకి చంద్రప్ప అన్న కొడుకులు పంచాయితీ పెట్టారు. పంచాయితీ వాళ్ళకే అయింది. యింటి మూల గుంటలో ముంత పగలగొడితే యాభై బేడలు, ముప్పయి అణాలు, మూడొందల దమ్మిడీలు వున్నాయి. పంచాయితీ ఆ డబ్బుని తననే తీసుకోమంది. డబ్బు తీసుకొన్నాడు. కాని తాను వుంచుకోలేదు. చంద్రప్పతో కలిసి నృత్యం చేసే జట్టు కళాకారులకి పంచి యిచ్చాడు. కొత్త జట్టు కట్టాడు. రాయలసీమ, కోస్తాలలో తనకంటూ ఓ ప్రత్యేకతని సంపాదించుకొన్నాడు.

ఉరుముల నాగన్న నేత్రం గొప్పది. గాత్రం గొప్పది. నాట్యం గొప్పది. అంతేకాదు పురాణాల రహస్యాలు అతనికి బోలెడు తెలుసు. ఎంతటి పండితుణ్ణయినా అట్టాగే కూర్చోబెడతాడు. అట్టా చెప్పుకొంటారు జనం నాగన్నని గూర్చి. అట్టా సాగిపోతోంది బతుకు. కాని ఎల్లన్న ఈ రోజు నాగన్నలో అలజడి లేపాడు. "ఎన్నెల దిన్నిమాలోడ్ని" అన్నప్పుడు ఒక్కసారి వర్తమానం వెనక్కి పరుగెత్తి ఆగింది. గతం చేసిన గాయం గుర్తొచ్చింది.

నాగన్న ఎన్నెలదిన్నిలోనే పుట్టాడు. అయ్య నారిగాడు ఎన్నెలదిన్నిలోనే పుట్టాడు. అమ్మ లచ్చమి ఎన్నెలదిన్నెలో పుట్టింది.

అయ్యకి మడి చెక్కలేదు. ఉందల్లా చెట్టు కొట్టే గొడ్డలే. తాటిచెట్టు పది దెబ్బల్లో కొట్టేవాడు. అటో శానాం, యిటో శానం పెట్టి తాటిచెట్టును కళ్ళముందే బద్దలు చేసేవాడు. చెట్టు ఎప్పుడు ఎక్కేవాడో, ఎప్పుడు ఆకు కోసి కిందికి దిగేవాడో అంతుపట్టదు. తాటిచెట్టుతో ముడిపడ్డ జీవితం అతన్ది. అయ్యతో తాటిచెట్లు కొట్టడానికి నాగన్న వెళ్ళేవాడు. అమ్మ కూడా వచ్చేది. తనకోసం అయ్య తాటిముంజలు కొట్టేవాడు. అమ్మ కాయ కొట్టేలోపు కాయ తినమని పందెం కట్టేది. అట్టాగే తినేవాడు. అమ్మ తాటికాయ కొట్టేలోపు తాటిముంజ

బొటనవేలుతో వెలికి తీసి తినేవాడు. కాయకున్న మూడు ముంజలు కాయ కొట్టేలోపు తినేవాడు. నవ్వొస్తుంది అనుకొంటే నాగన్నకి.

ముంజలు తిన్నాక చేల గట్టుకేసి వెళ్ళేవాడు. సన్నని నత్తగుల్లల డొప్పల్ని తాటి ఈనెతో దండగా చేసేవాడు. ఆ దండని లయబద్ధంగా కదిలిస్తే అచ్చు నీళ్ళు దొర్లి పడుతున్నట్లు వుండేది. ఆ దండని ఎండ్రకాయల కన్నాల దగ్గర వుంచి శబ్దం చేసేవాడు. కన్నాల్లోకి నీళ్ళు వస్తున్నట్టు ఎంట్రకాయలు అనుకొని పైకి వచ్చేవి. పైకొచ్చిన ఎంట్రకాయని వడుపుగా పట్టుకునేవాడు. పెద్ద గిట్టలు తుంచి తాటాకు రేకలో వేసేవాడు. ఒక్కోసారి అంత తొందరగా దొరికేవి కావు. గట్టు వెంట పరుగెత్తేవి. గిట్టలు ఎత్తిపెట్టి భయపెట్టేవి. అయినా పట్టేసేవాడు. అట్టా మధ్యాహ్నానికి పది పదిహేను ఎంట్రకాయల్ని పట్టేవాడు చేలో తాటాకు మంట పెట్టి వాటిని కాల్చేవాడు. అయ్య కాళ్ళు కడుక్కొని పంట కాల్వ వొడ్డుకు రాగానే అమ్మ కూటి దుత్త తెచ్చేది. కూట్లో కాల్చిన ఎంట్రకాయల్ని నంజుకుంటూ అయ్య "బిడ్డంటే ఈడేనే పిల్లా" అని అమ్మతో అంటూ నాగన్నని మెచ్చుకొనేవాడు. అంతా మా అమ్మ పోలిక అనేవాడు. నానమ్మ ఎట్టా వుండేదో నాగన్నకి తెలీదు.

అయ్య మధ్యాహ్నం దాకా తాటిచెట్లు కొట్టేవాడు. మధ్యాహ్నం నుంచి వాటిని బద్దలు చేసేవాడు. పని పూర్తయ్యేలోపు సాయంత్రం అయ్యేది. ఈ లోపు ఖాళీ కూటి దుత్తలో అమ్మతో పాటు నత్తగుల్లలు ఏరి గట్టుమీద గుల్లకొట్టి మాంసం దుత్తలో వేసుకొనేవాళ్ళు. పొయ్యి కట్టెలకి తాటి జీబులు ఏరి మోపుకట్టేవాళ్ళు. అంతటితో ఆగేవాళ్లు కాదు. తూర్పు బీడు మొదట్లో తుమ్మల తోపు వుండేది. అమ్మతోపాటు తుమ్మ చెక్క తీసేవాడు. తుమ్మ చెక్క ఎండబెట్టి పట్టపు సుబ్బులు కిచ్చేవాళ్ళు. పట్టపు సుబ్బులు కరవడిచేపలు, సొరచేపలు తెచ్చి యిచ్చేది. అమ్మ సొరపిట్టు కొట్టి పెట్టేది. తుమ్మల తోపుకురానే అమ్మా అంటే కరవడిచేప, సొరపిట్టూ వద్దంట్రా అనేది. ఆ మాట అనగానే అమ్మతో తుమ్మల తోపుకు వెళ్ళేవాడు.

అమ్మ తాటి జీబులు తన నెత్తిమీద పెట్టేది. తుమ్మచెక్క ఆమె నెత్తిమీద పెట్టుకొని నత్తమాంసం దుత్తచేత్తో పట్టుకొనేది. బీడు మేపుకు పోయిన గొడ్లు వూరి ముఖం పట్టేటప్పుడు అమ్మా, అయ్య, తాను యింటి దారి పట్టేవాళ్ళు. ఏటి గట్టుకు రాగానే నెత్తిమీద బరువు దింపుకొని కూర్చొనేవాళ్ళు. అయ్య తాటిచెట్లు ఎక్కి కల్లు దుత్తలు దింపేవాడు. అట్టా అయిదు చెట్లు ఎక్కేవాడు. అయిదు చెట్లలో మూడు చెట్లకు కట్టిన లొట్టె అంచులకి సున్నం రాసేవాడు. రెండు చెట్ల లొట్టెలకి సున్నం రాసేవాడు కాదు. సున్నం రాసిన లొట్టెల్లో తాటిసారు వచ్చేది. సున్నం రాయని లొట్టెల్లో కల్లు వచ్చేది. చెట్ల మొదట్లో మూడు తాటి ఆకు రేకలు దాచేవాడు. అయ్య తన రేకలో కల్లు తాగేవాడు. అమ్మా, తాను సారు తాగేవాళ్ళు. సారు తియ్యగా వుండేది. రోజూ పొద్దున అయ్య సారు ఇంటికి తెచ్చేవాడు. కల్తీలేని కల్లు, కల్తీ లేని సారు. తాగగా మిగిలిన కల్లు అయ్య యింటికి తెచ్చేవాడు. యింటికి తెచ్చిన కల్లు అయ్య

కూటిగింజలకి అమ్మేవాడు. ఒక్కోసారి దమ్మిడీకి ముంత కల్లు అమ్మేవాడు. అయిదు దమ్మిడీలు చేతికొస్తే అయ్య మొఖం విప్పారేది. ఆ రోజు కూటికి వడ్లు వస్తే అమ్మ ఎగిరి గంతేసేది.

సారు కాస్తే తాటిపాగు వచ్చేది. తాటిపాగు నిల్వ వుంచితే తాటి కలకండ అడుగున వచ్చేది. పచ్చి మామిడికాయ కోసి తాటిపాగులో ముంచి తినేవాడు. అట్టా నిల్వ వుంచిన పాగు రెండు మూడు బానలయ్యాక మళ్ళీ కాసేవాళ్ళు. చిక్కటి బెల్లం పాకం వచ్చేది గుంటలు తవ్వి గుంటలో పాకాన్ని పోసేవాళ్ళు. ఆ బెల్లం గడ్డలయ్యేవి. ఆ బెల్లం గడ్డలు అమ్మకానికి అప్పుడప్పుడు అయ్య వెళ్ళేవాడు.

ఎండాకాలం తాటికాయలు పండేవి. కొన్ని విపరీతంగా పండేవి. పండిన కాయల్ని కాల్చుక తినేవాళ్ళు. పాకానికొచ్చిన కాయల్ని కొట్టి చెక్క తీసేవాళ్ళు. ఆ చెక్కని ఉడకబెట్టేవాళ్ళు. అట్టా ఉడకబెట్టిన చెక్క తియ్యగా వుండేది.

చెక్క తీసిన తాటి విత్తనాల్ని పాతర పెట్టేవాళ్ళు. తేగలు వచ్చేవి. పాతర ఒక వరసలో తవ్వుతూ తేగలు పీకేవాళ్ళు. ఉడకబెట్టిన తేగలు రాత్రికి పందిరిమీద వేసి తెల్లారకట్ల మంచులో అవి తడిశాక, తెల్లారి తింటే అద్భుతంగా వుండేవి. తనకి అట్టా తినటమే యిష్టం. బురగూజు ఎంతో బాగుండేది.

అట్టా తాటిచెట్లు అమ్మ, అయ్య బతుకుల్తో పెనవేసుకపొయ్యాయి. నాగన్న బాల్యం, ఎన్నెలదిన్ని తాటిచెట్ల మధ్య, చేలగట్ల మీద, తుమ్మలతోపు నీడల్లో గడిచిపోయింది. ఎన్నెలదిన్ని. ఇప్పుడందులో ఎంతమంది కళ్ళముందు రాలిపొయ్యారో, ఎంతమంది మంచానికి అతుక్కొని రోజులు లెక్కబెట్టుకుంటున్నారో, ఎంతమంది తనలాగే ఆటపాటల్లో వుండిపొయ్యారో తెలీదు. అసలిప్పుడు ఎన్నెలదిన్ని ఏ రూపంలో వుందో. చాలా ఏళ్ళ తర్వాత గుర్తొస్తోంది.

ఎల్లన్న ఎర్రెంకడి కొడుకునన్నాడు. బూదేవి మేనల్లుడినన్నాడు. ఎర్రెంకడు అప్పుడు మరీ చిన్నపిల్లాడు. తల్లి సంకబిడ్డ. బూదేవి అప్పటికి యింకా పుట్టి వుండదు. ఎర్రెంకడు పెద్ద కరణం మామిడితోపు కాపలా వుండేవాడు. కాపలా అనేకన్నా కాపురమే అక్కడ పెట్టినట్టు వుండేవాడు. ఒక రకమైన వెట్టిచాకిరే అది. అనుకొంటే దారుణంగా వుంటుంది. అయ్య అట్టా కానందుకు సంతోషంగా వుండేది. కాని అయ్య కూడా కరణానికి పుట్టినే తాటిచెట్టు కొట్టివ్వాల్సి వుండేది. తాటి ఆకు కొట్టివ్వాల్సి వుండేది.

అసలు మాలాడు, మాదిగాడు వెట్టి చెయ్యందే ఎన్నెల దిన్నిలో బతకలేడు. ఎన్నెలదిన్ని బతుకంతా పెద్ద కరణం కనుసన్నల్లో వుంది. ఆయన గీసిన గీతల మధ్య తిరుగుతుంది. ఎన్నెలదిన్ని విశాలమైన భూముల్లో ఎక్కువ భాగం ఆయన చేతిల్లోనే వుంది. అతి తక్కువ భాగం. మిగిలిన కులాలకుంది. రెడ్లకి కొద్దిపాటి పొలం వున్నా మొత్తంగా అతని పాలెకాపులే. మిగతా కులాలకు సెంటోకుంటో వున్నా అది అతని చెప్పుచేతల్లోనే

వుండేది. మాలామాదిగలకి అసలు పొలమే లేదు. ఎర్రెంకడి అయ్యకి తూర్పు బాడవలో మడిచెక్క వుందనేవాళ్ళు. వుండొచ్చు. ఎర్రెంకడి అయ్య అప్పుడప్పుడు నయిదిబ్బ ఎరువు అక్కడికి గంపల్లో మోసేవాడు. అంతకన్నా మాలామాదిగలకి మరెవ్వరికి పొలం లేదు.

పెద్ద కరణం అతిక్రూరుడు. అతనికి జాలిలేదు. దయ లేదు. దానం చేసే గుణం లేదు. ఒకే ఒక్క కొడుకు. వాడికి ముందు కూతురు. కూతుర్ని నెల్లూరు ప్రాంతంలో ఇచ్చాడు అల్లుడికి బోలెడు అగ్రహారాలున్నాయి. పెళ్ళయిన రెండో ఏడే అల్లుడు చచ్చిపొయ్యాడు అగ్రహారాల్లో ఉన్న కొంత పొలం అమ్మగా వచ్చిన డబ్బు మూట గట్టుకొని కూతురు ఎన్నెలదిన్నికి వచ్చింది. అమ్మగా మిగిలిన పొలం కౌలుకిచ్చింది.

కోళ్ళ దిన్ని పంతులు కరణం కూతురు పొలం లావాదేవీలు చూసుకొనేవాడు. అతను అంతటితో ఆగలేదనే పుకారు వుండేది. కరణం కూతురుకు కడుపు చేసే దాకా వచ్చాడు. ఏం జరిగిందో తెలీదు. కోళ్ళ దిన్ని పంతులు ఓ రోజు నెత్తురు కక్కుకొని చచ్చాడు. ఆ తర్వాత నెలరోజులైనా గడవలేదు. కరణం కూతురు ఉరేసుకొని చచ్చింది. వంటినిండా దెబ్బలున్నాయని మంగలి రాములు వూళ్ళోవాళ్ళతో అన్నాడు. అందరికీ అన్ని తెలుసు కోళ్ళదిన్ని పంతుల్ని, కూతుర్ని, కూతురి కడుపులో పిండాన్ని చంపింది పెద్ద కరణమని తెలుసు. కాని మాట్లాడరు. వంటినిండా దెబ్బలున్నాయని వూళ్ళోవాళ్ళతో అన్న మంగలి రాములు వూరు విడిచి ఎటు వెళ్ళాడో తెలీదు. ఉన్న మంగలి కుటుంబాల్లో ఒకటి మాత్రం ఎన్నెలదిన్నెలో లేకుండా పోయింది. కూతురు మొగుడు చచ్చినందుకు పెద్ద కరణం బాధపడలేదు. పిల్ల కరణం అదృష్టాన్ని పొగుడుకొన్నాడు. అక్కని తండ్రి దారుణంగా చంపినందుకు పిల్ల కరణానికి కోపం రాలేదు. అక్క పట్టెమంచం సొరుగుల్లో దాచిన వెండి బిళ్ళలు లెక్కబెట్టుకొన్నాడు. అట్టా కొడుకు లెక్కబెట్టుకుంటున్నందుకు తన కడుపున రత్నం పుట్టాడని పొంగిపొయ్యాడు పెద్ద కరణం.

ఈ కథంతా అయ్య అమ్మతో చెవిలో చెప్పినట్టు చెప్పేవాడు. కరణం గుర్తు రాగానే కరణం పొలాలు, ఆ పొలాల కాపలా ముందు నిలుస్తున్నాయి.

తొలకర్లు పడ్డవంటే చాలు కరణం పెద్ద జీతగాడు మాలపల్లికి, మాదిగపల్లెకి వచ్చేవాడు. "కరణంగారి అరకలు కట్టాల యింటికొకడు రండ్రా" అని అనేవాడు. కరణానివి గట్లు లేని పొలాలు. ఎన్నెలదిన్నిలో అరకలు మాత్రమే కాదు, చుట్టుపట్ల ఊళ్ళనుంచి కూడా కావాల్సిన అరకలు వచ్చేవి. దున్నడం వో వారం రోజులు సాగేది. దుక్కికొట్టడం, చదును చెయ్యటం అప్పుడే జరిగిపొయ్యేది. మాలామాదిగ కుటుంబాలన్నీ కరణం పొలం మీదనే వుండేవి. మధ్యాహ్నం కూటికావిళ్ళు మాత్రం వచ్చేవి. మాలామాదిగలు వరసగా కూర్చుంటే జీతగాళ్ళు తాటాకురేకల్లో వడ్డించేవాళ్ళు. అదే కూలి. అంతకన్నా ఏమీ వుండదు. ఆ తర్వాత నాట్లేత కూడ అంతే. నారు పీకడానికి, నారు కావిళ్ళు మొయ్యడానికి, నాటడానికి మాలామాదిగ కుటుంబాలే పనిచేసేవి. యింటికో మగాడు, ఆడది అని అనేవాళ్ళు కాని కుటుంబాలకు కుటుంబాలే ఆ పనిలో వుండేవి. దానికీ మధ్యాహ్నం కూటి కావిళ్ళే కూలి.

కొన్ని సందర్భాల్లో ఆ మధ్యాహ్నం కూటికోసమే కుటుంబాలకు కుటుంబాలే వెళ్ళేవి. నిజానికి ఆ కూడు ఓ మంత్రం లాంటిది. విచిత్రమేమిటంటే పచ్చడి 'దానికెక్కువ వచ్చిందని' వొకామె, "దీని కెక్కువ వచ్చిందని" యింకోకామె తిట్టుకొనేవాళ్ళు. తిట్లు ఒక్క చోట ఆగవు. ఆ యింట్లో అందరి పేర్లు చాలా అసహ్యంగా బయటకొచ్చేవి. తగాదా ఒక్కోసారి కొట్లాటకు దారితీసేది. గట్టుమీద కూర్చొని కరణం యితర పెద్దలు అది వినోదంగా చూసేవారు. మాలాళ్ళని, మాదిగాళ్ళని వేరు వేరు వరుసల్లో కూర్చోబెట్టేవాళ్ళు. ఎవరి కులం వాళ్ళదే అనేవాడు కరణం. రెండు కులాలు ఏ విషయంలోనూ కలవకూడదు. అది అతనికి అవసరం.

నాటు అయ్యిందో లేదో కాపలా మొదలయ్యేది. కరణం పొలాల కాపలాకి యితర కులాలు వచ్చేవి కావు. ఈ రెండు కులాల్లోనే యింటికొకరు వంతులవారీగా వుండేవాళ్ళు. కోతలు వచ్చినా అంతే, కుప్పలు నురిసినా అంతే. మధ్యాన్నం కూటికావిళ్ళే కూలి. కాకపోతే కల్లాల్లో మాత్రం యింటికో మూడు చాటల వడ్లు 'కరణం దానం' కింద కొలిచేవాళ్ళు. ఆ తర్వాత "కల్లాంగింజ" వదిలేవాళ్ళు. కల్లాంగింజ కోసం వీళ్ళు తన్నుకొనేవాళ్ళు. కల్లాంలో మిగిలిన తాలుగింజ కోసం, నేల పగులుల్లో దాగిన గట్టి గింజకోసం వీళ్ళు పోటీలు పడేవాళ్ళు. చివరకి యింటిపేరు మీద కల్లాంలో గీతలు గీసుకొనేవాళ్ళు. అయినా తగాదాలు ఆగవు. ఆరుగాలం చేసిన వెట్టిచాకిరీ గుర్తు రాదు. కల్లాం అడుగున మిగిలిన గింజల కొట్లాట ఒకరోజుతో ఆగదు. కల్లాల్లో ఆడాళ్ళ తగాదా పల్లెల్లో బజార్ల తగాదాగా మారేది. ఒక్కోసారి పెద్ద కరణమే తీర్పు చెప్పేవాడు. "అయ్యో పాపమని కల్లాంగింజలు వదిలితే తన్నుకొని చస్తార్రుట్రా అలగా     గాడిదల్లారా" అని తిట్టడం, ఒక్కోసారి కొట్టించడం కూడా చేసేవాడు. చిత్రంగా వుండేది. దారుణంగా వుండేది.

కల్లాం గింజ తగాదా మాలపల్లి వీధుల్లో, మాదిగపల్లి వీధుల్లో విడివిడిగా జరిగితే పర్వాలేదు. ఒక్కోసారి రెండు పల్లెల మధ్య జరిగేది. అప్పుడు కరణమే కల్లాలు పంచి యిచ్చేవాడు. యిద్దరిలో ఏ ఒక్కరికీ కల్లం తాలుగింజ మీదే కాదు తమకి హక్కుంది, అసలు కరణం గాదెల నిండా వున్న ధాన్యం మీద కూడా తమకు హక్కు వుందనే ఆలోచన రాదు. ఏ కరణం వాళ్ళ శ్రమని వెట్టిగా మార్చి దోపిడీ చేస్తున్నాడో వాణ్ణే తమకు వాటాలు పంచమంటారు. ఆ అవకాశం కోసం ఎదురుచూసే కరణం వీళ్ళ మధ్య శాశ్వతంగా గండి కొట్టడానికి సర్వ ప్రయత్నాలు చేసేవాడు. పరిష్కారాన్ని వాయిదా వేసేవాడు. ఎవరి తలలన్నా పగిలాయా లేదా అని ప్రతిరోజు వాకబు చేసేవాడు. ఎన్నెలదిన్నిలో పిల్లాడిగా ఆ రోజు నాగన్నకి అదంతా అర్థం కాలేదు. ఆ రోజు తాను చూసిన వాస్తవాల్ని ఉరుముల నాగన్నగా యిప్పుడు అర్థం చేసుకోగలడు.

మాదిగల్ని కొట్టడానికి మాలల్ని, మాలల్ని కొట్టడానికి మాదిగల్ని కరణం మీ కులం అంత గొప్పది యింత గొప్పది అని ఉబ్బేసేవాడు. తన్నుక చచ్చేవాళ్ళు.

ఎన్నెలదిన్నిలో నాగన్నకి తన ఆకారం స్పష్టంగా కళ్ళముందు నిలుస్తోంది.

మొలచుట్టూ గుడ్డచుట్టి పెట్టిన గోసె. ఒక్కోసారి చుట్టు గుడ్డ లేకుండానే పెట్టిన గోసె. యింత పొడుగు జుట్టు. జుట్టు బిగదీసి కట్టిన ముడి. అమ్మ టెంకాయ చిప్పలో చేసిన సాదుబొట్టు. అప్పటి జుట్టు యిప్పటికీ అట్టాగే వుంది. కాకపోతే యిప్పుడు జులపాలైంది.

ఎన్నెలదిన్ని మాలపల్లి, మాదిగపల్లి ప్రమాదం అంచునే కాపురమున్నాయి. ఏటికి దగ్గర్లో వున్నాయి. వరద వచ్చిందంటే మొదటి నీరు నిలిచేది ఈ పల్లెల్లోనే. వరద ఏటిగట్టు కోస్తుంది. అట్టా వరస వరదల్లో కోత మొదలైతే రెండు పల్లెలు ఏట్లో కొట్టుకపోవాల్సిందే

రెండు పల్లెలు ఎత్తి కట్టాలని చాలాసార్లు అనుకొన్నారు. ఊరికి పై భాగాన ఖాళీ దిబ్బ వుంది. అక్కడ కట్టితే ఏటి ప్రమాదం వుండదు. కాని అక్కడ కట్టడం చిన్న విషయం కాదు. తలభాగాన అంటరాని పల్లెలుండటం అగ్రవర్ణాలు సహించవు. మాలమాదిగ పల్లెలు ఎప్పుడూ దిగువనే వుండాలంటారు. ఎగువన వుంటే అగ్రకుల అహంకారం ఒప్పుకోదు అందుకే మాలామాదిగల కోర్కె కోర్కెగానే మిగిలిపోయింది.

ఎన్నెలదిన్నెల్లో ఈ దరిద్రుల బతుకులు కోర్కెలతో మిగిలిపోయాయి. కోర్కెలతో కుమిలిపోయాయి కోర్కెల కోసం కూలిపోయాయి.

నిజంగా అట్టాగే జరిగింది. అయ్యా నారిగాడి బతుకు అట్టాగే కోర్కెలతో కూలిపోయింది కాకపోతే మాలాడి దిబ్బగా మిగిలిపోయింది. ఎట్టా జరిగింది ?

అర్ధరాత్రి వానచినుకు మొదలైంది. తెల్లారినా ఆగలేదు. రోజు దాటింది. వాన ఆగలేదు. రెండో రోజు దాటింది. వాన ఆగలేదు. మూడో రోజూ కురుస్తూనే వుంది. మూడో రోజు వానకు గాలి తోడైంది. ఆ గాలి కూడా ఆగి ఆగి వీస్తోంది. అప్పుడప్పుడు దిక్కు మారి వీస్తోంది. ఒక్కోసారి వెచ్చటి ఆవిరి చిమ్ముతోంది.

అర్థం కాని వాతావరణం. నిజానికి వాన ఎన్నెలదిన్ని పేదల గుండెల మీద కురుస్తోంది. గాలి వారి గుడిసెల మీద వీస్తోంది. గాలికి యింటి నిట్టాళ్ళు వూగుతున్నాయి. మట్టిగోడలు కూలిపడుతున్నాయి. కప్పులేసి గాల్లో తిరుగుతో ఎక్కడెక్కడో పడిపోతోంది.

వాన యిప్పట్లో ఆగేలా లేదు. గాలి ఎక్కువయిందే కాని తగ్గటం లేదు. కాకపోతే ఆగి, ఆగి కొడుతోంది. ఆగినప్పుడు ప్రకృతి స్థంభించినట్టు ఏదో వూహకందని భయం వెన్నాడుతోంది. వీచినప్పుడు గుడిసెలు, తాటిచెట్లు, నేల కరుచుకొంటున్నాయి.

అంతలో పిడుగులాటి వార్త. ఏట్లో కొత్త జాలు పారుతోంది. పెద్దలు ఏటికేసి పరుగెత్తారు. కొత్త నీరు నురగలు కక్కుతూ పారుతోంది. నీరు గట్టుదాటుతోంది. ఓ నెల రోజులు క్రితమే వరదలొచ్చాయి. అప్పుడే ఏరు గట్టుకోసి మాలుచ్చమ్మ చెట్టు దాకా వచ్చింది. మాలుచ్చమ్మ చెట్టు దాటితే ఎల్లమ్మ గుడి. వరద ఎల్లమ్మ గుడి దాటిందంటే ముంగమూరమ్మను దాటుతుంది. అప్పుడు మాలపల్లి ఉండదు. మాదిగపల్లి వుండదు. మాలుచ్చమ్మ చెట్టుకు ఎల్లమ్మ గుడికి మధ్య భాగం గండి పడిందంటే ఆ ప్రమాదం అంతా యింతా వుండదు.

నాలుగు గంటలకే చీకటి ముంచుకొచ్చింది. సముద్రంలో కొత్త శబ్దం మొదలైంది. చీకటితో రహస్యంగా కుట్ర చేసినట్టు ఏటినీళ్ళు మాలుచ్చమ్మ చెట్టు తాకాయి. కూడబలుక్కొన్నట్టు ఏటిగట్టు విరుచుకపడుతోంది.

"లాభం లేదు. ఎల్లమ్మ గుడి దాటిందంటే రెండు పల్లెలు మునిగిపోతాయి ముత్తా"

మాలపల్లి పెద్ద అన్నాడు.

"గండి పడకుండా చూడాల్రా సుబ్బా" మాదిగ పెద్ద మాట కలిపాడు.

వరద ఎల్లమ్మ గుడి దాటకుండా వుండటానికి చెయ్యాల్సిన ప్రయత్నాలన్నీ చేశారు. హోరుగాలిలో, కుండపోత వానలలో ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని, బ్రతకటం కోసం, తన వాళ్ళని బ్రతికించుకోవడం కోసం వయస్సుతో సంబంధం లేకుండా తాటి దుంగలు కొట్టారు, అడ్డం పెట్టారు, గడ్డిమోపులు కుక్కారు, చెయ్యాల్సిన పనులన్నీ చేశారు. అన్ని పనుల్లో అయ్యా వున్నాడు. అయ్యతో పాటు మాదిగ మాతయ్యా వున్నాడు. ఆ యిద్దరూ. వరద ఆపటానికి, కోత ఆపటానికి ప్రాణాలకు తెగించి పని చేస్తున్నారు

గట్టు కోత ఆగలేదు నీటి ఉద్రిక్తత తగ్గలేదు. కోస్తూనే వుంది. పొంగుతూనే వుంది. పల్లెలమీద విరుచుకుపడటానికి సిద్ధంగా వుంది.

అంతలో గాలి హోరు చిత్రంగా ఆగింది. ఏమీ జరగనట్టు భయంకరమైన నిశ్శబ్దం ప్రపంచమంతా ఆక్రమించినట్టు అన్పించింది. అనుభవం భయపెట్టింది. యింత ప్రశాంతత తర్వాత రాబోయే ప్రళయం కళ్ళముందు నిల్చింది

ఎల్లమ్మ గుడిని చుట్టి నీరు పరుగెత్తుతోంది. ముంగ మూరమ్మ మునిగిపోయింది. వాతావరణంలో వేడి పుట్టుకొస్తోంది. సముద్రంలో వుండ చుట్టుకొన్నట్టు తన్నుకొంటున్న ప్రక్రియ బద్దలు కావడానికి యింక ఎంతో సమయం లేదు.

రెండు పల్లెల జనం ఒకచోట చేరారు. పిల్లలు తల్లుల్ని అతుక్కుపోయారు. ఏడుపులు, ఆర్తనాదాలు -

"ఊరవతల గుట్టకేసి ఎల్దాం"

"ఊళ్ళో పెద్దలు సంపేత్తారు."

"వరద ముంచేత్తుంది"

"సముద్రం పొట్ట పగిలితే ఉప్పెన తప్పదు" గొడవగా మాటలు. తొందరలు. ఏడ్పులు. భయాలు.

ఆ గొడవల్లో, తొందరలో, ఏడ్పుల్లో, భయాల్లో, "దిబ్బ మీదికి ఎల్తోన్నా, వచ్చేవాళ్ళు రావచ్చు."

అయ్యా గట్టిగా అన్నాడు. అంతా వింతగా చూశారు. అయోమయంగా చూశారు. అయ్యా తనని చంకనెత్తుకొన్నాడు. అమ్మ గంప నెత్తినెత్తుకుంది. మాతయ్యా అయ్యతో

కదిలాడు

"బతకాలనుకొంటే రండి ఎపుడు అడ్డొచ్చినా గొడ్డలికి బలౌతాడు బతకాలనుకొన్నోళ్ళు రండి ఎట్టాగూ సత్తాం ఎల్లమ్మ కూడా మునిగింది రండి రండ్రా పిరికి నా కొడకల్లారా రండ హే "

నాగన్న యిప్పుడు పరుశురాముడు కథ చెప్తుంటే అప్పటి అయ్య గుర్తొస్తాడు గొడ్డలి పట్టుకొన్న అయ్యే పరుశురాముడే

"యిప్పటిదాకా ఈడ మనకి నేల చెక్కలేదు యిప్పుడు పాణం కూడా వుండదు నాకు సావాలని లేదు బతకాలనుంది"

అయ్య అడుగు ముందుకేశాడో లేదో జనం వరదలాగే లేచారు వరద తరుముతుంటే వరదకన్నా ముందు పరుగెత్తుతున్నారు దిబ్బమీదికి వెళ్ళాలంటే ఊళ్ళో గుండానే వెళ్ళాల్సి వుంది చుట్టూతా నీళ్ళు అక్కడిదాకా నడిచినవాళ్ళు మంత్రించినట్టు ఆగారు అయ్య వెనక్కి చూశాడు అంతా అయోమయంగా చూస్తున్నారు -

"నడవండి బతకటానికి నడవండి. బతకాలి మనం బతకాలి నడవండి"

సముద్రం పొట్ట పగిలి వుంటుంది ప్రళయాన్ని మోసుకొచ్చిన హోరుగాలి అంతు చిక్కని వాన తుఫాను అంటరాని ఉప్పెన ఊరిమీద పడింది మొదటిసారి ఎన్నాలదిన్ని జీవితంలో మొదటిసారి అంతమంది మాలా మాదిగలు అగ్రవర్ణాల యిళ్ళ మధ్య, దారివెంట, ఊరిమధ్య, దేవాలయాల సందులు దాటి దిబ్బకేసి నడుస్తున్నారు

నిజంగా తుఫానే అది

దేవాలయం ధ్వజస్థంభం పెళపెళమంటూ విరిగిపడిన శబ్దం కరణం పెంకుటికొట్టాం కూలిన శబ్దం కట్టు మడిగొడ్ల కట్లు తెంచుకొని తుఫాను గాలిలో బీభత్సంగా తిరుగుతున్న సన్నివేశం

నాగన్న బాల్యం ముద్ర వేసుకొన్న వాస్తవం

అలగా జనం యింతకాలం అగ్రవర్ణాలు వద్దన్న దిబ్బమీద కాలు పెట్టారు దిబ్బచుట్టూ వరద

అయినా భయం లేదు చాలా ఎత్తు దిబ్బ అంత హోరుగాల్లో అంత వానలో, భయంకరమైన తుఫాను రాత్రిలో, తడుస్తో, వణుకుతో ఆకలికి డొక్కలు లాక్కొంటో దిబ్బమీద, అగ్రవర్ణాల పై భాగాన ఏదో మొండి ధైర్యం, చావమనే నమ్మకం

ఆ రాత్రి గడిచింది

తెల్లారి గట్టుమీది నుంచి చూస్తే మాలపల్లి మాదిగపల్లి ఏట్లో కొట్టుకపోయినట్టుంది. అంతా జలమయం-

ప్రకృతి అంత మాయలాడి మరొకటి లేదు ఏమీ జరగనట్టు ఎండ కాస్తోంది

వచ్చేప్పుడు గంపల్లో, కుండల్లో, పెట్టెల్లో తెచ్చుకొన్న బియ్యం ఒకచోట పోశారు.

అయ్యా పంచె పరిశాడు.

మాదిగ మాతయ్యా బియ్యం దండి అక్కడ పోశాడు.

సుబ్బయ్యా తాత చెకుముకి రాయి తీశాడు. ఎంత కొట్టినా నిప్పు రాలేదు. ముత్తయ్యా అందుకొన్నాడు. కొట్టగా కొట్టగా వెలిగింది అగ్గి పుట్టింది ఆ అగ్గికి తడిసిన కట్టెలైనా మండుతాయి. మంట పుట్టాలే కాని కాలటం జరగకపోదు.

ఏం వండుకొన్నారో. ఏం తిన్నారో తెలీదు. తిన్నారు. కలిసి తిన్నారు. ఆ యిద్దరూ కలసి తిన్నారు. సుబ్బయ్యా తాతకి పొరపోతే ముత్తయ్యా తాత వాడి తలమీద తట్టాడు. ముత్తయ్యకి ఎక్కిళ్ళు వస్తే సుబ్బయ్యా తాత నీళ్ళిచ్చాడు. అవి వరద నీళ్ళే కావచ్చు. నీళ్ళిచ్చాడు. విషాదం ఒక్కోసారి అద్భుతంగా వుంటుంది.

వాన పూర్తిగా ఆగినట్టుంది. ఊళ్ళో పడిపోయిన ధ్వజస్తంభం చుట్టూ జనం చేరారు. దేవాలయం గోడలెక్కిన వాళ్ళు దిబ్బకేసి చూసినట్టుంది. ఏం చెప్పారో ఏమో తెలీదు. దేవాలయం గోడ మాత్రం ఒకరి తర్వాత ఒకరు ఎక్కి చూస్తున్నారు.

పగలు గడిచిపోయింది.

నీళ్ళు కూడా ఎంత ఉద్రిక్తంగా వచ్చాయో అంత హడావిడిగా తీస్తున్నాయి - ఎన్నెలదిన్ని మాలపల్లి, మాదిగపల్లి తుడుచుకపెట్టిపోయి అక్కడో నిట్టాడి, యిక్కడో నిట్టాడి మిగిలి, యిక్కడ నిన్నటిదాకా కాపురాలు వున్నాయనే గుర్తుగా వున్నాయి.

రాత్రి దిబ్బమీద విచిత్రంగా అన్పించింది. వెలుతురు కోసం మంట పెట్టారు. మంట చుట్టూ ఆడాళ్ళు, ముసలాళ్లు, పిల్లలు. వయసువాళ్ళు మాత్రం దూరంగా కూర్చొన్నారు. తెచ్చిన బియ్యం పగలు సరిపోయాయి. ఆలస్యంగా తిన్నారు కాబట్టి యింకా ఆకలి అన్పించలా. కాని రాత్రి గడిచేకొద్దీ ఆకలి అన్పిస్తోంది. ఉన్నది పసిపిల్లలకి పెట్టారు. నిద్రకి ఆగలేక తడిలోనే పడుకొన్నారు.

అయ్యకోసం చూస్తే, అయ్యా గుంపులో లేడు.

"అయ్యా" అని కేకేశాడు.

"అవునూ. నారిగాడేడ్రా...." ఎవరో అన్నారు.

"మాతయ్యా, వాడు అటెల్లారు, సెంబాటకై వుంటది" ఎవరో అన్నారు.

సుబ్బయ్యా తాత దిక్కులు చూశాడు.

ముత్తయ్యా తాత పైకల్లా లేసి చూశాడు.

యిద్దరూ దిబ్బంతా వెతికారు. అయ్యా, మాతయ్యే కాదు మరో యిద్దరు ఆ ఈడువాళ్ళు కూడా కన్పించలేదు.

"యాడ కెళ్ళుంటారు"

చుట్టు ఎటు చూసినా నీళ్ళు...... దిబ్బ దిగితే మొలల లోతు నీళ్ళు.. మధ్య మధ్యలో గుంటలు. దిన్నంతా ఎత్తుపల్లాలే. వరదకి ఏ ఎత్తు కరిగిందో, ఏ పల్లం ఎత్తయిందో అర్థం

కాదు.

"ఎదవ నాయాళ్ళు. సెప్పా పెట్టకుండా ఎటు సచ్చినట్టు."

రాత్రి గడిచిపోతోంది. ఆ నలుగురి విషయం అందరికీ తెలిసిపోయింది అందర్లో ఆతురత. అమ్మ అయోమయంగా చూస్తోంది.

నీళ్ళలో అలికిడైతే అంతా అటుకేసి చూశారు. అలికిడి దగ్గర పడేకుంది ఆతురతగా చూస్తున్నారు. దూరంగా నాలుగు ఆకారాలు నీళ్ళని తోసుకుంటూ వస్తున్నట్టనిపించింది. ఆ నాలుగు ఆకారాలు దగ్గరయ్యేకుంది వాళ్ళు ఎంత భారంగా నడుస్తున్నారో స్పష్టంగా తెలుస్తోంది. ఆ నలుగురి భుజాలమీద గోతాం మూటలు. దిబ్బ ఎక్కి, గోతాం మూటలు నేలమీది విసిరి అలిసిపోయి కూర్చొన్నారు. అంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"ఏందిరా ఇది నారిగా"

"బియ్యం."

"యాడయని"

"సావుకారు కొట్టులోయి"

"అంటే"

"పొయ్యి రాజెయ్యండి. బతకాల. అంతే. మనం బతకాల. మన బిడ్డలు బతకాల. పొయ్యి రాజెయ్యండి."

ఎవ్వరూ మాట్లాడలేదు. పొయ్యి రాజుకొంది. వండటం అయ్యాక నిద్రపొయ్యే వాళ్ళని నిద్ర లేపారు. అర్ధరాత్రి అంతా ఆవురావురుమని తిన్నారు.

ఆకాశం నిర్మలంగా వుంది. గట్టుకింద గుచ్చిన పుల్లకి మూరెడు దూరంగా నీరు జరిగిపొయ్యాయి. ఏరు తొందరగానే తీస్తోంది.

అంతా నిద్రపొయ్యాక పెద్దమాల, మాదిగ పెద్ద, మరికొంతమంది వున్నప్పుడు మాతయ్య అన్నాడు.

"ఊళ్ళో పెద్దలు రచ్చ చేశారు."

"షావుకారు కూడా రచ్చ దగ్గరే వున్నాడు."

"కొట్టు తాళం పగలగొట్టినా ఆడి భార్యాబిడ్డలు లేవలా."

"లేసుంటే"

"............."

"రచ్చలో మనమాటే వుంటది"

"ఏదైనా జరగొచ్చు."

"సద్దాం ఈడ్నే సద్దాం"

"ఈడ్నించి కదిల్తే కదిల్నోడ్ని కదిలినట్లు గుంటలో పెట్టడమే."

యిద్దరు పెద్దలు భయంగా చూశారు. కరణం క్రూరుడు. అనుభవం మరీ

భయపెడుతోంది.

"మనం సావటానికే పుట్లా........."

"ఆళ్ళు ఎత్తున వుండొద్దంటారు. ఏరు దిగువున వుండద్దంటది. ఎత్తుకు వస్తే ఆళ్ళు సంపుతారు. దిగువ వుంటే ఏరు సంపుద్ది. ఎట్టా సూసినా సావు తప్పదు. కాని...... యినండి...... సెప్పే మాట యినండి. మనం సావటానికే పుట్టలా."

"అంటే"

"సంపటానికి కూడా పుట్టినాం"

ఆఖరిమాట అయ్య, మాతయ్య యిద్దరూ కూడబలుక్కొని అన్నారు. నాగన్న ఈడు పిల్లలు నిద్రపోయినా తనకి నిద్ర రాలేదు. అయ్య దగ్గరే కూర్చొన్నాడు ఆవులిస్తూనే కూర్చొన్నాడు. అయ్యకి ఈ వైపు తానున్నాడు. ఆ వైపు మాతయ్య. ఆ యిద్దరి మధ్య గొడ్డలుంది. గొడ్డును తెగనరికే కత్తి వుంది.

"వానే రాకపోతే వరదే రాకపోతే, ఏరు గట్టు కోసుకొని ముంగమూరమ్మ మునగకపోతే యిక్కడికి రమ్మంటే ఒక్కడొచ్చేవాడు కాదు. వరద తరిమింది. వరద కలిపింది. అంతా కదిలొచ్చాం. యిక్కడైతే బతకొచ్చు......"

"వూళ్ళో అంతమందిమి నడిసొత్తుంటే ఎట్టాగో వుంది. తుఫానుకు యిళ్ళలో వుండిపొయ్యారు. లేకపోతే ఎట్టుండేదో."

"ఎట్టుంటది. తుఫాను రాకపోతే ఆళ్ళ యిళ్ళ మద్దె మనం అసలొత్తేగా ఎట్టుండేది తెలిసేది."

నవ్వులు

తెల్లవారింది.

నీరు బాగా తీశాయి. ఎక్కడి గట్టు అక్కడక్కడ కన్పిస్తోంది. యిసక భూమి కాబట్టి అంత నీరొచ్చినా బురద లేదు. ఏమీ జరగనట్టు మళ్ళీ తెల్లటి యిసుక దిబ్బలు.

అసలు కథ యిప్పుడు మొదలైంది. దిబ్బమీదికి కరణం రాలేదు. షావుకారు రాలేదు. రచ్చలో ఏమనుకొన్నారో తెలీదు.

కాని.....

రెండో రోజు అంతా అయిపోయింది. ఎట్టా జరిగిందో తెలీదు. గుడెసెలకి పుల్ల చూసొస్తానని వెళ్ళిన అయ్య తిరిగి రాలేదు. శవమై వచ్చాడు. మాతయ్య భుజాలమీద మోసుకొచ్చాడు.

"నేను పుల్లలు సూసొత్తా, నువ్వు ఆకు సూడ్రా మాతా అన్నాడు. ఆకు సూసి ఈడికోసం ఎంత సూసినా రాలా...... చిట్టిడివి కేసి ఎల్తే అడవి మలుపుదార్లో నెత్తురు మడుగులో పడున్నాడు......"

శవం చుట్టూ చేరిన జనం గొల్లుమన్నారు. గుండెలు బాదుకొన్నారు.

"నారిగాడు సావల.... నా అన్నదమ్ముడు...... సావలా... ఆడు సావలా..... "

మాతయ్యా రోధిస్తున్నాడు.

అమ్మ ఎప్పుడో నేలపైన పడిపోయింది.

మూడో రోజు దిబ్బమీది గుంపు చెల్లాచెదరైంది. అయ్యా ఎట్టా చచ్చింది అందరికీ తెలుసు ఎవరు చంపిందీ అందరికీ తెలుసు. కాని ఎవ్వరూ మాట్లాడరు. మాట్లాడే శక్తిలేదు. శక్తి వున్న నారిగాడు చచ్చాడు. శక్తి వున్న మాతయ్యా "ఆడు సావలా. ఆడు సావలా" అంటూ తిరుగుతూనే వున్నాడు.

పాత చోట్లోనే మళ్ళీ గుడిసెలు లేశాయి. అమ్మ అట్టాగే వుండిపోయింది. గుడిసెలు కట్టుకొనేవాళ్ళని చూస్తూ వుండిపోయింది. అయ్యా పేర కూడా వో గుడిసె కట్టారు.

అయ్యా 'కర్మ' అంతా కలిసే చేశారు. మాతయ్యా మాత్రం "ఆడు సావలా... ఆడుసావలా" అంటూనే వున్నాడు.

కాని ఆ రాత్రి నుంచే అతను కన్పించలేదు. ఎటు వెళ్ళాడో తెలీదు. అయ్యా గొడ్డలి కూడా ఎంత వెతికినా కన్పించలేదు.

మాతయ్యా అన్నట్టు అయ్యా సావలా. నారిగాడు సావలా. యిప్పటికీ గుర్తుండేటట్టు ఎన్నెలదిన్నిలో "మాలాడి దిబ్బ" అట్టాగే మిగిలింది.

అక్కడ మాలాడు దెయ్యమై తిరుగుతున్నాడనే పుకారు చాలాకాలం వుండేది. యిప్పుడా దిబ్బ ఎట్టా వుందో తెలీదు. దట్టమైన తాటిచెట్లతో వుండొచ్చు. కాని ఆ కాయలు కోస్తారో లేదో తెలీదు. ఆకు కొడ్తారో లేదో తెలీదు. కల్లు గీస్తారో లేదో తెలీదు మాలాళ్ళు వుండకుండా మాలాడి దిబ్బ వుంది.

కడుపు కోసుకొంటే కాళ్ళమీద పడ్తుంది.

నిజమే. అంతా కోతే. అంతా కడుపు కోతే.

అయ్యా చచ్చిన నెల రోజులకి ఎన్నెలదిన్నికి వీడ్కోలు చెప్పాల్సి వచ్చింది. ఉత్తరాది కోతలకి దాక్లాది జనం వెళ్తుంటే అమ్మ వాళ్ళతో కలిసింది. ఎన్నెల దిన్నెలో పెద్దలు అక్కడే వుండమన్నారు. అమ్మ కొంతకాలం అట్టా వెళ్ళొస్తానంది.

ఎన్నెలదిన్ని వదులుతుంటే పుట్టెడు ఏడ్పొచ్చింది. అయ్యా, తాటి చెట్లు, పంటపొలాల గట్లు, పరుగెత్తే ఎంత్రకాయలు, తుమ్మల తోపు అంతా వదలివెళ్తుంటే ఏదోలా వుంది. బాల్యం ఎన్నెలదిన్నితో ముగిసినట్టనిపించింది.

"మళ్ళీ వత్తం లేరానాగా"

అమ్మ అంది. అంటూనే కొంగు నోట్లో కుక్కుకుంది.

ఎల్లమ్మ గుడిచుట్టూ తిరిగారు. మాలుచ్చమ్మ చెట్టుకు మొక్కారు. చేలగట్లు దాటుతుంటే గట్టుమీద ఎంత్రకాయ పరుగెత్తుతోంది. జాగ్రత్తగా పట్టుకొన్నాడు. అంతే జాగ్రత్తగా గట్టుకింద వదిలాడు. అది పరుగు తీసింది. నవ్వు ఆగలేదు. అదే చివ్వరి జ్ఞాపకం. పరుగెత్తే

ఎంట్రకాయ ఎన్నెలదిన్ని తాలూకూ ఆఖరి అనుబంధం-

ఉత్తరాది ప్రయాణం ఎన్నెలదిన్నిని శాశ్వితంగా దూరం చేస్తుందనుకోలేదు. ఉరుముల చంద్రప్ప అక్కడే పరిచయమయ్యాడు. పరిచయమయ్యాడనే కన్నా అమ్మ బతుకులోకి అడుగుపెట్టాడనొచ్చు. గంగ జాతరకొచ్చాడు. జాతర అయినా వెళ్ళలేదు.

ఓ రోజు రాత్రి నిద్రలేసి చూస్తే దీపం ముందు కూర్చొని చంద్రప్ప అమ్మకేదో చెప్తున్నాడు. తెల్లారి ఎడ్లబండి తాము వుండే కొట్టాం ముందు ఆగింది.

"ఎక్కరా నాగన్నా"

ఎక్కడికని అడగలేదు. బండి ఎక్కాడు. అమ్మ కూడా కూర్చొంది. చంద్రప్ప ఎడ్ల దగ్గరగా కూర్చొన్నాడు. బండి వూరు దాటింది. అట్టా రెండు మూడు వూళ్ళు దాటాక బండి దిగారు. బండి వెనక్కి వెళ్ళిపోయింది. అదే వూరో తెలీదు. రామ్మందిరం పక్కన అమ్మ వంట చేసింది. ఆ రాత్రి అక్కడే నిద్రపొయ్యారు. నడుస్తో, బండ్లు కట్టించుకుంటో, ఎక్కడో ఒకచోట రాత్రి నిద్రచేస్తో, దర్మారం చేరారు. అది చంద్రప్ప పుట్టినూరు. అది ఉరుముల చంద్రప్ప పెరిగిన ఊరు.

అక్కడే నాగన్న పెరిగాడు. పెళ్ళీడు కొచ్చాడు. పెళ్ళాడాడు. రాములు కాపురానికొచ్చాక అమ్మ తృప్తిగా కన్నుమూసింది. తన పని పూర్తి చేసినట్టు, యిక తాను చెయ్యాల్సిన పని ఏదీ లేనట్టూ, ఎన్నెలదిన్నికి సెలవు తీసుకొన్నట్టు దర్మారానికి సెలవు తీసుకుంది. అయితే ఈ సెలవు శాశ్వితమైంది.

అమ్మ కన్ను మూసే రోజు చంద్రప్ప అమ్మ దగ్గరే వుండిపోయాడు. ఆమె పక్కనే కూర్చొన్నాడు. చంద్రప్ప ఒడిలోనే అమ్మ కన్ను మూసింది.

రాములు నీళ్ళోసుకుంది. ఆడపిల్ల పుడితే లచ్చిమి పేరు పెడ్దామన్నాడు చంద్రప్ప. మగపిల్లాడు పుడితే అని నాగన్న అన్నాడు. నారయ్య పేరు పెడదామన్నాడు.

జీవితం తనని వంటరివాడిని చెయ్యడానికే నిర్ణయించుకొంది. చంద్రప్ప కాలం చేశాడు. కనలేక రాములు కాలం చేసింది. తల్లితోపాటు కడుపులో బిడ్డ కూడా.

ఇంతకాలం ఉరుముల శబ్దాల మధ్యనే గడిపాడు. జీవితం గంగమ్మ పాటతోనే నిండిపోయింది. కుంకాలాట కోలాహలంతోనే నిండిపోయింది. ఖాళీగా వుంటే తెలీని బాధ, భయం వెన్నాడేది. అమ్మ, అయ్య చంద్రప్ప, రాములు, ప్రాణం లేకుండా పుట్టిన బిడ్డ వెన్నాడేవారు. అందుకే కదిలే కాళ్ళకి, మోగే ఉరుముకి, పాడే నోటికి విరామం యివ్వలేదు.

ఇదిగో యిప్పుడు ఎల్లన్నని చూశాక ఎందుకో తెలీదు అలసటగా వుంది. కాస్త విశ్రాంతిగా వాడితో మాట్లాడాలనిపిస్తోంది.

చంద్రప్ప చెప్పిన పురాణం రహస్యాలు ఎల్లన్నకి చెప్పాలనిపిస్తోంది. చంద్రప్ప నేర్పిన అడుగుల కదలికలు ఎల్లన్నతో కలిసి పంచుకోవాలని వుంది. ఈ బిడ్డని ఎన్నెలదిన్ని తన కోసమే తరిమింది. తనని వెతుక్కొంటూనే వచ్చాడు అని నాగన్న అనుకొన్నాడు.

రాత్రి ఎల్లన్న మాట్లాడుతున్నప్పుడు వాడి మాటల్లో పదే పదే బూదేవి పేరు విన్పించింది. అయ్యే పేరు అన్నిసార్లు చెప్పలేదు. అమ్మ పేరు అన్నిసార్లు చెప్పలేదు బూదేవిని వదలి, వీడు తనతో దర్మారం రాడు. వస్తాడనే నమ్మకం లేదు. ఎందుకో తెలీటం లేదు. నిన్నటి నాగన్నగా తాను ఈ ఉదయం లేనట్టు అన్పిస్తోంది. తెగిన బంధాలు తెగిపోగా ఏ బంధాలు లేని వంటరితనం యిప్పుడు భరించేదిగా అన్పించడం లేదు. మళ్ళీ తన బాల్యం గుర్తు చేశాడు ఎల్లన్న.

యింకా మసక చీకటి తొలిగిపోలేదు నాగన్నకి "పక్కెలదిన్ని" పొలాలకేసి నడవాలనిపిస్తోంది - చెట్టుకింద కూర్చొని దింపిన చెట్టు కల్లు కనీసం అరలొట్టె తాగందే ఈ నీరసం పోదనిపిస్తోంది. అడుగులేశాడో లేదో నిద్రపోతున్న ఎల్లన్న మంచం మీదినుంచి లేచినట్టు అన్పించింది. వెనుక్కి తిరిగి చూస్తే ఎల్లన్న నిద్రలేవటమే కాదు. దగ్గరగా వచ్చాడు.

మసక చీకట్లో పొలాలకేసి నడిచారు.

"నువ్వు చాలా దూరం నడిచావురా బిడ్డా"

"ఏమో తెలవదు. నడిచానో, పరిగెత్తానో, ఏదీ తెల్వదు."

"నాట్యం నేర్చుకొంటావా"

"నాకొచ్చు"

నాగన్న తెరలు తెరలుగా నవ్వాడు. మసక చీకటి ఆ నవ్వుకు పారిపోతున్నట్టనిపించింది.

"పాటలు కూడా వచ్చా"

"అత్త నేర్పింది."

"పోనీ ఉరుం నేర్చుకొంటావా"

"నేర్చుకొంటా..... కాని అత్తకి రాదు"

నాగన్న మళ్ళీ నవ్వాడు. గడ్డిపోచ మీది మంచు రుచిచూసే పిట్టలు పెళపెళమంటూ పైకిలేసి పారిపొయ్యాయి.

"నేను నేర్పుతాను. ధర్మారం వస్తావా"

ఎల్లన్న మాట్లాడలేదు. కల్లు చెట్టుదగ్గర నాగన్న ఆగాడు. కల్లులొట్టి దింపుతూ కల్లుగీసే గవుడు కన్పించాడు.

దింపిన కల్లు రేకలో పోపించుకొని తాగబోయి ఎల్లన్నకేసి చూశాడు. నాగన్న.

"తాగతావా"

"సారు తాగతా"

ఒక్కసారి తన బాల్యం గుర్తొచ్చింది. కల్లులొట్టె దింపిన అయ్య సారులొట్టి కోసం ఎదురుచూసిన తాను. తన అమ్మ. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ఎల్లన్న తల వెంట్రుకలలోకి వేళ్లు పోనిచ్చి ఆప్యాయంగా నిమిరాడు.

మరో చెట్టుకింద వుంచిన సారులొట్టి తెచ్చాడు గౌడు. రేకలో పోసి ఎల్లన్నకిచ్చాడు

"ఎట్టుంది."

"తియ్యగుంది"

"తాగు - వకటి కాదు ... కావాల్సినన్ని"

ఇప్పుడు మసకచీకటి కూడా లేదు. లేత ఎండ పొలాలమీద పరుచుకొంది.

గట్టుమీద నడుస్తూ ఎంట్రకాయ కన్నాల దగ్గర ఆగాడు నాగన్న.

"గవ్వల దండ కడదాం"

ఆ మాట అన్న ఎల్లన్నని అట్టాగే చూశాడు. ఆప్యాయంగా దగ్గరకి తీసుకొన్నాడు.

"చిన్నప్పుడు గవ్వల దండతో చాలా పట్టాను మానేశా...... ఎన్నెలదిన్నిని వదిలేస్తూ పట్టిన ఎంట్రకాయని వదిలేశా......

"నీకు ఎన్నెలదిన్ని తెలుసా"

"అక్కడే పుట్టా"

ఎల్లన్న వింతగా చూశాడు. నాగన్న తన కథ మొదలెట్టాడు యింటికొచ్చినా కథ ఆగలేదు.

ఆట కట్టానికి ఆ రోజు ఆగాలన్నాడు పక్కెలదిన్ని మాలపల్లి పెద్ద. మధ్యాహ్నం కోడిని కోశారు. కల్లు తెచ్చారు. నిద్ర పట్టింది. మెలుకువ వచ్చేసరికి ఎల్లన్న తన పొట్టమీద కాళ్ళు పెట్టి నిద్రపోతున్నాడు. వాడి పాదాలు నిమిరాడు. యింత అద్భుతంగా ఈ పాదాలు ఎట్టా పుట్టాయి అని అనుకొన్నాడు. కొలిచి చేసినట్టు. యివి పాదాలు కాదు తాళం తప్పని అడుగుల శబ్దాలు.

నిద్రలేసిన ఎల్లన్న అత్త మాట ఎత్తాడు. అత్త తనకోసం ఏడుస్తుందన్నాడు. అత్తను చూడాలని కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు.

ఆకాశంలో నెలవంక కన్పించింది. దానికేసి చూసి నాగన్న గట్టిగా కళ్ళు మూసుకొని ఎల్లన్నని ముందుకు రమ్మని పిలిచాడు. ఎల్లన్న ఎదురుగా వచ్చాక కళ్ళు తెరచి ఎల్లన్న మొహం చూశాడు.

"అత్త కూడా యింతే"

నెలవంక పల్చటి వెలుతురులో చేలగట్ల కేసి నడిచారు. గట్టుమీద ఎదురెదురు కూర్చొన్నారు. మనసులో కొన్ని నిర్ణయాలు చేసుకొన్నట్టు నాగన్న ఎల్లన్న కళ్ళలోకి చూశాడు.

"చీకటితోనే ఎన్నెలదిన్ని కెల్దాం"

ఎల్లన్న ఆనందంగా చూశాడు.

హటాత్తుగా గొడవ చేస్తూ ఎన్నెల పిట్ట దూసుకుపోయింది.

"ఎదవ పిట్ట. మనుషుల్ని కుదురుగ్గా కూచోనీది. నెలపొడిస్తే చాలు........ దీనికి ఎంత బడాయి. బడాయిపిట్ట."

కాని ఎల్లన్న గొడవచేస్తూ వెళ్తోన్న ఎన్నెల పిట్ట కేసి చూస్తోన్నాడు.

అది ఎన్నెలదిన్నికేసి వెళ్తున్నట్టు అన్పించింది.

ఎన్నెలదిన్ని యిప్పుడు ఎట్టా వుంటుంది  నాగన్న అనుకొన్నాడు.

ఎన్నెలదిన్నిలో అత్త పాపం ఏడుస్తూ వుంటుంది. ఎల్లన్న అనుకొన్నాడు.

ఎన్నెల పిట్ట ఎంత దూరం వెళ్ళిందో తెలీదు. కాని దాని గొంతు మాత్రం యింకా విన్పిస్తూనే వుంది.

యిది జరిగిన చాలా సంవత్సరాల తర్వాత

రూతుకు విన్పించినట్టు, రూబేను అనుకరించినట్టు.....

# 5

వేకువ మసక వెలుతురులో పొగమంచు కప్పిన గడ్డిపోచల్ని తొక్కుతో, ఎన్నిలదిన్ని దారిపట్టి నడుస్తున్న నాగన్న, ఎల్లన్నలు తన కళ్ళముందే నడుస్తున్నట్లుంది రూతుకు.

రూతు మాటల్లో అదో అందమైన సన్నివేశం. ఓ అద్భుతమైన ప్రయాణం. ఒకరికి గుర్తింపు వుంది. ఒకరు పరిచయం కావాల్సి వుంది. ఆ గుర్తింపు అంత సులువుగా వచ్చింది కాదు. ఆ పరిచయం అంత తేలిగ్గా జరిగేది కాదు. ఎంతో సత్తా వుంటే తప్ప ఆ కులాల వాళ్ళు గుర్తింపు పొందరు. పరిచయానికి నోచుకోరు. ఎందరో కళాకారులు కాలగర్భంలో కలిసిపోయారు. చరిత్ర వాళ్ళని తన పేజీల్లో రాసుకొన్నట్టు దాఖలాలు లేవు. ఈ దేశంలో కళకన్నా కులం ముఖ్యమైంది. కళని కూడా కులం తక్కెట్లో తూచారు. వీళ్లని మాత్రం తూకానికే కాదు అసలు తక్కెటదాకా రాకుండానే చేశారు.

రూతు అనుకుంటుంది. అనేకసార్లు అనుకుంటుంది. భూమ్మీద యిన్ని పాటలు పుట్టాయి. ఆ పాటకి ప్రాణం పోసిందెవరు ? ఆ ప్రాణానికి రాగం యిచ్చిందెవరు ? కాస్త నిదానంగా ఈ పరిశోధకులు, చరిత్రకారులు ఎందుకు ఆలోచించరు.

పొలాలు దున్నారు. కయ్యలు కట్టారు. నారు పోశారు. ఏతం తొక్కారు. కలుపు పీకారు. కంకుల్ని కాపాడారు. పంట కోశారు. కల్లాం చేశారు. గింజ కొట్టారు. కుప్ప వేశారు. దాన్ని నురిశారు. అంతా చేశారు. అర్థాకలితో ఆకాశ నక్షత్రాల క్రింద, యిసుక దిబ్బలమీద డొక్కల్లో మోకాళ్ళు గుచ్చుకొని నిద్రపొయ్యారు. పొలం వాళ్ళకి దక్కలా. కయ్యవాళ్ళకి చిక్కలా. గింజ సొంతం కాలా. ఏదీ తమది కాకుండా భూమంతా తమ చెమటని వర్షించారు. అట్టా వాళ్ళ శ్రమ తాలూకూ ఫలితానికి దూరంగా క్రూరంగా వుంచబడ్డారు.

భూమ్మీద జరిగిన ప్రతి పనిలోంచి పాట పుట్టింది. నాట్లు నాటుతో, కలుపు తీస్తో, కోతకోస్తో, కూలిచేస్తో, కూలి తల్లిపాట పాడింది. ఆకలిని మర్చిపోవడానికి, పాలకి కేకపెట్టే బిడ్డని మర్చిపోవడానికి, వొంగిన నడుము నొప్పిని మర్చిపోవడానికి మూగ గొంతులోంచి పల్లవి విన్పించింది. శ్రమలోంచి చరణాలను పంచింది. ఒక కూలితల్లి, ఒక మాలతల్లి, ఒక మాదిగతల్లి. ఆ పల్లవికి వంతలు వందలుగా పలికాయి. వంద గొంతులు ఒకే గొంతులా పలికాయి. ఆ గీతాన్ని ఏమన్నారు. పల్లెపదమన్నారు. అదో యుగళ సంగీతమన్నారు. జానపదుల గీతం సజీవమన్నారు.

రూతు అంటుంది. అట్టా అంటున్నందుకు ఎవరేమనుకొన్నా పర్వాలేదనుకొంటుంది.

ఆ పల్లెపదాల్లో పదాల్ని వెతకమంటుంది. విశ్లేషించమంటుంది. అచ్చు ఆ జీవితాల్లోంచి వచ్చిన పదాలే దొర్లుతాయంటుంది.

నాట్లు వేస్తో నాట్ల పాటలు పాడారు కలుపుతీస్తో కలుపు పాటలు పాడారు. కోతలు కోస్తో కోతల పాటలు పాడారు. ఆ పాటల్లో జీవితం దాచారు. ప్రణయం, శృంగారం, హాస్యం, కరుణ, మహామహా కవులు రాసినట్టు కృత్రిమంగా కాకుండా చాలా సహజంగా గాలి, నీరు, సూర్యుడు, చంద్రుడు, చుక్కలు ఉన్నంత సహజంగా పలికించారు.

శ్రమ చేసిన భూమి వాళ్లకి కాకుండా పోయినట్టే, పాట నిలిచినా ఆ పాట అల్లింది వాళ్ళని చెప్పుకోడానికి ఈ విశాల విజ్ఞానం ఎందుకు కుంచించుకుపోయింది. విచిత్రమేమిటంటే అట్టా కుంచించుకుపోయినందుకు అది సిగ్గుపడదు. సగర్వంగా సాహితీ ప్రపంచాన్ని ఏలుతుంది.

రూతుకు గుర్తుంది. ఆ రోజుల్లో ఎంకి, నాయుడు బావలకు విపరీతమైన ప్రచారం వుండేది. అది ఇప్పటిదాకా వుంది. తాను బతికుంటే వో శతాబ్దాన్ని పూర్తి చేసుకొనే చివ్వరి రోజుల్లో కూడా తెలుగుతనానికి యెంకినాయుడు బావలు ప్రతీకలుగా మిగిలే వుంటారు. వుండొచ్చు. అందులో నేరం కాని, తప్పుకాని లేదు. కాని విశాలమైన భూమ్మీద, చమట రాల్చిన పదాలు, పాటలు, అవి అల్లిన సుబ్బి, కోటి, లచ్చి, మారెమ్మ వగైరాల్ని ఏ ఆకాశ నక్షత్రాలు మింగేశాయి? ఏ కాలనాగులు కాటేశాయి ?

ఇవి ప్రశ్నలు కాదు అంటుంది రూతు. ఆ ప్రశ్నలకి జవాబు వెతుక్కోవడం అవసరం లేదంటుంది రూతు. గుర్తింపు, పరిచయం అంత పక్షపాతంగా మారినందుకు మాత్రం బాధపడుతుంది. అంత ద్రోహంగా మిగిలినందుకు మాత్రం ద్వేషిస్తుంది. నిజానికి తన జ్ఞాపకాలు ఆ బాధకి, ద్వేషానికి ప్రతిరూపాలే.

"అంతా అట్టాగే జరిగింది. నిజంగా అట్టాగే జరిగింది. నాగన్నలు, ఎల్లన్నలు పరిచయాల కోసం పాకులాడలేదు. గుర్తింపుల కోసం ఆడలేదు. పాడలేదు. కళ వాళ్ళ నరాల్లో వుంది. నెత్తురులో వుంది. గుండె లోతుల్లో వుంది. వాళ్ల చెమట సోనల్లో వుంది".

రూబేను రూతుతో ఆ మాటలు పదే పదే అనేవాడు.

"నాగన్న తన పాట, ఆట గంగని కొలవటానికే అనుకొన్నాడు. శివుణ్ణి మెప్పించటానికే అనుకొన్నాడు. గుండెల్ని తాకి, ప్రకృతిలో ప్రతిధ్వనించే ఉరుముల శబ్దాల హోరు గంగని దింపటానికే అని భ్రమించాడు. జాతరల్లో అతని విన్యాసాలు, హావభావాలు అంతా అక్కడే ఆగాయి. అయితే "పురాణ రహస్యాలు" అంటూ చంద్రప్ప చెప్పిన ప్రతి అంశం, నాగన్న అవసరమొచ్చినప్పుడల్లా మాట్లాడిన మాటలు తాను తనవాళ్ళు తక్కువవాళ్ళు కాదు అని చెప్పడానికే. అక్కడ అతనిలో కన్పించేది తిరుగుబాటు. అది తిరుగుబాటు అని కూడా అతనికి తెలీకపోవచ్చు అయినా కచ్చితంగా తిరుగుబాటే."

రూబేను నాగన్నని అట్టా విశ్లేషించాడు. రూతుకు అది నిజమే ననిపిస్తుంది. కాస్త

ముందుకు పోతే రూతు నమ్మకం నిజమే ననిపిస్తుంది. కళ్ళ ముందు నాగన్న.

ఎన్నెలదిన్ని పొలిమేర తాకగానే ఆగి చూశాడు నాగన్న. బాల్యం పంచిన ఊరు. చాలా ఏళ్ల తర్వాత, అక్కడికి అడుగు పెడ్తున్నాడు. వదిలేప్పుడు అమ్మతో కలిసివెళ్ళాడు. వచ్చేప్పుడు ఎల్లన్నకి తోడుగా వచ్చాడు. ఆ రోజు బాల్యాన్ని మూట కట్టుకొని వెళ్ళాడు. ఈ రోజు బాధని, ఒంటరితనాన్ని వెన్నంటుకొని వస్తున్నాడు. ఏరు దాటారు

"అట్టా కూర్చొందాం బిడ్డా"

ఎల్లన్న కూర్చొన్నాడు. యివతలి గట్టు. ఎన్నెలదిన్ని ఏటిగట్టు. చెట్టు మొదలు ఆనుకొని కూర్చొన్నాడు నాగన్న. కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు. అతని గుండెలు ఏ ఉద్వేగాలకు లోనవుతున్నాయో ఎల్లన్నకి తెలీదు. ఎల్లన్నకి తెలిసిందల్లా అత్త వడిలో దాగిపోవాలనే ఆతురత మాత్రమే.

"ఎల్దాం"

నాగన్న కళ్ళు తెరిచి చూశాడు. ఎల్లన్న అత్తకోసం ఆతురత పడ్తున్నాడు.

"ఎల్దాం బిడ్డా" అంటూనే తుమ్మపుల్ల విరిశాడు. పళ్ళు తోముకోమన్నాడు. అవసరమైతే చాటుకు పొమ్మన్నాడు. పళ్ళు తోముకుంటూనే గుట్టచాటుకెళ్ళాడు.

ఎన్నెలదిన్ని ఏట్లో మునుగుతుంటే అయ్య గుర్తొస్తున్నాడు. ముక్కు పట్టుకొని నీళ్ళలోకి చేపలా జారిపోతానని పట్టుకోమని అయ్యని అడిగేవాడు. అయ్య అక్కడక్కడే వెతికేవాడు. పట్టుకోలేనట్టుగా 'యాడ్రా' అని అనేవాడు. "ఈడ" అంటూ తాను ఎగిరి అయ్య భుజాలమీద ఎక్కేవాడు. అయ్య అట్టాగే ఏటి ఒడ్డుకు తనని తీసుకెళ్ళేవాడు. వళ్ళు ఆరేదాకా లేత ఎండలో కూర్చొనేవాడు. అట్టా కూర్చొన్నప్పుడు యిసుకలో కాలికింది ఎంత్రకాయలు కదిలేవి. కాలు అట్టాగే వుంచి వాటిని పట్టుకొంటే కుట్టేవి. విదిలిస్తే పరుగెత్తేవి. వెంటబడితే అప్పటిదాక యిసుకలో దాక్కొన్న చిన్న చిన్న ఎంత్రకాయలు వకటి కాదు వందల్లో పరుగెత్తేవి. దడి కట్టినట్టు యిసుకమీద చిన్ని చిన్ని ఎంత్రకాయలు పరుగు చిత్రంగా వుండేది. అవి వరుసగా ఏటి నీళ్ళలో కలిసిపోయేవి. అదో ఆట....... భూమికి సొంతమైన బాల్యం అట్టాంటి అద్భుతాల్ని దాచుకొంటుంది. నిజంగా అదో అదృష్టమే.

"ఎండ కాగుతా"

ఆ మాట అంటూనే ఎల్లన్న గట్టుమీదికెక్కాడు. నాగన్న కూడా గట్టుమీదికొచ్చాడు. గుడ్డ సంచిలో విబూది తీశాడు. నొసట దిద్దుకున్నాడు. కంఠానికి రుద్దుకొన్నాడు. ఎల్లన్న అట్టాగే చూస్తున్నాడు.

# 6

ఎల్లన్న వెళ్ళిన రోజునుంచి బూదేవి తిండి తినలేదు. వెతికే మనుషులు వెతుకుతూనే వున్నారు. గుడ్డల మూటతో వెళ్ళిన ఎంకట నర్సు ఆ రోజే యింటికొచ్చాడు. మూట అక్కడే పడేసి ఎల్లన్నకోసం తిరిగినవాడు తిరుగుతూనే వున్నాడు. ఎల్లన్నని తీసుకరాకుండా యింటిముఖం చూడొద్దంది బూదేవి. అదే మాట ఎర్రెంకడితో కూడా అంది. ఆడబిడ్డని తోడు తీసుకొని తిరగాల్సిన చోటంతా తిరిగింది.

ఎర్రగొల్లల గుడారాల దగ్గర ఏం జరిగిందో ఆ నోటా ఈనోటా పాకి మాలపల్లెకి తెలిసింది. ఎల్లన్నని ఎవరు ఎట్టా తరిమారో అట్టా తరిమినవారు హుషారుగా చెప్పుకొన్నారు. అదీ తెలిసింది. అది తెలిసి బూదేవి తట్టుకోలేకపోయింది. వాళ్ళ అంతు తేలుస్తానని బయలుదేరింది. పెద్దలు వారించారు. సాటి వయసువాళ్ళు అడ్డుపడ్డారు. అయితే నా బిడ్డని నాకివ్వండని అరిచింది. ఎందుకు మీ పెద్దరికమని పెద్దల్ని నిలేసింది. అయినా ఏమీ జరగలేదు. పెద్దలలో పౌరుషం కన్పించలేదు. ఈడువారిలో చలనం కలగలేదు. ఎల్లన్న కన్పించకపోతే అట్టా తరిమినవాళ్ళ అంతు చూస్తానంది. ఆళ్ళ బతుకులు బూడిద చేస్తానంది. ఎర్రెంకడు ఆ మాటలు వింటూ నిల్చున్నాడు. ఎంకట నర్సుకు బూదేవి తెగింపు భయం పుట్టించింది. ఆ రాత్రి ఆ యిద్దరూ నిద్రపోలేదు. ఆ యింటి ముందు కాపలా కాస్తూ కూర్చొన్నారు.

బూదేవి తెగించిందంటే ఎంతైనా చేస్తుంది. తర్వాత ఏం జరుగుతుందో పట్టించుకోదు. ఎర్రెంకడికి అది బాగా తెలుసు. పెద్దమాల 'దాని నోరు అదుపులో పెట్టరా' అని ఎంకటనర్సుతో అన్నాడు. ఆ మాటలు రచ్చల్లోకి వెళ్ళాయంటే ఎంత ప్రమాదమో పెద్దమాలకి తెలుసు. ఎంకట నరుసు పెద్దమాల హెచ్చరికతో బెంబేలెత్తాడు. అయినా బూదేవి నోటికి అడ్డు లేకుండా పోయింది. అమ్మలక్కలు దానికి పిచ్చి పట్టిందన్నారు. పెద్దమాల తన నోరు అదుపులో పెట్టమన్నాడని తెలిసి బూదేవి పెద్దమాల యింటికేసి వెళ్ళింది. పెద్దమాల బూదేవి మీద విరుచుకపడ్డాడు. నువ్వు అట్టాగే నోరు పారేసుకొంటే మాలపల్లి బూడిద అవుతుందన్నాడు. బూదేవి మాటకి మాట రెట్టించింది. యిట్టాంటి పెద్దమాలలుంటే పల్లె బూడిదే అవుతుందని అంది. అంతటితో ఆగలేదు. ఎల్లన్నని కొట్టినవాళ్ళని పేరు పేరునా తిట్టింది. పెద్ద మాలను తిట్టితే పెద్దమాలకు రోషం వస్తుంది. ఊళ్ళో వాళ్ళను తిట్టితే పెద్దమాలకు భయం పట్టుకుంటుంది. పల్లెమధ్య ఈ గొడవ

తారాస్థాయికి పోయింది. ఎంకట నర్సు యిక లాభం లేదనుకొన్నాడు. బూదేవి జుట్టు పట్టుకొని లాగాడు. వెర్రిపట్టినవాడిలా పైన బడి కొట్టటం మొదలెట్టాడు నిజానికి ఎంకట నర్సుకు బూదేవి మీద కోపం కాదు. ఆ మాటలు ఊరిపెద్దలు వింటే ఏమౌతుందోననే భయం. ఆ భయమే వెర్రివాణ్ణి చేసింది. ఎర్రెంకడు చూస్తూ వుండిపోయాడు. యిప్పటిదాకా బూదేవి వీపుమీద దెబ్బ పడలేదు. కాని యిప్పుడు పడింది. ఏం చేసిందని ఆ దెబ్బ పడింది. కళ్ళెంట నీళ్ళొచ్చాయి. తాను పిరికివాడు. నిజంగా బూదేవి అన్నమాటలు తాను అనాల్సింది. వీలైతే అట్టా తన బిడ్డని తరిమినవాళ్లని ఏదైనా చెయ్యాల్సింది. అదే పని తన కులంలో ఎవరైనా చేస్తే ఆ యింటిమీద తాను ఎంత పౌరుషం చూపించేవాడు. ఎంత ప్రతాపం వెలగబెట్టేవాడు. తనమీద తనకే అసహ్యం వేసింది. తలదించుకొన్నాడు.

ఎంకట నర్సు వెర్రి ఆవేశం యింకా తగ్గలేదు. లింగాలు అడ్డు రాకపోతే యింకా ఏం చేసేవాడో తెలీదు. లింగాలు అడ్డంగా నిలబడింది. ఆడబిడ్డని చూస్తే కడుపు తరుక్కుపోయింది. ఎల్లన్నకోసం కుమిలి, కుమిలి ఏడ్చింది. దానికన్నా ఆడబిడ్డ వీపుమీద దెబ్బపడటం సహించలేకపోయింది. బూదేవి ఆడబిడ్డకాదు. కడుపున పుట్టాల్సిన బిడ్డ. కాకపోతే తనని కనాల్సిన తల్లి. అది తన బిడ్డకోసం గొడవ పడుతోంది. ఎన్నాలదిన్నె మాలపల్లిలో ఏ వొక్క మగాడైనా బూదేవిలా మాట్లాడుంటే ఎట్టా వుండేదో తెలీదు కాని బూదేవి వాళ్ళందరి కన్నా గొప్పది.

"ఏది మాట్లాడిందయ్యా నా ఆడబిడ్డ...... మగాళ్లంతా పిరికి గొడ్లయితే నా బిడ్డ మాట్లాడింది. నా బిడ్డేకాదు, నేను మాట్లాడుతున్నా.. నన్నూ సంపండి. అది ఎల్లడి కూతురు. సుబ్బడి మనవరాలు. పిరికిగొడ్డు కాదు...."

ఎంకట నర్సు బిత్తరపోయి చూశాడు. తానింతవరకూ ఎట్టా ప్రవర్తించాడో యిప్పుడు అర్థమైంది. ఎర్రెంకడు లింగాల్ని చాలాసార్లు కొట్టాడు. కాని యిప్పుడు కొట్టలేకపోతున్నాడు. తాను పిరికిగొడ్డే కాదు. ఎందుకూ పనికిరానివాడు. లింగాలు ఆడబిడ్డని పైకి లేపింది. యింట్లో ఆడబిడ్డకి ఎదురుగానే కూర్చొంది.

ఆ రాత్రి పల్లె మధ్యలో రచ్చ జరుగుతోంది. రచ్చలో ఎల్లన్న చర్చకన్నా పెద్దమాలని బూదేవి తిట్టడం మీద చర్చ జరుగుతోంది. అంతకన్నా మించి ఊళ్ళో పెద్దల్ని బూదేవి తిట్టింది. ఆ విషయం ఊళ్ళో తెలిస్తే ఏది చెప్పాలనే దానిమీద చర్చ జరుగుతోంది. ఆ చర్చలో ఎర్రెంకడు లేడు. ఎంకట నర్సు లేడు. రచ్చకి రమ్మంటే రామన్నారు. ఎంకట నర్సు యింటి బయట మంచానికి అడ్డంగా పడుకొన్నాడు. దిబ్బమీద ఎర్రెంకడు కూర్చొన్నాడు. రచ్చనుంచి మనిషొచ్చాడు. మిమ్మల్ని రమ్మంటున్నారన్నాడు. రెండోసారి పిలుపొచ్చాక వెళ్ళకుండా వుండకూడదు. అది కులంలో తప్పవుతుంది. యింట్లోకి చూశారు. బూదేవి నిట్టాడికి ఆనుకొని కూర్చొనుంది. యిద్దరిలో ఏ ఒక్కరికి రచ్చ కెల్తున్నాం అనే ధైర్యం లేదు. వెళ్దామని పైకి లేశారు. రెండు అడుగుల వేశారో లేదో బూదేవి ఏడ్పు విన్పించింది. యింటిదగ్గర

అన్నం వండుకొని ఆడబిడ్డ యింటికొస్తున్న లింగాలు ఎదురైంది. ఆమె మగాళ్ళతో ఏం మాట్లాడలేదు. ఆడబిడ్డ ఏడుపు విన్పిస్తోంది నేరుగా యింట్లోకి వెళ్ళింది.

ఆ యిద్దరి కోసమే ఎదురుచూస్తున్నట్టు రచ్చదగ్గర పెద్దలు "రండ్రా కూసోండి" అన్నారు. "ఎల్లన్న అట్టా ఎల్లటం ఎందుకు, ఎల్లకుండా వుంటే యిదంతా జరిగేదా" అని అన్నారు. ఎంకట నరుసు మాట్లాడలేదు. ఎర్రెంకడు మాట్లాడలేదు. కొద్దిసేపు దానిమీదే తలో ఒక మాటన్నారు. 'చిన్నపిల్లాడు ఆడికేం తెలుసు' అని కొందరన్నారు. 'ఆడు కొట్టినప్పుడు యింటికొత్తే బాగుండేది' అని కొందరన్నారు.

"యింటికొత్తే ఏం చేసేవాళ్ళం."

ఆ మాట ఎర్రెంకడు అనలేదు. ఎంకట నరుసు అనలేదు ఎవడ్రా ఆ మాటన్నదన్నట్టు పెద్దమాల చూశాడు. మిగిలిన కులపెద్దలు కూడా చూశారు.

"ఎందుకెల్లావురా ఎదవనాయాల అని ఎర్రెంక మావ నాలుగు తన్నేవాడు. అట్టా ఎల్లి కొనక్క రాకండ్రా అని పెద్దలు అరిసేవాళ్ళు......."

అదే గొంతు మళ్ళీ విన్పించింది.

"ఎవుడా పురసేతోడు. ఆ మాటేదో ఈడకొచ్చి మాటాడు."

చీకట్లో ఓ మూల కూర్చొన్న పిట్టోడు ముందుకొచ్చాడు. ఎంకట నర్సు పిట్టోడికేసి వింతగా చూశాడు. ఎన్నెలదిన్నిలో మగాడంటే పిట్టోడే అని ఎర్రెంకడు అనుకొన్నాడు.

ముందుకొచ్చిన పిట్టోడు పెద్దమాల కేసి సూటిగాచూశాడు. మిగతావాళ్ళని పలకరించినట్టు చూశాడు. బిడ్డ కనబడలేదని బూదేవి నెత్తీనోరు కొట్టుకున్న సంగతి గుర్తు చేశాడు. ఆడేరాల దగ్గరికి ఎందుకెళ్ళాడు అని అన్నారే కాని ఎవడన్నా ఏం జరిగిందో తెలుసుకొన్నారా అని ప్రశ్నించాడు. ఎట్టా వెళ్లింది, ఎందుకు పరిగెత్తి పారిపోయింది తెలిసింది. తెలిసిన తర్వాత అట్టా చేసినవాళ్ళని అడిగే దమ్ము ఈ పెద్ద మనుషుల కుందా అని ప్రశ్నించాడు. కడుపుకాలి ఆడకూతురు అట్టా చేసినవాళ్ళని తిట్టిపోస్తే అది తప్పు ఎట్టా అవుతుందని నిలదీశాడు.

పిట్టోడు సూటిగానే మాట్లాడాడు. వాడి మాటలు పెద్దలకి మింగుడు పడలేదు. కుర్రాళ్ళు సర్దుకొని కూర్చొన్నారు. ఆ మాటలు వాళ్ళు అడుగుతున్నట్టే భావించారు. వాడు తప్పు మాట్లాడటం లేదని ఎంకటనర్సు అనుకొన్నాడు.

పిట్టోడుకి దుడుకు పిండం అనే పేరుంది. పెద్దల్లో వాడికి మంచిపేరు లేదు. వాడి మాటలు కూడా కట్టిరిసి పొయిలో పెట్టినట్టు వుంటాయి. అసలు వాణ్ణి రచ్చకి కూడా పిలవరు. పిలవకపోయినా వచ్చి కూర్చుంటాడు. పెద్దలు మాట్లాడుతుంటే వుట్టినే కూర్చోడు. వాళ్ళమీద బూతుల్తో లేస్తాడు. మధ్యలోనే వాణ్ణి జనం పక్కకి లాక్కుపోతారు. "సావండి నా కొడకల్లారా. మీ సావు మీరు సావండి" అంటూ వెళ్లిపోతాడు. అది ప్రతి చర్చలోనూ జరిగేదే. కాని ఈసారి వాడు అట్టా వెళ్ళలేదు. బూతులు మాట్లాడలేదు. వాడి మాటల్లో అందరి

మనసుల్లో నిలిచేమాట ఒక్కటన్నాడు.

"నారాయి మామవుంటే, సచ్చినా ఆనా కొడుకుల్ని అడ్డంగా నరికేవోడు "

ఆ మాటతో పెద్దలు అవాక్కయ్యారు. నారిగాడు గుర్తొచ్చాడు. మాలాడి దిబ్బ అట్టాగే వుంది. కుర్రాళ్ళు నారిగాడి మాట విని వున్నారు. యిప్పుడు రచ్చలో ఎల్లన్న లేడు. బూదేవి లేదు. నారిగాడు మిగిలాడు. మాలాడి దిబ్బ దెయ్యం రచ్చని ఆవరించింది. రచ్చ నడిపిన పెద్దమాలకి నిద్ర లేకుండా చేసింది.

యింటికెళ్ళాడే గాని పెద్దమాలకి పిట్టోడి మాటలే గుర్తొస్తున్నాయి. వాడు నిజమే చెప్పాడు. మాలామాదిగల్లో నారయ్యాలున్నారు. మాతయ్యాలున్నారు. బూదేవి అన్నట్టు అంతా పిరికిగొడ్లే కాదు. అంతా తలొంచుకు వెళ్ళేవాళ్ళే కాదు. నిజానికి పెద్దమాలకీ తలొంచుకు వెళ్ళాలని వుండదు. తలెత్తుకొని వెళ్ళాలనే ఉంటుంది. కాని వూళ్ళో వాళ్ళు కన్పించగానే తల తనకి తెలీకుండానే దించుకొంటుంది. అందాకా స్వేచ్ఛగా నడిచిన కాళ్ళు దారి పక్కకి జరిగిపోతాయి. జబ్బుపడ్డట్టు నడక మారుతుంది., అట్టా ఆ నడక మారటం అతనికి యిష్టం లేదు. అతనికి ముందు పెద్దమాల అతని అయ్య. గుబురు మీసాలు. మీసాల సుబ్బడనే వాళ్ళు. ఖచ్చితంగా నారిగాడు చనిపొయ్యే నాటికి మనిషి కాస్త వంగబడ్డాడు. వయసు పై బడ్డాక కట్టెలా వుండేవాడు. అప్పుడతనిది నడివయస్సు. నారిగాడంత వయస్సు. నారిగాడు ఎప్పుడూ గుర్తొస్తాడు. సాహసివాడు. మొండిపట్టు వాడిది. మాతయ్య మాత్రం. అదే పట్టు. అదే వూపు.

నారిగాడు చచ్చి దాదాపు పదేళ్ళయింది మాలాడి దిబ్బలో దెయ్యం తిరుగుతుందనే పుకారు వచ్చింది. అది ఎట్టికి పడిపోయింది. చచ్చిన యిన్నేళ్ళ తర్వాత ఈ పుకారు ఏంటని మాలపల్లిలో, మాదిగపల్లిలో చెప్పుకొన్నారు. పల్లెటూరు కాబట్టి పుకారు రోజుకో రూపం దాల్చింది. అర్ధరాత్రి ఎవడో ఒక బారుమనిషి గొడ్డలి పట్టుకొని తిరిగేవాడు. చీకట్లో కలిసిపొయ్యేవాడు. కరణం దిబ్బదాకా నడిచేవాడు. అక్కడి ఏటి మలువులో సుడిగుండాలుండేవి. ఆ సుడిగుండాల్లో మునిగేవాడు. మళ్ళీ కన్పించేవాడు కాదు. అట్టా అప్పుడప్పుడూ జరిగేది. ఒక్కోసారి వారంలో రెండుసార్లు జరిగేది. యింకోసారి నెలకోసారి. కొంతకాలం అసలు అట్టా జరిగేది కాదు. బోలెడు కథలు ప్రచారంలో కొచ్చాయి. నారిగాడు దయ్యమై తిరుగుతున్నాడనుకొనేవాళ్ళు. గొడ్డలి పట్టుకొని చెట్లు కొడుతున్నట్లు శబ్దం విన్పిస్తే విన్నామని చెప్పేవాళ్ళు. ఒక్కోసారి కరణం గొడ్లకొట్టాం దగ్గర గబగబా పరిగెత్తినట్టు వుందనేవాళ్ళు. కరణం యింటిముందు గుబురుచెట్టు దూకి పరిగెత్తినట్టు చెప్పుకొనేవాళ్ళు. కథలు రోజుకో రూపంలో వుండేవి.

ఓసారి షావుకారు సంత సరుకుతో వస్తుంటే తుమ్మలతోపు మధ్యలో ఎవరో నక్కినట్టు వుంటే వెనక్కి చూశాడని నల్లని ఆకారం తోపులోంచి దారిపట్టి వస్తుంటే సరుకు బండి దూకి పరుగెత్తాడని, ఆ తర్వాత సరుకుబండి కోసం పోతే సరుకుబండి అట్టాగే వుందని,

దొంగైతే సరుకు వుండదని, ఖచ్చితంగా మాలాడి దిబ్బ దయ్యమేనని గుట్ట గుట్టలుగా చేరి చెప్పుకొన్నారు. అక్కడేం జరిగిందో తెలీదు గాని షావుకారు అదురు జ్వరంతో మంచమెక్కాడు. మంత్రగాళ్ళు యింటిచుట్టూ మంత్రించారు. రెండు రోజులు షావుకారు యింట్లో గొప్ప తతంగమే జరిగింది

అంతకన్నా మించిన ఉత్సుకతని రేపే కథ మరొకటి జరిగింది. అదీ కరణానికి జరిగింది కాబట్టి గొప్ప సంచలనమే రేపింది. పెద్ద కరణం తూర్పు పొలం గొడ్ల కొట్టాం నుంచి అర్ధరాత్రి వస్తుంటే ఎవరో కరణాన్ని తరుముకొన్నారు. పెద్ద కరణం పరుగు తీశాడు. లంకణాలు పడ్డాడు అయితే పెద్ద కరణం అట్టాంటిదేం జరగలేదని రచ్చదగ్గర పదే పదే చెప్పాడు అట్టా చెప్పడానికి కారణం లేకపోలేదు. ఆ జామున పెద్ద కరణం కక్కుర్తిపడే రంకు భాగోతం బయటపడుతుందనే. అయినా కరణం కాదన్నాడు కాబట్టి ఆయన ఎదురుగా అంతా తలూపారు. తర్వాత కరణం లేనపుడు నవ్వుకొంటూ చెప్పుకొన్నారు.

పెద్ద కరణం కొడుకు పిల్ల కరణం మాత్రం ఆ విషయాన్ని అంత తేలిగ్గా తీసుకోలేదు. పెద్ద కరణం మీద విరుచుకుపడ్డాడు. అబ్బ అని కూడా చూడకుండా ఈ వయసులో రంకు చేస్తే చంపిపాతర పెడ్తానన్నాడు. రాత్రులు పెద్ద కరణాన్ని బయటకు రాకుండా కట్టడి చేశాడు. ఊళ్ళో పెద్దల్ని పిలిచాడు. యిదేదో తనకి దెయ్యం కథలా లేదన్నాడు. ఎందుకైనా మంచిది పెద్ద మంత్రగాణ్ణి పిలుద్దామన్నారు పెద్దలు. పిల్ల కరణం పెద్దలమాట కొట్టెయ్యలేదు. అట్టాగే చేశాడు. కాని తన పని మాత్రం మానుకోలేదు. వూళ్ళో కుర్రోళ్ళని పోగుచేశాడు. ఒక జాము దాటాక జట్టుకో పదిమంది చొప్పున తిరిగేవాళ్ళు. ఎన్నెలదిన్నిలో రాత్రులు వూళ్ళో కుర్రాళ్ళు కాపలా చుట్టుపట్ల వూళ్ళలో వింతగా పాకిపోయింది. ఎన్నెలదిన్ని మనిషి పక్కూరుపోతే వాడిచుట్టూ గుమిగూడేవాళ్ళు. అదే మాట. కాపలా మాట. పొలాల మీద కాపలా కూడా ఒక్కరే వుండటం లేదు. ఒక్కోచోట యిద్దరు ముగ్గురు మాలాళ్ళు. మాదిగలు కాపలా వుంటున్నారు. కాపలా మొదలయ్యాకే అసలు భయం అందర్నీ పట్టుకొంది.

ఏం జరిగిందో తెలీదు గాని మళ్ళీ చాలాకాలం దెయ్యం కదలిక లేదు. పెద్ద మంత్రగాడి గొప్పన్నారు పెద్దలు. కాపలా దెబ్బ అన్నారు కుర్రాళ్ళు. మరో అయిదేళ్ళు గడిచాయి. పెద్దమాల అయ్య కాలం చేశాడు. పిల్లకరణానికి పెళ్ళయింది. అంతకన్నా ఎన్నెల దిన్నిలో చెప్పుకోదగ్గ సంఘటనలు లేవు. కాకపోతే భూమ్మీదే కొంత మార్పు జరిగింది. కవులుకున్న రైతులకి ఎన్నెలదిన్ని పొలంలో కొంత భాగం పిల్లకరణం అమ్మేశాడు. ఎన్నెలదిన్నిలో పదిమంది రైతులు కరణం పొలం కొన్నాక రెండు అరక ఆసాములయ్యారు. ఆ పదిమంది తప్ప మిగిలినవాళ్ళ బతుకులు మామూలే. వాళ్ళ నడకలో మార్పొచ్చింది. జాతర్లప్పుడు కాస్తముందు భాగాన నిలబడటం మొదలెట్టారు. ఊళ్ళో జరిగింది ఆ మార్పయితే, మాలపల్లెలో, మాదిగపల్లెలో మరో రకమైన మార్పు జరిగింది. అది అట్టా ఎందుకు జరిగిందో వాళ్ళకి తెలీదు. రెండు పల్లెలు మొత్తంగా కరణానికి ఎట్టి చేయడంతో

పాటు రెండు అరకల రైతుల పేర్లతో జతకలిపి వాళ్ళని పిలవటం మొదలెట్టారు ఫలానా రెడ్డి గోరిమాలోడు, ఫలానారెడ్డి గోరిమాదిగోడు అని పిలవబడటమే కాదు, విభజించబడ్డారు కూడా. అంటే కరణం చేలలో పని రెండు పల్లెలు పాత పద్ధతి ప్రకారమే చెయ్యాలి తక్కినవాళ్ళకి మాత్రం ఏ రెడ్డి మాల ఆ రెడ్డి చేలో ఏ రెడ్డి మాదిగ ఆ రెడ్డి చేలో చెయ్యాలి.

అప్పుడే అనుకోని సంఘటన జరిగింది. అట్టా జరుగుతుందని పిల్లకరణం అనుకోలేదు. పెద్దకరణం అనుకోలేదు. అప్పుడప్పుడే గ్రామ ప్రముఖుల జాబితాలోకి అడుగుపెడ్తున్న రెండు అరకల రెడ్లు అనుకోలేదు. రైతుల్లో సుబ్బిరెడ్డి అచ్చిరెడ్డి అసలు అనుకోలేదు. జరిగిపోయింది. ఆ ప్రాంతమంతా... .. ఒక్కసారి ఆగి గాలి పీల్చుకొనేంత వేగంగా జరిగిపోయింది.

ఆ సంఘటన జరిగినతీరు యిట్టా వుంది. పిల్లకరణం అత్తగారింటికెళ్ళి వారం దాటింది. యింకో వారందాకా రావటానికి వీలు వుండదనే కబురు కూడా వచ్చింది. పెద్ద కరణం రచ్చలో పొద్దుబోయిందాకా కూర్చొన్నాడు. ఆ తర్వాత లోగిలిదాకా సుబ్బిరెడ్డి అచ్చిరెడ్డి తోడుగా వచ్చాడు. ఈ మధ్య అచ్చిరెడ్డి అట్టాగే చేస్తున్నాడు. అది అతనికి ఒక హోదాగా కూడా వుంది. రైతులు కరణం పొలాలు కౌలు తీసుకోవడం యివ్వడం కూడా అచ్చిరెడ్డే చేస్తున్నాడు. మరో మాటలో చెప్పుకొంటే పిల్లకరణం తర్వాత ఆ వూళ్ళో అచ్చిరెడ్డి పేరే ముందు పలుకుతోంది. అచ్చిరెడ్డికి ఈ పరిణామం ఒక్కోసారి వింతగా వుంటుంది. ఒక్కోసారి గర్వంగా వుంటుంది. పెద్ద కరణం, పిల్ల కరణం వెళ్తుంటే లేచి నిలబడే రైతులు యిప్పుడు అచ్చిరెడ్డి వెళ్తున్నా లేచి నిలబడుతున్నారు.

“యిక వెళ్ళవోయ్ రెడ్డీ” అని పెద్ద కరణం రోజులాగే అన్నాడు. అచ్చిరెడ్డి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. పెద్ద కరణం యింట్లోకి వెళ్ళలేదు. తూర్పు పొలం కొట్టాలకేసి అలవాటుగా నడిచాడు. పిల్లకరణం ఊళ్ళో లేనప్పుడు అట్టా వెళ్ళటం అలవాటుగా మారిపోయింది. అయినా పుట్టుకతో పుట్టిన రంకు పుడకల్తో కాని పోదంటారు.

తూర్పు పొలం కొట్టాలు ఏటిగట్టున వున్నాయి. పేరుకు గొడ్లకొట్టాలే కాని ఎండల్లో తప్ప ఎప్పుడూ గొడ్లని అక్కడ కట్టెయ్యరు. కొట్టాం ముందు దాదాపు కుంటనేల ఆక్రమించుకొని జడలమర్రి వుంది. పగలంతా దాని నీడలోనే గొడ్లని కట్టేస్తారు. మర్రి నీడలోనే కరణం రేవు వుంది. కరణం రేవు దాటి ఏటికి అవతల కెళ్తే దాదాపు మైలుదూరం తాటితోపు. తాటిచెట్లు కూడా చిక్కగా వుంటాయి. కొమ్ములబర్రె లోపలకెళ్తే ఎక్కడో ఒకచోట యిరుక్కుపోతుంది.

పెద్ద కరణం కూతురు తాలూకూ కోళ్లదిన్ని పంతుల్ని చంపింది అక్కడేనంటారు. అతన్నే కాదు చాలామంది బతుకులు అక్కడే తెల్లవారాయి. తెల్లవారాయి అనేకన్నా కరణం తెల్లవారేలా చేశాడు అంటే బాగుంటుంది. తూర్పు పొలం గొడ్లకొట్టాం, కరణం రేవు, రేవుకెదురు తాటిదిన్నె ఒక రకంగా భయపెట్టే దృశ్యాలే. అంత రాత్రి పెద్ద కరణం ఒక్కడే అక్కడికి వెళ్ళగలడు. అంత రాత్రి అచ్చిరెడ్డి అమ్మ మాత్రమే ఆ జడల మర్రికింద కరణం కోసం

కూర్చోగలదు

అచ్చిరెడ్డి అమ్మ ఆట్టా చాలా ఏళ్ళనుండి ఆ మర్రి కింద జాము కాని జాము కూర్చుంటుంది కరణం కోసం కూర్చుంటుంది. అచ్చిరెడ్డి పిల్లాడప్పుడు కూర్చొంది. పెద్ద కరణం పొలంలో పని కుర్రాడిగా పెరిగినప్పుడూ కూర్చుంది. పెళ్ళయ్యాక కరణం పొలం కవులకు తీసుకొని కవులు కమతం చేస్తున్నప్పుడూ అట్టాగే కూర్చొంది. పిల్లకరణం పొలం అమ్మకం పెట్టినప్పుడు పొలం కొని రెండెకరాల ఆసామి అయినా, తప్పలా కూర్చుంటూనే వుంది. దెయ్యంపిల్ల కూర్చొన్నట్టు, ఆ మర్రికింద, కరణం రేవు అంచుమీద నరమానవుడు సాహసించని జాముకాని జామున పెద్దకరణం కోసం కూర్చుంటూనే వుంది.

మొగుడు పెద్దిరెడ్డి సుబ్బిరెడ్డి, చిన్నా చితకా మనిషేం కాదు. ఎద్దంటి మనిషి. గొడ్డులా చాకిరి చేసేవాడు. నల్లమల అడవుల్లో గొడ్లు మేపేవాడు. వుంటానికి భూమి వుండేది. రాయిరప్పా. పంట పేరుకు మాత్రమే. ఎందుకూ పనికిరాదు. బతకటం కష్టమైంది. గొడ్లు తోలుకొని దేశంమీద పడ్డాడు. అచ్చిరెడ్డి చంకబిడ్డ. గొడ్లు అమ్ముకుంటూనే బతుకుదారి వెతుక్కోవటం మొదలెట్టాడు. దార్లో గెణిసిగడ్డల బండ్లు తోడయ్యాయి. ఆ బండ్లు ఎన్నెలదిన్ని వచ్చాయి. ఆ బండ్లతోనే ఎన్నెలదిన్ని వచ్చారు. మిగిలిన గొడ్లలో మంచివి కరణం కొన్నాడు. పనికిరానివి మాదిగలకమ్మాడు. కరణం సుబ్బిరెడ్డి కేసి ఎగాదిగా చూశాడు. పేరు అడిగాడు. చెప్పాడు. పెళ్ళాం పేరు రంగాయి అని చెప్పాడు. కరణం దయగా చూశాడు. తన పనిలో వుండమన్నాడు. గుడిసె కట్టుకు కట్టెలిచ్చాడు. తన చెట్ల ఆకు కొట్టుకోమన్నాడు. దేవుడల్లే కన్పించాడు. గొడ్లు అమ్మిన డబ్బు కరణం దగ్గరే వుంచాడు.

పెద్దిరెడ్డి సుబ్బిరెడ్డి జీతగాడయ్యాడు. తన గొడ్లు కరణం గొడ్లయ్యాయి. వాటిని వాటితోపాటు కరణం గొడ్లని కరణం బీడులో కాసేవాడు. గొడ్ల సావిడి పనంతా రంగాయి చూసుకొనేది. సుబ్బిరెడ్డి జీతం డబ్బులు తీసుకొన్నప్పుడల్లా తిరిగి కరణం దగ్గరే వుంచేవాడు. ఎంతయిందని అడిగేవాడు కాదు. యింతైందని కరణం చెప్పేవాడు కాదు. కాలం దాని దారిన అది వెళ్తోంది.

ఓ రోజు రంగాయి సుబ్బిరెడ్డితో డబ్బు లెక్క చూడమంది. తమ వూరు వెళ్దామంది. పెళ్ళాం మాట కాదనలేకపోయాడు సుబ్బిరెడ్డి. కరణాన్ని లెక్క అడిగాడు. కరణం వింతగా చూశాడు. జీవితంలో మొదటిసారి లెక్కలడిగిన జీతగాణ్ణి చూశాడు. సుబ్బిరెడ్డి కొత్తగా కన్పించాడు. ఈ వింత తనకి అనుభవంలో లేని విషయం. మింగుడు పడటం లేదు. యిట్టాంటి కొత్త మనిషి యింతకుముందు తనకి పరిచయం కాలేదు. యిట్టాంటి పరిచయం జరగకూడదు. యిప్పుడే కాదు. ఎప్పుడూ జరగకూడదు.

"ఆడది పట్టు పడతంది"

కరణం మాట్లాడలేదు.

సుబ్బిరెడ్డి నేల చూస్తున్నాడు. కరణం సుబ్బిరెడ్డి కేసే చూశాడు. చాలాసేపు అట్టాగే

చూశాడు. ఆ తర్వాత రేపు లెక్క చూద్దామన్నాడు.

మరుసటి రోజు కరణం లెక్కచూశాడు తీసుకొనేందుకు సుబ్బిరెడ్డి లేడు రాత్రి గొడ్ల కొట్టాంలో పడుకొన్నాడు. తెల్లారి చూస్తే పాముకాటుకు చచ్చిపడున్నాడు.

పాముగాట్లు లేవని తోటి జీతగాళ్ళు ఆశ్చర్యపోలేదు. గొంతు నల్లగా ఎవరో బలవంతంగా పిసికినట్టుందని రంగాయి అనలేదు కరణం లెక్కల్లో అచ్చిరెడ్డి తాలూకూ కూడికల్ని తీసివేతల్ని చూసింది. అంతే తన కళ్ళముందే సుబ్బిరెడ్డి మంటల్లో కాలాడు. పంచుకొన్న బతుకు కూడా ఆ మంటల్లోనే కాలిపోయింది. మిగిలింది శ్మశాన బూడిద అది చీకటి మర్రి బతుకు. ఆ చెట్టుకింద కూర్చొన్నపుడు దార్లో కరణాన్ని పురుగు కాటేసినట్టు అన్పించేది. కాని కరణాన్ని ఏ పురుగూ కాటేసేది కాదు. ఆ మధ్య దెయ్యం గొడవప్పుడు దెయ్యం కరణం కుతికి పిసికేసినట్టు అనుకొంది. కాని దెయ్యాలు అబద్ధం అనుకొంది. అర్ధరాత్రి తాను ఇక్కడ కూర్చొన్నా ఏదీ జరగలేదు. తాటితోపులో 'కొరివి' కూడా కన్పించదు. కరణం కన్నా మించిన దెయ్యం వుండదు. కరణమే పెద్ద దెయ్యం పదే పదే అనుకొంది. అట్టా అనుకొంటూ తల పైకెత్తి చూసింది.

ఎదురుగా మనిషి, కరణం కాదు. కరణానికి గడ్డం లేదు. కరణం చీకట్లో కూడా అంత నల్లగా కన్పించడు. అసలు కరణం చేతిలో గొడ్డలి వుండదు.

ఎవరది అనుకొనేంతలోనే కరణం వచ్చాడు.

అప్పుడు జరిగింది సంఘటన. ఊళ్ళన్నీ కలవరించిన సంఘటన. ఎన్నైలదిన్ని పేరు గ్రామగ్రామాన పాకిన సంఘటన.

అప్పుడు జరిగింది.......

మాదిగ మాతయ్య గొడ్డలికి తెగిపడ్డ పెద్ద కరణం తల సంఘటన.

రంగాయి సాక్షిగా

చీకటిమర్రి సాక్షిగా,

కరణం రేవు, తాటితోపు సాక్షిగా.......

రంగాయి మూగదే అయింది. మర్రి అంత మూగదయింది. రేవు అంత మూగదయింది. తాటితోపు అంత మూగదయింది. ఆ మూగతనం మాతయ్యని భయపెట్టింది.

"ఈడు నారిగాణ్ణి నంపాడు. యిప్పుడు నా సేతుల్లో నచ్చాడు" అని చెబుదామనుకొన్నాడు. సూటిగా రంగాయి కేసి చూశాడు. రంగాయి మౌనంగా చూస్తోంది. మూగదానిలా చూస్తోంది. వద్దనుకొన్నాడు. ఏదీ చెప్పొద్దనుకొన్నాడు. రెండు పల్లెలు కళ్ళముందు నిలిచాయి. అందుకే చెప్పొద్దనుకొన్నాడు. కాని రంగాయి మౌనంలో, రంగాయి మూగతనంలో మాతయ్య రూపం దేవుడి రూపంలా వుందని మాతయ్యకి తెలీదు. మాతయ్య దెయ్యం కాదు. మాతయ్య దేవుడు.

ఎంత వేగంగా తన పని పూర్తిచేశాడో అంత వేగంగానే మాతయ్య వెళ్ళిపోయాడు.

నేరుగా మాలపల్లి వెళ్ళాడు పెద్దమాల మంచం పక్క ఆగాడు. నిద్రపోయేవాణ్ణి తట్టి లేపాడు. పెద్దమాల విసుగ్గా లేశాడు. ఎదురుగా నిలబడ్డవాణ్ణి మొదట గుర్తు పట్టలేదు. ఆ తర్వాత గుర్తుపట్టాడు మాతయ్యని. చాలా ఏళ్ళ తర్వాత "ఆడు సావలేదు. ఆడు సావలేదు" అంటూనే వెళ్ళాడు. మళ్ళీ యిప్పుడు వచ్చాడు చాలా మారాడు. కూర్చోమన్నాడు. మాతయ్య కూర్చోలేదు. అటుగా ఎల్దాం రా అన్నాడు. యిద్దరూ బయటకొచ్చారు. ఏటిగట్టున కూర్చున్నారు.

చీకటి చుక్కలు మిణుకుమిణుకుమంటున్నాయి. మిణుగుర్లు వెలుగురవ్వల్లా పరిగెడుతున్నాయి. వాలుకు ఎదురీదే చేపలు పెద్ద శబ్దం చేస్తో అంత ఎత్తుకు ఎగిరిపడుతున్నాయి. కాస్త దూరంలో ఆ యిద్దరూ కూర్చున్న గట్టు చివ్వరి భాగాన గులకరాళ్ళమీద పారే పల్చటి ఏటిజాలు వింత శబ్దం చేస్తో, దగ్గరగా విన్పిస్తోంది.నిజానికి రాత్రి ప్రకృతి మౌనంగా లేదు. చీకటిగా లేదు చుక్కల్లా, మిణుగురుల్లా, ఎగిసిపడే జాలుకు ఎదురీదే చేపల్లా, ప్రకృతి తనకోసం తాను సృష్టించుకొన్న నీటిజాలు సంగీతంలా ఎప్పటిలాగే వుంది. కాకపోతే ఓ సాహసి గుండెలోతుల్లో పుట్టుకొచ్చిన ప్రతిధ్వనిలా వుంది.

అప్పుడు చెప్పాడు మాతయ్య జరిగిందంతా. పెద్దమాల అంతా విన్నాడు. మాతయ్య మాటలు భయపెట్టాయి. మాతయ్య మాటలు ఉద్రేకపర్చాయి. మాతయ్య మాటలు నరాల్ని లాగి వొదిలినట్టు అన్పించాయి. ఎందుకో తెలీదు పెద్ద పెట్టున ఏడ్పు తెప్పించాయి. మాతయ్యని గుండెలకి హత్తుకొని ఏడ్చాడు.

జాలుకు ఎదురు ఈదే చేపలు ఒక్క ఉదుటున ఎగిసిపడ్డ శబ్దం. గులకరాళ్ళ గుండెల నడుమ నీటిజాలు అంతులేని గోల.

పెద్ద మాలకు ఒక్కసారి పైకి లేసి మాలపల్లె మాదిగపల్లెలో జనానికి విన్పించేలా పెద్ద పెట్టున "పెద్ద కరణాన్ని మన మాతయ్య చంపేశాడు వీరుడు నా పక్కనే వున్నాడు. నిద్రలేసి రండి" అని అరవాలనిపించింది. కాని అరవలేకపోయాడు. ఏ పల్లెలకు విన్పించాలని అరవాలనుకొన్నాడో ఆ పల్లెలో ఇళ్ళు గుర్తొచ్చాయి. మనుషులు గుర్తొచ్చారు. వెంటనే భయం వెన్నాడింది. ఉద్రేకాన్ని అపుకొన్నాడు. నిజానికి మాతయ్యే రంగాయికి పెద్ద కరణాన్ని ఎందుకు చంపాడో చెప్దామనుకొన్నాడు కాని ఆగాడు. మాతయ్య ఎందుకు ఆగాడో పెద్దమాలా అందుకే ఆగాడు.

"రంగాయి !..."

"గుర్తుపట్టిందా"

"తెలవదు"

ఆ రాత్రి ఆ యిద్దరూ ఒక నిర్ణయానికొచ్చారు. ఈ విషయం ఆ యిద్దరిలోనే వుంచుకోవాలనుకొన్నారు. మాతయ్యే ఈ పనిచేశాడని తెలిస్తే రెండు పల్లెలు శ్మశానాలౌతాయి. అందుకే ఆ నిర్ణయానికొచ్చారు.

అట్టా నిర్ణయించుకొన్నాక మాతయ్య పైకి లేశాడు. మాతయ్య వెళ్తుంటే పెద్దమాలకి

అదోలా అనిపించింది. మాతయ్యతో గంటలు గంటలు గడపాలనిపిస్తోంది. కాని తెల్లారి దృశ్యం కళ్ళముందు నిలుస్తోంది మాతయ్య వుండటం క్షేమం కాదు. రంగాయి గుర్తుపట్టితే ప్రమాదం. అందుకే "ఎల్లొత్తారా" అని మాతయ్య అంటే కాదనలేకపోయాడు.

మాతయ్యతో పాటే ఏటిగట్టు దిగి రేవు దగ్గరకి నడిచాడు. రేవు నీళ్ళను పాయలు చేస్తూ మాతయ్య వెనక్కి వెనక్కి చూస్తో వెళ్లాడు. పెద్దమాల అట్టాగే చూస్తున్నాడు. వెలుగంతా ఎన్నెలదిన్ని ఏటి ఆవలగట్టుమీదే నడిచినట్టనిపించింది. వీరుడు ఎప్పుడు అట్టాగే నడుస్తాడు. ఆకాశంలో మెరుపు తారాడినట్టు, భూమ్మీద సూరీడు పరుచుకొన్నట్టు, పెనుతుఫాను రెండు క్షణాల్లో తన పని తాను పూర్తిచేసినట్టు.

అప్పుడు వచ్చింది రంగాయి. ఆశ్చర్యంగా చూశాడు. భయంగా చూశాడు. ఆమె పరుగెత్తినట్టు లేదు. ప్రశాంతంగా వెతుక్కుంటూ వచ్చినట్టుంది.

"మాతయ్య దేవుడు" ఆమె అంది. పెద్దమాలకి వింతగా వుంది. అతను మాట్లాడలేదు. ఎన్నెలదిన్ని ఏటిగట్టున వున్నట్టు అతనికి అన్పించటం లేదు.

"కడుపులో దాసుకొంటా.... వూరు వూరంతా యిరసకపడ్డా సెప్పను.... ....'

ఆమె అట్టాగే చెప్పుకుపోతోంది. నల్లమలకొండల కింద పుట్టానని చెప్పింది బతుకుని వెతుక్కుంటూ ఎన్నెలదిన్ని వచ్చానని చెప్పింది. ఎన్నెలదిన్నికి సుబ్బిరెడ్డిని బలిచ్చానని చెప్పింది. బలి తీసుకుంది కరణమంది. ఆ తర్వాత తనని లొంగదీసుకున్నాడంది. బిడ్డకోసం లొంగానంది. ఆ మాటలంటూ ఏడ్చింది. తోడబుట్టింది ఏడ్చినట్టనిపించింది. కరణం చావుకోసమే చూశానంది. మాతయ్య దేవుడంది. ఆ మాట చాలాసార్లు అంది. కరణాన్ని చంపి మాతయ్య వడివడిగా వస్తుంటే వెంట వచ్చానంది మాతయ్య మాలపల్లిలోకి దూరితే, తాను బయటే ఎదురు చూశానంది. ఏటి గట్టున వాళ్ళు కూర్చొన్నప్పుడు అక్కడికే వద్దామనుకొన్నట్టు చెప్పింది. మాతయ్యని తాను గుర్తుపట్టినట్టు మాతయ్యకు తెలియకూడదని ఆగానంది. మాతయ్య క్షేమాన్ని పదే పదే కోరుకుంది. వాడు కలకాలం బతకాలంది. తన ఆయువు కూడా తీసుకొని బతకాల నంది. అంటూనే వెనుదిరిగింది. ఎంత ప్రశాంతంగా వచ్చిందో, ఎంత ప్రశాంతంగా మాటాడిందో అంతే ప్రశాంతంగా నడవటం మొదలెట్టింది. ఆమె కన్పించినంత దూరం చూస్తూ వుండిపోయాడు.

ఏటికి ఆవలగట్టున నడుస్తున్న మాతయ్య.

ఈవలిగట్టున పెద్దమాల

ఊరిదారి పట్టిన రంగాయి.

అంటరానివాళ్ల బతుక్కి, ఆడవాళ్ళ బతుక్కి ఎన్నెలదిన్ని బతుకులో దాగిపోయిన వాస్తవ రూపం ఆ చీకటి రాత్రి తనలో దాచుకొంది.

తెల్లారి ఎన్నెలదిన్నిలో బోలెడు తతంగమే జరిగింది. లోలోపల ఏం జరిగిందో పెద్దమాలకు తెలీదు. రెండు పల్లెలు మాత్రం ప్రమాదానికి గురి కాలేదు. అంతే

చాలనుకున్నాడు అట్టా అనుకొనే ఇంతకాలం గడిపాడు. యింతకాలం ఆ చేదు నిజాన్ని గుండెల్లో దాచుకొన్నాడు.

ఎందుకోగాని యిన్నేళ్ళు దాచుకొన్న మాతయ్యని, రంగాయిని యింకా దాచుకోవటం కష్టమనుకొన్నాడు. ఆ రాత్రి దాచుకొన్న వాస్తవం తనతో చావకొడదనుకున్నాడు. తాను ఇంకా ఎంతోకాలం వుండకపోవచ్చు. తాను కాలం చేస్తే ఆ నిజం చెప్పేందుకు మాతయ్య లేడు. ఏమయ్యాడో తెలీదు రంగాయి లేదు. కొడుకు పెత్తనానికి వచ్చాక ఎన్నెలదిన్ని వదిలేసింది. సొంత వూర్లో పొలం అమ్మి వస్తానంది. పొలం అమ్మకాలు అయిందాకా అక్కడే వుంటానంది. పొలం అమ్మకాలు అయిపోయాయి. అయినా రాలేదు. రాదని పెద్దమాలకి తెలుసు ఆమె వెళ్ళేరోజు తానే బండికట్టాడు. దారంతా చెప్పింది. తిరిగిరాను అంది మాతయ్య ఒక్కడే ఎన్నెలదిన్నిలో గుర్తుండే వ్యక్తి అంది. ఆ రోజు కలిసినట్టే, అనుకోకుండా కలిసినట్టే ఈ దార్లో కలిస్తే బాగుండు అంది.

చాలారోజుల తర్వాత అమె బ్రహ్మంగారి మటంలో చేరిపోయినట్టు తెలిసింది. అప్పట్లో మాలామాదిగలు ఆ మతంలో ఎక్కువగా చేరేవాళ్ళు. అది కాకపోతే నాసరయ్య మతంలో చేరేవాళ్ళు. రామానుజ మతం మాలామాదిగల్లో బాగా పాతుకుపోయింది. ఎన్నెలదిన్నికి అంత తాకిడి లేదుగాని కనిగిరి, కందుకూరు, కంభం, కర్నూలు, పొదిలి ప్రాంతాల్లో బ్రహ్మంగారి మతం బాగా ప్రచారంలో వుండేది. వినుకొండ, నర్సారావుపేట, బాపట్ల, దర్శి, మార్కాపురం, పలనాడు ప్రాంతాల్లో నాసరయ్య మతానికి పేరుండేది. మనిషి తన ఉనికిని నిలబెట్టుకోవటానికి చేసే ప్రయత్నాలలో అదొకటి. శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మం బోధల్లో కులవివక్ష లేదు. నాసరయ్య కులంమీద పెద్ద దాడి మొదలెట్టాడు. రామానుజ మతం కులవివక్షత లేదంది. అందుకే వీళ్ళు ఆ బోధలకి ఆకర్షితులయ్యారు. భజన సంఘాలు ఏర్పడ్డాయి.

ఓసారి ఎన్నెలదిన్నికి బ్రహ్మంగారి తత్వాలు పాడుతూ వో దండు వచ్చింది. వాళ్లు మాలపల్లిలో తత్వాలు పాడారు. మాదిగపల్లిలో తత్వాలు పాడారు. పాటలు వినసొంపుగా వుండేవి. ఆ పాటల్లో కక్కడి మాట వుండేది. కక్కడు సొంతబిడ్డలా మాలలకి, మాదిగలకి అనిపించేవాడు. ఆ తర్వాత ఆ దండు ఊళ్ళోకి వెళ్ళింది. ఊళ్ళోవాళ్లు ఆ దండుని రానివ్వలేదు. ఇది జరిగిన మూడోరోజు రంగాయి సొంత వూరికి బండి కట్టించుకుంది.

ఇంకా బతికుందని కొందరంటారు. పొదిలికి రెండుసార్లు వచ్చిపోయిందని అచ్చిరెడ్డి దగ్గరకి రావడానికి యిష్టం చూపలేదని తెలిసింది. ఏద్దైందో తెలీదు. ఆమె ఎన్నెలదిన్నికి మాత్రం రాలేదు.

మాతయ్య సాహసం, కరణం మరణం, రంగాయి గొప్పతనం ఎన్నెలదిన్నిలో ఎవ్వడికీ తెలియకుండా సమాధి కాకూడదు. పెద్దమాల ఆ మాట గట్టిగానే అనుకొన్నాడు. అంతేకాదు ఆ నిజం పిట్టోడికి చెప్పాలనుకొన్నాడు.

చెప్పాడు. వాడ్ని ఆ రాత్రి లేపి, అక్కడే, ఎక్కడైతే మాతయ్య విడిపొయ్యాడో అక్కడే కూర్చోబెట్టి చెప్పాడు. మాతయ్యని చెప్పాడు. రంగాయిని చెప్పాడు.

అంతా విన్నాక పిట్టోడు ఎన్నెలదిన్ని రెండు పల్లెలకేసి చూశాడు. పెద్దమాల కేసి చూశాడు. ఎన్నెలదిన్ని గుండెల్లో విన్పించని శబ్దాలు వున్నాయి. చాలానే వున్నాయి.

ఆ రాత్రి పిట్టోడు నిద్రపోలేదు. చీకటితో మాదిగపల్లెకేసి వెళ్ళాడు. కువ్వల పెట్టిన మాంసం ముందు పోలడు వుంటే వో కువ్వ ఎత్తమన్నాడు. సహజంగా మాంసం కోసిన రోజు గంపలో మాంసం కువ్వల మూటలు పెట్టుకొని పోలడు భార్య మాలపల్లి వస్తుంది. అందుకే "అంత ఆత్రంగా వుందంట్రా పిట్టోడా" అని పోలడన్నాడు. "లేగదంటేనూ ఆడదాకా వత్తదా అని వచ్చాలేరా" అని అన్నాడు. నిజం అది కాదు. ఎందుకో తెలీదు. మాదిగపల్లికి రావాలనిపించి వచ్చాడు. అంతే. రానేవచ్చావు కాత్త నల్ల తినిపోరా అల్లుడా అని పోలడి భార్య అంది. 'నల్ల' అంటే ప్రాణం లేసొచ్చింది పిట్టోడికి పట్రాయే అత్తా అన్నాడు. పిల్లదానికి పట్టుకెళ్ళురా ఎదవనాయాల అని పోలడు అన్నాడు. ఆడ్ని తిన్నీ దానికేం దొబ్బుడాయిలే అని పోలడు భార్య అంది. యామైనా అత్తా అత్తేరా మావా అని పిట్టోడు అంటే, పోలడు భార్య వండిన నల్లమూట కట్టి పిట్టోడి చేతిలో పెట్టింది. నల్లలో ముక్కలన్నీ నువ్వే తినేవ్ పిల్లదానికి పెట్టు అని పోలడు అంటుంటే పిట్టోడు నవ్వుకుంటూ యింటిదారి పట్టాడు.

ఇంటి దగ్గర చిన్నమ్మి ఎల్లన్న వచ్చాడని చెప్పింది. రెండు మూటలు చిన్నమ్మి చేతిలో పెట్టి బూదేవి యింటికేసి నడిచాడు.

ఎన్నెలదిన్ని మాలపల్లెంతా బూదేవి యింటిముందే వుంది. ఎల్లన్నని గుండెలకి హత్తుకొని బూదేవి ఏడుస్తోంది. కాస్త దూరంలో మంచం మీద కూర్చొని వున్న వ్యక్తిని చూశాడు. అతని చూట్టూ జనం. పిట్టోడికి ఆ మనిషి కేసి అట్టాగే చూడాలనిపించింది. కాస్త ఆగాక ఆ వ్యక్తి ఉరుముల నాగన్న అని, ఆయనే ఎల్లన్నని యింటికి తెచ్చాడని తెలిసింది.

# 7

ఎన్నెలదిన్ని మాలపల్లి నాగన్నని మొదట వింతగా చూసింది. అక్కడక్కడా ఉరుముల నృత్యం చూసిన పెద్దలు నాగన్నగా గుర్తించారు. అతని నెరిసిన వెంట్రుకలకేసి, మొహం మీద వీబూది కేసి అట్టాగే చూస్తూ 'గురువులోరు' అని కొందరన్నారు

బూదేవికి మాత్రం నాగన్న మనిషిలా కన్పించటం లేదు. ఎల్లమ్మ తల్లి పంపినట్టున్నాడు. ఆ మాటే పైకి అంటోంది. జనం తనని గూర్చి పైకే మాట్లాడుతున్నారు. నాగన్న అన్నీ మౌనంగా వింటున్నాడు. చిన్ననాటి తన నేస్తాలకోసం వెతికాడు. అప్పటి తెలిసిన ఆకారాలతో యిప్పటి వాళ్ళని పోల్చుకోలేకపోతున్నాడు.కాని అప్పటి అయ్యీ ఈడువాళ్ళని మాత్రం గుర్తించాడు. అప్పటి పెద్దమాల యింకా వుండి వుండడు. కాని జనాన్ని అదమాయిస్తూ వచ్చిన పెద్దమనిషిని చూశాడు. అయ్యీ ఈడువాడు. పెద్దమాల కొడుకు, ఇప్పుడు పెద్దమాలయ్యాడు. వంగిపోయాడు. తనని ఆరాధనగా చూస్తున్నాడు. నేను నారిగాడి కొడుకునని చెప్పేయ్యాలనిపించింది. ఎల్లన్న అత్త వడిలోంచి యింకా బయటపడలేదు. తాను ఫలానా అని ఎట్టా చెప్పాలో అర్థం కాలేదు. ఎన్నెలదిన్ని వదిలాక మళ్ళీ యిప్పుడే వచ్చాడు.

ఎల్లన్న అయ్యీ ఎర్రెంకడుకేసి అట్టాగే చూశాడు. లాభం లేదు. ఈడువాళ్ళను గుర్తుపట్టడమే కష్టం. ఎర్రెంకడు అసలు వూహల్లోకి రావటం లేదు.

అట్టా చూస్తుంటే గుడ్లప్పగించి చూస్తున్న నల్లటి కుర్రాడి మీద చూపు పడింది. పొట్టిగా వున్నాడు. దొరికినట్టు దొరికి జారిపోయే నల్లంచి పిట్టలా వున్నాడు. ఆ కుర్రాణ్ణి చూస్తే ఆ రోజు అయ్యీతో వరద దాటి మూటలు మోసిన మాతయ్యీ కాక మిగిలిన యిద్దరిలో నల్లెంక మామ గుర్తొస్తున్నాడు. నల్లెంక మామ ఆ నలుగురిలో చాలా చిన్నాడు. అవే బిత్తరచూపులు. అదే నలుపు. జముడు కాకి రంగు తలకట్టు. అయినా ఆ బిత్తర చూపుల్లో తొంగిచూసే వింత ఆకర్షణ. అవును నల్లెంక మామ రూపే. అప్పుడే ఆ కుర్రాడు ఏదో మాట్లాడుతున్నాడు. మాటాడేటప్పుడు నాలుగుదిక్కలా ఒక్కసారి తిరిగే కళ్ళు. నల్లంచి పిట్ట కళ్ళు.

"యిట్టారా"

వచ్చాడు. పట్టుకొంటే జారిపోయేలా వున్నాడు. నల్లంచి లాగే కాదు. వాడి వడుపు చూస్తే బురదమట్టలా వున్నాడు.

"ఏం పేరు"

"పిట్టోడు"

నవ్వాగలేదు. నిజంగా పిట్టలోడే. నల్లెంకమామ కొడుకే.

"అయ్యపేరు"

"నల్లెంకడు""

వరద నీటిలో నల్లెంకడు. ఆ నలుగురిలో చిన్నాడు. గుండెల్లో ఆటూ పోటూ. రెప్పలచాటు వరదనీళ్ళు.

"అయ్యని ఎరుగుదువా"

తలూపాడు - అంతా ఏదో కొత్త సంగతి తెలిసినట్టు గుడ్లప్పగించారు.

పెద్దమాల కల్పించుకున్నాడు. నల్లెంకడు ఈ మధ్యనే కాలం చేశాడని అన్నాడు.

"చినరంగడు ? "

చినరంగడు ఆ నలుగురిలో ఒకడు ఎంత వెతికినా కన్పించలేదు. ఆగలేక అడిగాడు. ఎవరో అన్నారు "సిననారంగాయి తాతా పిలుత్తున్నాడే" అని. ఆశగా చూశాడు.

చినరంగడు రెండు కాళ్ళమీద కూర్చొన్నాడు. ఎండకాగుతూ. చేతిలో కర్ర. యిటు చూడటం లేదు వీపు యిటు తిప్పి అటు చూస్తున్నాడు. చూపు ఆనదని చెప్పారు. మొలచుట్టూ ఒక చుట్టు చుట్టి మొలతాడులో దోపిన గోసిగుడ్డ.

ఓ చిన్న పిల్ల 'గుంట గిన్ని' చినరంగడు ముందు వుంచింది. కొడుకు బిడ్డ అని చెప్పారు. ఆ పిల్ల చినరంగడు ఎక్కడ ఎండ కాగుతుంటే అక్కడికి గుంటకిన్నెలో పున్నీళ్ళ కూడు కలుపుకొని తెస్తుంది. కాల్చిన మిరపకాయ తాత చేతికిస్తుంది. తాతతో పాటే ఆ పళ్ళెంలో తింటుంది. అట్టా తిన్న తర్వాత గిన్నె కడిగి ఆ గిన్నెలో నీళ్ళు పోస్తే ఆ నీళ్ళన్నీ చిన్నరంగడు తాగుతాడు. ఆ రోజు అట్టాగే చేసి ఆ పిల్ల బూదేవి యింటిముందు జనంకేసి చూసింది. నాగన్నకేసి సూటిగానే చూసింది చిన్ని కళ్ళు, చిలిపి కళ్ళు. చీమిడి సారికల ముక్కు. మధ్యలో మొదలై పక్కకి వెళ్ళిన చింపిరి పాపటి. పిల్ల ముచ్చటగానే వుంది. ముచ్చుది. మూతి మూడు తిప్పులు తిప్పుతూ నిల్చుంది. పేరు సింపిరి.

"సినరంగడు ఎట్టా తెలుసు"

"మాతయ్య ఎట్టుండు"

ఆ మాటతో పెద్దమాల మొఖంలో మార్పు వచ్చింది. నాగన్నలోకి అట్టాగే చూశాడు. వెతికాడు. చాలాసేపు వెతికాడు. ఈ యిత్తనం ఏ చెట్టుది. ఆ చెట్టు ఈ దిబ్బ మీద ఏమైంది. ఎట్టాంటి చెట్టు అది. ఈ యిత్తనాన్ని రాల్చిన చెట్టు కోసం పెద్దమాల యింతకళ్ళు చేసి వెతికాడు. ఆగటం లేదు. నాగన్న రెప్పచాటు వరద ఆగటం లేదు. ఎల్లమ్మ ఆపలేదు, ముంగ మూరమ్మ ఆపలేదు. మాలుచ్చమ్మ చెట్టు ఆ వరదలో ఎప్పుడో కొట్టుకుపోయింది. యింకా ఆపుకోలేడు........ఆపే శక్తి లేదు.

"నారిగాడి కొడుకుని"

ఆ మాటని కన్నీటి వరదే బయటకి నెట్టింది. అప్పుల మధ్య, పుట్టిన గడ్డ మీద, పాలిచ్చిన గడ్డ మీద, ప్రాణం పోసిన గడ్డమీద. ఏడ్పు ఆగలేదు. ఆ రోజు అయ్యకోసం ఏడ్చాడు. ఈ రోజు ఎందుకేడుస్తున్నట్టు.

'నారాయి మామ కొడుకు !" పిట్టోడు ఆ మాటే పదేపదే అన్నాడు. పెద్దగా అరిచాడు, బూదేవి అల్లుడి ముచ్చట్లు ఆపి అటుగా చూసింది. ఎండకాగే చినరంగడు 'కర్రపట్టుకోయా సింపరే' అన్నాడు. చినరంగడు నడకలో ఎక్కడ లేని ఒడుపు వచ్చింది. సింపిరి ఆ వొడుపు తాతలో యింతకుముందు చూడలేదు. అంతా వింతగా వుంది. తవుడుకుంటూ చినరంగడు నాగన్న ముందు నిల్చాడు. "యర్రా నారిగాడి కొడుకు" అంటూనే వున్నాడు.

అనుకుంటాం గాని బూమ్మీద త్యాగానికి వున్నంత విలువ దేనికీ లేదు. అది ఎంత చిన్నదైనా కావచ్చు. దాన్ని ఎంత చిన్నవాడైనా చెయ్యొచ్చు. దాని శక్తి దానిదే. మనుషుల గుండెల్లో గూడుకట్టుకొని, వాళ్ళ మాటల్లో మరణం లేకుండానే వుంటుంది. జీవితంలో చీకటి కోణాలు చూసేవాళ్ళకి దాని విలువ అనుమానంగా వుండొచ్చు. అంత విలువైంది కాకపోవచ్చు. కాని ఎన్నెలదిన్ని మాలాళ్ళు చాలా మామూలు మనుషులు. వెలుగుకోసం వెతుకుతున్నవాళ్ళు. వాళ్ళకి ఆ త్యాగం చిన్నదిగా కన్పించదు. కొట్టి వేసేదిగా అన్పించదు.

నాగన్న చినరంగడి చేతులు పట్టుకొన్నాడు. అమ్మ సంగతి అడిగాడు. కథంతా చెప్పలేడు. చచ్చిపోయిందని మాత్రం చెప్పాడు. చూపులేని కళ్ళల్లోంచి చుక్కలు రాలాయి. "మీ అమ్మని ఎత్తకపోతారా"అని చినరంగడు చిన్నప్పుడు భయపెట్టేవాడు. నిజంగా ఎత్తుకుపోతాడేమోనని భయమేసేది. ఒక్కోసారి రాయే పిల్లా అంటో అమ్మ చెయ్యిపట్టి లాగేవాడు. కోపం వచ్చేది. వదిలిపెట్టమని గుంజేవాడు. అయ్య నవ్వుతూ వుండేవాడు. ఎంతకి చినరంగడు వదిలేవాడు కాదు. వాడి చెయ్యి కొరికేవాడు. కోరికేడే అంటూ వదిలేవాడు. రాత్రి యింటికి తడిక జాగ్రత్తగా వేసేవాడు. మధ్యలో తాడు కట్టిన కర్రని జాగ్రత్తగా మెలితిప్పి వాకిలి గోడలకు అతికేవాడు. వాకిలికి అవల తడికే అది తీయకుండా దానికి తాడు కట్టిన కర్ర వాకిలి గోడలకు అతుక్కుని ఈవల వుండేది. అయినా అనుమానం. కర్రలాగి చూసేవాడు. తడిక కదిలేది కాదు. ఎందుకురా లాగి చూస్తావని అమ్మ అంటే చినరంగడి మాట చెప్పేవాడు. అమ్మ నవ్వేది. గలగలా నవ్వేది. అట్టా అమ్మ మాత్రమే నవ్వేది. యింకా ఏ అమ్మకి చేతరాదు. సగం రాత్రి తడిక సందుల్లో శబ్దం వినిపిస్తే నిద్ర లేసేవాడు. "చినరంగడు మామొచ్చాడు తరమరా అని అమ్మ అనేది. తీరా చూస్తే మచ్చల కుక్క. కర్రలాగి, తడిక తీసి కుక్కను తరిమేవాడు. నవ్వు ఆగటం లేదు.

కలవటాలు, విడిపోటాలు యిష్టంగా వుంటాయి. దుర్మార్గంగా వుంటాయి. కాని ఎల్లన్నని కలవటం, పిట్టోడ్ని కలవటం మాత్రం చాలా ప్రత్యేకమైనవి. అవి నాగన్న సుదీర్ఘ ప్రయాణంలో చివ్వరి మజిలీలు.

పిట్టోడు అంత దగ్గరవాడనుకోలేదు. పిట్టోడు చేసుకుంది తన పెద్దయ్య కొడుకు బిడ్డనే అని తెలుసుకొన్నాక, చిన్నమ్మి " ఈడ్నే వుండిపో అయ్యా" అన్నాక ఆగిపోదామనుకున్నాడు. ఆగిపొయ్యాడు. చిన్నమ్మి చంకలో బిడ్డ నాగన్న భుజాలకెక్కింది

నాగన్న యిప్పుడు ఒంటరికాదు. ఎల్లన్న, బూదేవి, పిట్టోడు, చిన్నమ్మి, వాళ్ళ బిడ్డ అంతా తనవాళ్ళు.. వాళ్ళ బిడ్డకి మరీ దగ్గరయ్యాడు ఆ పిల్ల ముక్కు రక్కుతుంది. జుట్టు పీకుతుంది. 'చిన్నమ్మి రంగు, పిట్టోడి జుట్టు, పిల్ల విచిత్రమైంది. పేరు నాగన్నే పెట్టాడు.

సుభద్ర.

పిట్టోడికి నోరు తిరగలా. చిన్నమ్మికి నోరు తిరగలా. అయినా సుభద్రే. ఎన్నెలదిన్నిలో కొత్తపేరు అలవాటు పడుతోంది.

కాలం వేగంగా పరుగుతీస్తోంది. పరిగెత్తే కాలంతో ఎన్నెలదిన్ని బోలెడు మార్పులకి గురైంది. ఎల్లన్న యిప్పుడు పక్కిలదిన్ని పారిపోయిన దిసెముల పిల్లాడు కాదు, గడ్డాం మీసం పుట్టు కొచ్చిన ఆటలాడు పాటగాడు. ఆటెల్లడు. పాటెల్లడు.

# 8

రూతుకు రూబేను మాటలు గుర్తొస్తున్నాయి.

ఈ దేశాన్నుంచి కొందరు విచిత్రమైన అవకాశాల్ని, అంతులేని వనరుల్ని లాగేసుకున్నారు. ఏళ్ళు గడిచాయి.

ఎన్నో దారుణాలు, ఎన్నెన్నో డాంబికాలు, విజ్ఞానమంతా తమ సొత్తయినట్టు. కులం దుప్పటి కప్పుకుని, కులం కత్తి పట్టుకొని, పాలించారు. ప్రాణాలు తీశారు.

వాళ్ళు విశ్వాని కంతకి ప్రభువులు. దేవుడితో సమానులు. వాళ్ళని పూజించాలి, సేవించాలి, గౌరవించాలి. వాళ్ళకోసం సర్వాన్ని ఫణంగా పెట్టాలి. వారి పాదాల్లో పవిత్రత వుంది. అన్ని తీర్థాలు వాళ్ళ ఎడమకాళ్ళలో దాగివున్నాయి. కడగాలి. వాళ్ళ పాదాలని అప్పుడు కన్పిస్తాయి అనంత తీర్థాలు.

యింకొన్ని ఏళ్ళు గడిచాయి విశాలమైన భూమ్మీద, రాజులు చచ్చారు. వాళ్ళ రాజ్యాలు కూలాయి. సముద్రాలు దాటి తెల్లవాడు ఈ గడ్డ మీద స్వారి మొదలెట్టాడు. మరికొన్ని ఏళ్ళు గడిచాయి.

విచిత్రం. ఏదీ ధ్వంసం కాలా. కులం, అంటరానితనం, దౌర్జన్యం, దోపిడి ఏదీ అంతం కాలా. కాకపోతే అన్ని వేదాల్లో వున్నాయన్న వాళ్ళు అన్నీ తెల్లదొరల పాదాల్లో చూడటం మొదలెట్టారు. వాళ్ళ ఎడమపాదాల్లో తీర్థాలు ఏమయ్యాయో తెలీదు. తెల్లదొరల పాదాల్లో తీర్థాలు పుచ్చుకోవటం మొదలెట్టారు. అన్ని ఉన్నత పదవులూ వాళ్ళకే. ఒకసారి భగవద్గీత, మరోసారి వలస హృదయం. అంతే తేడా.

తమాషా. ప్రతీదీ చూడటం ఇంగ్లీషులోనే. సమస్త కళలకి వేద ఘోష బాల్చి తన్నేసి యూరోపియన్ గీతల్లో భాష్యాలు మొదలయ్యాయి. అక్కడ ఏ గీత గీస్తే యిక్కడి కుంచ అదే గీత గీసింది. అక్కడి నటుడు మీసం సగం తీస్తే యిక్కడి నటుడు కూడా కొలత పెట్టుకొని మరీ తీశాడు.

సాహిత్యం యిట్టా వుంటుంది. చిత్రలేఖనం అట్టా వుంటుంది. నాటకం అంటే ఇది. అది మరోలా వుండదు. తీర్మానాలు మొదలయ్యాయి. తీర్పులు వెలువడ్డాయి. పేర్లు లెక్కపెడితే ఒకటో రెండో పక్కన పెడితే అట్టా తీర్పు చెప్పిన వాళ్ళంతా భగవద్గీతలే. అందరూ వలస హృదయాలే.

కొందరు ఆకాశానికి ఎత్తబడ్డారు. కొందరు పాతాళంలోకి తొక్కబడ్డారు. అట్టా ఆకాశానికి

ఎత్తబడ్డవాళ్ళల్లో ఒకానొక రవివర్మ. ఆయనకే అందని అందాలు అంటూ రాశారు. నిజమే. ఆయనకి అందని అందాలు చాలా వున్నాయి. కాకపోతే అవి అంటరాని వసంతాలు. ఈ భూమ్మీద కురిసి వెలసిన వెలి కదలికలు.

ఆ వెలి కదలికల్లో తెలుగు నాటకం మూలాలు చూడటానికి యిష్టపడడు రాజమన్నార్. యూరోపియన్ తెరల వెనుక తెలుగు నాటకాన్ని వెతుక్కున్న ఈ "ఆశీర్వదించబడ్డ తీర్పర్ల"కు ఎల్లన్నల నటనలో, నర్తించిన పదాల లయలో నాటకం కన్పించదు. కన్పించదు అంతే. విశ్వనాథ వారన్నట్టు ఎందుకు కన్పించదు ? కన్పించదు కనుక కన్పించదు. పై పెచ్చు ఒకానొక క్రిష్ణమూర్తికి ఎల్లన్నల మొహాల్లో వికృతరూపాలే కన్పించాయి.

రూతుకు బుద్ధిలేదు. రూబేను నాలుక కోసేయాలి. వెనకటికి సీసం పోశారు. అభివృద్ధి చెందిన కాలం. యిప్పుడు తప్పనిసరిగా కోసెయ్యాలి. మాలామాదిగల, యానాదుల, ఎగుర్లలో నటన వుందంటారా ? నాటక మూలాలు వెదుక్కోమంటారా ? అట్టా చెప్పటానికి వాళ్ళకి ఏ హక్కు వుంది ? ఏది చెప్పాలన్నా చెప్పాల్సినవాళ్ళు చెప్పాలి. అట్టా చెపితినే అది సిద్ధాంతమౌతుంది. మాలలు, మాదిగలు, యానాదులు, ఎరుకలు, చాకల్లు, అట్టా అనేకానేకానేక అలగా జనాలు చెప్పేది అలగా మాటలు. 'మేధావి' అనే పదం కొందరికి మాత్రమే చెందుతుంది. మిగతావాళ్ళు 'అలగావి' కిందికొస్తారేమో ! 'అలగావి ' యిదేదో కొత్తపదం లాగుంది. శబ్ధ నిఘంటువులో పేజీలు వెతికితే బాగుండు. లేకపోతే కలిపితే యింకా బాగుండు.

అభినయం ఎట్టా ఉండాలి. ఎట్టాగో వుండాలి. ఏదోలాగో వుండాలి. ఎందుకో ఎగరాలి. ఎందుకు ఎగిరింది ఎదుటివాడికి తెలీకూడదు. మనుషుల్లా ఎగిరినట్టు ఎగరకూడదు. ఎక్కడనుంచో, ఎట్టాగో, గాల్లో తేలిపోతో, దేవతల్లానో, రాక్షసుల్లానో వుండాలి. అడుగుతీసి, అట్టావేసి, అతి సుకుమారంగా లాగి, అమిత లాఘవంగా మరో తిప్పు తిప్పి - ఓంలో 'తోం'ను కలిపితే, అదీ విన్యాసం. అదీ నర్తనం. అదీ నటనకు పట్టాభిషేకం. భరత మహాముని సృష్టిలో అక్కడే వుంది అసలు రహస్యం అంతా.

ఎన్నెలదిన్ని మాలామాదిగ యిళ్లల్లో ఉట్టి మీద మీగడ లేదు. వెన్నముద్దలు లేవు. వుంటే ఎండుచాపలుంటాయి. అంతగా కాకపోతే ఎండొరికలుంటాయి. వాటి కోసం ఏ బాలగోపాలుడు రాడు. వాడిని అంతా సుకుమారంగా నాట్యంలో కొడుకుతో సరిగమల్లో తిడుతో విన్నావా యశోదమ్మా అనేందుకు యశోదమ్మలు లేరు. ఎన్నెలదిన్ని యశోదత్త ఆ సమయాన బిడ్డమీద అందమైన, అతి సుకుమారమైన, రాగయుక్తమైన ఫిర్యాదు వస్తుందని అరుబయట ఎదురుచూస్తూ కూర్చోదు. కూరసట్లోకి "యిసుక దూసరాకు" కోస్తూ వుంటుంది. కాకపోతే తనదికాని పొలంలో నారు పీకుతూ వుంటుంది. ఆ పూట యింత సంకటి ముద్దకి భూమంతా వెతుకుతుంది. అంతా అన్వేషణే. అంతా పోరాటమే. ఆ యశోదకి

బాలగోపాలుడు నోరుతెరిస్తే భూమండలమంతా కన్పిస్తుంది. ఆ యశోద విస్తుపోతోంది. ఆమె మొహంలో సంభ్రమాశ్చర్యాలు. కాని ఈ యశోదత్త బిడ్డ నోరు తెరిస్తే ఆకలి కన్పిస్తుంది. విస్తుపోదు. ఏడుస్తుంది ఆమె మొహంలో సంభ్రమాశ్చర్యాలు కన్పించవు. సద్దికూడు మిగల్చని రాత్రిని తిట్టి పోస్తుంది. మొగుడ్ని తిట్టిపోస్తుంది. తన పుట్టుకని తిట్టుకుంటుంది కసి తీరదు. బిడ్డని కొడుతుంది. కొట్టాక వాడ్ని దగ్గరకి లాక్కుంటుంది. ఆకలి కడుపులో దాచుకుంటుంది. దొరికితే కూటిమెతుకులు వెతుక్కోమని అట్టా గంటలు, రోజులు చెప్పాడు రూబేను చరిత్రని, సాహిత్యాన్ని. అవి మాటలు కావు. గుండెకోతలు, గుచ్చుకొన్న సిలువ చీలలు.

రూబేను ! ఎంత ద్రోహం చేసింది ఈ సాహిత్యం బిడ్డ పాత్రకి ఎంత అసహజంగా, ఎంత కృత్రిమంగా మలిచింది. తల్లీ పాత్రకి అంత ద్రోహం చెయ్యొచ్చా............

ఏమిటిదంతా, మరణాంతర సన్నివేశంలా చలనం ఒక్కచోటే ఆగినట్టు, ఆగి తైతక్కలాడినట్టు. ఊహాలవికృతరూపం. అద్భుతమైన వికృతరూపం. అందమైన వికృత శిల్పం. అందంకూడా ఎంత వికృతంగా ఉంటుంది. నిజంగా అన్పిస్తోంది, అందానికి అర్థం తిరగరాయాల్సి వుంటుందని.

ఆరోజు రూబేను మాటలు విని రూతు అందానికి అర్థం తిరిగి రాయాలన్నాక రూబేను కళ్ళలో మెరిసిన మెరుపు, మొహంలో తొంగిచూసిన చిలిపి నవ్వు పదే పదే గుర్తొస్తుంది రూతుకు. అనుకొంటే ఇప్పుడు నవ్వొస్తుంది.

యింకా ఏమంది రూతు. ఆ మాటలు సరిగ్గా గుర్తురావాలి. రూబేను ఆరోజు కవిత్వమే చెప్పాడు. కవిత్వానికి వున్న అందం కూడా అప్పుడే చూసింది రూతు.

నిజంగా ఏమంది తాను.

“అందం అంటే గుర్తొచ్చింది రూబేనూ. నీ ఎల్లన్న సుభద్ర ఎట్టా వుండేది. అందంగా వుండేదా. నాకన్నా అందంగా........”

“చుక్కల్ని ఏర్చి పేర్చి ముగ్గు కర్ర గియ్. ఎట్టా వుంటుంది. అట్టా వుంటుంది” . అని అన్నాడు రూబేను. నిజంగా రూబేను ఎట్టాంటి కవి బండసందులలో ఎగిరే ఈ పావురంలో పదాల్ని చెక్కి పేర్చే నైపుణ్యం ఎట్టా అబ్బింది.

ఆ ఊహా చిత్రాన్ని మనసులో గీసుకొంది రూతు. గీతలు సరిగ్గా కుదరటం లేదు. చుక్కల ముగ్గుకర్ర అనే మాట మాత్రం పదే పదే అనుకుంది.

“అట్టా వుంటుందని ఎల్లన్నే పాట అల్లాడు. తన అల్లికలో చుక్కల్ని దింపాడు. చుక్కా చుక్కా కలిపి సుభద్రని వుంచాడు” మళ్ళీ రూబేను అన్నాడు.

అట్టా అన్న రూబేను రూతులోకి చూస్తూ వుండిపొయ్యాడు. అప్పుడనిపించింది రూతుకు ఆ ఆఖరి మాట అనకుండా వుండాల్సిందని. కాని అనేసింది. “నాకన్నా అందంగా...” ఎందుకో ఆ మాట ఆ క్షణం యిబ్బందిగా అన్పించింది. రూబేను చూపు

తిప్పలేదు.

"నీ అందం నీ మనుమడు పాడుకొంటాడు".

ఎంత ఆపుకొందామన్నా ఆ మాటకి యిద్దరికీ నవ్వు ఆగలేదు ఆ నవ్వులు యిప్పటికీ విన్పిస్తుంటాయి. సుభద్రని ఎల్లన్నని కలుపుకొని పంచుకొన్న నవ్వులు అవి. అక్కడే ఆగి పదే పదే మళ్ళీ ఆ నవ్వుల్ని గుర్తు తెచ్చుకోవాలని అనుకుంటుంది రూతు. అవి గుర్తొస్తే సుభద్ర గుర్తొస్తుంది. తనలాగే ఒకప్పుడు ఆ యింట అడుగు పెట్టిన కోడలు. పుట్టినే వెళ్ళిపోలేదు. పాటలా మిగిలి వెళ్ళిపోయింది.

ఆ చుక్కల ముగ్గుకర్ర ముందు నిలుస్తోంది. ఎట్టా పెరిగింది, నాగన్న గుండెల మీద, పిట్టోడి మురిపాల్లో . ఎట్టా నడకలు నేర్చుకుంది, చిన్నమ్మిని బోల్తాకొట్టిస్తో. బూదేవిని అడిగితే అంటుంది అది మురిపాలు మూట కట్టుకుని ఎదిగిందని. లింగాలు అయితే రెప్పకొట్టకుండా ఆపిల్లకేసి అట్టాగే చూసేది. ఆ పిల్ల తొక్కుడుబిళ్ళ ఆడేప్పుడు అనుకొనేది ఆగంతు ఈ గడపలోకి గెంతితే దీనబ్బ సొమ్ము ఏంపోయిందని. ఆశకి పోగాకే లింగాలా అని ఎర్రైంకడనేవాడు. ఆటలాడుతో ఊళ్ళు పట్టుకొని తిరిగే ఎల్లన్నకి పిట్టోడు పిల్లనిస్తాడనే నమ్మకం ఎర్రైంకడికి లేదు.

కాని ఎర్రైంకడికేం తెలుసు. ఏదన్నా తెలిసుంటే బూదేవికే తెలుసు. ఎల్లన్న పాటకట్టాడు. మామూలు పాటగా కట్టుకుంటున్నాడనుకుంది. పాటలో చుక్కల్ని పేర్చాడు. ముగ్గుల్ని గీశాడు. పాడి విన్పించాడు. ఎప్పుడంటే అప్పుడు పాడాడు. ఊరు సద్దుమణిగాక మరీ మరీ పాడాడు. ఓరోజు అసలు సంగతి బయటకొచ్చింది. పాటలోని పిల్ల దొంగలా వాడి మంచం దగ్గరికి వస్తుందని బూదేవి అనుకోలేదు. "ఓ సినీ సుక్కల ముగ్గుకర్రా" అని సుభద్ర వినేట్టే అంది. ఆ పిల్ల బిత్తరపోయింది. దడి తొక్కుకుంటూ పరుగుదీసింది. పాటగాడు భయపడ్డాడు. అయితే పోతూ పోతూ ఆ పిల్ల వెనుక్కి తిరిగి చూసింది. చిత్రమైన చూపు. పిట్టోడి చూపు. గాలంచూపు. చేప పడకుండా పోదు. కాని పాపమనిపించింది. అది భయపడ్డ దనిపించింది. అట్టా తనకి అనిపించినందుకు విచిత్రంగానే వుంది.

ఎండలు ముదిరిన కాలం. కావాలనే పిట్టోడి యింటి ముందు గంగిరేగు చెట్టు కిందికి వెళ్ళింది. ఆ చెట్టు నీడన మంచ మేసుక పడుకుంటుంది సుభద్ర. అక్కడకెళ్ళింది. బూదేవిని చూడగానే సుభద్ర చివుక్కున లేచి లోపలికెళ్ళబోయింది బెదురుపిట్ట. పిట్టోడి చూపొచ్చిందేగాని గుండెరాలా. చెయ్యిపట్టి కూర్చొబెట్టింది.

మంచం మీద సుభద్ర కూర్చొంటే మంచం కింద కూర్చుంది. చెక్క దువ్వెన సుభద్ర చేతికిచ్చింది. సుభద్రకి అయోమయంగా వుంది. చెక్కదువ్వెన బూదేవీ తలలో పెట్టి పేలు చూడబోయింది. "పేలు కాదే ముగ్గుకర్రా ఈపు, ఈపంతా పొంగింది. సెమట కాయలు." అని వీపుమీద రవిక పైకి లాక్కుంది. "పీటేసుకోయే అప్పా" అని చిన్నమ్మి పీట తెచ్చి బూదేవి కిచ్చింది. బూదేవి పీటమీద కూచుంది. చక్కదువ్వెన కొసతో చెమట

కాయలు ఒక్కొక్కటే గీకటం మొదలెట్టింది సుభద్ర. అదే అమ్మ అడిగుంటే చేసేది కాదు ఇంకో సందర్భంలో అయితే బూదేవి అడిగినా చేసేది కాదు. రాత్రి జరిగిన సంఘటన గుర్తొచ్చి ఒప్పుకొంది. కాకపోయినా బూదేవి పెద్దమ్మ మంచిదనే అభిప్రాయం సుభద్రకుంది.

చిన్నమ్మి ఆ మాటా ఈ మాట కలపటం మొదలెట్టింది. చిన్నమ్మి మాటలకు తలా తోకా వుండదు అమ్మ మాటాడకుంటేనే బాగుంటుందని అనుకొంటుంది సుభద్ర. కాని చిన్నమ్మి మాటాడకుండా వుండదు. ఆ మాట ఈ మాటా అయ్యాక సుభద్ర పెళ్ళిమాట ముందుకొచ్చింది. సుభద్ర ఊహించని మాట బూదేవి నోటిగుండా వింది. "ఎల్లన్నకియ్యరాదంటే లింగాలు ముచ్చట తీరుద్ది" అని బూదేవి అంది. "నాదేముందే అప్పా. అబ్బిట్టం. పిల్లిట్టం" అని అంటూ తన మాట విలువ ఈ యింట్లో ఏమీ లేదనే దెప్పి పొడుపు మాట విసిరింది. సుభద్ర బూదేవి ఈపు మీద గట్టిగా బరికింది. "ఇకచాల్లే పిల్లా దానిమీద కోపం నా వీపు మీద సూపితే ఎట్టానే" అని బూదేవి అంది. సుభద్ర నొచ్చుకుంది. "యికసాలుగాని యిట్టా కూసో" అని సుభద్రని పీటమీద కూర్చోపెట్టి బూదేవి మంచం మీద కూర్చుంది. "ఈరుబ్బాని యియ్యే సిన్నే" అంది. చిన్నమ్మి ఈరుబ్బాని యిచ్చింది. సుభద్ర జుట్టువిప్పి ఈరుబ్బాని తల్లోపెట్టి జుట్టు పాయలు పాయలు లాగటం మొదలెట్టింది. ఎంతతీసినా పేలు రాలేదు. "పేను లేని తల యిదేంతలే" అని ఈరుబ్బాని పక్కన పెట్టి చేతివేళ్ళతో తవడటం మొదలెట్టింది. రాగి వెంట్రుకలైనా ఎంత కుదురుగా వున్నాయి దీనికి అని అనుకుంది. పైకి అదేమాట అంది. "కొందరికి రాగి ఎంటికే బాగుంటదే. దీనికి నల్లెంటుకుంటే యింత బాగుండేది కాదు" అని అంది. చిన్నమ్మి అప్పుడే అనుకుంది ఆ యింట్లో పడేస్తే పిల్ల సుఖపడుతుందని. కాని పిట్టోడి ఉద్దేశం ఎట్టుందో తెలీదు.

ఎన్నెలదిన్ని పల్లెలో కాస్త గింజమెత్తుంది పిట్టోడికే. బాడిస పనిలో పిట్టోడికి పేరుంది. ఊళ్ళు తిరిగి యిళ్ళు కడతాడు. సాయంత్రానికి సుభద్రకి ఏదో ఒకటి తెస్తాడు. పిట్టోడి దృష్టిలో సుభద్ర ఎప్పటికీ చిన్నపిల్లే. సుభద్రని మాలపల్లిలో అందరి పిల్లల్లా పెంచటం లేదు. కాళ్ళకి గొలుసులు తీశాడు. చెవులకి దుద్దులు తీశాడు. ముక్కుపుటక పెట్టుకుంటాననంటే ఎరుకుల లచ్చిమిని పిల్చి దగ్గరుండి మరీ కుట్టించాడు. ముక్కుకు నప్పేలా ముక్కుపుటక చేయించాడు. ఆ చుట్టుపట్ల మాలా మాదిగ పల్లెల్లో మోకాళ్ళ కిందికి కోక కట్టింది సుభద్రే. అదో విడ్డూరంలా ఊళ్ళో చెప్పుకున్నారు. అట్టా కట్టడంపై రెడ్లు అన్న మాటలు విన్నాడు ఎదురుగా ఎవ్వరూ అనలా. అంటే పిట్టోడి నోరు మంచిది కాదని వాళ్ళకీ తెలుసు. బిడ్డకి సెప్పులు కావాల్రా పోలాయి మావా అంటే పోలడు మెత్తటి తోలు తెచ్చి ముచ్చటగా కుట్టాడు. అటూ ఇటూ చిన్న నగిషీ పని కూడా చేశాడు. మెత్తటి తోలైనా దానికి పిట్టోడు మూడు రోజులు ఆముదం రాశాడు.

ఓసారి బిట్రగుంట తిరణాలకి మోకాలు కిందకి కోక కట్టి, చెప్పు లేసుకుని, చెవులకి బుట్టలు, ముక్కుకి పుటక పెట్టి వెళ్తే, 'ఎవరు పిల్లే' యిది అని మాదిరెడ్డి సుబ్బాయమ్మ కోడలు సులోచనమ్మ అంది. పిట్టోడు కూతురని పక్కనున్నవాళ్ళంటే "కరణం బిడ్డలా వుందిరా" అని ఆ పిల్ల రంగుని, వెంట్రుకల్ని, కట్టుని తెగ ముచ్చట పడింది. దగ్గరకి పిలిపించుకుంది. ఆ పిల్ల కట్టూ బొట్టూ పదే పదే చూసింది. అట్టా జరిగిందని పిట్టోడికి తెలిసి ఆ రాత్రంతా దిష్టి తీయించాడు. చిన్నమ్మి తియ్యాల్సిన దిష్టిలన్నీ తీసింది. యింకా ఏ దిష్టి మిగిలుందో వాళ్ళకు తెలీక బూదేవిని పిల్చారు ఏయే దిష్టి తీశారో వివరంగా చెప్పారు అంతా విన్నాక బూదేవి తమలపాకు తుంచి, ఉమ్మిరాసి సుభద్ర బుగ్గమీద పెట్టింది. యిక చాలురా పిట్టోడా అంది. తమాషా ఏమిటంటే ఆ రాత్రి సుభద్రకి వళ్ళు వెచ్చ చేసింది. సులోచనమ్మ కళ్ళని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు పిట్టోడు. తెల్లారి తెలిసింది వొళ్ళు వెచ్చచేసింది సులోచనమ్మ కళ్ళు నుంచి కాదని. ఎంత మెత్తటి చెప్పయినా కరవకుండా ఆగలా. బొట్టేలు బొబ్బ లెక్కింది. అంతే. ఏందిరా పోలాయి మావా పిల్ల బొట్టేలు చెప్పు కరిసిందని పోలడు మీద తగాదాకే పొయ్యాడు. పోలడు నవ్వుకుని చెప్పు గట్టితనం అట్టాగే వుంటదిరా ఎదవనాయాల రేపటికి తగ్గిపోద్ది అన్నాడు. అట్టాగే తగ్గింది. అది "పోలాయి మామనోటి చలవే" అని పిట్టోడన్నాడు. అట్టా పెంచాడు సుభద్రని. అందుకే ఎర్రెంకడు ఆ పిల్లని ఆటలాడే తన కొడుక్కి యివ్వడని అనుమానం. కాని బూదేవి మాత్రం పిల్ల మాట కాదని పిట్టోడు ఎక్కడికి పోడని అనుకుంది. అట్టా అనుకోటానికి కారణం లేకపోలేదు. ఎల్లన్న మీద సుభద్రకి ఎంత మనసుందో తనకి తెలుసు. ఆ పిల్ల కంట నీళ్ళు కనబడితే పిట్టోడి అంత గట్టి గుండె ఎట్టా కొట్టుకుంటుందో అంతకన్నా బాగా తెలుసు.

అక్షరాల బూదేవి అనుకున్నట్టే జరిగింది. కోళ్ళదిన్ని సంబంధం చూశాడు పిట్టోడు. పప్పుకూటికి రేపు వస్తారని యింట్లో అన్నాడు. అప్పుడు కుండ బద్దలు చేసినట్టు చెప్పింది సుభద్ర. చేసుకుంటే ఎల్లన్ననే చేసుకుంటానంది. అప్పుడు ఆలోచించాడు పిట్టోడు ఎల్లన్నని గూర్చి నింపాదిగా. అటు ఎర్రెంకడి కుటుంబానికి, యిటు బూదేవి కుటుంబానికి ఒక్కడే బిడ్డ. తనకీ ఒక్కటే కూతురు ఆటలంటూ ఊళ్ళు తిరుగుతాడు. తిరగనీ, కొంపకొస్తే చాలు. వాడేం చాకిరీ చేసి సుభద్రని చాకాల్సిన పనిలేదు. అట్టా ఆలోచించాక చిన్నమ్మితో తన ఆలోచన చెప్పాడు. చిన్నమ్మి ఆ మాట బూదేవి చెవులో వేసింది. బూదేవి, ఎంకట నరుసు, లింగాలు పెద్దమాల పిట్టోడింటికి పప్పుకూటికి వెళ్ళారు. మూడు రూపాయల అరణాల ఓలి, కాళ్ళకి గొలుసులు, చెవులకి కమ్మలు పిల్లకి పెట్టేటట్టు మాట్లాడుకున్నారు. ముహూర్తం పెట్టుకోవడం, పెళ్ళి జరగడం రోజుల్లోనే జరిగి పోయింది. ఎల్లన్న సుభద్ర తన దగ్గరే వుంటారని అంది బూదేవి. అట్టాగేనన్నాడు ఎర్రెంకడు.

# 9

సుభద్ర అతని ఆటకి, పాటకి అడ్డురాలేదు. బూదేవి మాత్రం ఎల్లన్న పగలంతా ఎక్కడ తిరిగినా రాత్రికి యింటికి చేరితే బాగుండుననుకుంది అదేంటో గాని వ్యాపారమంటూ ఎంకట నరుసు ఊళ్ళు తిరుగుతున్నాడు. ఆటలంటూ ఎల్లన్న ఊళ్ళు తిరుగుతున్నాడు. యింట్లో ఇద్దరు ఆడాళ్ళే మిగిలిపోతున్నారు. ఎందుకో బూదేవికి ఈ పద్ధతి అంతగా నచ్చటం లేదు సుభద్రని మాత్రం చిన్నమ్మి కన్నామిన్నగా చూసుకొంటుంది. ఎల్లన్నకన్నా సుభద్రే తనకి చాలా దగ్గర దానిలా, కడుపున పుట్టిన దానిలా అన్పిస్తుంది. దీని కడుపు ఎంత తొందరగా పండితే అంత బాగుండు అనుకొనేది. బూదేవి కోర్కె తీరుస్తూ సుభద్ర నీళ్ళోసుకుంది. మగబిడ్డని కంది. శివయ్య అని నాగన్నే పేరు పెట్టాడు. బూదేవికి సుభద్రకి శివయ్యే ప్రపంచమయ్యాడు.

ఎల్లన్నకు చిన్నప్పుడు మనస్సు మీదపడ్డ ముద్ర చెరిగిపోలేదు. చిన్నవాడు గానే నాగన్న దగ్గర పాటకున్న పట్టు నేర్చుకున్నాడు. అడుగుకున్న లయ క్రమబద్ధం చేసికొన్నాడు. పెద్దయ్యాక చెంచు నాటకం నేర్చుకోవాలని పట్టుపట్టాడు. నాగన్నతో పోరు పెట్టాడు. నాగన్నకి ఉరుముల నృత్యంతోనే కాదు, రాయలసీమ బయలాటతో కూడా పరిచయముంది తనని యింతవాణ్ణి చేసిన చంద్రప్ప తక్కువ కళాకారుడేం కాదు. ఆయనకి వీధి భాగోతం తెలుసు. ఒక్క మాటలో చెప్పుకొంటే జానపద రూపం మీద చంద్రప్పకి మంచి పట్టుంది. ఆ పట్టునే ఉరుముల నృత్యంతోపాటు నాగన్నకి నూరిపోశాడు. చంద్రప్పకి సహజంగానే పండితుల మీద కోపం వుండేది. ఆ కోపంలో అనేక కథలు చెప్పేవాడు. చెప్పేవాడు అనేకన్నా అల్లేవాడు అని అనొచ్చు. చంద్రప్ప తనకి చెప్పినవన్నీ నాగన్న ఎల్లన్నకి చెప్పాడు. వాటిని ఆటకి పాటకి జతచేశాడు.

"మరాటోడు, మనోడే. తోలుబొమ్మల్తో పురాణాన్నీ చెప్పాడు. వాడు తయారుచేసిన కేతుగాణ్ణి, బంగారక్కని తయారుచెయ్యమను ఈ పండితుల్ని. వాళ్ళ రాధ, వాళ్ళ కృష్ణుడు మన బంగారక్క కేతుగాళ్ళ ముందు ఎందుకు పని కొస్తారు." అట్టా చెప్తూ వుండేవాడు. అంతా చెప్పి అర్థమైందా అని అనేవాడు. అర్థంకాలా. అర్థం కావాల. మాట చిన్నదే. తవ్వితే చాలా ఉంది. పూడ్చుగలిగితే ఎంతో లోతుంది. తవ్వాలి. తట్టలు తట్టలు మట్టి తవ్వాలి. పెద్ద పెద్ద గొయ్యిలు పూడ్చాలి. అట్టా చెప్పుక పొయ్యేవాడు. ఎల్లన్న చూపంతా నాగన్నమీదే పెట్టి వినేవాడు.

ఓరోజు "బ్రహ్మదేవుడు పెద్ద కంత్రీ" అంటో ఓ కథ చెప్పాడు. బ్రహ్మదేవుడు దేవతలకి ఓ నాటకం రాసి యిచ్చాడు. సురాసుర పురాణం. నాటకం మొదలైంది. ప్రేక్షకుల్లో దేవతలున్నారు, రాక్షసులున్నారు. తన సహజమైన బాణీలో "సురులు అనగా దేవతలు, అసురులు అనగా రాక్షసులు అని చెప్పేవాడు నాగన్న. అట్టా చెప్తున్నప్పుడు అర్థాలు వాళ్ళకే కాదు మనకీ తెలుసు అన్నట్టు వుండేది ఆ పట్టుదల.

నాటకం మొదలైంది. సగంలో కొచ్చింది.

ప్రేక్షకుల్లో కలకలం బయల్దేరింది. రాక్షసుల్లో అసహనం మొదలైంది. నాటకంలో తమకి ద్రోహం జరుగుతోంది. రచయితగా బ్రహ్మ కుట్ర చేశాడు. దర్శకుడిగా దేవతల పక్షం వహించాడు. రాక్షసుల పాత్రలు ఓడిపోతున్నాయి. రాక్షస ప్రేక్షకులు ఓర్చుకోలేకపోయారు. తిరగబడ్డారు. దేవతల్ని దొరికినవాళ్ళని దొరికినట్టు తన్నారు. దేవతలు నాలుగు దిక్కులా పరుగుతీశారు. "ఒరే ఎల్లన్నా ! ఆడు, ఎవుడు బెమ్మ జగత్‌కంత్రీ ... గోసే వూడిపోతుంటే పరుగెత్తి పరుగెత్తి బూమ్మీద పడ్డాడు, గంగవొడ్డున సెంబాటకి పోబొయ్యాడు. గంగ వూరుకుంటదా .... ఎవురామె. ఎవరి తల్లామె. మన తల్లి. ఉరుములోళ్ళ తల్లి. "బెమ్మా. పాడు పని చెయ్యమాక" అంది. అంతేకాదు. మీ ఋషులు నన్ను గబ్బు చేస్తున్నారు. వాళ్ళని కూడా తోలుకుపోరా అంది. బెమ్మ బిక్కమొహం వేశాడు. గంగతన వెయ్యినొక్క పుత్రుల్ని, వెయ్యినొక్క కూతుర్లని పిలిచింది. వెయ్యినొక్క పుత్రులు అప్పుడే పుట్టతేనె పిండుతున్నారు. వెయ్యినొక్క కూతుర్లు అప్పుడు దుంపకల్లాం తిరగగొడుతున్నారు. అమ్మ గొంతు వినగానే గంగ బిడ్డలు చేసే పని పక్కన పెట్టి తల్లి వొడ్డున గుమ్మిగూడారు తల్లీ పదివేల వందనములన్నారు. మమ్మల్ని పిలిచిన కారణం సెలవొసంగమన్నారు.

అప్పుడు బిడ్డల్ని చూసింది గంగ. గుడ్లల్లో నీళ్ళెట్టుకుంది. బిడ్డలు తల్లడిల్లిపోయారు. తల్లికొచ్చిన బాధ తమ బాధ అన్నారు. "అమ్మా రావమ్మా, ఆరి గంగమ్మా అపరంజి కుందనమె బంగారు బొమ్మా. నీ బిడ్డలమ్మా నీ పాపలమ్మా. సెలవియ్యే మా తల్లి సెలవియ్యవమ్మా." అట్టా తల్లిని వేడుకొన్నారు. తల్లి కరిగిపోయింది. వెల్లువ అయ్యింది. బిడ్డల వొళ్ళు తాకింది. బిడ్డల గొంతు తడిపింది. తరమండి గబ్బు పండితులనంది. గంగ బిడ్డలు బ్రహ్మని వాడి రుషుల్ని ముల్లోకాలు తిప్పారు. తరిమితరిమి తల్లి దగ్గరకొచ్చారు. బిడ్డల్ని చూసి తల్లి పొంగి పొరలింది. పొంగిన పాయొకటి సముద్రంలో కలిసింది. పొంగిన పాయొకటి చేలన్ని తడిపింది. గంగ శాంతించింది. కాని ఎల్లన్నా ! గంగ బిడ్డలు తరిమిన పండితులు కూడబలుకొన్నారు. నాటకానికి తెరలు కట్టారు. తెరల చుట్టూ డేరాలు కట్టారు. దేవాలయం గేట్లు మూసి సురాసుర పురాణం ప్రదర్శించారు. అర్థమయిందా. జనం మధ్య ఆడే దమ్ము లేదు ఆళ్ళకి. మనం అట్టా కాదు. మన ఎగురుడు జనం మధ్యే. బంగారక్క తెరమీద చిందేసినా, ఆలిసిగాడు ఆస్యం చెప్పినా, నరసింహస్వామి యాటమార్గానికి

వెళ్ళినా అంతా జనం మధ్యే."

అట్టా చంద్రప్ప చెప్పిన పురాణ రహస్యాలన్నీ ఎల్లన్నకి చెప్పేవాడు నాగన్న. అచ్చు చంద్రప్ప అన్నట్టే అర్థమయిందా అనేవాడు సంగతి చిన్నదేకాని ఎంత తొవ్వితే అంత లోతుంది అనేవాడు. ఎంత పూడ్చితే అంత గుంటుంది అనేవాడు. తవ్వాల, పూడ్వాల అనేవాడు ఎల్లన్న వినేవాడు. మనసు పెట్టి వినేవాడు. తవ్వడంలో అంత కష్టముందని అనుకోలేదు. పూడ్చటం అంత పెద్దపని అనుకోలేదు.

ఓ రోజు నిండు వెన్నెల నిండా కురుస్తున్నప్పుడు, ఎన్నెలదిన్నె యిసుక దిబ్బల మీద భాగోతం జట్టును కూర్చోబెట్టాడు.

పగలంతా చాకిరీ చేసేవాళ్ళు. రాత్రి యిసుక తిన్నెల మీదకు చేరేవారు. నాగన్న చెప్తుంటే నేర్చుకొనేవాళ్ళు. చెంచులక్ష్మి నాటకం పుస్తకం ముందు వుంచుకోరు. నాగన్న ఏది చెబితే అది చెంచులక్ష్మి మాటా పాట. అట్టాగే అన్ని పాత్రలకి. పారం రావడానికి రెండు నెలలు పట్టింది నాటకమంతా ప్రతి ఒక్కరికి వచ్చి వుండాలి. ప్రతి ఒక్కడూ ఏ పాత్రయినా వెయ్యాల్సి వుంటుంది. మరో నెల అడుగులకి సరిపోయింది. మొత్తానికి మూడు నెలల్లో నాటకం పూర్తయింది.

మొదట ఎల్లన్నని చెంచులక్ష్మి పాత్ర వెయ్యమన్నాడు నాగన్న. కాని నరసింహస్వామి పాత్రకి మనిషి దొరకలేదు. అందుకని ఆ పాత్ర ఎల్లన్నే నేర్చుకున్నాడు. ఆ తర్వాత ఆ పాత్రే ఎల్లన్న పేరుతో చుట్టుపట్ల మారుమ్రోగింది.

ఎన్నెలదిన్ని పల్లెలో బాగోతం జట్టుకట్టారని చుట్టుపక్కల తెలిసిపోయింది. ఎన్నెలదిన్ని ఊళ్ళో అదో వింతైంది. నవ్వులాటైంది. పనిలోకి వచ్చిన వాళ్ళతో ఎగతాళిగా అనేవాళ్ళు. రచ్చ దగ్గర అదో తమాషా చర్చయింది.

మొదటి ప్రదర్శన ఎన్నెలదిన్ని మాలపల్లెలో జరిగింది. నరసింహస్వామిగా ఎల్లన్న కట్టాడు. బూదేవికీ చిన్నమ్మికి మధ్యలో కూర్చొని ఎల్లన్న పాటని, ఆటని రెప్పలార్పకుండా చూస్తూ వుండిపోయింది సుభద్ర. "యాటా మార్గము నేను ఎలదీరో పోయొత్తు అది లాచ్మి" రగడ జరిగేటప్పుడు "నాతో ఎప్పుడన్నా అట్టా సెప్పేడా యాడకన్నా ఎల్లెప్పుడు" అని అనుకుంది. "చెట్టు లెక్కగలనే వో చెంచిత పుట్టలెక్కగలనే" అని చెంచులక్ష్మి దగ్గర అంటుంటే అన్నీ డంబాలు, చింత చెట్టు ఎక్కి చింత చిగురు కొయ్యమను, అయ్య గొప్ప అని లోలోపలే అనుకొంది.

"ఈడికి సింతసెట్టు ఎక్కటమే రాదు" అని పైకి బూదేవితో అంది. బూదేవి మాత్రం సుభద్రని దగ్గరకి లాక్కుంది. సుభద్రా బాగా దగ్గరకి జరిగింది. నిజానికి ఆరోజు ఆటని ఎల్లన్న, ఎల్లన్నతో పాటి ఆటగాళ్ళు కాదు నడిపించింది. నాగన్నే నడిపించాడు. సూత్రధారుడు మొదలుకొని అవసరమైన ప్రతి పాత్ర చేశాడు. రాత్రి అన్నాలు తిన్నాక మొదలైన ఆట తెల్లవారిందాకా సాగింది.

యిక్కడ ఆట ఆడటం కాని, అది ఏ స్థాయిలో ఆడిందికాని గొప్పకాదు. చుట్టుపట్ల మాలామాదిగ పల్లెల నుండి జనం వచ్చారు. రాయలసీమలో అట్టా ఆ కులం వాళ్ళు ఆడుతారని తెలుసు. ఉత్తరాదిన కూడా అక్కడక్కడా ఆడుతారని తెలుసు. తెలంగాణాలో మాదిగల సిందు భాగోతం, కోస్తా రాయలసీమల్లో మాలల వీది బాగోతం వినటానికైతే వినున్నారు. ఎన్నెలదిన్ని ప్రాంతంలో అది కొత్తే. అందుకే కోళ్ళదిన్ని, పక్కిల దిన్ని, చింతల గుంట, ఆ చుట్టుపట్ల వూళ్ళనుంచి జనం ఎన్నెలదిన్ని వచ్చారు. ఎన్నెలదిన్ని మాలపల్లె, మాదిగపల్లె చుట్టాలతో నిండిపోయింది. చుట్టాల్ని సంతృప్తి పరచడానికి కోళ్ళని కోశారు. అసలే వెన్నెలరాత్రి వెన్నెలంతా ఎన్నెలదిన్ని పల్లెలోనే కురిసినట్టుంది. ఆడాళ్ళు ఉన్నంతలో మంచి గుడ్డలు కట్టారు. తల చిక్కు తీసుకున్నారు. తలనిండా పూలు పెట్టారు. బూదేవికైతే కాలు బూమ్మీద నిలవటం లేదు. అల్లుడు మొఖానికి అర్దళం పూసి, భుజకీర్తులు, కర్ణాభరణాలు, హారం, కత్తి మొదలైన అలంకారాలు చూసి చంకలో ఎక్కి "కనబడటం లేదే అత్తా" అన్న ఎల్లన్నని గుర్తు తెచ్చుకుంది. నవ్వొచ్చింది. దిష్టికి తియ్యాలనుకొంది. ఆట అయ్యాక తీద్దామనుకొంది. నాగన్న మాత్రం టెంకాయపై కర్పూరం వెలిగించి ఎల్లన్నకి నాలుగు చుట్లు తిప్పి టెంకాయ నేలకేసి కొట్టాడు. నాగన్నది గొప్ప మనసనుకొంది బూదేవి.

గతంలో దూరంగా నక్కి నక్కి కూర్చొని చూసేవాళ్ళు యిప్పుడు "ఆటకి వదిలిన గుండ్రని చోటు" పక్కగా పీటలు, పట్టలు తెచ్చుకొని కూర్చొన్నారు. అదో విచిత్రమైన అనుభూతి. ఆట అంత దగ్గరగా కూర్చొని చూడటం కొత్తగానే వుంది. కూర్చొన్న మనిషి పైకిలేసి కాస్త పనిమీద వెళ్ళి తిరిగివస్తే యింకొకరు కూర్చుంటున్నారు. తిరిగొచ్చి తన చోటులో మరొకరు కూర్చొంటే కూర్చొన్నవాళ్ళని లెమ్మనటం, అక్కడ గొడవ జరగడం, అరుపులు, తిట్లు చాలా స్వేచ్ఛగా సాగిపోతున్నాయి. పిట్టోడు కర్ర తీసుకొని కూర్చొండహే అని కర్ర గాల్లో ఆడిస్తుంటే "అబ్బో అచ్చిరెడ్డిరో" అని జనం అన్నారు. ఊళ్ళో ఏ జాతర జరిగినా, చివ్వరికి "పందారం" జరిగినా, "సద్ది" జరిగినా అచ్చిరెడ్డి అట్టాగే కర్ర తీసుకొని అదమాయిస్తూ వుంటాడు. అదో పెద్దరికం. అదో పెత్తనం. నాగన్నకి మాత్రం ఆ గోలకి ఆనందంగా వుంది. కారణం ఫలానా అని చెప్పలేడు.

ఆట మొదలు పెట్టేముందు వింత జరిగింది. ఆటకన్నా అదే పెద్ద చర్చయింది చుట్టుపక్కల. గణనాధుని ప్రార్థన అయిపోయింది. పోతులూరయ్యపై గీతం కూడా అయి పోయింది. అప్పుడు సూత్రధారుడు నాగన్న అన్నాడు. "అరే సేవకా" అని. తాళం కొట్టేవాడు ముందుకొచ్చి 'అయ్యా' అన్నాడు. "అజారుమందున జాగ్రతా వున్నవట్రా ' అన్నాడు. "వున్నానయ్యా. మీరు తొందరగా రండయ్యా సెంబాట తొందరపెడతంది" అని అన్నాడు. అంతా గొల్లున నవ్వారు. ఆ నవ్వులు అయ్యేంతవరకూ ఆగాడు నాగన్న. అట్టా ఆట చూస్తో స్వేచ్ఛగా నవ్వుతున్నారు జనం. కరణం చూస్తాడనే భయంలేదు.

పెద్దకాపులు వింటారనే జంకులేదు. ఆట వాళ్ళది. ఆడేవాళ్ళు, ఆటచూసేవాళ్ళు వాళ్ళే. నవ్వులన్నీ ఆగాక అన్నాడు నాగన్న ఆత్మ గౌరవాన్ని ఆకాశానికి ఎత్తి పట్టేమాట. సంప్రదాయాన్ని మరో మలుపు తిప్పిన మాట.

"అరె సేవకా"

"అయ్యా"

"ఘనత వహించిన పెద్దమాల, అంతే ఘనత వహించిన మాదిగ పెద్ద వచ్చి తమ స్థానాలను అలంకరించారటరా"

అదేమాట

ఆ ఒకే ఒక్కమాట ...... ..

నిశ్శబ్దం. జనం విన్నమాట నిజంగా విన్నామా అనే సందేహం ఏమిటన్నాడు. ఆ ! అట్టా అన్నాడా ! జనంలో సంభ్రమం. వెన్నెల మబ్బులు ఎందుకో హడావిడిగా పరిగెత్తిన ఆకాశ చిత్రం పిట్టోడి నెత్తురులో ఎందుకో తెలీదు, తెలిసినా సరిగ్గా అర్ధంకాదు తీవ్రమైన సంచలనం.

"మాటాడవేం రా సేవకా ...... ఘనత వహించిన పెద్దమాల, అంతే ఘనత వహించిన మాదిగ పెద్ద వచ్చినారా లేదా ......"

మళ్ళీ అన్నాడు. యిప్పుడు జనం స్పష్టంగా విన్నారు.

"వచ్చుచున్నారు స్వామి"

జనం వెనక్కి చూశారు. ఆ మాట అనేదాకా రావద్దని నాగన్న ఆ యిద్దరికీ ముందే చెప్పాడు. ఆటకి దూరంగా ఒక దిబ్బమీద కూర్చొన్నారు ఆ యిద్దరు. తమని పిలిచేంతవరకు వెనకటి పద్ధతిలోనే దూరంగా కూర్చొన్నట్టుగానే వుంది వాళ్ళకి. పేర్లు పిలిచాక అట్టా కాదు కదరా అని అనుకొన్నారు. ఆ కొద్దిదూరం నడవటం వాళ్ళకి కష్టమనిపించింది. అడుగులు ఎట్టా వెయ్యాలో అర్థం కావడంలేదు. కొత్తగా వుంది. జనం వాళ్ళకేసి చూస్తుంటే వింతగా వుంది.

"మనకి యిద్దరు కరణాల్లా పిట్టోడా" అని ఎవరో అన్నారు. పెద్ద పెట్టున నవ్వులు. ఆ నవ్వుల మధ్యలో పెద్దలు నడకపెంచి మహా ప్రస్థానం ముగించినట్టు ముందుకొచ్చి కూర్చొన్నారు. ఆట మొదలైంది.

నరసింహస్వామి ఆదిలక్ష్మితో వేట మార్గానికి వెళ్తానన్నాడు. ఆదిలక్ష్మి వప్పుకోలేదు. ఆఖర్న వప్పుకుంది. అడవిలో నరసింహస్వామి చెంచులక్ష్మిని చూశాడు. యిష్టపడ్డాడు. చెంచులక్ష్మి తనకి జోడుగా వుండాలంటే చెట్టు లెక్కడం మొదలు పుట్టతేనె పిండటం దాకా మామూలు అడవి కుర్రాడు ఏం చేస్తాడో అన్నీ చేస్తాడో లేదో తెలుసుకుంది. నరసింహస్వామి అన్నీ చేస్తానన్నాడు. ఆటలో సజీవ పాత్రలే కన్పిస్తాయి. దేవుళ్ళు, దేవతలు, మంత్రాలు మాయలు కాదు. దైనందిన జీవితమే ఆ పాత్రల మాటల్లో కన్పిస్తుంది. చెంచులక్ష్మి అట్టా

అడిగేటప్పుడు జనంలో ముసలి సుబ్బరత్తం "కుప్ప నురుత్తాడో లేదో కనుక్కోయే పిల్లా" అంది.

"ఎర్రెంకా మీవోడికి కుప్ప నురవటం వచ్చుట్రా" అని ఎవరో అన్నారు నరసింహ పాత్రధారి ఎల్లన్న తడుము కోకుండా అన్నాడు "అదియునూ వొచ్చు" అని. "డంబాలే పెద్దమ్మా" అని సుభద్ర బూదేవితో అంది "చితనాపి పిల్ల" సుభద్ర బుగ్గలు తిప్పుతూ బూదేవి అంది. దాదాపు బూదేవి వొళ్ళో తల పెట్టి సుభద్ర చూస్తూ వుంది

చెంచులక్ష్మి తన తండ్రిని అడగమని నరసింహ స్వామికి చెప్పింది చెంచులక్ష్మి తండ్రికి నరసింహస్వామికి మాటలు మొదలయ్యాయి.

చెంచులక్ష్మి తండ్రి 'ఓలి' ఎంతనేది చెబుతాడు. సేరు వక్కలంటాడు. అయిదుకట్ల ఆకులంటాడు. ఆ మాట అన్నప్పుడు "సేరు వక్కలు కాదురా కోటిగా సేరున్నర" అని జనంలోంచి ఎవరో అందించారు కోటిగాడు చెంచులక్ష్మి తండ్రి పాత్రధారి. "సేరున్నర కాదోయ్ రెండు సేర్లు" మరొకరన్నారు. అది పక్కెలదిన్ని మాట. "కోళ్ళదిన్నిలో సేరున్నరే." యింకొకరన్నారు "చింతలగుంటకు వక్కలు కాదు లెక్క .. ఆకులు, ఆకులు అయిదుకట్లు కాదు ఏడు కట్లు" యింకొకరన్నారు "ఎన్నెలదిన్ని లెక్కే లెక్క", "పక్కెలదిన్ని లెక్కె చెల్లు" .. . "ఓలి" మీద పెద్ద చర్చ మొదలైంది జనంలో.

ఎల్లన్నకి ఆశ్చర్యంగా వుంది.

నాగన్నకు ఆనందంగా వుంది.

కోటిగాడు ఏ లెక్కచెప్పాలో అర్థంకాక చూస్తున్నాడు

అసలైన నాటకం అట్టా జరుగుతోంది. జనం మధ్య జనంతో సహా .

"యింతకూ ఏ ఓలి కోరుకుందువు పర్వత రాజా" నరసింహ పాత్రధారి ఎల్లన్న అన్నాడు.

"అన్ని కలిపి సెప్పురా కోటిగా" పెద్దమాల "పతానం మూట" విప్పుతున్నట్టు తీర్పు చెప్పాడు.

సూత్రధారి నాగన్న నరసింహస్వామి వైపు పెద్దమనిషిగా మాట్లాడటం మొదలు పెట్టాడు.

"అయితే రాజా ఎన్నెలదిన్ని ఆచారం ప్రకారం, పక్కెలదిన్ని ఆచారం ప్రకారం, కోళ్ళదిన్ని, చింతలగుంట ఆచారం ప్రకారం అన్నీ కలిపి ఎన్ని శేర్లు వక్కలైతే అన్ని సేర్ల వక్కలు, ఎన్ని కట్టల ఆకులైతే అన్ని కట్టల ఆకులు యిచ్చెదము. నీ కుమార్తెను మా నరసింహస్వామికిచ్చుటకు సమ్మతమేనా" అని అన్నాడు

జనం అట్టా బాగుందన్నారు.

చెంచులక్ష్మికి ఆదిలక్ష్మికి మధ్య సవతుల పోట్లాట అయితే చెప్పనవసరం లేదు. అదో సందడి.

తెల్లవారిందాకా సాగింది ఆట. తృప్తిగా చూశారు. అంతకన్నా మించి స్వేచ్ఛగా చూశారు.

ఆట పూర్తయ్యాక పక్కెలదిన్ని మాలపల్లి ఆట మా పల్లెలో ఆడాలన్నారు. కోళ్ళదిన్ని ఆ తర్వాత మా పల్లె అన్నారు. చింతలగుంట మా పల్లె మాటేందన్నారు.

ఎల్లన్న నాగన్న యిష్టమన్నాడు. నాగన్న మూడూళ్ళు ఒప్పుకున్నాడు. మూడూళ్ళలో ఆట గొప్పగా వుందన్నారు. చింతలగుంట కొచ్చేసరికి నరసింహస్వామి విశ్వరూపం ఎల్లన్నలో స్పష్టంగా కన్పించింది. ఆదిలక్ష్మితో నరసింహ స్వామికి, ఉగ్ర నరసింహస్వామికి, చెంచులక్ష్మితో నరసింహస్వామికి ఉన్న తేడా చాలా స్పష్టంగా అతని నటనలో, పాటలో కన్పించిందని నాగన్న అనుకొన్నాడు. ఎల్లన్న సహజ నటుడు. సామాన్యుడు మాత్రం కాడు. అసలు గీతం, సంగీతం, నృత్యం, అభినయం కలిసిన మొత్తం వీధి భాగోతమే ఓ గొప్ప రూపకం. ఓ సమాజం. ఓ సంస్కృతి. దేవతల్ని దేవుళ్లని అచ్చు పల్లెటూరివాళ్లలా మలుచుకొంటో, మాటాడుతో నడిచిన జనం మధ్య అడ్డుతెరలు లేని ఓ సజీవప్రక్రియ.

చూస్తే ఎన్నెలదిన్ని ఆట్లెలడి అటే చూడాలనే మాట చుట్టుపక్కల విన్పిస్తోంది. చెంచునాటకం తర్వాత ప్రహ్లాద నేర్చుకొన్నారు. హిరణ్యకశిపుడుగా ఎల్లన్న జనంలో నిల్చిపొయ్యాడు. గర్భిణీ స్త్రీలు ఆటకు రావద్దని దండోరా వేసే స్థాయికి ఎదిగాడు. నాగన్న చివ్వరిరోజుల్లో పోతులూరి వీరబ్రహ్మంగారి నాటకం మొదలుపెట్టాడు.

ఆటెల్లడి పేరు ఓ వైపు పెరిగిపోతుంటే మరోవైపు ఓ విచిత్రమైన వాతావరణం అగ్రకులాల్లో మొదలైంది. అది ఒక్క ఎన్నెలదిన్ని అగ్రకులాల పెద్దల్లోనే కాదు, పక్కెలదిన్ని, కోళ్ళ దిన్ని, చింతలగుంట, యింకా ఆ చుట్టుపక్కల ప్రతి ఊళ్లో ఆ వాతావరణం వాళ్లకే మింగుడు పడని పద్ధతిలో మొదలైంది ఎన్నెలదిన్ని ఊరి పెద్దలకైతే అదో తలకొట్టేసిన సమస్యగా ముందుకొచ్చింది.

చంద్రప్ప అన్నట్టు. విషయం చిన్నదే.. కాని చాలా లోతు వుంటుంది. పూడిస్తే చాలా మట్టిపట్టుతుంది.

అటెల్లడి ఆట మాలామాదిగ పల్లెల్లోనే ప్రదర్శన జరుగుతోంది. అది సమస్యకాదు. వాళ్లని పిలిచి ఊళ్లో ప్రదర్శన ఎట్టాగూ ఏర్పాటు చేసుకోరు. ఆటెల్లడి పేరు మాలా మాదిగల్లోనే కాదు యితర కులాల్లోకూడా విన్పిస్తోంది. ఎన్నెలదిన్నిలో ప్రదర్శన అయ్యాక బాగుందని తెలుసుకొని మొదట్లో, చాకల్లు, మంగలివాళ్లు, కుమ్మర్లు పక్కూరికి ఏదో పనిమీద పోయినట్లు పోయి చూశారు. తర్వాత ఆటకే వెళ్తున్నట్టు వెళ్లారు. అంతటితో ఆగలేదు ఎన్నెలదిన్ని పల్లెకే వెళ్లటం మొదలెట్టారు. అయినా సరే అదీ పెద్దపట్టింపుకాదు. రెడ్లు మాత్రం కదల్లేదు. అచ్చిరెడ్డికి అది చాలు.

సమస్యంతా ఎక్కడొచ్చిందంటే సహజంగా ఆటకు ముందు "కరణంగారు వచ్చారా, కాపులు వచ్చారా" అని సూత్రధారుడు అడగటం వాళ్ళు వచ్చిన తర్వాతే ఆట మొదలుకావటం

ఆనవాయితీ. ఒక్కోసారి ఆలస్యంగా వచ్చిన రెడ్డి మళ్లీ మొదలెట్టమంటే ఆట మళ్లీ మొదలయ్యేది. కానీ ఆటెల్లడి ఆటలో సూత్రధారుడు నాగన్న "ఘనత వహించిన కరణంగారు వచ్చారంట్రా" అని అనటం లేదు. ఘనత వహించిన 'పెద్దమాల' అంతే ఘనత వహించిన 'పెద్దమాదిగ' వచ్చారంట్రా' అంటున్నాడు. ఆ యిద్దరూ కరణాల్లాగా వచ్చి కూర్చుంటున్నారు. అదే పెద్ద సమస్య అయింది. ఎన్నెలదిన్ని పిల్ల కరణానికి, అచ్చిరెడ్డికి, యింకా కొందరు పెద్దలకి తలకొట్టేసినట్టయింది. అగ్రకుల అహంకారం ఆ మార్పుని జీర్ణించుకోలేకపోయింది. వాళ్ళదృష్టిలో నాగన్న, ఎల్లన్నలు పెద్ద దుర్మార్గుల్లా కన్పించారు. మాలాణ్ణి, మాదిగాణ్ణి కరణాల స్థాయిలో, కాపుల స్థాయిలో పొగిడే దుర్మార్గం సహించకూడదనుకొన్నారు. ఆ యిద్దరికీ బుద్ధి చెప్పాలను కొన్నారు.

దానికి రంగం దిబ్బలమిట్టలో సిద్ధం చేశారు. చింతలగుంటకి మైలుదూరంలో దిబ్బలమిట్ట ఉంది. అది అచ్చిరెడ్డి అత్తగారి వూరు. అచ్చిరెడ్డి మామ బుక్కిరెడ్డంత మూర్ఖుడు ఆ చుట్టుపక్కల లేడనే పేరుంది. మాటా మాటా వచ్చి ముక్కాల పీటతో భార్యని కొడితే ఆమె చచ్చివూరుకుంది. కనీసం ఆమె పుట్టింటివాళ్లకి కబురుకూడా చెయ్యకుండా దహనం చేశాడు. చాకలి మంగయ్య కయ్య తన చేను పక్కనుంటే అది అతను తన చేలో కలిపేదాకా అతని అంతు తేల్చాడు. పెద్దకరణం బతికివున్న రోజుల్లో పెద్దకరణం దగ్గరకు వస్తూపోతూ వుండేవాడు. అప్పుడే అచ్చిరెడ్డిని చూశాడు. కూతుర్ని యిచ్చి కూతురితోపాటు అయిదెకరాలు మాగాణి, రెండెకరాల మెట్టా యిచ్చాడు. ఓసారి ఎన్నెలదిన్ని కూతురు దగ్గరకొచ్చినప్పుడు పిల్లకరణం అచ్చిరెడ్డి ఆటెల్లడి ఆట సంగతి చెప్పుకొంటుంటే విన్నాడు. అంతా వినినేనైతే ఆ యిద్దరు కొడుకుల్ని అడ్డంగా నరికేవాణ్ణని అన్నాడు. ఆట దిబ్బలమిట్టలో వుందని తెలిసి ఆ మాట అల్లుడికి మనిషి ద్వారా చేరవేసి ఏం చెయ్యమంటావో వచ్చిన మనిషి ద్వారా చెప్పి పంపమన్నాడు. మామకి నేను చెప్పేదేంటి ఆయన ఎట్టాఅనుకుంటే అట్టా చెయ్యమని అచ్చిరెడ్డి వచ్చిన మనిషితో చెప్పి పంపాడు.

బుక్కిరెడ్డి నాటకం ముందురోజు మాలామాదిగ పెద్దల్ని పిలిపించాడు. అటెల్లడి ఆట దిబ్బలమిట్టలో జరిగితే రెండు పల్లెలు బూడిద అవుతాయన్నాడు. అంతకన్నా ఎక్కువ మాట్లాడటం వీళ్లతో అవసరం లేదనుకొన్నాడు. అయినా అంతగా ఆట ఆడాలనుకొంటే పెద్దమాలని, మాదిగ పెద్దని కరణాల్ని, కాపుల్ని పిల్చినట్టుపిలవకూడదు. అట్టాపిలవకుండా వుంటే ఆడుకోవచ్చని చెప్పి యికవెళ్లండన్నాడు. ఆ రాత్రికి రాత్రే దిబ్బలమిట్ట నుండి మనిషి ఎన్నెలదిన్ని వచ్చాడు. బుక్కిరెడ్డి అన్నమాటలు చెప్పి ఆట ఆ తర్వాత పెడ్డాం ఎల్లన్నా అన్నాడు. ఎల్లన్న నాగన్నకేసి చూశాడు. నాగన్న ఆలోచనలో పడ్డాడు. రంగం మరో మలుపు తిరుగుతుందనుకొన్నాడు.

యిప్పటిదాకా నాగన్నగాని, ఎల్లన్నగాని, పెద్దమాలని, మాదిగపెద్దని ఆటకుముందు సగౌరవంగా ఆహ్వానించడం అంత తీవ్రమైందిగా పరిగణించబడుతుందని అనుకోలేదు. బుక్కిరెడ్డి షరతు విన్నాక నాగన్నకు చంద్రప్ప మాటలు మళ్లీ గుర్తొచ్చాయి. తవ్వాల్సింది,

పూడ్చాల్సింది చాలా వుందనుకున్నాడు. తనకు తెలియకుండానే తన జీవితం మరోవైపు నెట్టబడు తుందనుకున్నాడు. ఎల్లన్నకేసి చూశాడు. ఎల్లన్న జాలు చేప కాదనుకున్నాడు. జాలుకు ఎదురీదే చేప అనుకున్నాడు. అట్టా ఈదుతున్నట్టు ఈ చేపకు తెలీదనుకున్నాడు. నిజానికి యిప్పుడు ఏం జరుగుతుందో వివరంగా ఎల్లన్నతో చెప్పాలనుకున్నాడు. పిట్టోడిని పిలిచాడు. మాదిగపల్లె పోయి పోలాయిని, మాతయ్య మేనల్లుడు ముసలయ్యని పిలుచుకరమ్మన్నాడు. వచ్చిన మనిషిని రాత్రికి వుండిపొమ్మన్నాడు. ఎల్లన్నతో ఏటిగట్టుకేసి నడిచాడు.

ఏటిగట్టున నలుగురూ కూర్చొన్నారు. నాగన్న జరిగిందంతా చెప్పాడు. అంతా విని ఆట ఆడకపోతే బాగుండదని పోలాయి అన్నాడు. పిట్టోడు ఆట ఆడాల్సిందే అన్నాడు. ముసలయ్య మౌనంగా వుండి పొయ్యాడు. అతను సాధ్యమైనంతవరకు మౌనంగానే వుండిపోతాడు,. ఎప్పుడోగాని మాట్లాడడు. మాతయ్య అప్పచెల్లెలు కొడుకు. ముసలయ్యని చూస్తే మాతయ్యే గుర్తొస్తాడు. ఆట ఆడితే ఆ పల్లె పరిస్థితి కూడా ముందు నిల్చింది. ఈ రాత్రికి రాత్రే ఆపల్లె కెళ్ళి మాట్లాడితే బాగుంటుందనుకొన్నారు. అక్కడే నిర్ణయం చేసుకోవచ్చనుకున్నారు. అన్నాలు తిన్నాక వచ్చిన మనిషితో దిబ్బలమిట్ట దారి పట్టారు. వెన్నెల మంచు కలిసిన వింత పొగ యిసుకతిన్నెల మీద పరుగుతీస్తోంది. పొలాలమీది కాపలా కుక్కల అరుపులు విన్పిస్తున్నాయి. దిబ్బలమిట్ట అట్టే దూరంలేదు. చుక్కపొడుపుకు చేరుకోవచ్చు.

అదే రాత్రి, ఏటిగట్టున ఆ నలుగురు కూర్చొన్నప్పుడే, ఊళ్ళో రచ్చమీద పెద్దలు కూర్చొన్నారు. వీళ్ళమాటల్లో "మగోడంటే బుక్కిరెడ్డే" అని ఒకరిద్దరు అనటం అచ్చిరెడ్డికి గర్వంగా అన్పించింది. మరో యిద్దరు అచ్చిరెడ్డిని కూడా పొగిడారు.. పిల్ల కరణానికి ఆ మాట అంతగా రుచించలేదు. తన తండ్రి స్థానంలోకి బుక్కిరెడ్డి, తన స్థానంలోకి అచ్చిరెడ్డి తెలియకుండానే జొరబడుతున్నట్టునిపించింది. మాట మార్చాలనుకున్నాడు.

"నాగన్న నారిగాడి కొడుకు కదూ"

ఆమాట పిల్లకరణం అనగానే అచ్చిరెడ్డి పిల్లకరణం కేసి చూశాడు. నాగన్న నారిగాడి కొడుకని పిల్లకరణానికి తెలియక అడగటంలేదు. తెలిసే అన్నాడు ప్రత్యేకంగా ఒకమాట పిల్లకరణం వూరికే అనడని అచ్చిరెడ్డికి తెలుసు. అప్పటికి అవును అని వూరుకున్నాడు. అంతా వెళ్ళినా రచ్చమీద ఆయిద్దరు అట్లాగే కూర్చున్నారు. కూడ బలుక్కొని అనుకున్నట్టు 'మాలాడి దిబ్బ సేద్యం' ఆ యిద్దరి మనసుల్లో మెదిలింది.

"ఆరోజే అడ్డు పడాల్సింది" పిల్లకరణం అన్నాడు.

"ఏ రోజు" అచ్చిరెడ్డి ఫలానా రోజని అనుకొన్నా కరణం నోటిగుండా వినాలని అడిగాడు.

"మాలాడి దిబ్బ మాలమాదిగలు సేద్యం పెట్టిన రోజు" కరణం నింపాదిగా అన్నాడు.

అచ్చిరెడ్డి కళ్ళముందు మాలాడి దిబ్బ సేద్యం ముందు నిల్చింది.

# 10

అచ్చిరెడ్డి కళ్లముందు మాలాడిదిబ్బ సేద్యమే కాదు, అప్పుడు పిల్లకరణం "దెయ్యాలదిబ్బ దెయ్యాల్నే తిన్నీ అచ్చిరెడ్డీ" అన్న మాటలు కూడా ముందు నిల్చాయి.

ఆ రోజు పిల్లకరణం ఆ మాటే అన్నాడు. నిజానికి మాలాడిదిబ్బేకాదు ఎన్నెలదిన్ని పరిసరాల్లో లెక్కలోకి రానిపొలం చాలావుంది.

అది యిప్పటిదాకా కరణం పొలం అనే జనానికి తెలుసు. అంతేకాదు ఈనాంభూముల అసలు భాగోతం ఎన్నెలదిన్ని జనానికి అర్థం కాని విషయం కూడా. ఎన్నెలదిన్నెలోనే కాకుండా చుట్టుపట్ల గ్రామాల్లో కూడా కరణం ఈనాంక్రింద పెద్దకరణం ఎంత సొంత చేసుకుంది లెక్కలు చెప్పగలిగే సత్తా ఎవ్వరికీ లేదు.

చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, ఎట్టి ఈనాముల్లో ఎక్కువ భాగం కరణం పొలాల్లో కలపబడ్డదనే సంగతి కూడా ఆ కులాలవాళ్లకి తెలీదు. కుమ్మరిమట్టికి వదిలిన రెండెకరాలు కుమ్మరి మాన్యం కింద అందరికీ తెలుసు. అది దాదాపు అయిదెకరాలుందని పెద్ద కరణానికి మాత్రమే తెలుసు. చాకలిబట్టలు ఉతకడానికి ఆరేసుకోడానికి కుంట చెరువు, దాన్ని అనుకొని వున్న అరెకరాల మాత్రమే చాకళ్లకి తెలుసు. మిగిలింది పెద్ద కరణం మాత్రమే చెప్పగలడు. ఆ వూళ్లో దేవదాసీలు లేరు. కాని దేవదాసీల పేర పాతిక ఎకరాలు లెక్కల్లో వుంది. అది దేవుడి మాన్యంతో కలిసివుందని కరణం అనేవాడు. దేవుడు పేరవున్నా దేవదాసీ పేర వున్నా అనుభవించేది కరణమే. ఎట్టి మాన్యం పంట కాలంలో గింజల కొలతతో చెల్లుబడి అయిపోతుంది. పొలం వుందని వుంటే ఎంతుందని ఎట్టి అడగలేదు. కరణం చెప్పలేదు. "పనుల మాన్యాలు"వున్నాయనే సంగతి ఎన్నెలదిన్ని జనాలకి తెలియకపోవటం వింతేంకాదు. కాని కరణం జాబితాలో ఆ ఈనాములు కూడా వున్నాయి.

రాయలసీమ నుండి ఎన్నెలదిన్నికి నాగన్న వచ్చిన కొత్తలో "ముద్దల ఈనాం" అని మాటల సందర్భంలో అంటే ఎర్రెంకడు, ఎంకటనర్సునోళ్లు ఎల్లబెట్టారు. పిట్టోడు మాత్రం అదేదో చెప్పమని పట్టుపట్టాడు. అదీ ఎన్నెలదిన్నికి దానికి తూర్పున వున్న చింతల గుంటకి పొలిమేర తగాదావస్తే ఆ సందర్భంలో "ముద్దల ఈనాం' యిస్తే నేను తగాదా తీరుస్తానని నాగన్న నవ్వుతూ అన్నాడు. అప్పుడు విన్నారు వాళ్లు ఆపేరు. పొలిమేర తగాదా తీర్చడానికి ఒక వ్యక్తి వుంటాడు, అతను పొలిమేరలు నిర్ధారణ చేసి పొలిమేర

పొడుగునా అన్నం ముద్దలు పెట్టాడు; దాన్నే 'ముద్దల ఈనాం' అంటారు. అట్టాంటి విషయాలు పిట్టోడిలాంటి వాళ్లకి ఆశ్చర్యాలు కాని కరణానికి అదృష్టం కలిసొచ్చే సందర్భాలు విచిత్రమేమిటంటే బ్రిటీష్‌వాళ్లు గ్రామ నౌకర్లకి డబ్బు రూపంలో యివ్వటం మొదలెట్టాక ఈ రకం ఈనాముల్లో ఎక్కువ భాగం కరణాల కిందో , భూస్వాముల కిందో సొంత ఆస్తిగా మిగిలిపొయ్యాయి. భూమ్మీద జరిగిన ఓ విచిత్ర నాటకం అది

పిల్లకరణం చాలా దూరమే ఆలోచించాడు. రైతులకి భూమి అమ్మకం కూడా ముందు చూపుతోనే చేశాడు. రోజురోజుకు మార్పుచెందుతున్న గ్రామసీమల స్వరూపాల్ని క్షుణ్ణంగానే పరిశీలిస్తున్నాడు అప్పుడప్పుడూ అనుకొనేవాడు, ఎన్నెలదిన్ని వదిలేసి నెల్లూరు చేరుదామని. పెద్ద కొడుకు చదువుతున్నాడు. దొరల ప్రాపకంలో అల్లుడికిమంచి పలుకుబడే వుంది. ఊళ్లో కూడా అచ్చిరెడ్డిలాంటి రైతులు గ్రామ పెత్తనంలో ముందుకొస్తున్నారు. పిల్లనిస్తూ దిబ్బలమిట్ట బుక్కిరెడ్డి అచ్చిరెడ్డికి కొంత పొలం యిచ్చాడు. కిందటేడు మరో పదెకరాలు కొన్నాడు. ఆ పదెకరాల పక్కనే పొరుంబోకు వుంటే తనతో మాట మాత్రం అనకుండా కలిపేసుకున్నాడు. అచ్చిరెడ్డిని చూసీ చూడకుండా పోనిస్తే యిద్దరు ముగ్గురు రైతులు కూడా అదే చేశారు. అలగాజనం ఫలానారెడ్డిగోరి మనుషులని పిలవబడటం పిల్ల కరణానికి ఎందుకో అంత వినబుద్ధిగా లేదు. చెప్పకనే కొన్ని పరిణామాలు తనకి అనుకూలంగా లేవు. అదిగో ఆ నేపథ్యంలోనే మాలాడి దిబ్బ దెయ్యాలే తిననీ అచ్చిరెడ్డీ అన్నాడు.

అయితే వాళ్లని పిలిచి మాలాడిదిబ్బ మీరు చేసుకొండ్రా అని పిల్లకరణం వాళ్లకివ్వలేదు. ఎన్నెలదిన్ని చింతగుంట పొలిమేర గొడవ రోజు ఆషామాషీగానే పిట్టోడు నాగన్న చాలా విషయాలు మాట్లాడుకొన్నారు. పిట్టోడిలో చిన్న అలజడి బయల్దేరింది. తన ఈడు వాళ్లతో కదిపి చూశాడు. కాస్త ఆశ కన్పించింది. మాదిగ కుర్రాళ్లని కదిలిస్తే బాగుందిరా పిట్టోడా అన్నారు. మాదిగపల్లెలో కుర్రాళ్లు సిద్ధమయ్యారు. ముసలయ్య, పోలడు ముందుకొచ్చారు.

పథకం నాగన్న గీశాడు. ముందు మాలాడి దిబ్బలో చెట్లు కొట్టాలనుకొన్నారు. కొట్టేటప్పుడు కరణం అడిగితే, అచ్చిరెడ్డి లాంటి రైతులు అడిగితే కట్టెపుల్లకని చెప్దామనుకున్నారు. ముందురోజు బెరుగ్గానే వెళ్లారు. రెండు మూడు చెట్లుకొట్టి ఆగారు. ఆరోజు వెళ్లింది అంతా కుర్రాళ్లే. వాళ్లతో వుంది నాగన్న వక్కడే. చెట్టుకొట్టకపోయినా నాగన్నతో పాటు ఎల్లన్న వుండిపోయాడు. ఎల్లన్న అక్కడికి వెళ్లినందుకు ఎర్రెంకడికి దాదాపు అదురు జ్వరం వచ్చినంతపనైంది. రెండో రోజుకుర్రాళ్ల సంఖ్య పెరిగింది. రెండో రోజు మధ్యాహ్నం దాకా కొట్టారు. రైతులెవ్వరూ ఆ విషయం పట్టించుకొన్నట్టు లేదు. మూడోరోజు సంఖ్య పెరిగింది. దాదాపు సగం దిబ్బ చెట్లూ, ముళ్లకంపా కొట్టేశారు.

అప్పుడు ఆలోచించింది ఊరు. ఊరి పెద్దలు రచ్చచేశారు. తెల్లారి మాలామాదిగల్ని గెవిటిచెట్టు కిందకి పిల్చారు. ఊరు బయట రెండు పల్లెలకి చీలే దారిలో పెద్ద వేప

చెట్టుంది. అది ఊరికి ముందు పుట్టిందని కొందరు, పెద్ద కరణం నాన్న దాన్ని నాటాడని కొందరు చెప్పుకొంటారు. గెముడు చెట్టు కాస్త గెవిటి చెట్టయింది. దాని కింద అరుగు కూడా వుంది. మాలా మాదిగల్ని పిలవాల్సివస్తే ఆ చెట్టుకిందికే పిలుస్తారు. మాలామాదిగల తీర్పులు ఊళ్లో చెయ్యటం అప్పటికి నామోషి లాంటిది. అందుకే మామూలు ఊరిరచ్చ కిందికి రాకుండా గెవిటిచెట్టు కిందికి అందర్నీ పిలిచారు. మాలపల్లె నుంచి కొందరు, మాదిగపల్లె నుంచి కొందరు వచ్చారు. అరుగుమీద పిల్లకరణం కూర్చొన్నాడు. అచ్చిరెడ్డి ఆ పక్కనే కూర్చొన్నాడు. వెనుక వరుసలో మిగతా రెడ్లు కూర్చొన్నారు. పిలుచుకొచ్చిన మంగలి వీరాస్వామి, చాకలి సింగన్న అటొకరు, యిటొకరు నిలబడ్డారు. వాళ్లకి దూరంగా ఎట్టి ఎల్లమంద నిలబడ్డాడు.

"మాలాడి దిబ్బ ఎట్టికి పడింది. బాగుచేసుకొందామనుకొన్నాం."

ఆ మాట నాగన్న అన్నాడు. పిల్లకరణం నాగన్నకేసి అట్టాగేచూశాడు. నాగన్న, నారిగాడికొడుకు. నారిగాడు ఎట్టా చచ్చిందీ పిల్లకరణానికి తెలియంది కాదు. తన తండ్రి మరణం మీదా పిల్లకరణానికుండే అనుమానాలు పిల్ల కరణానికున్నాయి. మధ్యలో 'రంగాయి' లేకపోతే తాను చాలా దూరం వెళ్ళేవాడు. అచ్చిరెడ్డి తన తల్లిని బజారుకు తీసుకురావద్దని కాళ్లావేళ్లాపడ్డాడు. అయినా పోయిన తండ్రి ఎట్టాగూ తిరిగారాడు అందుకే తండ్రి మరణం గురించి బయట రకరకాలుగా చెప్పుకొన్నాతన ఆలోచనలు తనలోనే దాచుకొన్నాడు. అంతేకాదు ఎన్నెలదిన్నిలో జరుగుతున్న మార్పులు కూడా తనని మరోవైపుకు ఆలోచించేలా చేస్తున్నాయి. అచ్చిరెడ్డి, మిగతారెడ్లు గమనించారో లేదో పిల్లకరణానికి తెలీదుగాని అతను మాత్రం ఒకటి గమనించాడు. "గవిటి చెట్టు' రచ్చ ఎప్పుడో గాని జరగదు. అట్టా జరిగినప్పుడు ఎంత రమ్మన్నా మాలామాదిగలు యింతమంది రారు. ఒక్కోసారి బెదిరించి రచ్చకు తీసుకురావాల్సి వచ్చేది. కాని యిప్పుడు చాలామంది వచ్చారు. గతంలో ఏదన్నా అడిగితే ఒకడిమీద ఒకడు చెప్పుకొనేవాళ్లు. కాని యిప్పుడు నాగన్నే చెప్పటం మొదలెట్టాడు. గమనించాల్సింది మరొకటి కూడా వుందనుకొన్నాడు పిల్లకరణం. పెద్దకరణం పొలం పనిరోజుల్లో మధ్యాహ్నం కూటికావిళ్లు కూడా మాలవాళ్లకి మాదిగవాళ్లకి వేరుగా వుంచేవాడు. రచ్చ దగ్గర కూడా వేరువేరు గుంపులుగా కూర్చొనేవాళ్లు. యిప్పుడు అట్టాలేదు. అంతా ఒకేచోట కూర్చొన్నారు. మాలల్లో పిట్టోడు, మాదిగల్లో పోలడు చూపుల్లో కాస్త తేడా కన్పిస్తున్నట్టుంది. వాళ్లచూపులు అనుమానంగా వున్నాయి. పెద్దమాల, మాదిగ పెద్ద చూపులు ఆందోళనగా లేవు. గత్తరగా లేవు. పిల్లకరణం అచ్చిరెడ్డికేసి చూశాడు. "గవిటిచెట్టురచ్చ"లో కూర్చోవటం అచ్చిరెడ్డికి కొత్తకాదు కాని కరణం పక్కన కూర్చొవటం కొత్తే. అచ్చిరెడ్డి అట్టా తన పక్కన కాకుండా వెనకవరుసలో కూర్చొంటే బాగుండేదనుకొన్నాడు.

"చెట్లుకొట్టాక మీతో చెబుదామనుకొన్నాం" నాగన్న నిజం చెప్పటం లేదని పిల్లకరణానికితెలియకపోలేదు.

"ముందే చెబుదామనుకొంటే మీరు నెల్లూరు పొయ్యారని తెలిసింది"

తన పెద్దరికానికి ఆమాటలు పనికొచ్చేవిగానే అనిపించాయి పిల్లకరణానికి. మార్పుకోరేవాడికి ఆ మాత్రం పెద్దరికం కాపాడుకోవటం మంచిదేననిపించింది నాగన్న నిజం చెప్పినా అబద్ధం చెప్పినా తనని పైస్థానంలో వుంచాడనిపించింది.

అచ్చిరెడ్డికి మాత్రం ఆ మాట నచ్చలేదు. చెట్లుకొట్టాక మీతో చెబుదామనుకొన్నామని అన్న నాగన్న మాటలో 'మీతో' అంటే తనతో కూడా అని అనుకొన్నాడు. కాని రెండో మాట తాను కాదని చెబుతోంది. కరణం లేకపోతే తనకి చెప్పొచ్చుగా. తనని అంత తక్కువగా చూడటం అతనికి నచ్చలేదు.

"ఆయన లేకపోతే, మేం లేమా, మాతో చెప్పొచ్చుగా' కడుపులో మాట దాచుకోలేక అనేశాడు. కరణానికి అచ్చిరెడ్డి మాటలు కోపం తెప్పించాయి. అయినా పైకి ఏదీ అనకుండా వుంటే బాగుండదని "నేను లేకపోతే అచ్చిరెడ్డికి చెప్పొచ్చుగా" అన్నాడు. ఆమాట అన్నాడేగాని నాగన్న అచ్చిరెడ్డికి చెప్పకపోవటం పొరపాటే అంటాడేమోనని అనుమానం వచ్చింది. అట్టా అనకుండా వుంటేనే బాగుంటుందనుకొన్నాడు. నాగన్న ఏమీ మాట్టాడలేదు. ఏమీ మాట్లాడనందుకు పిల్లకరణానికి సంతోషంగా వుంది.

నాగన్న ఆలోచన నాగన్నకుంది. లేదు అని కూడా కరణం అనుకోడు. తెలివి ఎవడి అబ్బసొత్తుకాదు. కలుగులో ఎలుక్కి, కలుగు పక్క పాముకి దేని తెలివిదానిదే. కాకపోతే 'కలుగు' ఒక్కటే యిబ్బంది. నాగన్నలకి ఈ వ్యవస్థ కలుగులే తవ్వింది ఆ కలుగు చీకట్లోనే బతకమంది. ఎలికలుగు తవ్వుకోవటం నాగన్నలు నేర్చుకోకవూరుకోరు. అట్టా వూరుకొంటే అది చరిత్రేకాదు. దానికి పరిణామమే లేదు. ఎవరో ఒక జడల రుషి చరిత్రంటే యిదే అని రాసి పారేసే చెత్తలా వుంటుంది. చేలగట్లలో వుండే ఎలుక తవ్వుకునే కలుగుకు రెండో దారి కూడా వుంటుంది. అదే ఎలికలుగు. ఆ దారి ఏర్పాటు చేసుకొవటం కాస్త ఆలస్యంగా చేసుకొందికావచ్చు అంతే తేడా.

పిల్లకరణం నాగన్నకేసి చూస్తున్నాడు. అచ్చిరెడ్డి మాత్రం నాగన్న నోటిగుండా ఏమాటా రాకపోవటం సహించలేకపోతున్నాడు. అసలు ఈ అలగాజనంతో అంత నింపాదిగా మాట్లాడటమే తప్పనే నిర్ణయానికొచ్చాడు. నోటికిబూతులొస్తున్నాయి. పిల్లకరణం గమనిస్తూనే వున్నాడు. అతను గమనిస్తోంది అచ్చిరెడ్డిని కాదు. అతని మాటల్నికాదు. అచ్చిరెడ్డి నోట బూతులు వస్తున్నప్పుడు పిట్టోడి కళ్లని గమనిస్తున్నాడు. ముసలయ్య చూపుల్ని చదువుతున్నాడు. యిబ్బందిగా కదిలే పోలయ్యని ఆలోచిస్తున్నాడు. ఆ చూపుల్లో అసహనాన్ని,ఆ కదలికల్లో ఆరాటాన్ని కరణం లెక్కలతో సరిచూసుకొంటున్నాడు. తండ్రి మరణం యిప్పుడు తీసివేతల్లో కొచ్చింది. అచ్చిరెడ్డి ప్రవర్తన కూడికల్లో కొచ్చింది. ఆ భూమి వాళ్ళకి చెందితేనే మంచిదనుకొన్నాడు. ఒకనాటి తెలివికాదు అది. విభజించి పాలించటం తెల్లవాడు ఈ నేలమీద కొత్తగా ప్రయోగించింది కాదు ఉన్నదాన్ని వాడుకొన్నది మాత్రమే.

పెద్ద కరణం మాలల్ని మాదిగల్ని విభజిస్తూ వచ్చాడు. వాళ్లు కలవకుండా అన్ని గీతలు శాస్త్రరీత్యా గీశాడు. అప్పుడు తమ వలయంలో, తమ హోదా స్థాయిలో అచ్చిరెడ్లులేరు యింత చేసుకోరా అచ్చిరెడ్డీ అని గీత గీసియిస్తే అంత చేసుకొని తన కివ్వాల్సింది తనకిచ్చి మిగిలిందే ఉంచుకొన్నాడు. పిల్లకరణం రోజుల్లో హోదా స్థాయిలో కొట్టొచ్చిన మార్పు కన్పించింది. గీత గీసి యిస్తే తీసుకొనే స్థితిలో అచ్చిరెడ్లు లేరు. ఒకప్పుడు ఏం చేద్దాం పంతులూ అంటూ వచ్చేవాడు బుక్కిరెడ్డి, కాని యిప్పుడు నేనైతేనా అంటున్నాడు. పిల్లకరణం విభజనలో పావుల్ని మరోవైపుకు కదుపుతున్నాడు.

"అచ్చిరెడ్డికి చెబితే బాగుండేది" ఆ మాట చాలా తేలిగ్గా రెండు మూడుసార్లు అన్నాడు.

"అయినా, దెయ్యాలదిబ్బ దెయ్యాల్నే తిన్నీ అచ్చిరెడ్డీ" అని లేశాడు. ఏమైనా రచ్చ తన మాటతో ఆగాలనుకొన్నాడు.

"యిక వెళ్దాం"

అమాటలంటూ లేశాడు. అచ్చిరెడ్డి అయిష్టంగానే లేశాడు. దార్లో అచ్చిరెడ్డితో అన్నాడు' ' కాపురాలైతే తలపై వుండకూడదు. మాలాడి దిబ్బ వాళ్ళ బాగుచేసింది కాపురాలు వుండటానికి కాదుగా.'అంటూ చెప్పుకపోయ్యాడు. అచ్చిరెడ్డికి ఎన్ని చెప్పినా వెల్తిగానే వుంది.

సమస్య అట్టా పరిష్కారమౌతుందని పిట్టోడు అనుకోలేదు. చెట్టుకొట్టాక మీతో చెబుదామనుకొన్నాం" అని నాగన్న అనటం కూడా పిట్టోడికి నచ్చలేదు. పోలడుతో ఆ మాటే అంటే అంతకన్నా ఎదంటాడ్రా అల్లుడా అన్నాడు. ముసలయ్య మాత్రం నాకూ అంత బాగాలేదు అని అన్నాడు. ఆ రాత్రి నాగన్నని నిలేసి అడిగాడు. నాగన్న నవ్వి వూరుకోలేదు. తన ఆలోచన విడమరచి చెప్పాడు. వాళ్లు చేను దగ్గరకి దొమ్మిగా రాలేదు. రచ్చపెట్టారు. రచ్చలో అచ్చిరెడ్డికి, పిల్లకరణానికి కొంత ఎడమ ఏర్పడుతున్నట్టు అనిపించింది. అందుకే అట్టా మాట్లాడానన్నాడు. అది దెయ్యం దిబ్బ కాబట్టి, దానితో ముడివడి పెద్ద కరణం చావు కూడా వుంది అని కరణం అనుకొంటున్నాడు కాబట్టి ఆ భూమి దక్కింది. లేకపోతే అంత తేలిక కాదు అని నాగన్న అన్నాడు.

కారణాలు ఏవైనా కావచ్చు మాలాడి దిబ్బ మాలామాదిగలు సాగులోకి తెచ్చారు. తలోచెక్క పంచుకొన్నారు. వాళ్లు గుర్తుంచుకోవాల్సింది నారిగాణ్ణి, మాతయ్యని. అక్కడ వాళ్ల త్యాగం వుంది. వాళ్ళ సాహసం వుంది. చిందించిన నెత్తురు వుంది. తీర్చుకొన్న నెత్తుటి బాకీ వుంది. చరిత్ర అట్టాగా సాగింది. శంభూకుడి తల, ఏకలవ్యుయుడి బొటనవేలు అవి మాత్రమే కాదు. వాటితోనే దళిత చరిత్ర ఉదాహరణలు ఆగిపోలేదు. చరిత్రకందని, అందినా పట్టించుకోని అంటరానివాళ్ళ తిరుగుబాట్లు, పోరాటాలు, త్యాగాలు, సాహసాలు, వెలుగుకు నోచుకోకుండా చీకట్లోనే కలిసిపోయాయి. తెలిసీ తెలీక మాట్లాడేవాళ్ళు మాట్లాడుతూనే వుంటారుగాని మాలామాదిగలకి పోరాటం ఆదర్శం కాదు. అవసరం. అవసరం కాబట్టే

నారిగాళ్లు, మాతయ్యలు అంత సాహసాలు చేశారు. ఈ దేశం పోరాట చరిత్రలో వాళ్ల నెత్తురుతో తడవని పుటలేదు. వాళ్ల సాహసాల్తో ముడిపడిలేని సందర్భం లేదు. భూమికోసం పోరాడారు. భుక్తి కోసం పోరాడారు. ఆత్మగౌరవం కోసం పోరాడారు. వర్తమానం కూడా అదే. వర్తమాన పోరాట జీవితం కూడా అదే. అది ఆదర్శం కాదు. అవసరం.

నిజానికి మాలాడి దిబ్బ సేద్యం జరిగింది పాతబడిపోయింది. కాని ఎల్లన్న ఆటలో దాగిన ఆత్మగౌరవం దగ్గర అచ్చిరెడ్డికి, పిల్లకరణానికి అది మరోసారి గుర్తొచ్చింది. మాలాడి దిబ్బని వొదులుకోవడం పిల్లకరణం తేలిగ్గా తీసుకొన్నాడు. కాని ఎల్లన్న ఆట కరణం స్థాయిలో మాలామాదిగ పెద్దల్ని వుంచటం మాత్రం సహించలేకపోయాడు. అది తీవ్రమైన ధిక్కారంగా భావించాడు. కాకాపోతే మట్టి తన చేతికి అంటకూడదనే ఆలోచనతో ఉన్నాడు. అందుకే అచ్చిరెడ్డితో "ఆ రోజే అట్టుపడాల్సిందనే" మాట అన్నాడు. ఆ రోజు జరిగిపోయింది తిరిగి జరిగేది కాదు. కాకపోతే నీ మాట వినలేదు రెడ్డీ అనే అర్థం వచ్చేలా మాట్లాడితే అచ్చిరెడ్డి బండిపరం భుజాల మీదికి ఎత్తుకుంటాడు. నిజంగా అట్టాగే జరిగింది. అచ్చిరెడ్డిని రెచ్చగొట్టి పిల్లకరణం కూతురి దగ్గరికెళ్లాడు. రెచ్చిపోయిన అచ్చిరెడ్డి ఏకంగా దిబ్బల మిట్టకే బయల్దేరాడు.

దిబ్బల మిట్టలో విచిత్ర వాతావరణం నాగన్నకి, ఎల్లన్నకి ఎదురైంది. వాళ్లతో మాట్లాడటానికే ఆ రెండు పల్లెల్లో వాళ్లు యిబ్బంది పడుతున్నారు. ఈ వాతావరణం పిట్టోడిని ముసలయ్యని, పోలడిని యిబ్బందిలో పెట్టింది. పెద్దమాల మాదిగ పెద్దకూడ బ లుక్కొని చెప్పినట్టు, యింతకన్నా మేం చెయ్యగలిగింది ఏది లేనట్టు "మమ్మల్ని పిలవకుండా ఆట ఆడండి" అని చెప్పారు. అట్టా కాకపోతే మేము బుక్కిరెడ్డిని ఎదుర్కొని నిలబడలేమన్నారు. అచ్చిరెడ్డి కూడా దిబ్బమిట్టలో వున్న సమాచారం తెలిసింది. చుట్టుపట్ల వూళ్ల రెడ్లు ఎడ్లబండ్లలో దిబ్బలమిట్ట వస్తున్నారని, ఏ క్షణానైనా పల్లెలమీద పడతారనే పుకారు పుట్టింది. ఆత్మగౌరవం ఖరీదు చాలా ఎక్కువే అనుకొన్నాడు నాగన్న.

"కరణానికి లేని గొప్ప అచ్చిరెడ్డికి ఆడిమామకి ఎందుకొచ్చింది"

"కరణానికి లేదని ఎవురన్నారు. రెచ్చగొట్టి తప్పుకొన్నడు"

"ఊళ్లజనంవత్తారు పెద్దాళ్లని అట్టా పిలవకపోతే మానే. ఆట ఆడండి.

"ఎల్లన్న ఆట చూడాలని ఆడాళ్లు ముసలాళ్ల యిద్దై పోతున్నారు"

"అట్టా పిలవకుండా ఆడుకోండ్రా అని బుక్కిరెడ్డి అన్నాడు"

"ఆడు ఎట్టా ఆడమంటే అట్టా ఆడటానికి మనం ఆడికట్టుమడి గొడ్లమా."

"పెద్దమొగోడోయ్"

మాటలు. ఎల్లన్నచుట్టూ. నాగన్నచుట్టూ. వింటూనే వున్నారు. ఏది మాట్లాడాలో అర్థం కావటం లేదు. ఏదో ఒకటి మాట్లాడాల్సి వుంది. ఏదో ఒకటి నిర్ణయించుకోవాల్సి వుంది. ఆ ఏదో ఒకటి. పెద్దలని గౌరవంగా పిలవకుండా ఆట ఆడటమా ? లేదా ఆడకపోవటమా ? ఆ రెంటిల్లోనే తేలాల్సి వుందని ఎల్లన్న అనుకొన్నాడు. సమస్యల్లా ఆట ఆడటం దగ్గరకాదు.

పెద్దల దగ్గరే. పెద్దల్ని గౌరవంగా పిల్చి ఆడించుకొనే తెగింపు పల్లెలో లేదు. తెగించడటమంటే గొప్ప సాహసమే చెయ్యాల్సి వుంటుంది. అందుకే ఎల్లన్న ఆట ఆడకుండా వుండటమే ఆత్మగౌరవం మిగుల్చుకోవడం అనుకొన్నాడు. కనీసం అదన్నా మిగలాలనుకొన్నాడు. ఆ మాటే నాగన్నతో అన్నాడు. ఆ నిర్ణయం కోసమే నాగన్న ఎదురుచూస్తున్నాడు. అసలు తానే ఆ మాట చెబుదామనుకొన్నాడు. తన జీవితం సందె పొద్దుకాడ వుంది. ఎల్లన్న యిప్పుడిప్పుడే మండుతున్న పొద్దు. నిర్ణయం అక్కడ రావటమే మంచిదనుకొన్నాడు.

అంతేకాదు ఈ వాతావరణం నాగన్న ఊపిరిమీద ప్రభావం చూపుతోంది. తెలీని ఆందోళన, ఆవేదన గుండెల్ని పిండుతున్నట్టనిపిస్తోంది. తాను ఓటమిని ఓర్చుకొనే స్థితిలో లేనట్టు అన్పిస్తోంది. తెలీని యిబ్బంది గుండెల్లో సుడులు తిరుగుతోంది. నాగన్నకేసి చుశాడు ఎల్లన్న. అతని మొహం మీద చీకట్లు తారాడుతున్నట్టు అన్పించింది. అందుకే చొరవ తీసుకొని "ఆట యిప్పుడొద్దు. యింకోసారి ఆడుతామన్నాడు." అంతా నిరాశపడ్డారు. పెద్దలు ఆడమన్నారు. ఆటకన్నా ఆత్మగౌరవం ముఖ్యమనుకొన్నాడు ఎల్లన్న. మళ్లీ చెప్పాడు. యింకోసారి ఆడదామన్నాడు. తప్పక ఆడదామన్నాడు. నాగన్న ఎల్లన్నకేసి చూశాడు. ఎల్లన్న నేత్రం అంత ఎర్రగా ఎప్పుడూ లేదనిపించింది. ఎల్లన్న మనసులో యిప్పుడు ఏది బలంగా వుందో నాగన్నకి తెలును. దున్నే భూమి, వుండే యిళ్లు, కట్టేగుడ్డ, ఆడే ఆట. ఏదీ.........ఏదీ.. ...అంత తేలిగ్గా దక్కదు. తవ్వాల్సింది, పూడ్చాల్సింది చాలా వుంది. మరోసారి ఎల్లన్న కళ్లలోకి చూశాడు. ఎర్రగా వుండిపోయ్యాయి. ఉండనీ అనుకొన్నాడు. అట్టాగే వుండాలనుకొన్నాడు.

ఎన్నెలదిన్ని కేసి నడక చాలా భారంగా వుంది. పిట్టోడు, ముసలయ్య, పోలడు ఏదేదో మాట్లాడుతున్నారు. ఎల్లన్న మౌనంగా నడుస్తున్నాడు. నాగన్న మాత్రం మౌనాన్ని కూడా భరించలేకుండా వున్నాడు. ఈ సంఘటన ఎల్లన్న జీవితాన్ని ఏ మలుపు తిప్పుతుందో ఊహించలేకుండా వున్నాడు. ఎల్లన్న కళాకారుడు. స్పందించటం కళాకారుడి గుండె కుండే ప్రత్యేకత. దిబ్బుల మిట్టజనాన్ని అతను అర్థం చేసుకోవడం పైన అతని స్పందన రూపం వుంటుంది. ఈ జనం భయాన్ని అర్థం చేసుకొని ఆ భయాన్ని పోగొట్టే మార్గాలు వెతికే స్పందన అతన్లో పుడితే ఆ కంటిలో ఎరుపుకు కొత్త అర్థం వస్తుంది. మలుపు పొంగే వరదలా పంచుకొనే ప్రేమలా మిగులుతుంది. అట్టాకాక మరోలా,వీళ్లని నమ్మి ఏదీ చెయ్యకూడదనే భావం ఆ స్పందనలో తొంగి చూస్తే అది ప్రమాదానికి దారితీస్తుంది. కళాకారుడికి స్పందన అతి సున్నిత అంశం.

నాగన్నకు నడవటం కూడా కష్టంగా వుంది. అప్పుడే జరిగింది అతని ఎదమీద ఎవడో శత్రువు బలంగా తన్ని వెళ్ళి నట్టనిపించిన దృశ్యం. ఎన్నెలదిన్ని బళ్లబాటమీద దుమ్ము రేపుకొంటో ఎద్దులబండి ఎన్నిలదిన్ని కేసి పరుగెడుతోంది. అది అచ్చిరెడ్డి బండి. ఆ గంటల మోత అచ్చిరెడ్డి ఎడ్లదే అని అన్నాడు పిట్టోడు. నాగన్న అట్టాగే చూశాడు. ఆబండి ఊరిదారికేసి

వెళ్తోంది. నాగన్నకు ఊపిరి ఆడటం లేదు. ఎద్దుల గంటలమోత విన్పిస్తూనే వుంది. మోత తన ఓటమిని, అచ్చిరెడ్డి విజయాన్ని చాటుతోంది.

నడక సాగటం లేదు. సందెచీకట్లు ముసురుతున్నాయి. మాలాడి దిబ్బ మీదగా వెళ్దామన్నాడు మాలాడి దిబ్బ మలుపుల తిరిగారు. మాలాడి దిబ్బ దగ్గరపడేకుంది నాగన్న గుండెలు చాలా వేగంగా కొట్టుకోవటం మొదలయ్యాయి మాలాడి దిబ్బ వచ్చింది.

"అగుదాం బిడ్డా"

ఎల్లన్న నాగన్నకేసి చూశాడు. బిడ్డా అని తనని మొదట్లో పిలిచేవాడు. ఆ పిలుపు ఈ మధ్యలేదు. అదీ అలసినట్టుగా అన్నాడు.

"కాసేపు కూర్చుందాం"

చీకట్లు పూర్తిగా కప్పేశాయి. మాలాడి దిబ్బంతా తైదవేశారు. కంకి బాగా వచ్చింది. యింకొద్దిరోజుల్లో కోతకోస్తుంది. అంతా పాలకంకి. ఆ పాలకంకికేసినింపాదిగా చూశాడు నాగన్న. వెన్నెలైతే బాగుండేదనుకొన్నాడు. అయినా చూడటానికి చీకటి అడ్డురాదనుకొన్నాడు. పిట్టోడు మంచి నీళ్లుంటే పట్రమ్మని మంచెకాడి మనిషిని కేకేశాడు.

"పంట బాగా వచ్చింది.........కూటికి దిగుల్లేదు"

నాగన్న మాటలకి అంతా ఔనన్నారు.......అంత చీకట్లోనూ నాగన్నదేన్నో వెతుకుతున్నట్టు చూశాడు. అతని చూసేవైపుకు అంతా చూశారు. అచ్చిరెడ్డి చేల మధ్య మంచె దగ్గర కాగడా వెలుతురు కన్పిస్తోంది

"అది అచ్చిరెడ్డి అబ్బ సొమ్ముకాదు. కరణం లెక్కలోకి రాదు"

నాగన్న వేలుపెట్టి చూపుతున్న వైపు చూశారు. అచ్చిరెడ్డి చేలకి మాలాడి దిబ్బకి మధ్య బీడు భూమిలో నల్లతుమ్మచెట్లు తలలు విరబోసుకొన్న దయ్యాల్లా వున్నాయి.

"ఈ గట్టు అక్కడ పడాలి"

ఎల్లన్న నాగన్నలోకి గుచ్చి గుచ్చి చూశాడు. తనకేసి అట్టాగే చూస్తున్న ఎల్లన్న వీపు తట్టాడు. పైకి లేశాడు. మంచెకాడి మనిషి నీళ్ళు తెస్తే తాగాడు. దారంతా మాట్లాడుతూనే వున్నాడు. బలవంతంగా మట్లాడుతున్నట్టనిపించింది. గొంతు చాలా బలహీనంగా విన్పిస్తోంది. ఈ రాత్రంతా మాట్లాడుతూనే వున్నాడు. ఆట మారాలన్నాడు పాట మారాలన్నాడు. రెండు మూడు పాటలు పాడాడు. ఆ పాటలు కొత్తగా అన్పించాయి. ఆకలి, భూమి, కన్నీళ్లు, మాలాళ్లు, మాదిగాళ్లు ఆ పాటలనిండా నిలిశాయి.

ఎల్లన్న ఆ రాత్రి నాగన్న దగ్గరే వుండిపొయ్యాడు. నాగన్న కొత్తపాటలు పాడుతుంటే వాటిని మనసులో బంధిస్తూ కూర్చొన్నాడు. గంగ పాట వినరా బిడ్డా అన్నాడు. పాడాడు. గంగని భూమ్మీదికి తెచ్చింది బగీరథుడు కాదు. ఉరుములోళ్లు. బగీరథుడు అబద్ధం. ఉరుములోళ్లు నిజం. ప్రళయం ఉరుముల శబ్దంలో పుట్టింది. ఈ భూమ్మీద మొదట నీటికయ్యలు కట్టింది మాదిగోళ్లు, మాలోళ్లు, ఎరుకలోళ్లు, యానాదోళ్లు, గిరుల గుండెల్లో

నిద్రోయే గిరిజనులు. నిప్పు చేశారు. నీళ్లు తెచ్చారు. భూమిదున్నారు. బువ్వవండారు. ఆ తర్వాతే ఎవరొచ్చినా. నోటికాడి కూడు కొట్టెయ్యడానికి ఎవరొచ్చినా ఈ తర్వాతే వచ్చారు. అట్టా పాడుతూపోయ్యాడు. ఓ జాముదాకా పాడాడు. తొలికోడి కూసింది. నిద్రొస్తుంది రాబిడ్డా అన్నాడు. రోజూ ఆ జామున లేసేవాడు. ఈ రోజు నిద్రొస్తుందన్నాడు. కన్నుమూశాడు. మళ్లీ కళ్లు తెరవలేదు. గట్లు తెంచుకొని గంగ ఎటు పరుగుతీసిందో తెలీదు. ఉరుముల శబ్దం ఏ దూరతీరాలను తాకుతో ప్రళయం సృష్టిస్తుందో తెలీదు.

చంద్రప్ప పురాణ రహస్యాల్లో మరణం రహస్యం ఎట్టా వుందో చెప్పకుండానే వెళ్లాడు నాగన్న. కాని ఎప్పుడో పాడాడు నాగన్న. ఓ విసుర్రాయి పాట. కట్టెలే సుట్టాలు. కాడేబంధువులు, పాడె బద్దెలు బావా మరదళ్లు గుప్పెడు గుప్పెడు మట్టి గుండెల్లపోత. సుట్టాలు బంధువులు సుట్టూ కూసుంటారు. కన్నీరు తీస్తారు. ఆ తర్వాత. ఎవడికివాడు. తొలగిపోతాడు. కాని నాగన్న వెంట ఎవ్వరూ వెళ్ళకపోయినా నాగన్న ఎన్నెలదిన్నిలో నిలిచిపోయ్యాడు.

ఎల్లన్నే నాగన్నకి అన్నీచేశాడు. అన్నీ చేసిందాకా గుండె నిబ్బరంతో ఉండిపొయ్యాడు. అంతా అయ్యాక తనకేమి మిగలనట్టు, తన ముందు వున్నదంతా శూన్యమైనట్టు భావించాడు ఒక్కడే దిక్కుల్ని చూస్తోవుండిపోతున్నాడు. ప్రతి దిక్కులోనూ నాగన్నని వెతుకుతున్నాడు. నాగన్న మరణానికి ముందు మాట్లాడిన ప్రతిమాటా గుర్తు తెచ్చుకొంటున్నాడు. ఆ రాత్రి పాడిన కొత్తపాటలు మాట్లాడిన మాటలు, గంగ పాట అన్ని తనకేదో కొత్త సంగతి చెప్పినట్టు అన్పించింది. ఆ కొత్త సంగతే అర్థం కావటం లేదు.

ఆటకి బయానా తీసుకొన్న వూళ్ల నుంచి మనషులు వచ్చిపోతున్నారు. బయానా తిరిగి యిచ్చి పంపుతున్నాడు. నాగన్న లేకుండా ఆట ఆడాలని లేదు. నాగన్న వోటమి తట్టుకోలేకపోయాడు. లేకపోతే మరణించేవాడు కాదు. ఆత్మగౌరవం. అది చిన్నది కాదు. ఏది ఏమైనా దిబ్బల మిట్టలో ఆట ఆడి వుండాల్సింది. ఆ వూరిజనం తాడోపేడో తేల్చుకోడానికి ముందుకు రావాల్సింది. అట్టా ముందుకు రానందుకు వాళ్లని తిట్టుకొన్నాడు. వెంటనే నాగన్న మాటలు గుర్తొచ్చాయి. ప్రేమించటం నాగన్న నేర్పాడు ద్వేషించటం కూడా నాగన్నే నేర్పాడు. నాగన్న పిల్లకరణాన్ని, అచ్చిరెడ్డిని ద్వేషించాడు. దిబ్బల మిట్ట మాలామాదిగలు తనతో నిలబడకపోయినా వాళ్లతో ప్రేమగానే మాట్లాడాడు. దారంతా వాళ్ల మీద ప్రేమకురిపిస్తూనే వున్నాడు. మాలాడి దిబ్బ దగ్గర అంత చీకట్లో బీడు భూమికేసి తన చూపుడువేలు ఎంత సూటిగా చూపాడు. అది అచ్చిరెడ్డి అబ్బది కాదన్నాడు. యిక్కడి గట్టు అక్కడికి పడాలన్నాడు. అన్నిటికన్నా విచిత్రం ఆ రాత్రి పాడిన కొత్త పాటలు. ఎందుకు పాడినట్టు. ఆకలి పాటలు, నేల చెక్క పాటలు, సుట్టు గుడిసెపాటలు. ఎందుకు పాడినట్టు. గంగ పాటలో నిప్పు, నీళ్ళు, బువ్వ. దేనికి సందర్భాలు అవి. కొలిక్కి రావటం లేదు. ఏదో వుంది. తాను యిప్పటి దాకా చెయ్యంది యిప్పుడు చెయ్యాల్సింది ఏదో వుంది. అదే అర్థం కావడం లేదు ఎల్లన్నకు.

జీవితం నిండా అర్థం కాని ఆవేదన, ఎండుదనం, తీరనిలోటు, ఆరనిదాహం, ఏమైపోయింది తాను ఆడుతూ పొందిన ఆనందం. ఎటు వెళ్లాడు తనతో యిప్పటిదాకా ప్రయాణం చేసిన కళాకారుడు. తన లోనివాడు. పాడినవాడు పాట అల్లినవాడు. పుట్టినే మౌనిగా, మూగగా ఎందుకు మారుతున్నాడు.

అట్టా అని ఎల్లన్న పూర్తిగా మౌని కాలేదు. మూగ కాలేదు. కాకపోతే నీడలే తన సృజన పైన తారాడుతున్నాయి సమాజానికి తనకీ వున్న సంబంధం బలహీనపడుతోంది. యింకా యిక్కడే వుంటే అది బలహీనపడటమే కాదు, తెగిపొయ్యే ప్రమాదం కూడా వుంది.

తాను పాడాడు. పాట పాడటానికి యిప్పటిదాకా ఆనందమే ఆత్మసంతృప్తే కారణం. దానికి ప్రేరణ ఎక్కడుంది. ఎక్కడో వుంది ఆ అన్వేషణేయిదంతా చెట్టు, పుట్ట , కాకి, కోయిల ,కన్నీళ్లు, పన్నీళ్లు, ఆకలి, చేను, చెలక. .. మళ్లీ అనుకొంటే... . ఆకలి, చేను, చెలక.. . . యింకా..... యింకా చేను, చెలక ఆకలి, ఆత్మగౌరవం.... అక్కడే ఆగింది. అంతా అక్కడే ఆగింది. యిక్కడి గట్టు అక్కడపడాలి ... అక్కడ పడాలి . ... . అచ్చిరెడ్డి చేలదగ్గర, సరిగ్గా అక్కడ, నిజంగానే. అక్కడే, అక్కడే పడాల .. .. పెద్దల్ని, పెద్దమాలని, మాదిగ పెద్దని, కరణానికన్నా మిన్నగా అచ్చిరెడ్డి కుళ్లుక చచ్చేలా పిలవాలి . పిలిచి తీరాలి. అట్టాపిలవనప్పుడు, పిలువలేనప్పుడు ఆట, మాట, పాట, ........ ఆత్మగౌరవం అన్నీ ప్రశ్నలే.

ఎట్టా వచ్చి ఎట్టా వెళ్లాడువాడు. ఏది చేసి ఏది చెయ్యకుండా వెళ్లాడువాడు. ఉరుముల మాలోడు, ఎన్నెలదిన్నినాగడు, నారిగాడి కొడుకు, గొప్ప కళాకారుడు. నిజంగా దేనికోసం వెతికాడు వాడు. తాను వెతికింది దొరికినట్టు దొరికి జారిపోయినప్పుడు ఎంత ఘోరంగా ఆగిపొయ్యాడు అసలు నడకే తెలీనివాడిలా అలసిపోయినట్టు అట్టాగే పడుకొని మూసిన కన్ను తెరవకుండా. ఎల్లన్నకి కన్నీళ్లు ఆగవు. అంత ఘర్షణా అక్కడ ఆగుతుంది. అక్కడ నుంచి ముందుకుపోదు. గుండెలనిండా అలజడి. బతుకంతా ఆందోళన. దేనిమీదనో తిరగబడాలనుంది. ఆ తిరుగుబాటే అర్థం కావటం లేదు.

ఒక్కక్షణం యిట్టా అనుకుందాం. అశాంతిలో, ఆందోళనలో, తిరుగుబాటులో, మహోన్నత విప్లవాల ప్రభంజనాల్లో సమాజానికి కళాకారుడికి వున్న సంబంధం చరిత్రలో ఎక్కడన్నా బలహీనపడిందేమో వెతుకుదాం. లేదు. అట్టా జరగలేదు. ఉత్కృష్టమైన కళాసృష్టే జరిగింది. భూమ్మీద జరిగే ప్రతి మార్పు కళని మారుస్తూ ముందుకొచ్చింది. ప్రపంచం మూలల్లోకి వెళ్దాం. అంతా అట్టాగే జరిగింది. ప్రతి మూలలో సంఘర్షణే చరిత్రగా నిలిచింది. మా నిషాదం మొదలు మహాప్రస్థానం దాకా పుట్టుకొచ్చిన పదాలనన్నీ రాసిపోస్తే ఆ రాసిలో దొరికేవి మూడే మూడు పదాలు. అలజడి ,ఆందోళన, తిరుగుబాటు. ఆ అలజడే కళ. ఆ ఆందోళనే పాట, ఆ తిరుగుబాటే ఆట.

నిజానికి ఎల్లన్నకి తెలీకుండానే, అర్థం కాకుండానే అతనిలో జరుగుతోంది ఆ

అలజడే, ఆ ఆందోళనే, ఆ తిరుగుబాటే. అయితే స్పష్టంగా తన ముందు కన్పించటంలేదు. నారిగాడు, మాతయ్య, నాగన్న ముందు నిలుస్తో, గుండెను తాకుతో, గుడ్లల్లో నీళ్లు చిమ్ముతో క్షణం క్షణం మెదలుతూనే వున్నారు. అయితే అట్టా ఎందరు నారిగాళ్లు, ఎందరు మాతయ్యలు, ఎందరు నాగన్నలు ? ఆ ప్రశ్న అతన్ని యిబ్బంది పెడుతోంది జవాబు కావాలి. జవాబు కోసమే అక్కడ వుండకూడదనుకొన్నాడు. ఎక్కడికో వెళ్లాలనుకొన్నాడు ఎక్కడికనేది తెలీదు అక్కడే తప్పుచేశాడు. అయినా వెళ్లాడు. తప్పుచేశాడని కూడా అనలేము. యిక్కడ వుంటే తన సంఘర్షణ అంతా నాగన్న దగ్గరే ఆగుతోంది. ఆ లేమి దగ్గర గందరగోళమౌతోంది. అందుకే వెళ్లాడు. ఎన్నెలదిన్ని దాటి వెళ్లాడు. ఒకప్పుడు అగ్రకుల అహంకారం తరిమితే దిసమొలతో ఎన్నెలదిన్ని దాటి పరుగుతీశాడు. యిప్పుడు కావాలనే వెళ్లాడు వెతుకులాటతో వెళ్లాడు. చుక్కల ముగ్గుకర్ర సుభద్రని వదిలాడు. శివయ్య చిరునవ్వుల్ని మరచాడు. బూదేవిని ఎన్నెలదిన్నికే వదిలాడు. కన్న తల్లితో తండ్రితో తనకున్న బంధం చాలా చిన్నదే. వెళ్లేటప్పుడు అది గుర్తు కూడా లేదు.

వెళ్లే ముందు వారం రోజులు శివయ్యతో ఆడాడు. బూదేవితో పాడాడు. చాలారోజుల తర్వాత అల్లుడి మొఖంలో కళచూసి మురిసిపోయింది బూదేవి. నేస్తాలతో గడిపాడు. జట్టుతో కోలాటం పెట్టాడు. చిన్నమ్మి బూదేవిని పిల్చి అల్లుడికి సజ్జబూరెలు చెయ్యమంది. ఆరోజు బూదేవితో సహా అంతా అక్కడే తిన్నారు. జీవితం అంత ఉధృతమైన వాగు పొంగులా వుంటుందనుకోలేదు సుభద్ర. ఆ వారం రోజుల్లో ఓ రోజు రాత్రి నేస్తాల మధ్య కూర్చొని కొత్తపాట అల్లాడు ఎల్లన్న. చాలా పెద్దపాట. అత్త తెల్లార్లూపాడే ఓ జానపద పాటని వరస తీసుకొన్నాడు.

ఆ పాటలో నారిగాడు, వరద, మాలామాదిగలు దిబ్బమీదికి ప్రయాణం. నారిగాడి మరణం. మాలాడి దిబ్బ. అదో చరిత్ర లాసాగింది. వీరుడు నారయ్య నేలకొరిగినప్పుడు, మాతయ్య మనోవేదన. నేస్తాల గుండెలు కరిగాయి. పాట మొదలయ్యాక పల్లెలో జనం ఒక్కొక్కరే చేరారు. కళ్లముందు దృశ్యం చూశారు. తన పాట అంత ప్రభావం చూపుతుందని ఎల్లన్న ఊహించలేదు. పాట రెండు గంటలు సాగింది. అది బుర్రకథ కాదు. హరికథ కాదు. ఆడాళ్లు అన్నాలు తిన్నాక తీరిగ్గా పాడుకొనే వరస. ఆ వరసలోనే అనేక మార్పులు చేశాడు ఎల్లన్న. మరుసటిరోజు రాత్రి దాన్ని కథగానే చెప్పమన్నారు పెద్దలు. మరుసటి రోజు కథ మొదలైంది. రెండు గంటలు కాదు మూడు గంటలు సాగింది. ఆడాళ్లు పెద్దగానే ఏడ్చారు. మగాళ్లు కళ్లు వొత్తుకున్నారు. కథ వినినపిట్టోడు ఆగలేకపొయ్యాడు ఆ రాత్రి అల్లుడ్ని దగ్గర కూర్చొబెట్టుకుని మాతయ్యని చెప్పాడు. చెప్పకూడదనుకొంటూనే చెప్పాడు.

ఎల్లన్న అంతా విన్నాడు. అంతా విన్నాక జీవితం కేవలం కన్నీళ్లు మాత్రమే కాదనుకొన్నాడు. తన కథ కన్నీటితో ఆగదనుకొన్నాడు. అసలు ఏ కథా కన్నీటితో

ఆగకూడదనుకొన్నాడు. అంటరాని జీవితమంతా మాతయ్య ఆక్రమించాడు. జీవితం గొప్ప సాహసి ఎంత సాహసి అది, మాతయ్య అంత. పాట అల్లుకుపోతోంది. కథ మరో క్రమంలోకి మారింది. ఎన్నెలదిన్ని గ్రామస్వరూపం, మాలామాదిగల స్థితిగతులు, పెద్ద కరణం, భూమి, అట్టా మొదలైంది కథ. వరద, నారగాడి మరణంతో మలుపు తిరిగింది. పెద్ద కరణాన్ని మాతయ్య మట్టు పెట్టటంతో ముగిసింది. అట్టా అల్లుకపొయ్యాడు కథని.

తానో వీరగాధకి ప్రాణం పోస్తున్నట్టు ఎల్లన్నకి తెలీదు. నిజానికి ఎల్లన్న అల్లింది ఓ వీరగాధాచక్రం. కాకపోతే కాటమరాజు వీరగాధా చక్రంలో లా ముప్పయికి మించిన కథలు లేకపోవచ్చు. కాని యిద్దరు వీరులున్నారు. ఒక వీరుడు వీరమరణం చెందాడు మరో వీరుడు ఆ వీరుని నెత్తుటి బాకీ తీర్చుకొన్నాడు. ఆ యిద్దరి వెనుకభూమి వుంది ఆత్మగౌరవం వుంది. అంత విశ్లేషణ ఆరోజు ఎల్లన్నకు తెలీకపోవచ్చు. కాని అల్లాడు. "పలనాటి యుద్ధం" రాసిన శ్రీనాధుడు కాకపోవచ్చు ఎల్లన్న. ఒక గొప్ప స్పందించే కళాకారుని హృదయం అతను. పదాలు తన సొంతం. తనకు తెలిసినవి. తన చుట్టూ వున్నవాళ్లకు తెలిసినవి. జీవితం తన అనుభవం. తన చుట్టూ పుట్టి పెరిగిన వాస్తవం. రాగంతో తాను పరుగెత్తలేదు. రాగాన్ని తనతో లాక్కొచ్చుకొన్నాడు. అది సహజత్వం. ప్రతి జానపదుడూ అట్టాగే చేశాడు. తాను ఎక్కడా బందీ కాలేదు. భావాన్ని ఏ చెరలోనూ బంధీని చెయ్యలేదు. గాలిపాట అంటారు పండితులు. సహజమైన స్పందనకు మారుపేరు గాలిపాట. చాలా స్వేచ్ఛగా ప్రకృతిలో జరిగే ప్రతి సహజమైన ప్రక్రియలా, మార్పులా, మలుపులా, మెల్లగా వీస్తూపోయే పిల్లగాలిలా ... గొడ్లుకాసే కుర్రాడు యిష్టంలా మోగే పిల్లనగ్రోవిలా.

కాస్తపనుంది వెళ్లొస్తానన్నాడు. ఆ కాస్తపని అన్ని సంవత్సరాల ఎడబాటు అనుకోలేదు సుభద్ర. వెళ్లిరావటం అంతదూరంగా వుంటుందనుకోలేదు బూదేవి. వెళ్లొస్తానన్న రోజు చూశారు. మరుసటి రోజు చూశారు. మూడోరోజు పిట్టోడు భుజం మీద తుండుగుడ్డ వేసుకొని బయల్దేరాడు. ఎంకటనర్సు తానూ వస్తానన్నాడు. ఎల్లన్న వెల్తాడనుకొన్న అన్ని వూళ్లూ తిరిగారు. జాడలేదు.

# 11

నిజానికి తిరిగా రాకూడదని వెళ్లలేదు ఎల్లన్న. రావాలనే వెళ్లాడు, కాని ఎప్పుడు అనేది అతనికే తెలియలేదు. అట్టా కొట్టుకపొయ్యాడు. సుడిగాలికి గిర్రున తిరిగిన ఆకు తనకు తెలీకుండానే ఏదో వైపు విసిరి వేయబడ్డట్టు, పట్టుమని పదిరోజులు ఏవూళ్ళోనూ వుండలేదు. ఒక్క గుంటూరు ప్రాంతంలో మాత్రం ఒకే వూళ్ళో కొన్ని నెలలున్నాడు.

పెరిగేపైరు పంటలమీద పాటలల్లాడు. నాటుకు వంగిన కూలీల కష్టాన్ని పంచుకొంటూ గానం చేశాడు. చేల గట్లపై నారుకావిళ్లు మీద పదాలు పలికాడు. పంటకోతని, నూరిసే కుప్పని అట్టానేల మీద జరిగే ప్రతి విన్యాసాన్ని పలికాడు. అంతే చేశాడు. అప్పటికప్పుడు అల్లుకోవడమే.

ఏ గ్రామం చేరినా, అక్కడి మాలపల్లెకో మాదిగపల్లెకో చేరేవాడు. ఉన్న నాలుగు రోజులూ అక్కడే గడిపేవాడు. ఆ నాలుగురోజులూ అక్కడ రాత్రంతా పాటలే. రాత్రంతా సందడే. మాల బైరాగి అని తాను పేరు పెట్టుకోలేదు. జనం అట్టా పిలిచారు. పిలుచుకోనిమ్మని వూరుకున్నాడు.

అల్లిన ప్రతి పాటలో సుభద్రను వుంచాడు. సుభద్రకు చెబుతున్నట్టే పాడాడు. అతని పాటకి పల్లవి సుభద్ర. అల్లికకు అసలైన దారం. ఆ దారం చుట్టూ పాటల దండలు కూర్చుకపొయ్యాడు.

కురిసేవానలో, మెరిసేమేఘంలో, పారే పంట కాల్వల్లో, పైరుమీద పరుగెత్తే పసి తెమ్మెరలో, చిగురు దొన్నెల్లో, పార్లే ఆశలో, పులకించే మనసులో, ఎన్నెల పిట్ట రొదలో, నిశ్శబ్దంలో, నర్తనలో, బతుకు జీరలో, అట్టా జీవితం ప్రతి అంచునా తన పల్లవి సుభద్ర. అట్టా సుభద్రని వెంటేసుకొనే తిరిగాడు. ఎవరీ సుభద్ర అంటే ఏదీ మాట్లాడడు. నవ్వి వూరుకొంటాడు. ఆ నవ్వే అతన్ని బైరాగిని చేసింది, మాల బైరాగిని చేసింది.

వేమనని వెలికి తీసిన బ్రౌన్ దొర తెలుగు భాషకు అనన్యంగా కృషి చేస్తున్న రోజులు. తెలుగు సాహిత్యం, సంస్కృతిలో బోలెడు విచిత్రాలు. యాదృచ్ఛికాలని కొట్టెయ్యలేము., వేమన కోసం బ్రౌన్ వెతికే రోజుల్లో, తాళపత్రగ్రంథాల కోసం చేసిన అన్వేషణలో బ్రాహ్మణకవుల ముట్టడి తక్కువ. కాబట్టే వేమన బైటకు రాగలిగాడు.

బ్రౌన్ చుట్టూ బ్రాహ్మణ పండితులు మూగారు. బ్రౌన్‌కు ఎల్లన్నలు కన్పించే అవకాశమే లేకుండా పోయింది. ఈ బ్రాహ్మణ పండితులు, వ్రాయసగాండ్రు గ్రామాలు తిరుగుతూ గ్రంథాలు సేకరించారు. అన్నీ శతకాలు, అన్నీ పురాణేతి హాసాలు, కాశీ

పురాణాలు, విష్ణుపురాణాలు, సూర్య తనయ పరిణయాలు, అట్టా ఎంత దూరం వెళ్ళారంటే మంత్రగాడి మంత్ర తంత్రాలు కూడా తెలుగు సాహిత్యంగా చెలామణి చేశారు. వేమనని కవిచౌడప్పని, సుమతీ శతకాన్ని, పోతన భాగవతాన్ని అట్టా కొన్నిటిని పక్కన పెడితే మిగిలిందంతా తెలుగుకాని తెలుగుని తెలుగుగా చెలామణి చేశారు. వెలగపూడివాళ్ళు, ములగపాకవాళ్ళు, రావిపాటి వాళ్ళు, చిలకమర్రి వాళ్ళు, సముద్రాల, తిప్పాభట్ల, పురాణం వాళ్ళు, పువ్వాడ వాళ్ళు ..... అంతా చేరి అసలైన తెలుగు పదాన్ని వెలికితీసి పదిలపరచే అవకాశమే లేకుండా చేశారు

ఎల్లన్నల జీవితాలకి ఏ కాలంలో న్యాయం జరిగింది కాబట్టి. వాళ్ళ భావాలకి ద్రోహం జరిగింది. వాళ్ళ మాటకి, బాణీకి జరిగిన ద్రోహం అంతాయింతాకాదు. ప్రజల సంస్కృతి ప్రాణం తీశారు ఏ ఎండకి ఆ గొడుగు పట్టి ప్రజలదికాని సంస్కృతికి పెత్తనమిచ్చి పట్టం కట్టారు. తమ పీఠాధిపత్యం నిలబెట్టుకోడానికి ఏ అడ్డమైన గడ్డయినా కరవటానికి వెనుకాడలేదు ఈ పండితులు. కేవలం అయిదుగురో ఆరుగురో మెచ్చుకొనే కళని, సాహిత్యాన్ని తొంభై శాతం ప్రజల పైన రుద్దారు.

ఆలయం బయటి కళంతా, సాహిత్యమంతా, సంస్కృతంతా అలగాజనానిదైపోయింది. ఆలయం లోపలి జీవంలేని పెనుగులాటంతా కళై ముందు కొచ్చింది. అప్పటి కాళిదాసు శకుంతల, అల్లసాని వరూధిని, నిన్నటి నండూరి ఎంకీ, యిప్పటి విశ్వనాథ కిన్నెర అంతా ఊహా సుందరులు. కాని ఎల్లన్న సుభద్ర ఊహ కాదు. ఆమె పుట్టి పెరిగిన కులం ఊహకాదు. వేసిన అడుగులు, చూసిన ఎదురు చూపులు, ఎన్నెలదిన్ని ఊహలు కావు. నెత్తురూ, మాంసం కలిసిన ఊపిరున్న సజీవరూపం.

అయినా అది క్షేత్రయ్య పదం కాదు, అన్నమయ్య పదం కాదు, త్యాగయ్య పదంకాదు, సీతమ్మకు చేసి యిచ్చిన చింతాకు పతకం కాదు. ఓ మాల బతుకు. ఓ మాదిగ బతుకు. ఓ అంటరానివాడి పదం. అందుకే ఎల్లన్న పదాలు గ్రంథస్థం కాలేదు. కాని ఎవడెంత అడ్డుపడ్డా గుండెలోతుల్ని పూడ్చలేరు.

ఎల్లన్న పదాలని గాలి మోసుకెళ్ళింది. శ్రమ ఆ వూరి నుంచి ఈ వూరికి, ఈ వూరి నుంచి ఆ వూరికి వలస వెళ్ళినప్పుడల్లా ఆ పదాలని మోసుకెళ్ళింది. నెల్లూరు ప్రాంతంలో ఎల్లన్న పదాలు పలకని మాలపల్లె మాదిగపల్లెలేదు. బృందగానం చెయ్యని చేలగట్లు లేవు.

అప్పుడే ఓ సన్నివేశం జరిగింది. పండితుల తాళ పత్రగ్రంథాలకోసం, వాటిని పరిష్కరించడం కోసం, అట్టా పరిష్కరించడంలో తమ తెలివితేటల్ని కలపటం కోసం అమిత ఉత్సాహంగా ఊళ్ళు గాలిస్తున్న రోజుల్లో జరిగిన సన్నివేశం.

కుమ్మరి పెదకోటేశ్వరుడు. కుండలు మలచడంతో పాటు ద్విపదలు కూడా రాయటం మొదలు పెట్టాడు. బోలెడు రాశాడు. బాగా రాస్తాడనే పేరువుంది కూడా. ఒకానొక

సముద్రాల వారి యింట పుట్టిన పండిత శ్రేష్టుడు మాత్రం కుమ్మరి పెదకోటేశ్వరుడి ద్విపదల కన్నా ఆయన చేసిన కుండలు మిన్న అని ఓ ఛలోక్తి విసిరాడు. పండితలోకం చప్పట్లు కొట్టింది. అట్టా వాళ్ళ గుండె బరువు తీర్చుకొన్నారు. శంఖంలో పోసిందే తీర్థం. పరమబూతైనా బ్రాహ్మణుడు పలికిందే వేదం. ఏ పలుకు పలికినా వాళ్ళే పలకాలి. వాళ్ళు పలికితే సంస్కృతం సంస్కృతమౌతుంది. తెలుగు తెలుగౌతుంది. చివరకు యింగ్లీష్ కూడా యింగ్లీష్ కావాలంటే వాళ్ళే పలికి తీరాలి. అవసరమైతే బ్రహ్మని బ్రౌన్ దొరని చెయ్యగలరు. బ్రౌన్ దొరని బ్రహ్మని చెయ్యగలరు. నిజంగా అట్టాగే చేశారు. బ్రాహ్మణుల్ని తిట్టిన వేమన పద్యాలను సేకరించి వెలుగు చూపినందుకు బ్రౌన్‌ని హిందూ వ్యతిరేకి అని అన్నారు. ద్విపద కావ్యాలని "ముదివిటులు, విధవలంజలు, పదకవితలు" అంటూ తిట్టిన పండితులు బ్రౌన్ ద్విపద కావ్యాలమీద మక్కువ చూపినపుడు రూపాయికి యిన్ని ద్విపదలు రాసేట్టు కూలి పని చేశారు. విచిత్రజీవులు. ఛీ ఇది గాడిద అని అంటూనే అవసరమైతే దాని ఓండ్రులో ఓంకారనాదం వినగలరు.

కుమ్మరి పెదకోటేశ్వరుడు ద్విపదలు శివుడిమీద రాయలేదు. జంగాల ద్విపదల్లో గొప్ప తనం చూశాడు. తన ద్విపదల్లో పోతులూరి వీరబ్రహ్మాన్ని రాశాడు. కులంపేరుతో హెచ్చుతగ్గుల్ని నిరసించాడు. తాను కులాన్ని వదిలాడు. కుమ్మరి చక్రంలో జీవిత చక్రాన్ని మలిచాడు. అంతా మట్టే. బ్రాహ్మణుడు, రెడ్డీ, కుమ్మరి, చాకలి, మాల, మంగలి, మాదిగ అంతా మట్టే. చక్రం తిరిగే కుంది, సానపట్టే కుంది, విడిపోయే ఆకారం మనిషి. వాడు ఒక్కడే. అట్టా తనకు తోచిన పద్ధతిలో తన వేదాంతం రాశాడు. పండితులు దాన్ని మట్టికుండ వేదమని హేళన చేశారు. అతను వెనక్కి తగ్గలేదు. మట్టితో వినాయకుణ్ణి చేశాడు. దాన్నే బేడ డబ్బులకి అమ్మాడు. అదే పూజలందుకొంటున్నప్పుడు పండితులకన్నా మిన్నగా నవ్వాడు. మాలపల్లె వెళ్ళాడు. వాళ్ళ మగ్గం గుంట దగ్గర కూర్చొని మాట్లాడాడు. ఆకలి వేళ వాళ్ళచేతి పున్నీళ్ళే తాగాడు. కాకపోతే కాస్త సొంరి కలపమనేవాడు. మాదిగ పల్లె వెళ్లేవాడు ఆకలైతే అక్కడ తినేవాడు. తనకి వడ్డించింది ఏదీ అని అడగలేదు. అప్పుడప్పుడు 'బసవడి' కోసం వెతుకుతున్నాననేవాడు. కుమ్మర్ల యింటికి రానిచ్చేవారు కాదు. ఎవరు రానిస్తే వాళ్ళింటికే వెళ్ళేవాడు. తనచుట్టూ మనుషుల్లో బసవణ్ణి వెతికాడు. వెతుకుతూ గడిపాడు.

వీరబ్రహ్మాన్ని, బసవణ్ణి కలిపితే తన ద్విపద అసలు రూపమనేవాడు. అట్టాంటి కుమ్మరి పెద కోటేశ్వరుడు మాల బైరాగిని విన్నాడు. గాలి, శ్రమ, మోసుకొచ్చిన అతని పాటవిన్నాడు. చూడాలనుకొన్నాడు. తన పక్క వూరులో వున్నాడని తెలిసి చెనగపప్పు, బెల్లం మూట కట్టుకొని బయల్దేరాడు.

చేరాల్సిన గమ్యానికి తన దారి తాను వెతుక్కుంటూ బయలుదేరాడు. సందెవేళకి వూరు చేరాడు. మాల బైరాగి కోసం వాకబు చేశాడు. ఆ వూరిపండితుడు అతన్ని

గుర్తుపట్టాడు. ఎవరికోసం అని రెట్టించి అడిగాడు. చాలా ప్రశాంతంగా మాల బైరాగి కోసమన్నాడు. పండితుడు వింతగా చూశాడు. మళ్ళీ అడిగాడు. "నీ భగవంతుడు నీకు చెముడు ఎందుకిచ్చాడు ?" అని ఆ పండితుడ్ని ప్రశ్నించాడు, పండితుడికి కోపం వచ్చింది. మాల బైరాగిని కలవడానికి రాజమార్గంలో, అందునా బ్రాహ్మణ బజారులో నడిచే హక్కు నీకు లేదు. ఆచారమంటే కుమ్మరికుండలు చెయ్యడం కాదు. తక్షణమే వెళ్ళు యిక్కడనుంచి అంటో అరుగుమీది రాగి బిందెలో నీళ్ళు చల్లడానికి బిందె చేతికి తీసుకున్నాడు. పదిమందీ చుట్టూ చేరారు. ఈ కుమ్మరాడు మాలవాణ్ణి కలిసేందుకు బ్రాహ్మణ బజారులో నడిచి పోతున్నాడు. తరమండి ఈ అప్రాచ్యుణ్ణి అంటూ అరవటం మొదలెట్టాడు కుమ్మరి కోటేశ్వరుడు ఆ పండితునికేసి వింతగా చూశాడు. కాలు పైకి ఎత్తాడు. కాలికున్న మట్టిని చేతిలో తీశాడు. ఈ మట్టి తాకి నాకాలు అపవిత్రమైంది అంటూ ఆ మట్టిని అక్కడ విదిలించాడు. ఖాండ్రించి నేలమీద ఉమ్మాడు. ఈ ఉమ్మి అంటరానిదైతే దీన్ని మీ పవిత్రమైన చేతుల్తో ఎత్తి వేసుకొండి అంటూ వెనక్కి చూడకుండా అడుగులు మాలపల్లి వేపు వేశాడు. అంతా చూస్తూవుండిపోయారు. అతను వెళ్ళినా పండితుడు నోరు ఆగలేదు. వీణ్ణి కుమ్మరి కులం వెలేసిందని అన్నాడు. యింత అవమానం చేసిన వాణ్ణి చూస్తూ వూరుకోరాదన్నాడు. ధర్మాన్ని రక్షించడానికి ముందుకురండని గావు కేక వేశాడు. కొందరికి ధర్మపూనకం వచ్చింది. ఊగిపోయారు. కుమ్మరి కోటీశ్వరుడనే ద్రోహికి బుద్ధి చెప్పాలనుకొన్నారు. కాపు వేయడానికి సిద్ధమయ్యారు

మాలబైరాగి మాలపల్లెలో లేడు. యానాదుల గుట్టమీద వున్నాడని తెలిసింది. ఆ గుట్టకేసి నడిచాడు. యానాదుల గుట్ట దగ్గర పడుతోంది. అద్భుతమైన సన్నని రాగం విన్పిస్తోంది. శబ్దం డప్పులదేగాని అది మాదిగ డప్పుల శబ్దంలా లేదు.. అదో వింత శబ్దం. మధ్యలో పిల్లన గ్రోవి నాదం. గొంతు మగాడిదికాదు. దగ్గరకు వెళ్ళేకొద్ది పాట స్పష్టమౌతోంది. యిప్పుడు మగాడి గొంతు విన్పిస్తోంది.

భామరో నాపేరు అభిమన్యుడందురే.
అబ్బేమో అర్జునుడు, అమ్మేమో సుభద్ర
భామరో ..........................................

భామరో నాపేరు అనే దగ్గర రగడ మొదలైంది. అభిమన్యుడందురే దగ్గరవంత పలికింది.

కుమ్మరి కోటీశ్వరుడు దూరంగా ఆగిపోయాడు. ఎదురుగా అద్భుతమైన దృశ్యం. అతని కళ్ళు మాల బైరాగి కోసం వెతికాయి. తన దృష్టి ఆగిన చోట యిసుక తిన్నెపై కూర్చొని తదేకంగా చూస్తున్న గడ్డం వ్యక్తిని మాల బైరాగి అయివుంటాడనుకొన్నాడు. అడుగు ముందుకు వెయ్యబోయాడు. యింతలో శ్రావ్యమైన సన్నని గొంతు.

ఎవ్వరైతేనేమీ పోరా
నాతో పరిహాసమెందుకు లేరా
దవ్వులనుండుము దగ్గరకు రాబోకు. ॥దవ్వుల॥

దవ్వుల దగ్గర మళ్ళీ రగడ... మాల బైరాగి తన్మయుడై చూస్తున్నాడు. అతను మాల బైరాగి దగ్గరకెళ్ళాడు. ఒక్కసారి పాట ఆట దరువు ఆగిపోయాయి.

తాను ఎవరో చెప్పాడు. ఎందుకొచ్చిందీ చెప్పాడు. మాల బైరాగి పెదకోటీశ్వరుడుకేసి చూశాడు. ముందుకు దువ్విన తెల్లని పొట్టి వెంట్రుకలు. మూడొంతులు నెరిసిన మెలిదిరిగిన గడ్డం. ఎప్పుడైందో రణం కాలికి కట్టు కట్టి వుంది. చూపు సూటిగా వుంది. దీక్షగా చూస్తే అవతలి మనిషిని కాల్చిమసి చేసేలా వుంది. ఎందుకో తెలియటం లేదుగాని అతనికి గురుస్థానం యివ్వాలనిపిస్తోంది. ఆ మాట పైకి అనక పోయినా అంత గౌరవంగా చూశాడు మాలబైరాగి అతనికేసి. పెదకోటీశ్వరుడు మాలబైరాగి పక్క కూర్చొన్నాడు.

ఆకాశంలో చుక్కలు. ఎంత గొడవ వాటిది. ఆ మూలకి ఈ మూలకి, ఎంత పరుగు వాటిది. యిసుక తిన్నెమీద ఎందుకంత చుక్కల వెలుగు యిష్టంగా పరుచుకొంది. తనలో కలిసి పొయ్యేవాళ్ళంటే ప్రకృతికి ఎందుకంత యిష్టం.

"ఇళ్ళొదిలి చాలా ఏళ్ళయింది. ఎర్ర గొల్లల ఆట చూశా. కొత్తయిండ్లు, కోటకొండవాళ్ళ ఆటలు చూశా. చిందువాళ్ళ, చిన మాదిగల, చిలకల వాళ్ళ ఆటలు చూశా. జగం వాళ్ళ, జంగాలి పల్లి వాళ్ళ ఆటలు చూశా. దాసరి వాళ్ళ, పిచ్చిక గుంటల వాళ్ళ ఆటలు చూశా. సరే మాల వాళ్ళ ఆటలు ఆడా. కాని యానాదుల ఆటల్లో వున్న వొడుపు నాకు ఎక్కడా కనపడలా. ఆ గొప్ప తనం వీళ్ళ నడుములో వుంది. అంత అందమైన నడుము మరే కులానికీ లేదు. ఆట కోసం పుట్టిందా నడుము. ఆ తిరుగుడు తిరగొచ్చు కాని అంత అచ్చు గుద్దినట్టు అందరికీ వుండదు."

మాల బైరాగి చెప్పుకపోతున్నాడు. అతన్ని కుమ్మరి పెదకోటేశ్వరుడు వింతగా చూస్తున్నాడు. పండితుల్లో వుండే ఈర్ష్య, పీఠాధిపత్యం కోసం చేసే కుట్ర యితన్లో లేదనిపించింది. అసలు జానపదంలోనే ఆ స్వచ్ఛత, నిజాయితీ వుంది. నిర్మలత్వం, సహజత్వం వుంది. అందుకే అది విసిరేయబడ్డా, వెలివేయబడ్డా సజీవంగా వుంది.

"చుక్కలు ఎట్టా వున్నయ్...." పెదకోటీశ్వరుడు అన్నాడు.

ఆమాటకి మాలదాసరి ఆకాశం కేసి చూశాడు. చుక్కల గుత్తులు. ఆగుత్తికి ఈ గుత్తికీ మధ్య పరుగు తీసే ఒంటరి చుక్కల పరుగులు. ఎంత చూసినా దప్పిక తీరదు.

"చుక్కలమీద పాటపాడు. వినాలనే యింత దూరం వచ్చా. ఈ రాత్రంతా పాడు. నువ్వు పాడిన ప్రతి పాటానేను రాస్తా. కడపలో కాయితం బాగానే వుంది. నెల్లూరులో కూడా అమ్మకం వుంది. తాళ పత్రాల మీది పదాలు కాయితంమీదికి ఎక్కిస్తున్నాడు తెల్లదొర. పండితులంతా వూళ్ళు గాలిస్తున్నారు. నేను బసవడి కోసం తిరుగుతున్నా. వాడి మాటలు

కావాలనాకు. చాలా మటుకు రాశా. దాలిగుంట పెడదాం. ఆ వెల్తురులో రాస్తా, ఆకులు మంచివే తెచ్చా."

పెదకోటేశ్వరుడు చెప్పటం ఆపి మాల బైరాగి కేసి చూశాడు.

దాలి గుంట మండుతోంది. మంటలో చుక్కల వెలుగు. ఏదీ వోడిపోదు. కలిసి పోతాయి. ఎట్టా కలిసిపోతాయి. గుండెతో చూడాలి. అంతే.

రాత్రి వింత శబ్దం విన్పిస్తోంది. యానాది రమణయ్య డప్పుపైన పుల్ల కొడ్తున్నాడు. రాత్రి వింత శబ్దంలో డప్పుపుల్ల కలసిపోతోంది. ప్రకృతి ఒక్కసారి ఒళ్ళు విరిచి కళ్ళు యింతవి చేసుకొంది. వింత పులకరింత దానికి, ప్రతిక్షణం తన సొంతం చేసుకొంటో. దాగిపోవటం అట్టా వుంటుంది.

మాల బైరాగి గొంతు విప్పాడు. పెదకోటేశ్వరుడు రాస్తున్నాడు.

ఎంత దూరం ఎన్నెల దిన్ని ? ఎంతో దూరం లేదు. పెద కోటేశ్వరుడి రాతలో దాగిపోతుంది.

రాత్రి గడిచిపోతోంది, ఆగలేకపోతున్నా ఏది అనుకోకండి మిత్రులారా అంటో

మాల బైరాగి గొంతు, యానాది రమణయ్య డప్పుపై పుల్ల లయ, కుమ్మరి పెదకోటేశ్వరుడి రాత. కురిసే వెన్నెల. తడిసే ప్రకృతి. కలిసే పిల్లగాలి.

ఏది జరుగుతోంది యిక్కడ, ఈ దాలిగుంట వెలుతురు సాక్షిగా, ఏ సాహిత్యం ? ఏ సంగీతం ? ఎందుకింత అద్భుత సృష్టి ? సత్యం అంటారు శివం అంటారు. సుందరం అంటారు. ఈ త్రిత్వం ఎందుకు అంటరానిదయింది.

పెదకోటేశ్వరుడు మనస్సులో వెయ్యి ఆలోచనలు. సానెమీద అద్భుత ఆకారాన్ని పొందే మట్టికుండకు ఎంత గుండెకోత. ఆ వేడికి దూరం కావాలని ఎంత ఆరాటం. తాను మట్టిగా వున్నప్పుడు, కేవలం మట్టిగానే వున్నప్పుడు ఎంత ప్రాణం దాని ప్రతి అణువులో. ఎంత గొప్ప నేస్తం కట్టేది అది పూలతో, చెట్లతో, రెల్లుగడ్డితో . అవును కదూ ఆ మట్టే కదూ ఈ పాటలు. ఆ సజీవమే కదూ ఈ సంగీతం. అంత సహజత్వాన్ని, అంత నిండుప్రాణాన్ని ఎందుకు బతకనీరు. శాస్త్రీయమంటో ఎందుకింత దారుణంగా హత్య చేశారు, మాటని, పాటని ఈ పండితులు . ఈ కాలిన కుండలు. ఈ పగిలే కుండలు. ప్రాణం లేని భావ చిత్రాలు. ప్రకృతిలో ఎంత గొప్పగా మమేకమైంది ఈ మట్టి అల్లిక. "మాల బైరాగీ నీ పేరు చెప్పు రాస్తున్నాను. సుభద్రని రాశాను. ఎన్నెలదిన్ని రాశాను. నాగన్నని, మాతయ్యని రాశాను, నారిగాణ్ణి రాశాను, చెప్పు నీపేరు. చెప్పవయ్యా, చెప్పు". పెదకోటేశ్వరుడు రాస్తూనే అడుగుతున్నాడు.

రెండు జాములు దాటాక దాలిగుంట నుసినికదుపుతూ మాల బైరాగి అన్నాడు.

"అడిగావు , చెబుతున్నా . ఎల్లన్న, ఆటెల్లడు. పాటెల్లడు."

పెదకోటేశ్వరుడు అట్టాగే చూశాడు. పక్కనే రొదచేస్తో ఎన్నెలపిట్ట దూసుకపోయింది. ఎల్లన్నకి నవ్వొచ్చింది.

“విను దాని రొద”

చాలా దూరం దాని రొద విన్పిస్తూనే వుంది.

“ఏం విన్పిస్తుంది దాని రొదలో నీకు”

“అంటరానివాడి గుండె గొంతుక”

“గుండె గొంతుక ! ఎట్టా అల్లావు ఆపదాన్ని”

“నేను కాదు. బతుకు. బతుకు అల్లింది. కాదూ ? బతుకు అల్లిన అల్లికకాదూ? చిన్ని ఎల్లడు అంతపరుగు తీసి ఆగినప్పుడు ........... ఉరుముల శబ్దం కదూ వాణ్ణి బతికించింది. అది బతుకు. అదే అల్లింది. ఆటని మాటని. పాట నాయింట పుట్టింది, మాట నాయింట పుట్టింది. ఆట నా బతుకులో లయ నేర్చుకొంది. అందుకే వాళ్ళు నన్ను ఎంత విసిరేసినా అవి నాయింటికే పరుగుతీశాయి. నాతో పుట్టినాతోనే మట్టవుతాయి.

“నువ్వు వేదాంతివి”

“అది పండితుల కిరీటం. నాకొద్దు ఆ పదం.

నాదిబతుకు. మనిషిబతుకు. మట్టి బతుకు”

“శబ్దం నీపాదాల దగ్గరుంది”

“తప్పు. నాగుండెలో వుంది.”

అట్టా సాగింది ఆ యిద్దరి మధ్యా రెండు జాములు దాటిందాకా

ఆతర్వాత ఆ యిద్దరూ ఆదమరచి నిద్రపొయ్యారు. యానాది రమణయ్య డప్పుపుల్ల కొడుతూనేవుంది. జీవుడు మాత్రం ఎప్పుడో నిద్రలో జారుకొన్నాడు.

తెల్లవారింది. రాసిన రాతంతా మూట గట్టి మాల బైరాగి చేతిలో పెట్టాడు పెదకోటేశ్వరుడు. వద్దన్నాడు. నీదగ్గరే ఉంచమన్నాడు మాల బైరాగి.

‘వస్తాను ఎల్లన్నా’

‘ఆపేరిని చాలా ఏళ్ళయింది”

నవ్వులు. నవ్వులతోనే వీడ్కోలు చెప్పుకొన్నారు. వీడ్కోలు చెప్పుకొంటూనే చాలా దూరం నడిచారు. యానాది రమణయ్య కళ్ళతోనే నవ్వుతున్నాడు. కళ్ళతోనే మాట్లాడుతున్నాడు. అతని నడుము నాట్యాన్ని, కళ్ళు భావాన్ని ఆవిష్కరిస్తాయి. మాట అతనికి ఎప్పుడోకాని అవసరం వుండదు.

మాలామాదిగ పల్లెల్ని ఊరిని వేరు చేసే పొలిమేర దగ్గర ఆగారు.

“నేను యిటు వెళ్ళను”

“ఏం”

“వచ్చేటప్పుడు నాకాలి మట్టితుడిచి విసిరాను. ఖాండ్రించి ఉమ్మిమరీ వచ్చాను.”

“పక్కదారి బాగుండదు”

"దారి ఎప్పుడూ బాగుండదు. నడిస్తే బాగౌతుంది. చెయ్యాల్సింది నడవటమే. ఇది వేదాంతం కాదు. బతుకు పారం" అంటూ నవ్వాడు. ఎల్లన్న నవ్వాడు. రమణయ్య్ర కళ్ళు నవ్వాయి.

ఎల్లన్నను గుండెలకు హత్తుకున్నాడు. రమణయ్యని గుండెలకి హత్తుకొన్నాడు వీడ్కోలు అంత భారంగా వుండకూడదు. అయినా తప్పదు. నలుగురూ నడిచిన దారివొదలి ఎవ్వరూ నడవని దారికి నడకని పరిచయం చేస్తూ ముందుకు సాగాడు. చూస్తూ వుండి పొయ్యారు మాల బైరాగి ఎల్లన్న, యానాది రమణయ్య.

వెనుక్కివెళ్ళాలని అన్పించడంలేదు. ఎత్తుగా పెరిగున్నవకే వక్క తాటి చెట్టు మోము కేసి చూశాడు రమణయ్య. కాలికి బందం వేశాడు. కత్తి బొడ్లో దోపుకున్నాడు. తాటి చెట్టు మోము దగ్గర కూర్చొన్నాడు. బాగా దిగిన రెండు తాటి గెలలు కొట్టాడు. కాయలు కొట్టుకుంటూ, ముంజలు తింటూ అక్కడే వుండి పొయ్యారు.

అట్టావున్నారు కాబట్టే ఆ ఆర్తనాదం విన్నారు. తలెత్తారో లేదో ఆమలుపు అంచున ప్రాణాలు చేతుల్లో పెట్టుకొని పరుగెత్తే పెదకోటేశ్వరుణ్ణి చూశారు. తరుముకొస్తున్న అగ్రవర్ణాలను చూశారు. వాళ్ళ చేతుల్లో కర్రలు, బరిసెలు, కత్తవ పారలు, గొడ్డళ్ళు చూశారు. అందరికన్నా ముందు రొప్పుతూ పరుగెత్తే పండితుణ్ణి చూశారు. కళ్ళముందే నేల మీద పడ్డ మిత్రుణ్ణి చూశారు. అతని వీపున దూసుక పోయిన బరిసెను,. తలపై దాడిచేసే కర్రల్ని చూశారు. పండితుడు వేమూల విసిరేసి కాలుస్తున్న రాతప్రతుల్ని చూశారు. దూరంగా వున్నా ఒక్క క్షణంలో అన్నీ చూశారు. పెద్దగా అరుస్తూ పరుగుతీశారు. వాళ్ళ అరుపులు మాలపల్లి తాకాయి. మాదిగపల్లి తాకాయి. యానాది గుట్టలో పుట్ట పగిలింది. అరుపుల్తో అంతా ఆ దారుణ దృశ్యం వైపు పరుగుతీస్తున్నారు.

పరిగెత్తే జనాన్ని చూసి, చెయ్యాల్సిందంతా చేశారు కాబట్టి అగ్రవర్ణాలు పారిపోయారు. అలగా జనం అక్కడికి చేరారు.

నెత్తురు మడుగులో కుమ్మరి పెదకోటేశ్వరుడు. మండుతున్న మాలబైరాగి ఎల్లన్న పాటల చివ్వరి రాతప్రతి.

మిత్రుడి తలని వొళ్ళో పెట్టుకొన్నాడు ఎల్లన్న. పెదకోటేశ్వరుడు ఎల్లన్న కేసి చూశాడు. రమణయ్య కేసి చూశాడు. చుట్టూ మూగిన జనాలకేసి చూశాడు. తృప్తిగా నవ్వాడు. 'పిలిచాడు. ఎల్లన్న బసవుడు !' చివ్వరిమాట ఎల్లన్నతో అన్నాడు.

చితికి ఎల్లన్నే నిప్పు పెట్టాడు.

ఎవరీ బసవుడు

ఎట్టాకలుస్తాడు వాడు. చితి మంటల్లోకి చూస్తూ ఎల్లన్న అనుకొన్నాడు. పోతులూరి పదాలు తెలుసు. ఈ బసవడ్ని అసలు తాను విననేలేదు. కాని బసవడిమాట పెదకోటేశ్వరుడి

నోట రెండు మూడు సార్లు విన్నాడు. చివ్వరి మాటా అదే. నాగన్నతన పురాణ రహస్యాల్లో చెప్పలేదు బహుశా చంద్రప్ప చెప్పివుండడు. కాని ఈ బసవడు ఎప్పటివాడు.

చితిమంట ఆరేంతవరకూ అక్కడే వుండి పొయ్యాడు. అస్తికలు పోగుచేసి సమాధి కట్టాడు రమణయ్య అక్కడ ఓ సంపెంగ మొక్క నాటాడు చుట్టూతా గంగిరేగి చెట్ల బారువేశాడు. ఎల్లన్న ఆవూరు వొదిలినా రమణయ్య చెట్లకి నీరు పోస్తూనే వున్నాడు.

రెండేళ్ళ తరువాత ఎల్లన్న అక్కడికి తిరిగి వచ్చాడు ఆ చెట్ల నీడల కింద రమణయ్య తిరుగుతూనే వున్నాడు. ఇప్పుడది ప్రశాంతమైన వనంలా వుంది. రమణయ్య కల్లాకపటంలేని ఋషిలా వున్నాడు. కళ్ళలో ఆనవ్వు చెరిగిపోలేదు.

ఆరాత్రి వెన్నెల్లో సంపెగపూల పరిమళం. నిశ్శబ్దానికి, కదలిక యిస్తో మాలబైరాగి ఎల్లన్న పాడేపాట. రమణయ్య డప్పు పుల్లల అలజడి. ప్రకృతికి మరోసారి వింత అనుభూతి. గంగిరేగు వెన్నెల నీడల్లో ఏదో పనిపడ్డట్టు తారాడే మిణుగురులు. చుక్కలు మాత్రం వుట్టినే వున్నాయా ? ఎంత సందడి వాటికి.

అట్టా వూళ్ళు తిరుగుతో ఏడాదికో, రెండేళ్ళకో అక్కడికి వస్తూనే వున్నాడు మాలబైరాగి ఎల్లన్న. రమణయ్య ఆ చెట్ల నీడల్లో అట్టాగే. విచిత్రం. ఏడాది కొకసారి మాలా మాదిగ యానాదులు అక్కడ గుమిగూడుతున్నారు. కుమ్మరి పెదకోటేశ్వరుడి సమాధి అలగా జనం సందడి స్థలమైంది. ఈ దేశం ప్రతిమూలలో అట్టాంటి సందర్భం నిజంగా వో విచిత్రసన్నివేశం. మాలబైరాగి ఎల్లన్న వచ్చిన ఏడాది అయితే అదో కళా ప్రాంగణం యానాదుల నృత్యాలు, పాటలు, ఆటలు, ..... డప్పులహోరు...... గీత కింద జనం వాళ్ళంతటవాళ్ళు ఏర్పాటు చేసుకొన్న కలయిక. ఈ కలయికకి సంప్రదాయం ఏ పేరు పెడుతుంది. ఏదో ఒకటి. అన్నింటికన్నా విచిత్రం ఆ ప్రాంతం కుమ్మరికులం ఆరోజు ఉపవాసం వుంటోంది. అట్టా అగ్రవర్ణాలు కలయిక జరిగితే అదో పుణ్యక్షేత్రం. ఏ దేవుడో ఎటో వెళ్తూ ఒక్క అడుగు అక్కడ వేశాడనే స్థల పురాణం. ఆ అభూత కల్పనలకు యిక్కడ చోటులేదు. ఏకృత్రిమ ఆచారం దీన్ని శాసించలేదు. యిక్కడవుంది ఆట, మాట, పాట కలసిన ఓ సుందర దృశ్యం అంతే.

# 12

ఎల్లన్న వూళ్లు పట్టి తిరుగుతున్నాడు.

శివయ్య ఎన్నెలదిన్నిలో పెరుగుతున్నాడు

తిరిగే ఎల్లన్న కోసం ఎదురుచూడడం , పెరిగే శివయ్య కోసం చేల గట్లకు శక్తి నంతా ధారపోయ్యటం తప్ప సుభద్రకు చెయ్యాల్సింది యింకేమీ లేదు. అంతా ఆశే. ఎప్పటికన్నా ఎల్లన్న వస్తాడనే ఆశ. శివయ్య తండ్రి దగ్గర లేకపోయినా గొప్పగా ఎదగాలనే ఆశ. ఆశకి దూరమూ తెలీదు. దగ్గరా తెలీదు. గెలుపుకు ఓటమికి తన దగ్గర చోటులేదు. అందుకే దాన్ని ఆశ అన్నారు. మనిషి బతకటానికి మనిషికన్నా ముందు పుట్టిన నమ్మశక్యమైన ఔషదం ఆశ. దానికి బతికించడమే తెలుసు. చంపటం బొత్తిగా తెలీదు. నిజంగా ఆ ఆశే , ఎల్లన్న ఎప్పటికన్నా వస్తాడనే చిన్ని ఆశేలేకపోతే, శివయ్యని ఎన్నిలదిన్ని లో సుఖంగా బతికేలా వుంచాలనే ఆగొప్ప ఆశే లేకపోతే పిట్టోడికి ఎంతో గుండెకోత కోసేది సుభద్ర. ఆ కోతకు వాడు తట్టుకొనే వాడు కాదు.

బిడ్డని చూడాలంటూ కలవరించి మంచం మీదే కన్నుమూశాడు ఎర్రెంకడు. మొగుణ్ణి కాదని నేను ఎట్టా వుంటాన్రా శివా, అంటో లింగాలు తనదారి తాను వెతుక్కుంది. కాలం ఆగిందా, గాలంతా ఎన్నెలదిన్ని పొలిమేరలు దాటి వీచనంటే వీచనని భీష్మించి కూర్చుందా? ఎండాకాలం అట్టా ఆగిందా. చెట్ల ఆకులు రాలిపోతే , కొమ్మలు, వూరుకొన్నాయా. కొత్త రెమ్మలు పుట్టకుండా ఆగాయా. ఏదీ ఆగలా. కాలంతోపాటు, దాని నడకతో పాటు, దాని పరుగులతో పాటు అది పంచిన పన్నీటిని, కన్నీటిని సమంగా ఎన్నెలదిన్ని మాలా మాదిగ యిళ్ళు ముంగిళ్ళలో కళ్ళాపీ చల్లుకుంటూనే వున్నాయి. ముగ్గు కర్రలు గీస్తూనే వున్నాయి.

పిట్టోడు వూళ్ళు తిరిగి యిళ్లు కట్టలేనన్నాడు. యింటిముందే నాగళ్ళు చెక్కుతూ కూర్చొన్నాడు. భుజాన పెట్టుకొనే పెదబాడిసె చేతిలో పట్టుకొనే చిన్న బాడిసె, ఉలి యిప్పుడు పక్కనే వుండిపోతున్నాయి. కాకపోతే పిడిసేన పట్టడానికి తాడు పట్టుకొని చిన్నమ్మి కూర్చుంటుంది. ఆ యిద్దర్ని అట్టా చూస్తే అదో తపస్సులా వుంటుంది. ఆ తపనంతా శివయ్య కోసమే. శివయ్య దేవుడు కాదు. దేవుడైతే ఓ టెంకాయతో సరిపుచ్చుకొనేవాళ్ళు. యింత ఈబూది మొఖాలకు రాసుకొనేవాళ్ళు. శివయ్య మనవడు. వాడి కోసం వయస్సు మర్చిపోయే తపస్సు అది. శ్రమ. మాలా మాదిగలకి మిగిలింది; దక్కిందీ అదే. శ్రమ.

భూగోళం మీద ఎక్కడో ఏదో మార్పు జరిగింది. నేతగాళ్ళ బతుకుమీద తెల్లోడు గురిచూసి చావు దెబ్బకొట్టాడు. ఉత్తరాదిన మగ్గాలు ఆడటం మాని రాట్నం మీద దారం మాత్రమే తిరుగుతోంది. ఎవడో దూది యిచ్చిపోతాడు. ఆనక నూలు కండీలు ఏరుకుపోతాడు. ఒక్కోదానికి యిన్ని దమ్మిడీలు లెక్క. వడికిన నూలు అక్కడెక్కడో మిల్లు కెళ్తుంది బట్ట ఏమౌతుందో ? అంతా తెల్లాడిమాయ. తెల్లాడితో చేతులు కలిపిన నల్లడలారీ వ్యాపారుల మాయ. చీరాల పేరాల ప్రాంతాలేకాదు. మగ్గం నమ్ముకున్న అన్ని ప్రాంతాలలో అంతే. నేత బతుకు సాలీలు, నేత బతుకు మాలలు, ఎవరైనా అంతే.

యిప్పటిదాకా మగ్గం గుంట దగ్గరే సంచకరువు పెట్టేవాడు ఎంకటనర్సు, మగ్గం గుంట దగ్గరే కోసిన దుప్పట్లు, పంచలు కొనుక్కొని మూట కట్టుకొని తిరిగేవాడు. కాని యిప్పుడది కాదు. మగ్గాం నేసే యిళ్ళు యిప్పుడు దారంతీసే వరకే ఆగాయి. కండెలు చుట్టే వరకే ఆగాయి. దారం కదుర్లు కండెలు తానేం చేసుకుంటాడు. మిల్లు దగ్గరికి వెళ్ళాలంటే కొత్త. అక్కడి వ్యాపార భాషవేరు. తీరువేరు. చాలామారింది ఈ మార్పు మింగుడుపడలేదు. యికతిరిగి లాభంలేదనుకొన్నాడు. చివ్వరిసారి వస్తూవస్తూ గోగునార కట్టలు తెచ్చుకున్నాడు. నులక పేనటం, మొదలెట్టాడు. యింటి పట్టునే వుండిపోయాడు. గోగునారతోనే రకరకాల విన్యాసాలు మొదలెట్టాడు. మంచం నులక, ఎద్దుల మువ్వల పట్టెడ, మూతికి సిక్కాం, ముక్కుకు ముకుతాడు, పగ్గాలు అట్టా అనేక రూపాల్లోకి మారుతోంది గోగునార. నూలు బట్టతో ముడిపడ్డ బతుకు గోగునారతో పూర్తయ్యేలా వుందని పించింది ఎంకటనర్సుకు. మాలాడి దిబ్బ కయ్యల్లో అక్కడక్కడా గోగులు వేశారు. పనికి వచ్చాకపీకి ఎండబెట్టేవాళ్ళు. దాన్ని ఏటి నీళ్ళల్లో తొక్కేవాళ్ళు. నానాక గోగుతీసేవాళ్ళు. నానిన గోగు ముందేసుకుని నీళ్ళలో గోగులు బయటకు తీసే ఎంకటనర్సుని చూస్తుంటే బూదేవికి యిప్పుడు విచిత్రంగా వుంటుంది. యిదేదో బాగానే వున్నట్టనిపిస్తోంది. మనిషి యింటపట్టున వుంటున్నాడు. ఆ క్షణమే ఎల్లన్న గుర్తొస్తాడు. మనిషి యింటి పట్టున వుండడంలో సంతోషం ఏగాలిలోనో కొట్టుకపోతుంది. అయినా ఎంకటనర్సు చేతిలో గోగునార ఎన్నికళలు మారుతుందో చూస్తుంటే అబ్బురంగానే వుంటుంది.

కళలంటాం మనం. అరవైనాలుగు కళలున్నాయని చెప్పుకొంటాం. ఎట్టా వచ్చాయా కళలు. అనుకొంటే అదోలా వుంటుంది. ఆశ్చర్యంగానూ అద్భుతంగానూ వుంటుంది. వాటిలో జీవితానికి ఆధారాన్ని యిచ్చిన సజీవ కళలు ఎట్టావున్నాయి. పశువుల చర్మాన్ని అతి నేర్పుగా తియ్యటం, దాన్ని మృదువుగా చెయ్యటం, మట్టితోటి, కర్రతోటి, కొయ్యతోటి కుండలు చెయ్యడం, పాడివుంటే పాలు పితకటం, వెన్న చిలకడం, కాసి నెయ్యితియ్యడం, నువ్వుల నుండి కొబ్బరి నుండి ఆముదాల విత్తనాల నుండి , పిచ్చి దిండిగ మొక్కలనుండి నూనె తియ్యటం, దూది వడకడం బట్ట నెయ్యటం, నాగలి పట్టి నిటారుగా కొంద్ర వేసి దున్నడం, విత్తడం కుప్పలు నురవటం, నీళ్ళు వుండే చోటు అన్వేషించి పుల్లనాటి చూపితే

తియ్యటివో, వుప్పటి నీళ్ళో పడటం, తాటినారతో, గోగునారతో, తాటి ఆకుతో, వెదురుతో వేముతో ఈతపుల్లలతో ఆకుతో చివ్వరకు నీళ్ళకాలువ అంచుల వెంట విస్తారంగా పెరిగేరెల్లుతో తాళ్ళు, బుట్టలు అనేక రకాల అల్లకాలు అల్లడం, కమ్మరి కొలిమిలో యినుము కొడవళ్ళు కావటం, కత్తులు కావటం, గొడ్డళ్ళు కావటం, యిళ్ళు కట్టడం, గ్రామాన్ని ముడిపెట్టుకొని, జీవితాన్ని అంటి పెట్టుకొని ఎన్నికళలు. జానపదుడు ఎంత స్పష్టంగా చెప్పాడు కళ ప్రజల కోసమే అని అనుకొంటే సామాన్యుల బతుకుల్లో దాగున్నది చిన్నాచితకా కళకాదు.

గొడ్డు చర్మాన్ని అతి లాఘవంగా నైపుణ్యంగా వొలిచేపోలడు, కొయ్య చెక్కేపిట్టోడు, నారతో నానా విధాలు నాట్యాలు చేయించే ఎంకటనర్సు ఎంత గొప్ప సజీవ కళాకారులు.

శివయ్య ఆ ముగ్గురి నెరిసిన గడ్డాల్లోకి వేళ్ళుపెట్టి రుద్దుతో వాళ్ళు చేసే పని చూస్తూ వుండేవాడు. "తోలు అట్టా ఎట్టా వలుత్తావే తాతా" అని పోలడ్ని అడిగేవాడు. "తియ్యమను యిట్టా పిట్టోడ్ని యదవనాయాల్ని" అని పోలడు అనేవాడు. శివయ్యకి నవ్వొచ్చేది. "ఆడు సేసినట్టునాగలి నువ్వు సేత్తావా" పోలడి పెళ్ళాం ఎత్తిపొడిసేది. మాట పడ్నీదు' ' అంటో తోలు తీసేవాడు. దాన్ని చెరోవైపు శివయ్య, పోలడు పెళ్ళాం పట్టుకుంటే ఓ వైపు పోలడు పట్టుకొని లాగి నేలమీద పరచి యింకా లాగి ముడుచుకుపోకుండా నాలుగువైపులా నాలుగుమేకులు కొట్టేవాడు. కుక్కలు తాకకుండా నులకమంచం తిరగేసి నాలుగువైపుల నాలుగు రాళ్ళు పెట్టేవాడు. అదంతా శివయ్య చూస్తూ వుండేవాడు. చర్మం ఎండాక తుమ్మచెక్క నీళ్లలో వేసి నాన బెట్టడం కూడా దగ్గరుండి చూసేవాడు నానిన చర్మాన్ని నునుపు చెయ్యడం వింతగా వుండేది. ఆ వింతలో శివయ్య భాగం పంచుకొనేవాడు.

పిట్టోడు బొంగరానికి తరిణ పట్టడం చిత్రంగానే వుండేది. తరిణ పట్టేటప్పుడు తాడు లాగుతో చిన్నమ్మి చేతులు చేసే విన్యాసాలు కూడా చూడముచ్చటగా వుండేవి. బొంగరం చేతికిచ్చి దాని ముక్కుకి ముల్లుకొట్టి ఆడుకోరా శివా అంటే ఆ బొంగరం తీసుకొని ఎంకటనర్సు దగ్గరికి పరుగు తీసేవాడు. ఎంకటనర్సు బొంగరానికి తాడు పేనేవాడు. అంత సన్నగా, అంత నునుపుగా ఎంకటనర్సు తాడు పేనుతుంటే కళ్ళప్పగించేవాడు. తాడు ముడి దగ్గర చిన్న మువ్వ కట్టి ఎట్టావుంది రా శివా అంటే ఎగిరి భుజం మీద కూర్చొనేవాడు. ఆ భుజం మీదే బజారంతా తిరిగి ఒక్కవుదుటన కిందకి జారేవాడు. అక్కడ తీసిన పరుగుతో మాదిగ పల్లె చేరేవాడు. పోలడి యింటిముందు బొంగరం తిప్పి పోలడి నెరిసిన గడ్డాం రాస్తూ, తాడు కున్న మువ్వతో తన బుగ్గల మీద మెల్లగా కొట్టుకొనేవాడు. మువ్వ ముచ్చటగా మోగేది. తిరిగే బొంగరాన్ని చూస్తో, మోగే మువ్వని వింటో రెండు చిన్ని చర్మం ముక్కల్ని తీసుకొనేవాడు పోలడు. పట్టీలు వేసేవాడు. శివయ్య కాళ్ళకి తొడిగేవాడు. శివయ్య సంబరం శివయ్యకే తెలుసు. వాణ్ణి చూసినప్పుడల్లా బూదేవి అనుకొనేది యింతకన్నా అబ్బురంగా పెంచేను ఎల్లన్నని అని. అంతలోనే అర్థం కాని

నిరాశ గుండెల్ని తాకేది.

పిట్టోడు, ఎంకటనర్సు, పోలడు బాగా నలిగి పోయారు అయినా ఓపిక చావలేదన్నట్టు ఏదో ఒకటి చేస్తూనే వున్నారు అయితే చలిమంట ముందు కూర్చొంటే అంత తొందరగా లెగవటానికి యిష్టపడడంలేదు ఆకూవక్కా నలగ్గొట్టి పెడ్తుంది బూదేవి ఎంకటనర్సుకి. మాంసం ముక్క తగిలితే పళ్ళు నొప్పి, చెంపనొప్పి అంటాడు పిట్టోడు. ఆ యిద్దరికన్నా పోలడే కాస్తమెరుగు. అదేమంటే ఎడుతలలు ఏటుకుతిన్న వొల్లుది పిట్టోడా ఎదవనాయాల అంటాడు.

యిప్పుడు ముగ్గురూ ఒకచోట కూర్చొంటే అన్నీవెనుకటి కబుర్లే వాళ్ళ కబుర్లలో అచ్చిరెడ్డి ఎట్టా ఎదిగిపోయింది వుంటుంది. పిల్లకరణం పట్టణానికి కాపురం ఎత్తేసింది వుంటుంది వెళ్తూ వెళ్తూ పిల్లకరణం ఓపనిచేశాడు. అది మంచికి చేశాడో చెడుకుచేశాడో తెలీదు. అచ్చిరెడ్డి చేలకి మాలడి దిబ్బకి మధ్యవున్న బంజరంతా మాలా మాదిగలకి యిచ్చేశాడు. అది అసలు ఎవరిదనేది ఏ ఒక్కరికీ సందేహం రాలేదు. ప్రభుత్వం అంటే కరణమే అనే భావనకి వాళ్ళింకా దూరం కాలేదు. అట్టా యివ్వటానికి వీల్లేదన్నాడు అచ్చిరెడ్డి. యివ్వాలనుకొన్నాను యిచ్చేశాను అన్నాడు పిల్ల కరణం. అచ్చిరెడ్డికి పిల్ల కరణాన్ని కాదనే అవకాశం దొరకలేదు. కాని దాన్ని మాలామాదిగలు పంచుకొన్నప్పుడు తన కోపాన్నంతా కరణం ముందు వెళ్ళగక్కాడు. కరణానికి కావాల్సింది కూడా అదే. అచ్చిరెడ్డికి మాలామాదిగలకి ఎప్పుడూ ఏదో ఒక రగడ వుండి తీరాల్సిందే అందుకే అంత దానకర్తలా వ్యవహరించాడు. పిల్ల కరణం పెద్ద కరణమంత 'యిదైనోడు' కాదని మాలామాదిగ పెద్దలు అన్నారు. 'యిదైనోడు' అంటే అసలైన అర్థం ఎవ్వరికీ తెలీదు. ఏదైనా కావచ్చు.

పిల్ల కరణం దానం చేసిన బాడవ, అతను అనుకున్నంత పని చేసింది ఎన్నెలదిన్నిలో చేలకి నీళ్ళు పట్టడం ఓ పద్ధతి ప్రకారం జరుగుతుంది. ఆ పద్ధతి పెద్ద కరణమే చేశాడు. ముందు కరణం పొలాలు తడపాలి. ఆ తర్వాత కాస్త పెద్ద రెడ్లు, ఆ తర్వాత సన్న రెడ్లు, ఆ తర్వాతే ఇతర కులాలు. మాలాడి దిబ్బ సాగుబడి కొచ్చిందాక మాలామాదిగలకి నీళ్ళ సమస్యే లేదు. ఆ వరస పూర్తయ్యేసరికి తూములో నీళ్ళ పారటం ఆగేది. మాలాడి దిబ్బ తడవటం జరిగేది కాదు. నాగన్న బతికున్న రోజుల్లో మాట. యిప్పుడు కరణం దానం యిచ్చిన బాడవలో కరణం చేలకి, రెడ్ల చేలకి నీళ్ళు పెట్టేటప్పుడు పంటకాలవలు పొర్లిపారేవి. అట్టా పొర్లిపారిన నీళ్ళు బాడవలో బండ్లబాటని నీళ్ళ కాలువ చేసేవి. అక్కడక్కడా గుంటలుంటే ఆ గుంటలు కూడా నిండేవి. దానికి తోడు చేలలో వూట నీళ్ళు కూడా అక్కడ చేరేవి. ఆ నీటిని మాలాడిదిబ్బకు మళ్లించాడు నాగన్న. పొర్లి నిండిన ఎడ్లబాట నీళ్ళని, ఊటనీళ్ళని గుంటకి మరల్చారు. ఆ గుంటని పెద్దది చేశారు. ఆ గుంటకు ఏతాం పెట్టారు. ఏతాం దగ్గర్నుంచి మాలాడిదిబ్బ దాకా నడుం ఎత్తు యిసుక దిన్ని పేర్చారు. దాన్నే కాలవలా మార్చారు. ఏతాం నీళ్ళు ఎత్తయిన ఆ యిసుక కాల్వగుండా మాలాడి

దిబ్బకు చేరేవి. ఏతాం తొక్కటం వంతులవారీగా జరిగేది.

బాడవ దానం జరిగాక అచ్చిరెడ్డికి కడుపు మండింది. నిజానికి అదంతా తాను కలుపుకోవాలనే ఆలోచన వుండేది. చూస్తూ చూస్తూ అంత భూమి మాలామాదిగలకి దక్కడం మింగుడు పడటం లేదు. తోటి రెడ్లని పురికొల్పాడు. పంట కాల్వ పొర్లిన నీళ్ళని దారి మళ్ళించాడు. ఊట నీళ్ళు బాడవ చేలోకి వచ్చినా అవి పది పదిహేను ఏతాం బానలౌతాయి తప్ప చేలు తడిసే నీళ్ళనిపించుకోవు.

తూము నీళ్ళు కరణం చేలు తడిపాయి. అచ్చిరెడ్డి చేలు తడుపుతున్నాయి. ఆనక సన్నరెడ్ల కయ్యలు తడపాల్సి వుంటుంది. మిగిలితే యితర కులాల సెంటోకుంటో తడుపుతాయి. ఆ యేడు అందాకా వచ్చేలాలేవు. నీళ్ళు తడవకపోతే మాలాడిదిబ్బ ఎండిపోవటం తప్ప మరొకటి వుండదు. ఏది చెయ్యాలో మాలామాదిగలకి అర్థం కావటం లేదు పొర్లుడు నీళ్ళు దారి మళ్ళి అచ్చిరెడ్డి పడమటి చేల బయట చేరుతున్నాయి. అక్కడ నుంచి దిన్ని పొయ్యటం జరిగే పనికాదు.. అచ్చిరెడ్డి చెబుతున్న కుంటిసాకు బండ్ల బాట ఉమ్మడి లెక్కలోది కాబట్టి బాడవ మాల మాదిగలదైనప్పుడు ఉమ్మడి బాట అట్టా నీళ్ళతో నిండిపోతే రెడ్ల బళ్ళుకు దారే లేకుండా పోతుందని. 'ఎప్పుడూ లేంది యిప్పుడు మీకు కాకుండా పోద్దా' అని మాలామాదిగలన్నారు. ఎప్పుడూ లేంది బాడవ యిప్పుడు మీదైందిగా అని అచ్చిరెడ్డి విరుచుకపడ్డాడు.

మాలామాదిగలకి దారి దొరకటం లేదు. అచ్చిరెడ్డి అక్కస్సు అర్థమైంది. అంతా ఒక్కచోట గుమిగూడారు. నాగన్న లేని వెల్తి కన్పించింది. వాళ్ళ మాటల్లో కరణం అసలు బుద్ధి బయటకు రాలేదు. అది అర్థం కూడా కాదు. అచ్చిరెడ్డే వాళ్ళకు పెద్ద ద్రోహిగా కన్పిస్తున్నాడు. రెండు రోజులు అట్టాగే గుమిగూడారు. మీరే ఏదో ఒకటి చెయ్యండని పిట్టోడి నెత్తిన పోలడి నెత్తినా భారం మోపి మూడోరోజు "యింతకాలం బూముండే బతుకుతున్నామా' ' అనే వేదాంతంలోకి జారిపొయ్యారు. మూడో రోజు రచ్చ దగ్గర పోలడు, పిట్టోడు, ముసలయ్య మరో అయిదుగురు అదే ఈడువాళ్ళు కూర్చొన్నారు.

అర్ధరాత్రయింది. ఏదీ ఒక కొలిక్కి రావటం లేదు. రచ్చకి ఎదురు యింట్లోంచి మల్లయ్య నీళ్ళకావిడితో బయటకొచ్చాడు. నీళ్ళకి రావంటోయ్ పిట్టయ్ మామా అన్నాడు. "అపరాత్రి అయిందా" అని పిట్టోడు అన్నాడు. "కాక నీ కోసం కూకుంటదా" అంటూనే వెళ్ళాడు.

"యిట్టాసేత్తే ఎట్టా వుంటదిరా పిట్టోడా" అని పోలడన్నాడు.

"ఎట్టాసేత్తే"

"మంచి నీళ్ళు తోడుకోవడంలా అపరేత్రి.... అట్టాగ".

పిట్టోడు పోలడి మాటల్ని కొట్టి పారెయ్యలేదు. దారి దొరికిందనుకొన్నాడు.

మాలామాదిగలకి మంచినీళ్ళ బావిలేదు. ఊరి మొత్తానికి వున్నది ఒకటే మంచినీళ్ళ

బావి. దాన్నే బొడ్డుబాయి అంటారు. అక్కడ తప్ప ఎన్నెలదిన్నిలో ఎక్కడ తవ్వినా సవ్వ నీళ్ళే. ఆ బావి గమిటి చెట్టుకు తూర్పున వుంది. మాలామాదిగలు తప్ప వూరంతా తాగటానికి ఆ నీళ్ళేవాడుతారు. మాలామాదిగలైతే బుంగలు పట్టుకొని బావికి దూరంగా నిల్చొంటారు. అగ్రకులాల పుణ్యాత్ములు వాళ్ళు నీళ్ళు తోడుకునేటప్పుడు దయతలచి వీళ్ళ కుండల్లో నీళ్ళు పోస్తే తాగడానికి నీళ్ళు దొరుకుతాయి. లేకపోతే లేదు నీళ్ళు పోసినంతసేపు ఆ పుణ్యాత్ముల్ని ఈ అంటరాని వాళ్ళు పొగుడుతూనే వుంటారు, ఆ పుణ్యాత్ములు ఈ అంటరానివాళ్ళని తిడుతూనే వుంటారు. బుంగెడు నీళ్ళు కోసం పెద్ద కొట్లాటే జరుగుతుంది ప్రతి ఉదయం బావిదగ్గర అదో విచిత్ర దృశ్యం. బ్రతిమలాటాలు, భంగపడటాలు, తిట్టిపొయ్యటాలు, తిరస్కారాలు అంతా గుక్కెడు నీళ్ళ కోసం, దప్పిక తీరటం కోసం.

ఒక్కోరోజా ఏ పుణ్యాత్ములూ జాలిచూపరు. పనుల రోజుల్లో అయితే అసలు దయ తలచరు. ఒక్కోసారి మిట్ట మధ్యాహ్నందాకా, మండే యిసుక పాదాలని కాలుస్తుంటే, పుణ్యాత్ముల కోసం, నీళ్ళు పోసే పుణ్యాత్ముల కోసం ఎదురు చూస్తూ వుండి పోవాల్సి వుంటుంది. అదిగో ఆ సందర్భాల్లో మనుషులు నీటి దొంగలౌతారు. అర్ధరాత్రి కోసం మేలుకొని వుంటారు. దొంగల్లా బావి దగ్గరకి చేరుతారు. దొంగల్లా నీళ్ళు తోడుకొంటారు. దొరికితే ప్రాణాలే పోతాయని నీళ్ళు కావిడితో పరుగులు తీస్తారు. ఆ పరుగులాటలో బోర్లపడటాలు, బుంగలు పగలటాలూ మామూలే. ఈ నీళ్ళ దొంగతనం పనుల రోజుల్లోనే జరుగుతుంది. నీళ్ళ కోసం బావిదగ్గరే పడిగాపులు కాస్తూ కూర్చుంటే పనుల రోజుల్లో కుదరదు. కూలి బతుక్కి ఆ పదిరోజులే పండగ రోజులు.

"దొంగతనంగా మడవ తిప్పుదామంటావా"

"తప్పుదొరే"

పిట్టోడికి నవ్వొచ్చింది. గొంతు తడుపుకోడానికి దొంగతనం గొంతు తడపటానికి దొంగతనం. మనిషి అంటరానివాడు. వాడిమడి చెక్క అంటరానిదే. 'అంట'టానికి దొంగతనం. శాస్త్రం దీనికి యింకేదన్నా పేరు పెడుతుందా. సమాజం ఈ చర్యని అట్టాకాకుండా యింకోలా ఆలోచిస్తుందా. తెలీదు. పిట్టోడి నవ్వుకి అవేవీ తెలీవు. తెలిసిందల్లా బతుకు పోరాటమే.

చీకటి రాత్రి. పారే కాలవ నీళ్ళ శబ్దం తప్ప యింకేది విన్పించడం లేదు. గుండెలు కొట్టుకొంటున్న శబ్దం పిట్టోడికి, పోలడికి, ముసలయ్యకి, మల్లయ్యకి మాత్రమే విన్పిస్తుంది. మల్లయ్యకి నీళ్ళ దొంగగా గొప్ప పేరుంది. మాలామాదిగల్లో అట్టా పేరున్న దొంగలుంటారు. అదో విచిత్రం ఈ దేశం మహోన్నత సంస్కృతిలో అచ్చిరెడ్డి మడవ దగ్గరకి మల్లయ్యే వెళ్ళాడు.

మడవ దగ్గర వున్న పెద్ద జీతగాడు యింటికెళ్ళాడు. తిరిగి వాడొచ్చేది చుక్క పొడిచాకే. ఏది జరిగినా ఈలోపే జరగాల్సి వుంది. మడవ దగ్గర పంటకాల్వ సుడులు ఆగిన దృశ్యం కన్పిస్తోంది. అక్కడిదాకా తూము నీళ్ళు వస్తాయి. అక్కడ నుంచి ఏ వైపు తెంచితే ఆ

వైపున వెళ్తాయి. తక్కిన వైపు కట్టపోస్తారు. కట్ట నిలవటం కోసం తాటిబొంతలు కూడా తొక్కుతారు. మల్లయ్య అక్కడ నిలబడి పొలాలకేసి చూశాడు. యిక్కడ తెంచడం వరకూ యిబ్బంది లేదు. నీళ్ళు ఏ వైపు పంపాలి. ఎటుపంపితే మాలాడిదిబ్బ దిన్ని కాలవకు అందుతాయి. సన్నరైతుల వైపు తెగ్గొడితే దగ్గర్లో అందుతాయి. అయితే అచ్చిరెడ్డి చేలు తడవటం యింకా పూర్తికాలేదు. ఆ రాత్రిసన్న రైతుల వైపు నీళ్ళు పారితే బోలెడు అనుమానాలొస్తాయి. పార భుజాన పెట్టుకొని పిట్టోడి దగ్గరకొచ్చాడు. పిట్టోడు, పోలడు తూము దగ్గరున్నారు. మల్లయ్య మాట కోసం చూస్తున్నారు. మల్లయ్య ఎత్తమంటే లాకులు ఎత్తటానికి సిద్ధంగా వున్నారు. మాలాడి దిబ్బ మొదట్లో మరో నలుగుర్ని వుంచారు. నీళ్ళని కయ్యలకి మరల్చటం అక్కడ వాళ్ళు చెయ్యాల్సివుంది. అసలు సమస్య ముందుంచాడు మల్లయ్య.

అంతా తాటిచెట్టుక్రింద కూర్చొన్నారు. నీళ్ళు ఎటు పంపాలో అర్థం కావటం లేదు. పోలడు పైకిలేశాడు. పక్కనున్న కొత్తగా ఎదిగిన తాటిచెట్టు బారుకేసి వేళ్ళాడు. తాటి మట్టలు తీసి కాలిబందాం చేశాడు. మాటపలుకూ లేకుండా వాళ్ళు కూర్చొన్న చెట్టెక్కాడు. కల్లు దుత్త దింపాడు. 'కల్లు దొంగ' పిట్టోడు నవ్వుతూ అన్నాడు. కల్లు తాగారు. మాలాడి దిబ్బకేసి నడిచారు. దిబ్బంతా తిరిగారు. అంతా కలిసి మళ్ళీ మడవ దగ్గరకొచ్చారు. మల్లయ్య చేతిలో పార పిట్టోడు తీసుకొన్నాడు. సన్న రెడ్లవైపు తెంపాడు. పారతో తెంపినట్టు కాకుండా కట్ట తెగినట్టు కన్పించేలా చేశారు. కాలవలో నిలవవున్ననీరంతా అదార్నే పారింది. ఆ రోజుకు అది చాలనుకొన్నారు. రేపు రాత్రికి తెంచితే కొత్తగా తెంచినట్టువుండదు. అనుకొన్నట్టే జరిగింది. పెద్ద జీతగాణ్ణి తిట్టాడు అచ్చిరెడ్డి. సన్న రెడ్ల చేల దగ్గర గట్లు అట్టాగే వున్నాయి కాబట్టి కావాలని తెంపినట్టు అన్పించలేదు. నీళ్ళు మాత్రం ఆ దారి కాలవంతా నిండాయి.

మరుసటి రోజు అనుకొన్నది అనుకొన్నట్టు చేశారు. అర్ధరాత్రి చుక్క పొడుపుదాకా ఎంత నీరు పారుతుందో అంత నీరు పారేలా చేశారు. చీకటి రాత్రి. దొంగలజాము. నీరు కూడా దొంగలాగే దారి మళ్ళింది. దొంగలాగే మాలాడి దిబ్బ గొంతు తడిపింది.

తెల్లవారింది. మాలపల్లిలో, మాదిగపల్లిలో, వింత అనుభూతి. తెలీని భయం. అర్థంకాని ఆందోళన. తడిసిన దిబ్బను చూసుకొన్నప్పుడు ఆనందం. అయినా ఆనందం కూడా భయమే. ఆ అనుభవం కూడా ఆందోళనే. అయితే సాహసానికి భయం లేదు. ఆందోళన లేదు. వుంటే అది సాహసం కాదు. కాదు కాబట్టే పిట్టోడు, పోలడు., ముసలయ్య, మల్లయ్య మాలాడి దిబ్బ మీదే కూర్చొన్నారు. తడవాల్సిన రెండు మూలలు ఎట్టా తడపాలనేది వాళ్ళ ముందున్న ఆలోచన. అప్పుడే అనుకోని సంఘటన జరిగింది.

అప్పుడు యిట్టా జరిగిందీ అంటే నమ్మలేం. సామాన్యులు అంత సాహసులంటే చచ్చినా ఒప్పుకోరు. అయినా కొన్ని అట్టా జరుగుతాయి.

ఊహించలేదు. సుభద్రలో అంత సాహసం వుందని ఎన్నెలదిన్ని ఊహించలేదు కన్న తండ్రే తన బిడ్డ అంత గట్టిదని అనుకోలేదు. మొండిదని మాత్రమే అనుకొన్నాడు.

మాలాడి దిబ్బ తడిసిన మూడో రోజు జరిగింది ఈ సంఘటన . అప్పుడు సన్న రైతుల కయ్యలు తడుస్తున్నాయి. సన్న రైతుల కయ్యలు తడిసేటప్పుడు మరో అర్ధరాత్రి మాలాడి దిబ్బ రెండో విడత తడిసింది. ఆ యేడుకు ఆ నీళ్ళు చాలనుకొన్నారు మాలాడి దిబ్బ ఏతాం పట్టకుండానే ఎట్టా తడిసిందనేది అచ్చిరెడ్డి రచ్చలో చర్చయింది మాల పల్లిలో మహ పిరికి గొడ్డు చంద్రాయిని గొడ్ల కొట్లో కట్టేసి చింత బరికెలు తీశారు. వాడు అంతా చెప్పాడు. అచ్చిరెడ్డి ఉగ్రుడైపోయాడు. మందిని మాలాడి దిబ్బ మీదకి దండెత్తించాడు. పిట్టోడ్ని, పోలడ్ని పట్టుకొన్న వాళ్ళని పట్టుకొన్నట్టు కింద పడేసి కర్రల్తోకొట్టారు. అనుకోని సంఘటన కాకపోయినా అట్టా అనుకోని పద్ధతిలో జరుగుతుందనుకోలేదు. అంతా అయోమయంలో పడ్డారు. చెయ్యాలనుకొన్న దాడి చేసి అచ్చిరెడ్డి మనుషులు చక్కా వెళ్ళారు. పిట్టోడికి చెయ్యి విరిగింది. పొలడి నడుం మీద బలమైన దెబ్బే తగిలింది. మల్లయ్య తప్పుకొన్నాడు గాని ముసలయ్యకి దెబ్బ తగిలింది.

మాలామాదిగలు అవాక్కయి చూశారు. తేరుకోవటానికి పట్టిన సమయంలోనే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. అంతా దెబ్బతిన్న పిట్టోడికేసి, పోలడి కేసి చూడలేకపోతున్నారు. పిట్టోడి చెయ్యి నెత్తురు కారుతోంది. పోలడి వీపు నెత్తురు కారుతోంది. మాలామాదిగల కళ్ళు కన్నీళ్ళు కారుస్తున్నాయి.

ఆ నెత్తుటి మధ్య సుభద్ర వుంది. ఆ కన్నీటి మధ్య సుబద్ర వుంది. పక్కనే వున్న పార తీసుకొంది. అంతా చూస్తూనే వున్నారు. కోక బిగదీసి గోచిపెట్టింది. అంతా గుడ్లప్పగించి చూస్తున్నారు. పవిటవో తిప్పు తిప్పి దోపుకుంది. ఎండలో మెరిసే పచ్చని బంగారం తీగలా వుంది కళ్ళు మండుతున్న కొలిమిలా వున్నాయి. పారతీసుకొని ముందుకు కదిలింది.

"యాడకే సుబద్రా"

ఆ గొంతు పిట్టోడిది మాత్రమే కాదు. బూదేవిది మాత్రమే కాదు. పోలడి దొక్కడిదీ కాదు. చాలా మంది అంటరాని వాళ్ళది. ఎన్నెలదిన్ని మాలా మాదిగలు ఒకే సారి కలిసి అన్న మాట "యాడికే సుబద్రా" అని

సుభద్ర ఆగలేదు.

ఎవరి మాటకి ఎదురు చూడలేదు. అడుగులు కాదు అవి పరుగులే. కసి నిండిన పరుగులు. ఎందుకు కదిలిందో తెలీదు. ఎట్టా పరుగెత్తుతుందో తెలీదు. పోలడు భార్య వెర్రిగా కేక పెట్టింది. "ఆగే సుబద్రా......రాండే నా సవుతుల్లారా....... ఆగే బిడ్డా ........" వెర్రి పరుగు. బిడ్డకోసం తల్లి పరుగు. ఆ పరుగులో బూదేవి వుంది. ఆ తర్వాత ఎన్నెలదిన్ని మాలామాదిగ తల్లులు బిడ్డలు.........

"ఆగే సుబద్రా.......... ఆగే సుబద్రా.......'

సుభద్ర ఆగింది. అచ్చిరెడ్డి మడవ దగ్గర. మడవ అంచున కాలు పెట్టింది. బలహీనమైన పనుపు కొమ్ము సుభద్ర. పనివాడు ఆదమర్చితే మంటల్లో వెంటనే కరిగిపోయే అతి సన్నని బంగారు తీగ సుభద్ర... నడుం వంచింది. పిచ్చి బలం. మడవ మీద బలంగా పారని దింపింది. మట్టిలాగి పక్కకు తోసింది. గండి పడ్డ నీళ్ళు. పార ఎత్తి అట్టాగే నిలబడింది. పారే నీటిపైని సూర్యుడి తళుకులు ఆ బంగారు ఒంటిమీద నాట్యం చేస్తుంటే హతాశులైచూస్తున్న అచ్చిరెడ్డి మనుషులకేసి కాళిలా చూస్తోంది ఆ క్షణానికి అచ్చిరెడ్డి వచ్చాడు.

ఆ వైపు మాలామాదిగలు. ఈ వైపు రెడ్లు. మధ్యలో అచ్చిరెడ్డి చేలో పన్జేస్తున్న యితర కులాలవాళ్లు. వాళ్ళలో చాకళ్ళు, మంగళ్లు, కుమ్మర్లు. చూస్తున్నారు. అట్టాగే చూస్తున్నారు.

"దేవతెలిసిందే సుబ్బప్పా"

చాకలి వెంకాయి అట్టాగే చూస్తూ అంది.

"సుబద్ర ఈమేనా............"

కాపరానికి కొత్తగా వచ్చిన కుమ్మరోళ్ళ కోడలు వెంకాయిని అడిగింది.

"ఆ బిడ్డే. బంగారం.... గడపదాటి ఎరుగదు. మాల్దె. మారాజు బిడ్డలా పెంచేడు పిట్టోడు. మొగుడు ఆటలెల్లడు. దేశాలు పట్టి ఆటలాడతా పోయేడు."

"యదవ కాని ఎదవ. ఎట్టా పొయ్యేడు."

"దాని బతుకు అట్టా కాలింది. బిడ్డకోసమే బయ్యారపోళ్ళ కోడలా అది సేలగట్ల తొక్కింది."

సూర్యుడు నడినెత్తిన లేడు. సుభద్ర సూటిగా చూస్తున్న కళ్ళల్లో దాక్కొన్నాడు.

దృశ్యం ఆందోళనగా వుంది.

దృశ్యం గుండెల్ని తన్నుతోంది. ఏదో ఒకటి మాడిమసికావటానికి సిద్ధమౌతున్నట్టు ఊహించని విచిత్రమైన అనుభవం. దాన్ని ఎట్టా అర్థం చేసుకోవాలో రెడ్లకి తెలీయటంలేదు. ఎట్టా ముగుస్తుందో మాలా మాదిగలు పట్టించుకోవటం లేదు.

వాళ్ళు చూస్తున్నదల్లా ఒక్కటే.

ఓ ఆడకుతురు. అందులో మాలది. నీళ్ళ కాల్వ తెంచి పార ఎత్తి నిలబడ్డది. దమ్ముంటే తనని కదిలించమని సవాల్ విసురుతోంది.

"పిల్లకి పూనకం పట్టింది."

రెడ్లలో చుక్కిరెడ్డి అన్నాడు. అచ్చిరెడ్డి పక్కనే వున్నాడు. చుక్కిరెడ్డి అంతటితో ఆగలేదు. చుక్కిరెడ్డికి గట్టి నమ్మకం దేవతలు పట్టినవాళ్ళే యిట్టా చెయ్యగలరని.

"జాతర్లో కూడా అంతే. ఆ పిల్ల ఒల్లు పొంగుద్ది. పాప ఆడదు. నోరెత్తి పలకదు."

అచ్చిరెడ్డి వింటూనే వున్నాడు. వింటూనే సుభద్ర కేసి చూశాడు. నిజమే పాప

కొట్టడం లేదు. చూపు మరల్చడం లేదు. ఎత్తిన పారదించటం లేదు. పెట్టిన పాదం వెనక్కితీయటం లేదు నీళ్ళు పాదాల్ని చుట్టివెళ్తున్నాయి. అట్టాగే చూశాడు. ఒంట్లో ఎందుకో తెలీదు. చిన్న కంపరం మొదలైంది. చుక్కిరెడ్డి మాట్లాడుతూనే వున్నాడు. నిజంగా చుక్కిరెడ్డికి సుభద్ర సుభద్రగా కన్పింటంలేదు. ఆ పిల్లని అమ్మ ఆవరించింది. అమ్మ తల్లే అట్టా చేస్తుంది.

పల్లె నమ్మకం విచిత్రమైంది. వాటికి కారణాలు దొరకవు. ప్రతి అద్భుతం వాళ్ళు దేవుళ్ళల్లో, దేవతల్లో, దయ్యాల్లో చూస్తారు. కాబట్టే ఆ పల్లె జీవనంలో అన్ని గ్రామ దేవతలు కాపురం చేస్తున్నారు. మనుషులైతే అట్టా చేయరని వాళ్ళ నమ్మకం. పోలేరమ్మ, అంకాళమ్మ, ముంగమారమ్మ అట్టా వందలాది అమ్మ దేవతలున్నారు. పార్వతి అచ్చమైన అంటరాని దేవత. మాలాళ్ళు పారాతమ్మ అని ముద్దుగా పిల్చుకుంటారు. ముంగమూరమ్మ పిట్టోడి యింటి దేవత. పార్వతమ్మకి తోబుట్టువు. అట్టా ఎన్నెలదిన్నె మాలపల్లిలో యింటికో దేవతుంది. దేవుడున్నాడు. వాళ్ళంతా పార్వతమ్మకి తోబుట్టువులే. నిజంగా యిప్పుడు యిక్కడ సుభద్ర అట్టాగే నేల కొరిగితే సుభద్ర దేవతే అవుతుంది. పారోతమ్మ తోబుట్టువో, మేనకోడలో అవుతుంది. అక్కడే ఓ రాయి మొలుస్తుంది. సోది చెప్పే ఎంకటలచ్చిమికి పూనకం వస్తుంది. ఆ పూనకంలో సుభద్ర తనకి గుడి లేదురా అచ్చిగా అంటుంది. అచ్చిరెడ్డి గుడి కట్టిస్తానంటాడు. ఉమ్మి భూమ్మీద వేసి అది ఆరేలోపు కట్టమంటుంది. ఈ మాట పిట్టోడి ముత్తాతని ముంగమూరమ్మ అడిగింది, వాడు బతికున్న రోజుల్లో. అప్పట్నుంచి ముంగమూరమ్మకి ఈ రోజుకీ ఎన్నెలదిన్నెలో గుడిలేదు. సుబద్ర పార్వతమ్మ రూపమౌతుంది. ముంగమూరమ్మ భాగమౌతుంది. అందుకే ఆ షరతు పెడుతుంది. అది సాధ్యం కాదు. అక్కడ గుడి ఏర్పడదు. కాని జాతర జరుగుతుంది. సుభద్ర నీళ్ళ తల్లి కావచ్చు. మడవమ్మ కావచ్చు. పొలాలమ్మ కావచ్చు, కయ్యలమ్మ కావచ్చు కాకపోతే సుభద్రమ్మే కావచ్చు. విచిత్రమేమిటంటే సుభద్ర కోపానికి అచ్చిరెడ్డి కుటుంబం గురి కాకుండా ప్రతి ఏటా ఆ జాతర అచ్చిరెడ్డి చెయ్యొచ్చు. పసుపు కుంకుమ పిట్టోడి యింటి నుండి ప్రతి ఏడూ ఎల్లన్న యింటికొస్తే, ఎల్లన్న వంశం వాళ్ళు జాతర రోజు తీసుకురావచ్చు. అట్టా జరగొచ్చు. జరిగే అవకాశం వుంది.

సుభద్ర నీళ్ళ కాలువ గండి కొట్టింది. పార ఎత్తి నిలబడింది. సుభద్ర మాలల ఆడపడుచు. అంటరాని కులంలో పుట్టింది. మాలదిగానో, అంటరానిదిగానో అయితే అంత సాహసం చెయ్యదు. పిట్టోడిలా, పోలడిలా రాత్రి దొంగతనం చేసేది. మల్లయ్యలా అర్ధరాత్రి బావినీళ్ళు దొంగతనంగా తోడేది. కాని పట్టపగలు, అందరి రెడ్ల ముందు అంత తెగించి అట్టా చెయ్యదు. కాబట్టి సుభద్రని దేవతే ఆక్రమించింది. జాతరలో సుభద్రకి పూనకం వస్తుంది. కాబట్టి నిజంగా దేవతే ఆమెలో జొరబడింది. చుక్కిరెడ్డి దాన్ని నమ్ముతాడు. లేదు నేను సుభద్రగానే ఆ పని చేశాను అని సుభద్ర గట్టిగా అరిచి చెప్పినా చుక్కిరెడ్డి నమ్మడు.

చాకలి వెంకాయికి అసలే సుభద్రంటే అమితమైన ప్రేమ. ఆమె రూపమంటే అమితమైన యిష్టం సుభద్ర చిన్న పిల్లగా వున్నప్పుడు చిన్నమ్మి బిడ్డని సంకనెత్తుకొని చాకిరేవుకెళ్ళింది బిడ్డని యిసకలో దింపి బట్టలు తడిపి ఒడ్డున వేస్తోంది బిడ్డ యిసకలో బంతాడుతుంటే చూసింది వెంకాయి. బంగారం తారాడినట్టనిపించింది. చూస్తూ ఊరుకోలేకపోయింది. అటూ ఇటూ చూసింది. రేవులో మనుషుల్లేరు. పిల్లనెత్తుకొంది. మళ్ళీ చూసింది మాలపిల్ల నెత్తుకుంటే మాటపడాల్సి వస్తుంది ఎవ్వరూ చూడటం లేదనిపించింది. బిడ్డని ముద్దాడింది. నీళ్ళల్లో గుడ్డలు తడుపుతూ చిన్నమ్మి చూస్తునే వుంది. వెంకాయి బిడ్డ నెత్తుకొని చెట్టుచాటుకుపోయింది. ఎందుకువెళ్ళిందో అర్థం కాని చిన్నమ్మి చెట్టు దగ్గరికి వచ్చి తొంగి చూసి ఆశ్చర్యపోయింది. బిడ్డకి రొమ్మిచ్చి పాలుతాపుతోంది వెంకాయి.

"పాలిత్తున్నా"

చిన్నమ్మి చుట్టూ చూస్తు నిల్చుంది. అట్టా మాలపిల్లని వళ్ళో కూర్చో పెట్టుకొని పాలివ్వటం ఎవరన్నా చూస్తే వూరికినే పోదు. బిడ్డ తాగినంత సేపు తాగి రొమ్ము పక్కకు నెట్టి నోట్లో నాలుక అడ్డం పెట్టి "ట్టా" అని అంది. వెంకాయి ఎంత మురిసిపోయిందో. ఆపిల్ల కళ్ళలోకి చూస్తూ ఆ కళ్ళు ఆ పిల్లకి ఎట్టా వచ్చాయే సిన్నే అని ఎన్ని సార్లు అందో. ఆ బిడ్డేగా ఈ సుభద్ర. 'ట్టే' అంటో ఎంత వెర్రి నవ్వు నవ్వింది. ఆ రోజు గజ్జెల కాళ్ళతో కడుపులో ఎంత కుమ్ముకుమ్మింది. అట్టా మాలింట పుట్టి అచ్చిరెడ్డి మడవ మీద కాలెట్టి నిలబడ్డ ఈ మనిషి మనిషి మాత్రం కాదు. కానే కాదు. దేవతే. ముంగుమూరమ్మే. పార్వతమ్మే.

"అది దేవత బిడ్డరా..... అట్టా ఎంత సేపు వుంటాది.. దింపండ్రా పారని....."

వెంకాయి పరుగెత్తింది సుభద్రకేసి. కుమ్మరోళ్ళ కొత్త కోడలు మాత్రం సుభద్ర ముక్కు పుటకే చూస్తోంది.

వెంకాయి మాట విన్నాడు అచ్చిరెడ్డి. వెనుక్కి తగ్గాడు. అక్కడ యింకా వుండకూడదను కొన్నాడు. చుక్కిరెడ్డి మాటలు ఆపలేదు. మాట్లాడుతూనే వున్నాడు. ఎంకాయి మాట నిజమన్నాడు. తనలాగే తెలిసింది కాబట్టి "అది దేవత బిడ్డ" అని అందని అన్నాడు. అప్పుడే కాదు వూళ్ళోకి వచ్చాక కూడా మాట్టాడుతూనే వున్నాడు. చుక్కిరెడ్డి యిట్టా అన్నాడని యిల్లిల్లూ తిరిగి వెంకాయి చెబుతూనే వుంది. అచ్చిరెడ్డి భార్య వెంకాయిని దొడ్లోకిలాక్కెళ్ళి జరిగిందంతా చెప్పమంది. చుక్కిరెడ్డి తేల్చేశాడు. సుభద్రలోకి దేవతే జొరబడింది. సుభద్ర మాలింట పుట్టినా పెరిగిన పద్ధతే వేరు. తిరిగిన తీరేవేరు. ఎప్పుడూ మందిలోకి రాని సుభద్ర ఆ రోజు అట్టా చేసిందంటే అదంతా దేవత పనే. ఖచ్చితంగా దేవత పనే. చుక్కిరెడ్డిని మరింతగా నమ్మింది వెంకాయి. యింకాస్త కథ కలిపింది. అచ్చిరెడ్డి భార్య అప్రయత్నంగా చేతులెత్తి మొక్కింది.

విచిత్రమేమిటంటే మూడోరోజు అచ్చిరెడ్డి మాలుచ్చమ్మ చెట్టు దగ్గర సద్ది పెట్టాడు. ఆ సద్ది మాలామాదిగలు తిన్నారు. తిన్నాక వేపమండలతో సద్ది తిన్న వాళ్ళని పొలిమేర

దాకా తరిమారు. యిప్పుడు బాడవలో పారే నీళ్ళు బండ్ల బాటలో పారటం మొదలెట్టాయి. అక్కడ ఏతాం తొక్కటం మాలాడి దిబ్బ తడవటం మళ్ళీ మొదలైంది. ఏళ్ళు గడిచిపోతున్నాయి. ఎవరేమనుకున్నా, ఎన్ని కథలు పుట్టినా సుభద్ర మామూలు మనిషే. చాలా మామూలు మనిషే శివయ్య కోసం శ్రమించే తల్లే. ఎల్లన్న కోసం ఎదురుచూసే యిల్లాలే.

అంతా గతం. దాన్ని ముందేసుక కూర్చొంటారు పిట్టోడు, ఎంకటనర్సు, పోలడు. వాళ్ళ గతమంతా తిరిగి తిరిగి సుభద్ర దగ్గర ఆగుతుంది ఎల్లన్న ఎట్టా వున్నాడో అనే నిరాశతో ఆగుతుంది, శివయ్య వచ్చి నాలుగు తిట్టిందాకా సంక్రాంతి రోజులైతే చలి మంటల దగ్గర్నుంచి లేవరు ఎండాకాలమైతే మాట్టాడుకుంటూ అట్టాగే రచ్చ దగ్గరే పడుకుంటారు. ఏదోజామున "ఎదవనాయల నిద్దరపడితే లెగ్గొట్టకూడదా" అంటో పోలడు యిసుక దులుపుకొంటూలేస్తాడు. అట్టా సాగిపోతుంది వాళ్ళ బతుకు ఎన్నెలదిన్నిలో. వాళ్ళకి ఎన్నెలదిన్ని ఒక్కోసారి వింతగా వుంటుంది. ఒక్కోసారి "సత్తే ఈడ్నే సావాల" అనేంత యిష్టంగా వుంటుంది. ఒక్కోసారి "యదవ్వూరు యింకేడైనా పుడ్తే బాగుండేది" అనేంత విసుగ్గా వుంటుంది. నిన్న ఎట్టాగో గడిచింది. ఈ రోజు యిట్టా గడుస్తోంది. రేపు తమకంటూ ఏదీలేదు.

సుభద్రకి అలాంటి నిరాశలేదు. ఉన్నదంతా ఆశే. పొద్దున్న లేస్తుంది. మాలాడి దిబ్బకేసి వెళ్తుంది. రోజంతా అక్కడే కయ్యల్లో గడ్డ కొడుతూనో, కలుపు తీస్తూనో ఏదో ఒకటి చేస్తూనే వుంటుంది. తన కయ్యకి పక్కనే పిట్టోడి కయ్య బూదేవి కయ్యా వున్నాయి. మూడిటినీ కలిపే పండిస్తున్నారు. వరి నాటినా, లేదా పండినా, గోగులు ఎక్కొచ్చినా అంతా ఆ భూమే. మూడు కయ్యలు కలసినా ఎకరాకి యింకో రెండు సెంట్లు కొరవే. పిట్టోడు వద్దన్నా వినదు. నీ చాకిరి మేము చూడలేమే చిట్టి తల్లీ అన్నా పట్టించుకోదు. యిప్పుడు తాను చిట్టితల్లి కాదు. కళ్ళ ముందు శివయ్య వున్నాడు. కనిపించని ఎల్లన్న మనసులో ఉన్నాడు. తనకి తాను ఓ గీత గీసుకుంది. ఆ గీతలోనే తిరుగాడుతుంది. ఆ గీతకి పల్లె ఏ అర్థం చెప్పుకుంటుందో తనకు అవసరం లేదు.

ఆ గీతలోనే తిరిగింది చాలా ఏళ్ళు. తల అక్కడక్కడా తెల్లపడుతోంది.

బాలనరుపన్నాడు పిట్టోడు. చిన్నమ్మికి నవ్వొచ్చింది. పిట్టోడికి సుభద్ర యింకా చిన్నపిల్లే. కాలి చెప్పు మర్చి మాలాడి దిబ్బకెళ్తే, ఆ చెప్పులు తీసుకొని పరుగెత్తి బిడ్డ కాలికి తొడిగిగాని యింటికిరాడు. అప్పుడు గాని తినడు. ఆస్తులు లేని చోట ఆప్యాయతలే ఆస్తులు, ప్రేమలే జీవితాలు. నిజంగా పేదాళ్ళు ఎంత గొప్ప ప్రేమికులు. వాళ్ళు మనిషిని ఎందుకట్టా ప్రేమిస్తారు. అట్టా చెయ్యటంకన్నా గొప్ప విలువ ఏది వుంది ప్రపంచంలో. ప్రవక్తలు విలువల్ని బోధిస్తారు. పేదలు విలువలతో జీవిస్తారు.

ఓ సారి ఎల్లన్న కబురు మాసీలుకు వలస కూలీలు వస్తే వాళ్ళ ద్వారా తెలుసుకుంది.

ఆ తెలుసుకోవటం కూడా తమాషాగే జరిగింది. కోతల్లో కూలీలు పాటపాడారు.

*సూబద్రయినవే*
*సూరు కింద నీరు సిట్టేలికతాగే* ॥సూ॥
*సూబద్రయినవే*
*మబ్బూలేని సోట వానెట్టకురిసే* ॥సూ॥
*సూబద్రయినవే*
*వానా కురవక పోతే వాగెట్టనిండె* ॥సూ॥
*సూబద్రయినవే*
*వాగు నిండకపోతే సేనెట్టు తడిసె* ॥సూ॥
*సూబద్రయినవే*
*సేను తడవకపోతే నాటెట్ట ఏసె* ॥సూ॥
*సూబద్రయినవే*
*నాటు యెయ్యక పోతే కంకెట్ట వచ్చె* ॥సూ॥
*సూబద్రయినవే*
*కంకె కొట్టకపోతే గింజెట్టరాలె* ॥సూ॥
*సూబద్రయినవే*
*గింజరాలకపోతే గాదెట్టా నిండే* ॥సూ॥
*సూబద్రయినవే*
*గాదె నిండకపోతే నామెట్టా తీరే* ॥సూ॥
*సూబద్రయినవే*
*నామూ తీరిపోయే అకాలిమిగిలే* ॥సూ॥
*సూబద్రయినవే*
*అరుకాలము పంట అయ్యలకి కొలతే* ॥సూ॥
*సూబద్రయినవే*
*సూరుకిందా నీరు సిట్టేలికతాగే* ॥సూ॥

కూలీలు పాడే ఆ పాటంతా విన్నది. ఆ పాట తన పేరుతో మొదలౌతుంది. వంతలో తన పేరే వుంది. పాడే పిల్ల గొంతు కూడా బాగుంది. వరస ముగింపులో ఆ పిల్ల రాగం విరుపు అచ్చు ఎల్లన్న విరిసినట్టేవుంది.

ఆ పాట ఎల్లన్నే అల్లాడు.

ఆ పాట కట్టి ఆ పిల్ల వుండే వూళ్ళో ఎల్లన్నే పాడాడు. చాలా సార్లు పాడి వుంటాడు. అట్టా జరగకపోతే ఆ విరుపురాదు. ఆ కూలీలు ఉత్తరాది నుండి వచ్చారని మాత్రమే తెలుసు. నెల్లూరు ప్రాంతానికి గుంటూరు, కృష్ణా ప్రాంతమంతా ఉత్తరాది కిందే లెక్క.

ఉత్తరాదిలో ఏవూరు వీళ్ళది. బూదెవితో తన అనుమానం చెప్పింది. బూదేవి కూడా ఆ పాట విన్నది. తన పక్కన పన్లో వున్న పోలడి భార్య కూడా విన్నది. యిద్దరికి సుభద్ర పేరు ఆ పాటలో వుండటంతో ఆలోచన రాకపోలేదు సుభద్ర చెప్పటంతో బూదేవికి గట్టి నమ్మకం కుదిరింది. రాత్రికి వాళ్ళను కలవాలనుకుంది. సుభద్ర కూడా వాళ్ళ దగ్గరకు వస్తానంది.

ఉత్తరాది కూలీలు రెడ్డేనాది గుట్టమీద వుంటున్నారు రెడ్డేనాది గుట్ట పొలాల మధ్య వుంది. అక్కడ యానాదుల కుటుంబం ఒక్కటే వుంటుంది. రెడ్డేనాది చాకిచర్ల నుండి వచ్చాడు. అక్కడ వాళ్ల అయ్య, తాత, రెడ్డిని కనిపెట్టుకొని వాళ్ళ వాముల్లోనె కాపురం పెట్టారు. ఎన్నేళ్ళ క్రితం పెట్టారో తెలీదు. వాళ్ళ యింటి పేరు మర్చిపోయారు. రెడ్డేనాదులు పెద్దకొడుకు ఎన్నిలదిన్నొచ్చాడు. రెడ్డి చేల కాపలా కాస్తో గుట్టమీదే వుండిపోయాడు. రెడ్డేనాది మగాడు, ఆడది వాళ్ళ యిద్దరు పిల్లలు. గుట్ట చాలా పెద్దది. కోతల కాలం వలస వచ్చిన కూలీలు అక్కడే వుంటారు. అక్కడికే బయల్దేరారు. మాదిగ పల్లె మీదుగా వెళ్తుంటే పోలడు, పోలడు భార్య తోడుగా బయల్దేరారు.

నడుస్తూ పైకి చూసింది సుభద్ర.

జిలుగు చుక్కలు. లేత వెన్నెల. నెలసోన అనొచ్చు. కోసి భూమ్మీద పరచిన వరి బోదెల పైన మెరవనా వద్దా అన్నట్టున్న తెలిలేతనెలవెన్నెల. అట్టా పరవకుండా ఖాళీగా వున్న వరి కయ్యలలో బాతుల వాళ్ళు మల్దోలినబాతుల గుంపుల గొంతుల శబ్దాలు. ఎంతో వింతగా విన్పిస్తాయి అవి. ఆరితేరిన గాయకులు అనేకమంది ఒకేసారి వంతపాడినట్టు. చెప్పా పెట్టకుండా ఆగిపోతాయి. విచిత్రమైన నిశ్శబ్దం. మళ్ళీ మొదలు. ఒకేసారి కలసికట్టుగా.

అట్టాంటప్పుడు ఆగి వినేవాడు ఎల్లన్న. ఎందుకంత యిష్టంగా వాటి గొంతులు వినేవాడో అర్థం కాదు. కోతల ముగింపు రోజుల్లో బాతుల గుంపు రాక ఎల్లన్నని ఎంత సంబరపరుస్తుందో అనుకొంటే విచిత్రంగా వుంటుంది. అదీ లేత వెన్నెలల్లో. అట్టాంటి సందర్భాన్ని ఎల్లన్న సక్కటి ఎన్నెల అనేవాడు. ఒక్కోసారి సలవాయి ఎన్నెల అనేవాడు. సక్కటి ఎన్నెలకి సలవాయి ఎన్నెలకి తేడా తెలీదు సుభద్రకి. కాకపోతే తనవాడు అట్టా అనేవాడు. వాడు పక్కనున్నప్పుడు వాటి ప్రత్యేకత కోసం వెతకలేదు.

కాని యిప్పుడు వెతుకుతోంది. నెలవంక పొడిచినప్పుడు, జిలుగు చుక్కలు మెరుస్తున్నప్పుడు, బాతుల గుంపులు రెక్కలు ఆడిస్తో అరుస్తున్నప్పుడు, ఆ మట్టి నేల మీద, ఆ గట్ల చేల మధ్య, ఎండీఎండకుండా వుండే పంట కాల్వల అంచున సక్కటి ఎన్నెల. ఎట్టా వుంటుంది అది. సలవాయి ఎన్నెల. ఎందుకొతుంది అది. ఎంత వెతికినా తన వెతుకులాట వుట్టిదే అవుతుంది. వాడు అట్టాగే చేశాడు. ఎన్నెల దిన్నిలో ఎన్నెలంతా గూడేసి తోడుకొని వుట్టి దిన్నినే యిక్కడ వదిలేసి వెళ్ళాడు. కుళ్ళుమోతు.

ఎన్నెలకి ఎన్ని పేర్లు పెట్టాడు. ఒకటా, రెండా. లేతెన్నల, నిండెన్నల, పండెన్నల, పిండెన్నల, అట్టా ఎన్ని పేర్లు. నవ్వొస్తుంది. ఒక్కోసారి, ఎంత చితనాపిపేరు పెట్టినవ్వేవాడు.

యిప్పుడు యిక్కడతనకి ఏ వెన్నెలా కన్పించడం లేదు. అంతా చీకు చీకటి. కాటుక పొగ. కాకపోతే వాడు అల్లిన పాటల మాటలు మాత్రం ముందు నిలుస్తాయి. ఎట్టా అల్లాడు వాడు తన మీద. అనుకొంటే ఒళ్లు పొంగుతుంది. ఎదిగిన బిడ్డ తల్లిననే మాటే మర్చిపోతుంది. అంతా దొంగెన్నెల పాడాలనుంది. తన వెనుక నడుస్తున్న యిద్దరు ఆడాళ్ళు విన్నా, ముందు నడుస్తున్న పోలాయి మామ విన్నా పెదాల్ని ఆ పదాలు కదుపుతున్నాయి. గుండె లోతుల్లోంచి ఓ మూగ స్వరం మొదలౌతోంది కాని ఆ స్వరం తాను మాత్రమే వింటోంది. పాడుతోంది తాను కాదు, వాడు. ఎల్లన్న. ఎల్లడు గుండెగుప్పెట్లో పెట్టుకున్నవాడు. ఎన్నెట్లో తన బొమ్మని తన యిష్టమొచ్చినట్టు గీసినవాడు. ఎట్టా అన్నాడు వాడు.

మిన్నూ పానుపు మీద
దూదీ దుప్పటి పైన
సుక్కాల పూల గుత్తి సూబద్రా
నువ్వూ పచ్చి పగడానివే సూబద్రా

మిన్ను పానుపు, దూది దుప్పటి, సుక్కల పూలగుత్తి ఏది ఎట్టా వుంటుంది. ఇది యిందుకన్నానని చెప్పి చస్తేగా పచ్చిపగడం. ఎట్టా కన్పించింది అప్పుడు వాడికి తను. ఏడ్పు ఆగడం లేదు. ఎందుకిట్టా చేశాడు యిప్పుడు.

పెళ్ళికి ముందు చుక్కల ముగ్గు కర్ర అంటోపాడినప్పుడు. దొంగలా వాడి దగ్గరకి చేరి, అయ్యా అలిగినా, అమ్మతిట్టినా నీదే తప్పంతా అంటో వాడి గుండెల్లో దాగి వాడి పాటకి ముగింపు చెప్పినప్పుడు. ఎందుకంత కలవరించాడు అప్పుడు. ఆ కలవరింత అంతా అబద్ధమని ఎట్టాకొట్టి పారేస్తుంది తాను. అబద్దమైతే అట్టా ఎందుకుంటుంది. రెడ్డేనాది దిబ్బదగ్గరౌతుంటే ఏది గుర్తొస్తుంది తనకి. ఆ దిబ్బ పక్క తాటి బారు అంచున వాడు ఎన్నో పేర్లతో పిలిచే ఎన్నెల వానలో తడుస్తో 'వోరదే' అని రెడ్డేనాది పంటకాపలా కాస్తో కేక వేస్తే కంటపడకుండా పరుగెత్తడం ఎన్ని సార్లు జరిగింది. సిగ్గులేని రోజులు. అయినా ఎంత మంచి రోజులు. అవి ముమ్మాటికి అబద్దాలు కావు. ఏటిపైన మెరిసే వెన్నెల. ఆ మెరుపుల్లో చేసిన చలి స్నానాలు . మరీ లజ్జ లేకుండా పోయిందే దీనికీ అని అమ్మ తిట్టినా అవి తిట్లుగా అన్పించిందా అప్పుడు. ఆ స్నానాలు అబద్ధాలు కాదు. ఆ తిట్లు అబద్దాలు కావు. తన కోసం ఎదురు చూస్తో, నిద్రకి దూరంగా గడిపి నువ్వు వత్తావని రాత్రంతా నిద్రపోలా అని వాడంటే వాడి కళ్ళల్లో ఎర్రజీర చూసి ఎంత జాలి పుట్టింది తనకి అప్పుడే కదూ వాడు బజార్లో నిలబడి అట్టా చూస్తే తెగించి వాడి చెయ్యి పట్టి వాడ్ని ఇంట్లోకి లాగింది. అప్పుడే కదూ అయ్యా చూసింది. అలిగి కూడు తినకుండా కూర్చొంది కోళ్లదిన్ని పెళ్ళి కొడుకును వెతికింది. తెగేసి చెప్పాక ఎల్లడ్ని తప్ప యింకొకడ్ని చేసుకోనని చెప్పాక ఎంత గొప్పగా చేశాడు తమ పెళ్ళి. అదంతా అబద్ధం ఎట్టా అవుతుంది. వాడు అబద్ధం కాదు. వాడితో పెళ్ళి అబద్ధం కాదు. ఎన్నెల, ఏరు, పదాలు పరుగులాటలు ఏవీ అబద్ధం కాదు.

కానప్పుడు, ఏదీ అబద్ధం కానప్పుడు ఎందుకిట్టా విసిరేసి పోయినట్టు.

కళ్ళ నీళ్ళు కళ్ళల్లో దాగడం లేదు. గుండెకోత గుండెల్లో దాగడం లేదు. అక్కడే కూర్చోవాలనుంది. వెక్కి వెక్కి ఏడ్వాలనుంది. ఈ ముగ్గురూ లేకపోతే గొంతెత్తి అరవాలనుంది. యిప్పుడే రావాలా ఈ జిలుగు చుక్కల వెన్నెల. గాయంలా వెన్నాడుతున్న జ్ఞాపకం. తమాయించుకుంది. పైటతో కళ్ళు తుడుచుకుంది.

రెడ్డేనాది ఎప్పట్నుంచి చూస్తున్నాడో 'ఏందమ్మోయిట్టొచ్చేరు' అని పలకరించేడు. వలస కూలీల్ని కలుద్దామని అని పోలడు చెప్పాడు. అప్పుడే అన్నాలు తిన్నట్టుంది. ఆడాళ్ళంతా గుంపుగా కూర్చొన్నారు. మగాళ్ళు యిసక మీద చాపలు పర్చుకొని పడుకొని వున్నారు. వచ్చిన వాళ్ళని చూచి వాళ్ళు పైకి లేశారు. ఆడాళ్ళు తలెత్తి చూశారు. ఎన్నెట్లో సుభద్ర వాళ్ళకి వింత అనుభూతి నిచ్చింది. కూర్చోమంటూ అప్యాయంగా పిలిచారు. సుభద్ర పాటపాడిన పిల్ల పక్కే కూర్చొంది.

'కోతకోత్తూపాడావే. ఆ పాట యినాల' అంది.

ఆ పిల్ల సిగ్గు పడింది. 'పాడే' అని ఆడాళ్ళ వంత పలికేరు. పిల్లగొంతెత్తింది. పాట మొదల అయింది. రెండు, మూడు చరణాలు మళ్ళీ మళ్ళీ పాడించుకుంది.

'యాడ నేర్చావ్'

'మాలబైరాగి నేర్పాడు'

'యీ పాటొక్కటేనా'

'శానా నేర్పాడు'

'మిన్నూ పానుపుమీద......'

సుభద్ర మొదటి పాదం అందుకొందోలేదో అ పిల్ల పాడటం మొదలెట్టింది. దూది దుప్పటిపైన అంటో పాటంతా పాడింది.

తాను అనుకొన్నది నిజమైంది. ఎల్లన్నె. తన ఎల్లడే. కాని ఆ పిల్ల మాల బైరాగి అంది.

'ఎవరు నేర్పారన్నావు'

"మాలబైరాగి"

"ఎల్లన్న కాదూ"

"ఎల్లన్నా"

"ఆదే.... ఆ టెల్లడు పాటెల్లడు"

'ఎల్లన్నెవురో తెలవదు"

సుభద్ర నీరసంగా చూసింది. ఆ పిల్లకి ఎట్టా చెప్పాలో అర్థం కాలేదు. ఎట్టా ఆ పిల్ల నుంచి తెలుసుకోవాలో అర్థం కాలేదు. తలదించుకొంది. బొట్లు రాలిపడ్తున్నాయి. అప్పటిదాకా తదేకంగా సుభద్రనే చూస్తున్న ఆ పిల్ల అయ్య ముందుకొచ్చాడు. పేరుసిన

సుబ్బన్న అని చెప్పాడు. ఆటలాడతానన్నాడు. బలరాముడి పాత్రకి పెట్టింది పేరన్నాడు. ఆ వేషం తప్ప మరో వేషం కట్టనని కూడా గర్వంగా చెప్పుకొన్నాడు. ఆ పిల్ల పేరు చెప్పాక బలరాముడి వేషం మీద అతనికెంత మోజో అర్ధమైంది ఆ పిల్ల పేరు శశిరేఖ.

ఆ పేరు పలకటం కుడా అచ్చు బలరాముడు పలికినట్టే పలికాడు. సుభద్ర పేరు నాగన్న అట్టాగే పిల్చేవాడు. మాలవీధి భాగవతుల్లో యిది వింతైన అంశం. వీధి భాగవతాలు ప్రదర్శించే ప్రత్యేక తెగ అంటూ ఆ కులంలో లేదు ఎవరైనా నేర్చుకొంటారు. అయితే ఆ యింట ఆడబిడ్డ పుడితే ఆ యింటి నాన్నో, తాతో, మేనమామలో ఎవరో ఒకరు ఆటగాడైతే ఆ బిడ్డకి పౌరాణిక పేరు పెడతారు. పలకటం కూడా చాలా స్వచ్ఛంగా పలుకుతారు బూదేవిని పలికినట్టు లచ్చిందేవిని పలికినట్టు కాకుండా సుభద్ర, శశిరేఖ, ప్రభావతి అట్టా స్పష్టంగా పలుకుతారు

ఆ పిల్లపేరు చెప్పాక ఆ పిల్లకేసి చూసింది సుభద్ర.

శశిరేఖ ! అట్టా అని ఎందుకు పలికిందో తెలీదు. పలికింది. ఆ పిల్ల తలెత్తి చూసింది. కాస్త దూరంలో వున్న దిండిగయిత్తుల సవురు దీపం ఎత్తిపట్టి చూసింది. కుళ్ళు పుట్టింది. లేతెన్నల్లో అంత స్పష్టంగా కన్పించలేదు ముందు. కాని ఆ పిల్ల తీరు వేరుగా వుంది. పిల్ల అంత ఎరుపు కాదు. అంత నలుపు కాదు. కన్ను వడుపు. ఆ వెలుతురులో బూదేవి కూడా ఆపిల్లకేసి చూసింది. ఆ పిల్ల చూపు చూసింది. అదే వొడుపు. గాలం చూపు. నవ్వొచ్చింది బూదేవికి. ఎల్లన్నని వెతుక్కుంటూ వచ్చినప్పుడు సుభద్ర అట్టాగే చూసింది. తనకి తెలియకుండానే కంటి కాటుక వేలు అంచున తీసి ఆ పిల్ల బుగ్గ మీద చుక్కెట్టింది సుభద్ర. ఆ పల్ల బిత్తరపోయింది.

సినసుబ్బన్న చెప్పటం మొదలెట్టాడు ఎల్లన్న ఎట్టా కలిసింది. గోడ్లకాడి పిల్లలకి పాట నేర్పే మనిషిని చూశాడు. మొదటిసారి ఎల్లన్నని అట్టా చూశాడు గోంతు గొప్పగా వుంది. దగ్గరకెళ్ళాడు. చెంచునాటకంలో కీర్తన. మనిషి డస్సి వున్నాడు. గడ్డాం పెరిగి వుంది. అక్కడక్కడ నరిసి వుంది. గుడ్లు విశాలంగా వున్నాయి. ముక్కు సూటిగా వుంది. చక్కగా వుంది. నవ్వినప్పుడు అద్భుతంగా వున్నాడు.

"ఏ ఊరు బైరాగివి"

అతను ఆశ్చర్యంగా చూశాడు. తన మాటలు అతన్ని ఎందుకు ఆశ్చర్యపరచాయో తెలీదు. ఏదో వెతుకుతున్నట్టు చూశాడు. తనని కొత్తగా పిల్చినట్టు చూశాడు. ఊరు చెప్పలా.

" పేరేంటి"

"బైరాగి........మాలబైరాగి"

నవ్వుతూ అన్నాడు. ఎందుకు నవ్వింది అర్థం కాలా. కాని మళ్ళీ నవ్వితె బాగుండుననిపించింది. కూటిమూట విప్పి ముందుంచాడు. తిన్నాడు. యింటికి పోదామంటే మారుమాటాడలేదు. వచ్చాడు. మాలపల్లికి ఆటనేర్పాడు. ఆట ఆడించాడు. గుడ్డలు పెట్టారు.

గురుదక్షిణ యిచ్చారు. ఎక్కడ నుంచి వచ్చాడో చెప్పలేదు. ఎందుకొచ్చింది చెప్పలేదు. కాని ఎప్పుడూ ఏదో ఒక పాట అల్లుతూనే వున్నాడు అల్లిన ప్రతిపాటలో సుభద్ర వుండేది ఆ సుభద్ర ఎవరంటే చెప్పలా. ఓ రోజు శశిరేఖ అడిగింది "సుభద్ర అత్తపేరా" అని "ఏ వూరు బైరాగి" అన్నప్పుడు ఎట్టా చూశాడో "సుభద్ర అత్త పేరా" అన్నప్పుడూ అట్టాగే చూశాడు.

నాకు మింగుడుపడలా. ఈ పిల్ల సుభద్రని అత్తా అంది."

చినసుబ్బన్న చెప్పుకపోతున్నాడు.

సుభద్ర శశిరేఖ కేసి మరోసారి చూసింది. ఆ పిల్ల తలదించుకొనే వుంది.

"తలెత్తు" సుభద్ర అంది.

శశిరేఖ తలెత్తింది.

"యిట్టా సూడు. ఎట్టుందీ అత్త"

పంట వోదెల మీద పరిగెత్తే గాలి ఒక్కసారి ఆగింది. వలస కూలిలు ఒక్కసారి సుభద్ర కేసి చూశారు. సినసుబ్బన్నకి నోటమాట రాలేదు. అందరి మనస్సుల్లో ఒక్కసారి వీచిన పదాలు ఎల్లన్న పదాలు.

# 13

ఎల్లన్నని తెల్సుకొని వెతుకుదామని రెడ్డేనాది గుట్టకు పోయింది సుభద్ర. ఎల్లన్న జాడ తెలీలేదు గాని కోడలుమాత్రం దొరికింది. సుబ్బన్న ఎన్నెల దిన్నికి వలస కూలీగా బయల్దేరడానికి పదిరోజులముందే ఎల్లన్న ఆ వూరువిడిచాడు. ఎల్లన్న లేడనేగాని శివయ్యా శశిరేఖల పెళ్ళిబాగానే జరిపించింది. యింటి పక్క ఖాళీజాగాలో సుట్టుగుడిసె కట్టిచ్చింది ఆ యిద్దరికీ. యిప్పుడు పొద్దున్నే మాలాడి దిబ్బకి తోడుగా శశిరేఖ వస్తోంది. బూదేవి యింట్లోనే వుండిపోతోంది నులకపేనుతూ. పొట్టిమనిషికాబట్టి చిన్నమ్మి నలగలేదు.

పల్లెల్లో రాముడూ రాములమ్మ జంటలుంటారు. సీతయ్య సీతమ్మ జంటలుంటారు. అట్టా పేర్లతో జంటలుంటే వాళ్ళచేత నడుంనొప్పికి రోకలి తిరగేయిస్తారు. కాని సుభద్ర శశిరేఖ అత్త కోడళ్ళు కావటం వింతగానేవుంది. చాకలి వెంకాయికి అదీ ఒక వింతే. చుక్కిరెడ్డినైతే ఏదో శక్తి వెన్నాడుతూనే వుంది. అచ్చిరెడ్డి భార్య చాకలి వెంకాయిని దొడ్లో కూర్చొబెట్టుకొని అత్తాకోడళ్ళ సంగతులు చెప్పించుకొంది. వెంకాయి చెప్పినమాట చెప్పకుండా చెప్పింది. ఆ తర్వాత  అచ్చిరెడ్డి భార్య మాలాడి దిబ్బమీదుగా పోతూ దిబ్బలో నడుంవంచి కలుపుతీసే అత్తాకోడళ్ళని మొదట చూసీ చూడనట్టు చూద్దామనుకొంది. తీరా చూశాక కదలబుద్ది కాలా.

కాలం దాని రపాన అది కొట్టుకపోతోంది

ఎక్కడో మొదలైన కరువు ఎన్నెలదిన్నిని తాకీ తాకనట్టు తాకుతోంది. గాలి కొత్తగా వీస్తున్నట్ట అనిపిస్తోంది. ప్రతి రోజు సాయంత్రం సముద్రం మీద వీచే గాలిలో ఏదోమార్పు కన్పిస్తోంది. అచ్చిరెడ్డికే యిబ్బందికరంగా వుంది. కింది రెడ్ల పరిస్థితి దిగజారుతోంది. సన్నకారు అయితే ఈ రోజుల్ని తట్టుకోలేమని భయంలోకి వెళ్ళి పొయ్యారు. మాలామాదిగల పరిస్థితి యిక చెప్పనవసరంలేదు. శివయ్యకి చాకిరి చాకిరిగానే మిగిలిపోతోంది. అత్తాకోడళ్లు నడుములు విరిగిపోవటం తప్ప ఫలితం కన్పించడంలేదు. చుక్కి రెడ్డి అమ్మతల్లి జాతర చెయ్యాల్సిందే నన్నాడు. పిల్లల చేత కప్ప తల్లిని కర్రకి కట్టించి, దాని మీద వేపమండలు వేసి కప్పొతల్లి నీలాడే అంటూ గోల చేపించాడు. కప్పతల్లి నీలాడిందీలేదు, కడవలనిండా నీళ్ళొచ్చిందీ లేదు.

దారిన వెళ్ళే బాటసారులు ఎన్నెల దిన్ని గవిటిచెట్టు దగ్గర కూర్చొన్నప్పుడు వాళ్ళ ప్రాంతాల్లో అక్కడక్కడా జరిగే ఆకలి చావుల మాట చెప్పటం మొదలెట్టారు. ఎన్నెల దిన్నెకి

అది భయపెట్టేమాటే భయపెట్టేమాటే కాదు, ఆకలిచావులు ఎన్నెల దిన్నినీ చుట్టు ముట్టాయి.

దాతుకరువు దక్షణాది భారతంలో లక్షలాది మందిని బలితీసుకొంది. వర్షాల్లేవు. పంటల్లేవు. నెర్రులు బారిననేలమీద పనీపాటాలేదు. ఆకులు తిన్నారు. అలమలు తిన్నారు. బొంతకాయలు ప్రాణాలు నిలబెట్టలేదు. నాగజెముడు కడుపులో మంటలు రేపింది. బురదనీళ్ళు ప్రాణం పోస్తాయనే తాగారు. అయినా ఆకలిచావులు తప్పలేదు. కాళ్ళుకొట్టుకొంటూ చచ్చారు. కడుపు బిగదీసుకొని చచ్చారు. విరోచనాలు పట్టుకొని చచ్చారు. ఎండిన డొక్కల్ని మాడ్చి మాడ్చి మరీ చచ్చారు దానికి తోడు దూముతోడైంది.

ఎల్లన్న వున్న ప్రాంతంలో చావగామిగిలిన జనం వలసలు వెళ్తున్నారు. బకింగ్‌హోమ్ కాలవ తవ్వకం జరుగుతోందని అక్కడ కూలి దొరుకు తుందని, బతకొచ్చని ప్రాణాలు చేతిలో పెట్టుకొని దారి అడుక్కొంటూ వెళ్తున్నారు. ఊరు ఎదురైతే ఊరు దాటినడుస్తున్నారు. అక్కడి దూము తమకు తగలకూడదనే ఆశ. అయినా దారిలో ఎవడో వొకడు రాలిపోతూనే వున్నాడు. సమూహాలుగా జనం సుదీర్ఘప్రయాణం చేస్తున్నారు. గమ్యం ఎక్కడో తెలీదు. ఎక్కడో ఒక చోట వుండి తీరు తుంది. ఈ గడ్డమీదే వుంటుంది. ఆ సమూహాల్లో మాల బైరాగి ఎల్లన్న చేరిపొయ్యాడు.

దారిలో సంపెంగిపూల సమాధి గుర్తొచ్చింది. కుమ్మరి పెదకోటేశ్వరుడు, యానాది రమణయ్య గుర్తొచ్చారు. ఆకలి పేగులు అంత శ్రమ తీసుకోడానికి సిద్ధంగాలేవు. అయినా సమూహాల నుండి తప్పుకొన్నాడు. విచిత్రం అతన్ని కొంత మంది వెంబడిస్తూ నడుస్తున్నారు. మీరెక్కడికి అని అతనంటే నువ్వెక్కడికి అని వాళ్ళన్నారు జీవితం ఎంత అయోమంగావుందో అని అనుకోడానికి అంత కన్నా ఉదాహరణ అక్కర్లేదు. బతకటానికి పరుగులాట. దార్లో రాలిపోవచ్చు. గమ్యం చేరొచ్చు. అదివాళ్ళ చేతిలో లేనిపని.

సంపెంగపూల సమాది చేరాడు. సమాదిమీద సంపెంగపూలు లేవు. పూలు రాల్చే సంపెంగ ఎప్పుడు సగం వాడి బతుకుపోరు మొదలెట్టిందో తెలీదు. యానాది రమణయ్య కన్పించలేదు. అతని అందమైన నడుము, నిర్మలమైన కళ్ళనవ్వు జాడలేదు. యానాదుల గుట్ట గుడిసెల్లో బక్కచిక్కిన కుక్కల అరుపులు కూడా లేవు. మాలపల్లి ఎటువలస వెళ్ళిందో తెలీదు. మాదిగపల్లె ఏమూలలు వెతుక్కుంటుందో తెలీదు. సమాది పక్క కూర్చొన్నాడు. రమణయ్య పదే పదే గుర్తొచ్చాడు. డప్పు పుల్ల గుర్తొచ్చింది. గొప్ప రుషి రమణయ్య. ఇక అక్కడ వుండ బుద్ధికాలేదు. ఆకలి చచ్చిపోయింది. తాను చచ్చిపోలేదు. యింకా ఎందుకు బతికున్నట్టు. దూరంగా మెరుస్తున్న మెరుపు. అది మెరుపు కాదు. మెరుపులాంటి భ్రమ.

ఎన్నెలదిన్ని !

ఎన్నెలదిన్ని !!

పుట్టినూరు. పెరిగినూరు.

తిరిగి వెళ్ళాలనుకొని వచ్చాడు. వెళ్ళాలి. అక్కడి దాకా వెళ్ళాలి. ఎన్నెలదిన్ని వెళ్ళాలి. మళ్ళీ సమూహాల్లో కలిశాడు. తనలో తాను ఏదో అల్లుకొంటున్నాడు. ఆ అల్లికలో ఎవరినో ఉద్దేశించి పాడుతున్నాడు. తన పల్లవి సుభద్ర. అంతే. ఆ ఒక్క పదమే మిగిలింది. ఆ ఒక్క పదమే పదేపదే అల్లుక పోతుంది. ఎన్నెల దిన్నికేసి ప్రయాణం కట్టాడు.

ఎన్నెల దిన్నిలో రోజుకో మనిషి శవమౌతున్నాడు. అచ్చిరెడ్డి దూముకే చచ్చాడు. చుక్కిరెడ్డి ఆకలికే చచ్చాడు. చచ్చేటప్పుడు కూడా ఏదో దేవత అతన్ని వెన్నాడుతూనే చంపింది. చాకలి వెంకాయి కుమ్మరోళ్ళ కొత్త కోడలు అంతే. అచ్చిరెడ్డి భార్య చావుతో కొట్లాడుతోంది.

మాల మాదిగ కొంపల్లోనైతే చెప్పనవసరం లేదు. శివయ్య తన వాళ్ళ కోసం గుంటలు తవ్వటం మొదలెట్టాడు. ఉదయం పిట్టోడిని పూడ్చాడు. సాయంత్రం చిన్నమ్మి. రెండో రోజు బూదేవి. రాత్రి ఓజాము కాడ ఎంకటనర్సు. శివయ్య గుంటలు తవ్వుతూనే వున్నాడు. అయిన వాళ్ళకోసం తవ్వుతున్నాడు. పక్కవాళ్ళ కోసం తవ్వుతున్నాడు. ప్రతి గుంట దగ్గరా సుభద్ర కొరివి దయ్యంలా కూర్చొంటూనే వుంది. యింత మంది చస్తూన్నా తనకి చావురాదనుకొంది. వాడొచ్చేదాకా బతికి తీరుతాననుకొంది.

"కలేకాయి తినే పిల్లా "

"నువ్వు తినత్తా"

"కడుపు పుండౌతుందే పిల్లా"

ఆ అత్తాకోడళ్ళ మాటలు వినలేకపొయ్యాడు శివయ్య. పార తీసుకొన్నాడు. అప్పటికే తేగల పాతర నాలుగు సార్లు తవ్వాడు. అయినా ఆశ. ఒక్కటైనా దొరక్కపోదు. కుళ్ళగించటం మొదలెట్టాడు. అప్పుడే మోము పుట్టిన తాటి యిత్తనం దొరికింది. దాన్ని మళ్ళీ మట్టిలో వేశాడు. గుంట పెద్దదౌతుందేగాని తేగ జాడలేదు. అయినా ఆరాటం. మనిషి బ్రతకడానికి శ్రమిస్తాడు. చస్తూ శ్రమిస్తాడు. నిజం. శివయ్య తోబుట్టువులు చావురాకముందే చచ్చారు. తల్లిమిగిలుంది. పెళ్ళాం మిగిలుంది. తన తండ్రి చచ్చాడొ బతికాడో తెలీదు. బతికుంటే ముగ్గురు బతికున్నట్టు. తన తల్లిపేరు సుభద్ర. భార్య పేరు శశిరేఖ. పురాణం పేర్లు. రాజవంశం పేర్లు. ఎంతో యిష్టంగా పెట్టుకొన్న పేర్లు. ఆ పేర్లు పెట్టిన వాళ్ళు ఎంత స్పష్టంగా పలికేవాళ్ళు ఆపేర్లని. కాని తన తండ్రి అర్జునుడుకాదు. తాను అభిమన్యుడు కాదు. తమ పక్షాన ఏ కృష్ణ భగవానుడూలేడు. అయిదువూళ్ళు కాదంటే జరిగే కురుక్షేత్రమూ తమ ముందులేదు. ఉన్నదల్లా కులం. చాతుర్ వర్ణానికి వెలుపలి కులం. వెలివేయబడ్డకులం. పోరాటమంతా బతకటానికే. పారిపోయినా, పరుగులు తీసినా, అంతటా తన వంటిని అంటనివో విషనాగు సంస్కృతే.

అయినా బతకాలి ఆకలిని జయిస్తో, అంటరానితనాన్ని జయిస్తో. అందులో యిట్టాంటి కరువులో.

చచ్చిన గొడ్లమాంసాన్ని, రాబందుల్ని తరుముతో ఆ గొడ్ల ఎముకల్ని కండని వేరు చేసి కాల్చుక తినే ఎన్నెల దిన్ని మాలా మాదిగలు. దాని దగ్గరా కొట్లాట. గద్దల్తో కొట్లాట రాబందుల్తో కొట్లాట. తోటిమనుషుల్తో కొట్లాట యింత మాంసం ముక్క కోసం కాల్చుక తినటం కోసం. చాతుర్వర్ణం బతికిన వాళ్ళని తిన్నది దాని బయటి వర్ణం చచ్చిన వాటినే తిన్నది. అహింసామూర్తులు వీళ్ళు. అందుకే ఈ ఆకలి. అందుకే ఈ అంటరానితనం ఎల్లన్న గొప్పగాయకుడు కావచ్చు. కాని యిప్పుడు శివయ్య వూహించుకోలేడు. గద్దల్ని తోలుతో ఆ గొప్ప కళాకారుడు కాల్చుకోటానికి ఇంత ముక్క కోసం .... తోడేలు చూపులు .... చెట్టు మీది రాబందుచూపులు. వద్దు. ఆ ఆలోచనేవద్దు.

తవ్వుతున్నాడు. ఒక్కతేగన్నా దొరకకపోదని తీరా ఆగిచూస్తే చాలా గుంటే తవ్వినట్టనిపిం చింది. అనుకోకుండానే అన్పించింది యిద్దరికి సరిపడే గుంట ఆ ఆలోచనకి భయం పుట్టు కొచ్చింది. పార అక్కడే పడేసి పల్లె బయటి కొచ్చాడు.

వలస జనం ఎక్కువైనట్టు గవిటిచెట్టుకింద జనం సందడి. వాళ్ళంతా పైనుండి వస్తున్నారు. ఆకలి కడుపులో పెట్టుకొనే నడుస్తున్నారు. కరువుపనుల కోసం. బకింగ్‌హాం కాల్వ తవ్వకం కోసం. కూలికోసం. అక్కడికి చేరే సమూహాలు. వాళ్లదగ్గర కెళ్ళాలనుకొన్నాడు. వెళ్ళబుద్దికాలేదు. సగందూరం వెళ్ళి వెనుక్కితిరిగాడు. కాని ఎవరో వ్యక్తి తూలిపడుతూ యిటేవస్తున్నట్టనిపించింది అతను గవిటిచెట్టు కింది సమూహాల్లోంచే వస్తున్నాడు. ఆ వ్యక్తి దగ్గరయ్యాడు యిప్పుడో ఈక్షణమో చచ్చేలావున్నాడు. వచ్చినవాడు అంతకన్నా ఏ మాటా మాట్లాడలేనన్నట్టు ఒకే మాట పదేపదే అంటున్నాడు.

"సుభద్ర... సుభద్ర.. ..సుభద్ర"

శివయ్య ఆ మాటతో ఉలిక్కిపడ్డాడు. లోతుగా చూశాడు. తన తండ్రా ? తన తల్లిపేరు అంటున్నాడు. తన తండ్రే. అవును తన తండ్రే. ఆ వ్యక్తికి అవేవీ పట్టటంలేదు. ఒకేమాట. అంతకన్నా ఏమాట రాదు అన్నట్టు.

సుబద్ర...... సుభద్ర. ... నిజంగా తన అయ్యే. తన అయ్యే

శివయ్య తండ్రిని వాటేసుకొన్నాడు. పెద్దపెట్టున ఏడుస్తున్నాడు. కాని ఒకేమాట

సుభద్ర.... సుభద్ర

శివయ్య తన పేరు చెప్పాడు. నేను నీకు ఒక్కగానొక్క కొడుకునన్నాడు. చూడ్రానాకేసి అయ్యా అన్నాడు.

కాని .....

సుభద్ర ....... సుభద్ర

అదేమాట. తండ్రీకొడుకు, తల్లీకూతురు. ఏ బంధం ఇది. ఉన్నది ఒకే ఒకబంధం. అది వున్న వాళ్ళకి కావచ్చు. లేనివాళ్ళకి కావచ్చు. అగ్రవర్ణం వాళ్ళకి కావచ్చు. అంటరాని

వాళ్ళకు కావచ్చు. ఒకే ఒక్క శాశ్వతబంధం. ఆలుమగల బంధం. "నేనూ నా సుభద్ర. ఆమె నేనూ". ఈ మాటలన్నీ పైకి అనలేడు. అనగలిగేది ఒకే ఒక్కమాట.

"సుభద్ర.... సుభద్ర"

వాలిపోతున్నాడు.

శివయ్య అయ్యని పట్టుకొన్నాడు. భుజాని కెత్తుకొన్నాడు. వడివడిగా అడుగులు వేస్తున్నాడు. అయ్య అక్కడిదాకా బతకాలి. అమ్మని చేరిందాకా బతకాలి.

సందె వెలుగులు చివ్వరి నవ్వులు నవ్వుతున్నాయి. ఈ వెలుగునే ఎల్లన్న ""సందెలుగు కుందేలు సూబద్రా, సేలగుట్టలదూరే సూబద్ర" అంటూ పాట అల్లాడు. అదోముసలి పొద్దని పిలిచాడు. రేకువేకువది. బిగుసుకపోతున్న సందె పెదవి. మొలక అలల చివ్వరి మజిలీ....... మాటలు రాని మట్టిని ముద్దాడే సెలయేటి కడుపుకోత.

అదంతా ఎల్లన్న పాటల పదనిసలు. శివయ్యకి అవన్నీ అక్కరలేదు. అయ్య బతకాలి. అమ్మను చేరిందాకా అయ్య బతకాలి. అంతే.... బలం కొద్దీ అడుగులు పడ్తున్నాయి.

ముంగిట అడుగులు ఆగాయి.

తలెత్తాడు శివయ్య.

ఎదురుగా సుభద్ర.

రెండు చేతుల్లోకి అయ్యని తీసుకొన్నాడు.

"అయ్య... మా యయ్య"

ఒకే శబ్దం. సుభద్ర.... సుభద్ర.

సుభద్ర అట్టాగే ఆగి చూసింది. తనవాడే. ఎట్టావెళ్ళాడు వీడు. ఎట్టావచ్చాడు యిప్పుడు. ఈ సంజలో, ఏ చీకటి వెల్లువ నెట్టుకొచ్చింది వీణ్ణి. ఎక్కడెక్కడో తిరిగిన ఈ పాట తీరా దగ్గరికొచ్చేవేళకి ఎందుకిట్టా అలిసిపోయింది.

సుభద్ర అట్టాగే చూస్తోంది. చూస్తోనే కూలబడింది. చేతులు శివయ్యకేసి చాపింది. చూపు ఎల్లన్న కేసేవుంచింది.

"యిట్టా ఈరా బిడ్డని".

శివయ్య ఎల్లన్నతలని ఆమె చేతుల్లో వుంచాడు.

సుభద్ర ..... సుభద్ర.

సుభద్రకు మాటరావడంలేదు. ఎల్లన్న తలని పవిటతో కప్పింది. గుండెలకు హత్తుకొంది. చేతుల్తో ఎల్లన్న తల నిమురుతోంది. ముంచుకొచ్చిన నిద్ర. మళ్ళీ మెలుకువ రానినిద్ర.

నిశ్శబ్దం. అంతే. పిలిచేందుకు అతనులేడు. వినేందుకు ఆమెలేదు.

శివయ్య ఏడ్పువక్కటే మిగిలింది.

శశిరేఖ రోదన దానితోడుగా నిలిచింది.

ఆకలి, అంటరానితనం పెనవేసుకొన్న పచ్చి నెత్తుటిబొట్టులా ఎన్నెలదిన్ని చేలలో పరుగెత్తి అదృశ్యమైన సందెవెలుగు చివ్వరి జాడనీడ.

ఆ యిద్దర్నీ విడదీయటం శివయ్యకి యిష్టం లేదు. అట్టాగే అతికష్టంమీద పాతర గుంటలో వుంచాడు. దోసిలి మట్టి నెట్టాడు. శశిరేఖని నెట్టమన్నాడు. అట్టా మట్టి నెడుతూనే వున్నారు. అట్టా ఎందుకు చేస్తున్నారో వాళ్ళకే తెలీదు. గుంటపూడింది అనుకొన్నాక ఆ గుంటమీద అట్టాగే అలసి పడుకొన్నారు.

మట్టికింద పాట, పల్లవి. మట్టిపైన వాటి ప్రతిధ్వనులు.

ఎన్నెలదిన్ని ఎట్టా అనుకొంటుందో తెలీదు, ఎన్నెలపిట్టమాత్రం అక్కడవాలిందే కాని రొద చేస్తూ పారిపోలేదు.

తెల్లవారింది. ఉన్న నాలుగు గుడ్డలు మూటకట్టాడు శివయ్య. కూటికుండ, కూరాకు సట్టె బుట్టలో పెట్టాడు. బుట్టవకవైపు, మూట ఒకవైపు కావిడిలో పెట్టుకొన్నాడు. శశిరేఖతో వలసల్లో కలిసిపొయ్యాడు.

వెళ్తూ వెళ్తూ వెనక్కి చూశాడు. మట్టికింది అమ్మ అయ్యా గుర్తొచ్చారు. ఎంకటనర్సు, పోలడు, పిట్టోడు, బూదేవి, చిన్నమ్మి, పోలడి భార్య ... ఒక్కొక్కరే గుర్తొచ్చారు. రెండుపల్లెలు రెండు శ్మశానాల్లా వున్నాయి. ఊళ్ళో ఏదో పీనుగ అప్పుడే లేసినట్టుంది. మాలాడి దిబ్బ దాటుతుంటే ఎంతో బాధ ముందు నిల్చింది. అంతా బతుకుపోరు. తిరిగి ఈ వూరు వస్తారో రారో తెలీదు. తప్పకరావాలనుకొన్నాడు. తన రక్తమంతా ఈ మట్టిలోనే యింకి వుంది. వాళ్ళ చెమట తాగిన నేల యిది. తిరిగిరావాలి. తప్ప కుండా తిరిగి రావాలి.

"అత్తగుర్తొత్తుంది "

"నడువ్...... ముందువలస శాన దూరం ఎల్లింది " ఆకలికి అడుగు పడక పోయినా శశిరేఖ శివయ్యతోపాటు పరుగు తీస్తోంది. ఎందుకో తెలీదుకాని నడుస్తున్నవాడు ఒక్కసారి ఆగాడు. శశిరేఖ కేసి చూశాడు.

"అయ్యపాటలన్నీ వచ్చుగా నీకు "

"శానావచ్చు "

"దాచివుంచు. రాయించిపెడదాం". మళ్ళీ నడక. కావలి వచ్చింది. కలుగోలమ్మ గుడి దగ్గర ఆగారు. ఆ రాత్రి గుడి దగ్గరే ఆగాలనుకొన్నారు. జనం ఆగటం లేదు. అమ్మతల్లికి మొక్కారు. కలుగొలమ్మకి కులం లేదు. పార్వతమ్మకి తోబుట్టువు. మళ్లీ నడక మొదలైంది. చిట్టడివి అడ్డొచ్చింది. పక్కమనిషి నడిగితే రుద్రకోట దగ్గర పడ్డదన్నారు. ఎప్పుడు తవ్వారో తెలీదు. నేల బావి పెద్దదే వుంది అక్కడ. నేరేడు చెట్లు చుట్టూవున్నాయి. కోతుల్లా చెట్ల మీద పడ్డారు. దొరికినన్ని నేరేడు కాయలు మూటలుకట్టారు.

"తిను."

"కడుపునొప్పి"

"బతకాల"

నొప్పి అంటూనేతింది. దిగుడుబాయిలో దోసెడు నీళ్ళు తాగారు. కూటికుండలో నీళ్ళు తెచ్చాడు శివయ్య. ఆరాత్రి అక్కడే పక్క. బారులుతీరి పడుకొన్నారు. ఆకలి నిద్ర, అలసిన నిద్ర.

మళ్ళీ నడక. చుక్కపొద్దున్నే. యింకో రోజు పడుతుందన్నారు ఎవరో. రోజుకాదు రెండు రోజు లన్నాడు యింకొకాయన. అయిదు రోజులు "నడవమా ? నడవండహే పొద్దాక సనుగుడు."

"ఎవడాడు ఎనకబడ్డాడు."

"ఆగండి"

"పడిపొయ్యాడు"

గుంపంతా అక్కడికి చేరారు. పడ్డవాడు పడ్డట్టేవున్నాడు. కదలటంలా. పక్కకిలాగారు. వాడిదేవూరో తెలీదు. చిట్టడివి కొమ్మల ఆకులు పైన వేశారు

గుంటతవ్వే వోపికలేదు.

"బయంగా వుంది "

"ముందునడువు"

గుంపులు గుంపులుగా జనం. దారంతా జనం. సత్తువ లేకున్నా తప్పదన్నట్టు నడుస్తున్న జనం. ఎవరికళ్ళల్లో చూసినా కాంతిలేదు  చాలా పోగొట్టుకొన్న విషాదం. ఆ గుంపులో ఓకుర్రాడు శివయ్యని పలకరించాడు. పక్కన ఓ పిల్లకూడా వుంది.

"ఆరుగురు అప్పాచెల్లెళ్ళు. కళ్లముందే మట్టికలిసేరు. బయ్యారం మాదిగోణ్ణి. ఒక్కడ్ని మిగిలా. మద్దెలో వోణ్ణి. అయ్యముందే సచ్చేడు. అమ్మ ఆడెంటే ఎల్లింది. నీ పేరేంది'

"శివయ్య. ఎన్నెల దిన్ని మాలోణ్ణి. ఇది నాయింటిది"

"యిద్దరేనా మిగిలింది"

"ఆ !

"నువ్వు నయం. నేనొక్కణ్ణే మిగిలా"

"ఈ ఆడకూతురు ........"

"దార్లోతోడైంది. ఇంకా పడమటి పిల్ల లాగుంది. నాకులాగే ఒక్కటే మిగిలుంటుంది. కాలవ దాకా బతికుంటే కాపరం పెడ్దామనుకొన్నాం. మద్దెలో ఎవురు సచ్చినా బతికి నోళ్ళు గుంట తవ్వాలను కొన్నాం. ఈడదాకా బతికున్నాం. నాపేరు జింకోడు. ఆ పిల్ల పేరు తెలీదు. కులం తెలీదు. పిల్లకి మాటల్రావు. అంతాసైగే"

ఆ మాటలంటూ నవ్వాడు. శివయ్యకి నవ్వురాలేదు. గుండెని ఎవరో తొలిచినట్టుంది. అట్టాగే ఆ కుర్రాడికేసి చూశాడు.

పగలంతా నడుస్తూనే వున్నారు. నడుస్తూ నడుస్తూ ఆ పిల్ల ఆగేది. అట్టా చాలసార్లు ఆగింది.

"యిరోసెనాలు.... నిన్నాయింతే" విచిత్రం ఆ పిల్లని గుట్టచాటుకో చెట్టు చాటుకో అతనే తీసుకెళ్ళేవాడు. అతను వెళ్తేనే ఆ పిల్లవెళ్ళేది. శివయ్యకి ఆశ్చర్యంగా వుండేది. ఆ పిల్లకి అతని మీద అంత విశ్వాసం ఎట్టా కలిగిందో అర్థం కాలేదు.

చీకటిపడ్తున్నా నడుస్తూనే వున్నారు. ఏదోవూరులాగుంది. కుక్కల అరుపులు విన్పిస్తున్నాయి. ఊళ్ళోకి వెళ్ళడానికి భయం వేసింది శివయ్యకి అతనైతే పర్లేదు పద అన్నాడు. ఊళ్ళో దూము వుండొచ్చు. ఊరికి దూరంగా వున్న మామిడి తోటలో ఆగారు. తోటలో నీళ్ళ దొరువుంది. ఆనీళ్ళు మంచివో కాదో తెలీదు. అయినా తప్పదు తాగాలి.

మసక వెన్నెల.

ఎండు ఆకులు చిమ్మి యిసక మీదే నడుంవాల్చారు. శశిరేఖ అలసివుంది. అట్టా పడుకొందో లేదో కన్నుమూసింది. మగత నిద్రపట్టింది. ఆపిల్ల మాత్రం అతని చేతిని బలంగా పట్టుకొనే పడుకొంది.

"ఊళ్ళోకి ఎల్దామా"

"ఎందుకు"

"యిళ్ళు గాలిస్తే కూడు దొరక్కపోదు అట్టాదార్లొ రెండుసార్లు ఎతికాను. కూడు దొరికింది. ఈ పిల్లానేనూ తిన్నాం"

"నాకు నమ్మకంలేదు"

"సూద్దాం. ఆడాళ్ళు నిద్రపోతున్నారు. దగ్గర్లోనేవూరు. అంతా నిద్రపొయ్యుంటారు. ఎక్కడో వకచోట రెండు మెతుకులు దొరక్కపోవు. సిన్నప్పట్నుంచి కూటి దొంగతనం నాకు చేతవ్. నాతోరా. దొరికితే పాపం నీ యింటిది ఇంత ఎంగిలి పడుద్ది".

ఆ మాటతో మెత్తబడ్డాడు శివయ్య. శశిరేఖను నిద్రలేపి వూళ్ళో కెళ్ళొస్తామని చెప్పాడు. ఆమె ఊఁ అంది.

ఊళ్ళో కుక్కల అరుపుతప్ప యింకోశబ్దం లేదు.

ఏవూరో తెలీదు.

అక్కడక్కడా యిళ్ళల్లో దీపం వెల్తురు కన్పిస్తోంది. చాలావూళ్ళకన్నా ఈ వూరునయమని పించింది. జింకోడు చెప్పినట్టు చేస్తున్నాడు శివయ్య.

మనుషులు బొత్తిగా లేని యిళ్ళు.

బహుశా కొద్ది రోజుల ముందు వుండి వుంటారు. వలస పోయివుండొచ్చు. చచ్చి పోయివుండొచ్చు.

మనుషులున్నా సొక్కినట్టు నిద్రపోతున్నారు. కాని ఏ కుండలోనూ కూడు మాత్రం లేదు. అయినా జింకోడుకి విసుగు పుట్టలేదు. యింకా వెతుకుతూనే వున్నాడు. చివ్వరి మూడిళ్ళు వున్నాయనుకొన్నాడు.

ఒక యింట్లో నిట్టాడి పక్కన దీపంవుంది. దీపానికి దూరంగా కుక్కి మంచంవుంది. మంచం పక్కన కూటి పళ్ళెం వుంది. దాన్ని ఆత్రంగా పట్టుకొని చూశాడు. ఎవరో సగం కూడు తిన్నారు. సగం వుంచారు.

"కూడు!"

జింకొడు గట్టిగానే అన్నాడు.

"సగంతిని వదిలేరు".

జింకోడి మాటల్ని ఆశ్చర్యంగా విన్నాడు శివయ్య.

"మా ఆయినే ... అంతా తిన కుండానే సచ్చేడు"

ఆశ్చర్యంగా, భయంగా ఆ మాటలు వొస్తున్నవైపుకు శివయ్య, జింకొడు చూశారు. నిట్టాడి నీడ చాటున ఓ ముసల్దివుంది. మొలకి తప్ప వొంటిమీద గుడ్డలేదు., వికృతంగా వుందా చీకటి నిట్టాడినీడలో.

జింకోడు నిట్టాడి పక్కన దీపం ఎత్తి చూశాడు. కుక్కి మంచంలో నీలుక్కుపోయిన ముసలాడి మృతదేహం.

"గొప్పమనిసి. మనకోసం యిదుంచి సచ్చాడు" నవ్వుతూ అన్నాడు. జింకొడి మాటలకి శివయ్య ఆశ్చర్యపొయ్యాడు. భయంగా చూశాడు.

"దెయ్యంకూడనా ? ఆకలికన్నా దెయ్యం యాడుంది. పద ...."

ఆ మాట అని వెనుక్కి తిరిగాడు. శివయ్య యింకా యిటు తిరగలేదు. నిట్టాడి నీడలో ముసల్ది ఒక్క ఉదుటున జింకోడి మీద పడింది. అనుకోని సంఘటనకి మొదట జింకోడు జంకాడు.

"కూడు ఆడ పెట్రా"

ఆ మాటంటూ ఆముసల్ది జింకోడ్ని గట్టిగా పట్టుకొంది. మొలకున్న యింత చింపిరి పాత కూడా వూడిపోయింది. వింతజంతువులా వుంది. శివయ్యకి అక్కడ నుంచి పారిపోదామని పించింది. జింకోడు మాత్రం ఆ ముసల్దాన్ని గట్టిగా తోశాడు. ఆ ముసల్ది దూరంగా పడిపోయింది. జింకోడు శివయ్య చెయ్యిపట్టుకొని లాగుతూ బయటకొచ్చాడు. మునల్ది లేని సత్తువు తెచ్చుకొని వెంటపడింది. జింకోడు పరుగుతీశాడు. శివయ్య అనుకోకుండానే పరుగుతీస్తున్నాడు. ముసల్ది తిడుతూ పరుగు తీస్తోంది. వెనక్కి తిరిగి చూస్తే భయంకరంగావుంది. కుక్కలు ఆ ముసల్దాని వెంట పరుగుతీశాయి. ముసల్ది కుక్కల్ని తరుముతూనే జింకొడ్ని తిడుతోంది. పరుగెత్తలేక ఆగింది. యిప్పుడు కుక్కల అరుపులే విన్పిస్తున్నాయి. తోట దగ్గరపడ్డాక వెనుక్కిచూస్తే చుట్టూ కుక్కలు మధ్య ఆ ముసల్ది కన్పిస్తోంది. కుక్కల అరుపులు విన్పిస్తున్నాయి. ముసల్దాని గొంతు విన్పించటంలేదు.

"పాపం ముసల్దాన్ని కుక్కలు చంపుంటాయి.'

"ఆమెని లేపు కూడు తింటది"

"అది రెండు దెయ్యాలకూడు"

"యిక్కడున్న నాలుగు దెయ్యాలకి సరిపోద్ది సర్దుకుంటే.... నిద్రలేపు"

"నిద్రలేపినా తినదు"

"నువ్వు"

"వొద్దు"

"మంచిదే... అయితే రెండే రెండు దెయ్యాలు తింటాయి".

ఆ పిల్లనిలేపాడు. అలసిపోయినట్టుకళ్ళు తెరిచింది ఆ పిల్ల నోట్లో ముద్ద కలిపిపెట్టాడు నోట్లొ కూటి ముద్ద పడగానే ఆపిల్ల కళ్ళు పూర్తిగా తెరిచి పైకిలేచింది.

కూడా ? అన్నట్టు సైగచేసింది.

"తిను"

యాడది, అన్నట్టు మరో సైగ.

"ఎవుడో సగం తినకుండా సచ్చాడు... ఈ ముద్దా తిను."

బాగుంది అన్నట్టు తలూపింది. అతను మరో ముద్దపెట్టాడు. చాలన్నట్టు తలూపింది. బతి మాలాడు. వద్దంటూనే వుంది. అతను బల వంతంగా మరోముద్ద తినిపించాడు. శివయ్య చలించిపొయ్యాడు. అతనికేసే చూస్తున్నాడు. అతను మిగిలిన కూడుమూడు ముద్దలు చేసి తిన్నాడు. దొరువులో నీళ్ళు పళ్ళెంనిండా ముంచి తాగాడు. నీళ్ళు తెచ్చి ఆ పిల్ల మూతికడిగాడు. నీళ్ళు తాపాడు. పళ్ళెం తలకిందపెట్టుకొని పడుకొన్నాడు. ఆ పిల్ల వాడి బుజం మీద తలపెట్టిపడుకొంది. చేతులు వాడి చాతిమీద వుంచింది.

శివయ్యకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తన కళ్ళలో నీళ్ళు ఎందుకు తిరుగుతున్నాయో తెలీదు. కాని అట్టా జరుగుతొంది.

ఆ రాత్రంతా ఆ పిల్లకు విరోచనాలు అవుతూనేవున్నాయి. శివయ్యకు ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. దాదాపు చుక్క పొద్దుకాడే శివయ్య నిద్ర లేసి చూస్తే జింకోడి ఏడ్పు విన్పించింది. ఆ పిల్లకేసి చూశాడు శివయ్య.

"ఎప్పుడు జరిగింది "

"అప్పటికి సుక్క పొడవలా"

మౌనం. ఎవరు ఏం మాట్లాడాలో అర్థం కాదు శశిరేఖ నిద్రలేసి ఆ దృశ్యం చూసి తట్టుకోలేక పోయింది.

"మీరెళ్ళండి. అనుకొన్నమాట పూర్తిసేసి బతికుంటే వత్తా"'

అంతకన్నా చెయ్యగలిగింది కూడా ఏదీలేదు. ఆ పిల్లకేసిచూశాడు. శాశ్వితంగా అలుపు తీర్చుకొంటోంది.

జింకోడ్ని అక్కడే వదిలేసి బయల్దేరారు. చుక్కపొద్దున మొదలెట్టిన ప్రయాణం బకింగ్ హాం కాలవ తవ్వకం దగ్గర కొచ్చేసరికి సూర్యుడు నడినెత్తికి వచ్చాడు.

ఆ ప్రాంతమంతా కూలీలతో నిండివుంది. ఎక్కడెక్కడి సమూహాలు యిక్కడ గుమి గూడినట్టుంది. తవ్వేవాళ్ళు తవ్వుతున్నారు గంపలకెత్తేవాళ్ళు ఎత్తుతున్నారు మోసేవాళ్ళు మోస్తున్నారు. శివయ్యకి అంతా అయోమయంగా వుంది. బతుకు ఆట. అంతా అంతే. కేవలం బతకటం కోసం ఆట.

పన్లో చేరడానికి ఎవర్ని అడగాలో అర్థం కాలేదు. అలసిపోయిన శశిరేఖ అతని బుజాల ఆసరాతో నిలబడివుంది. శివయ్యకి అక్కడికి చేరాక యిక బతుకలేమనే భయం పోయింది. పనిలో చేరితేచాలు. శశిరేఖని బతికించు కొంటాడు.

కాస్తదూరంలో ఓ గుండ్రటి మనిషి కన్పించాడు. తాటాకుల టోపి పెట్టుకొన్నాడు. మనిషి విచిత్రంగావున్నాడు. అతని పంచె కట్టు చిత్రంగావుంది. చొక్కా పైన పంచ కట్టడం శివయ్యకి కొత్తగా అన్పించింది. దానిమీద తోలు బెల్టుపెట్టాడు. మొహం మీద తీర్చిదిద్దిన మూడు నామాలు. మాట్లాడుతున్నాడో అరుస్తున్నాడో అర్థంకావటంలేదు. పన్లో పెట్టుకొనేది ఆయనే అని తెలిసింది. ఆశగా వెళ్ళాడు. కాస్త దూరంలో నిలబడ్డాడు. శశిరేఖ శివయ్య బుజాల ఆసరావొదల్లేదు. వదిలితే పడేలా వుంది.

నాలుగు సార్లు దణ్ణంపెట్టాడు. అతను గమనించిందీ, గమనించంది అర్థంకావటంలేదు. అయిదోసారి గుండ్రని మనిషి ఏమిటన్నట్టు చూశాడు. కోడిపిల్లల కేసి చూసే గద్దలావుంది ఆ చూపు. శశిరేఖ భయంగా చూసింది.

శివయ్య పనికావాలన్నాడు. చాలా దూరం నుంచి వచ్చామన్నాడు. శశిరేఖ పరిస్థితి చెప్పాడు. ఏకళన వున్నాడో తలూపాడు. గట్టి ఎదురు బొంగు నేలలో గుచ్చి దానికి గొడుగు కట్టిన నీడలోకి వెళ్ళాడు. అక్కడ బల్లమీద కూర్చొన్నాడు. పుస్తకం తీశాడు. చెవులో కలం తీశాడు. బల్లమీది యింకు బుడ్డీలో ముంచి పేరు చెప్పమన్నాడు.

"శివయ్య"

అతను తలపైకెత్తిచూశాడు. కలం మళ్ళీ సిరాబుడ్డీలో ముంచి రాసుకొంటున్నాడు.

"ఎన్నెలదిన్నె మాలోడ్ని"

ఆ గుండ్రని మనిషి రాస్తున్న వాడల్లా రాయటం ఆపి తలపైకెత్తి చూశాడు. ఏదో దుర్మార్గం విన్నట్టు మొహంపెట్టాడు.

"యిది నాయింటిది"

గుండ్రని మనిషి కళ్ళు ఎర్రబడుతున్నాయి. రాక్షసుల్నిచూసినట్టు ఆయిద్దరి కేసి మార్చి మార్చి చూస్తున్నాడు. వెర్రి పట్టిన వాడిలా అరవటం మొదలెట్టాడు. మాలా మాదిగ అనేమాటలు మాత్రం అర్థమౌతున్నాయి అతని అరుపులకి పనిచేసే వాళ్ళు ఎక్కడిపని అక్కడ ఆపారు. ఏంజరుగుతుందో అర్థంకావటంలేదు.

"ఈ మాల కొడుక్కి యిక్కడ పనికావాల్ట" గుండ్రని మనిషి కొంపలంటుకుపోయినట్టు అరుస్తూనే వున్నాడు. పని ఆపిన కూలీలు ఆ యిద్దరిమీద మట్టిగడ్డలు విసరటం

మొదలెట్టారు. కూలీలలో వకరిద్దరు వూగిపోతూ గడ్డపారల్తోపై కొస్తున్నారు. గుండ్రని మనిషి ఎందుకు అరుస్తున్నాడో, గడ్డపారల్తో ఆ యిద్దరు కూలీలు ఎందుకు దాడి చేస్తున్నారో మట్టిగడ్డలు నాలుగు వైపులనుండి ఎందుకు తమపైన పడుతున్నాయో శివయ్యకి అర్థం కావటంలేదు. ఒక్కటి మాత్రం అర్థమైంది. అక్కడవుంటే తమ ప్రాణాలకు ముప్పువస్తుంది. ఆ ఆలోచన రాగానే శశిరేఖ చెయ్యి పట్టుకొని అక్కడ వుండకుండా పరుగుతీశాడు. తమని తరుముకొంటూ కొందరు కూలీలు వస్తున్నట్టు అన్పించింది. లేని శక్తి తెచ్చుకొని పరుగు ఎక్కువచేశారు. చాలా దూరం తరిమాక కూలీలు వెనుక్కి తిరిగారు యిక పరుగెత్తే ఓపికలేక ఎండిన సరిగె తోపు బాటలో చతికిలపడ్డారు. ఎండ తీవ్రంగావుంది. సరిగె తోపులో మరీ వేడిగావుంది. అయినా కాలే యిసుకలోనే చతికిల పడ్డారు. శశిరేఖ భయంగా చూస్తోంది.

అంతా వూహించని వద్ధతిలో జరిగింది. వెంరుపుదాడిలా జరిగింది. ఎందుకట్టాజరిగింది. తానేం చేశాడు. ఏం అన్నాడు. శశిరేఖ ఏడుస్తోంది. ఆఏడ్పు చూస్తే శివయ్యకి భయంవేస్తోంది. నిస్సహాయంగా ఆమె మొహంలోకి, కళ్ళలోకి చూశాడు. మొహంనిండా మట్టి. కంటి రెప్పల మీద బురదమట్టి. అనాలోచితంగానే ఆమె మొహం మీద మట్టిని తుడుస్తున్నాడు. ఆమె ఏడ్పు మరీ ఎక్కువైంది. ఆమెని ఓదార్చే ఓపిక కూడా లేదు. కూలి కోసం మైళ్ళకు మైళ్ళు నడిచివచ్చారు. కాలవ దగ్గరపడగానే బతుకుమీద ఆశపుట్టింది. ఉన్న ఆ ఒక్క ఆశాపోయింది. యిక బతకటం జరిగేపనికాదు. ఒక్కొక్కర్నే తన వాళ్ళని ఆకలిబలి తీసుకొంటే వరుసగా గుంటలు తవ్వాడు. తనకంటూ ఈమె మిగిలింది. కాని.... కాని.....ఊహించలేక పోతున్నాడు. ఆమె మొహాన్ని చేతుల్లోకి తీసుకొన్నాడు. ఏడ్పుఎక్కువౌతుందేకాని ఆగటంలేదు.

"యిట్టాచూడు"

ఏడ్పు ఆపి చూసింది. జాలి చూపు. నిస్సహాయంగా చూసే ఆకలిచూపు. కళ్ళనీళ్ళు తిరిగాయి. ఆమె మొహాన్ని, మొహంమీది కన్నీటిని తుడిచాడు. మళ్ళీ మళ్ళీ తుడిచాడు. ఆ జాలి చూపుల్ని పెదాలతో కప్పేశాడు. తనలో తాను ఏదో అనుకొంటున్నాడు. ఆమె వినాలని అంటున్నాననుకొంటున్నాడు. మాటలు తన పెదాలు దాటి రావటం లేదు.

ఎన్నిరోజులైంది ఈ పిచ్చిది తిండితిని. దారంతా యింకా ఎంత దూరం అని పదేపదే అడిగింది. యిక్కడ దాకా బతకటం కోసమే నడిచింది.

మాలాడు, మాదిగాడు అంటూ కూలీలు అరచిన అరుపులు గుర్తొచ్చాయి. యిప్పుడు తనకు కొన్ని నిజాలు స్పష్టంగా, అస్పష్టంగా అర్థమౌతున్నాయి. ఎందుకనిపించిందో గాని ఎన్నెల దిన్ని రెడ్డోడ్ని అని చెప్పుంటే బాగుండేదనిపించింది. కూలి దొరికుండేది. తమ వెంట ఆకలి వొక్కటేకాదు, అంటరానితనం కూడా తోడుంటుంది. తమ మీద రాళ్ళు విసిరిన కూలీలు కూడా బతకటం కోసం మైళ్ళు నడిచి వచ్చిన వాళ్ళే. వాళ్ళ బంధువుల కోసం వాళ్ళ వూళ్ళల్లో తన లాగా గుంటలు తీసినవాళ్ళే. మామూలు కూలీలే. కాని ఆకలికి కూడా

అంటరానితనముంది. కూలికి కూడా అంటరానితనముంది.

తన శరీరం అంటరానిది.

తన శశిరేఖ శరీరం అంటరానిది.

కాని తన శరీరానికి శశిరేఖ శరీరం అంట రానిది కాదు. ఎందుకో ఆప్యాయంగా నిమిరాడు. ఆమె చేతుల్తో తన మొహాన్ని రాసుకొన్నాడు. ప్రపంచం ఎట్టా గోచన్తుంది. చావనీ అనుకొన్నాడు. బతుకు పోరాటం చివ్వరి ఘట్టంలో వుంది. బకింగ్‌హాం కాల్వ యింకా చాలా దూరం వుంటే బాగుండేది. ఆశతో బతికేవాళ్ళు. ఆశతోనడిచేవాళ్ళు. యిప్పుడు దూరంలేదు. నడకఆగిపోయింది. ఆశలేదు. అది అడుగంటింది. బతుకు ఆగటానికి సిద్ధంగావుంది. వెన్నుకు అతుక్కపోయిన ఆమె డొక్కలోంచి ఆకలి శబ్దం విన్పిస్తోంది. బలహీనంగా కొట్టుకొంటున్న ఆమె గుండెల శబ్దం కూడా విన్పిస్తున్నట్టే వుంది ఆమె యిప్పుడు ఏడ్వటం లేదు. శోషపోయిన దానిలా పడివుంది. ఈమె గుంట అందరి గుంటలా తవ్వకూడదనుకొన్నాడు. ఆ అలోచన రాగానే భయంగా తుళ్ళి పడ్డాడు. అతని తత్తరపాటుకు ఆమె కళ్ళు తెరిసింది. అతనికేసి చూసింది. సన్నగా నవ్వింది. అతని ఆకలి కడుపులో మొహం వుంచి, వొదిగిపోయింది. ఆమెను అతను ఒడిసి పట్టుకొన్నాడు. అమెయింకా అతనిలో వొదిగి పోయింది. అట్టాగే నిద్రపోయ్యారు. నిజానికది నిద్రకాదు. ఏదీ చెయ్యలేని అసహాయత.

వానల్లేక ఎండిన సరిగ తోపులో గాలి వెచ్చగా వీస్తోంది. పడమటిగాలి మధ్య మధ్యలో యిసుకనంతా ఎత్తిపోస్తోంది. నిజానికి యిసుకరేణువులు వాళ్ళ శరీరాన్ని చాలా బలంగానే తాకుతున్నాయి. అయినా స్పర్శ చచ్చిపోయింది. ఏదైనా జరగనీ. యిసుక తుఫాను రానీ, ఆ యిద్దర్నీ అట్టాగే కప్పెయ్యనీ. సజీవ సమాధి పేర్చనీ. అంతావక్కటే. ఆందోళన, ఆరాటం, భయంలేని స్థితి అది. తత్వవేత్తలు నిశ్చల సమాధి అంటారు. బహుశా ఇదే కావచ్చు.

అతను ఎన్నెలదిన్ని మాలాడు.

ఆమె అతని తోడు.

తరతరాల అంటరాని జీవితాలకు వారసులు వాళ్ళు. వాళ్ళ పూర్వీకులు ఊరవతల విసిరేయ బడ్డారు. అంటరానివాళ్ళుగా బతికారు.

అవును.

అట్టాగే బతికారు.

అట్టా ఎందుకు బతికాల్సివచ్చిందో వాళ్ళకి తెలీదు

చరిత్ర తొలి దశలమాట.

అప్పుడు రాజ్యాలు పాలించారట.

రాజులు పాలించినట్టు. బ్రాహ్మణులు పాలించినట్టు. రెడ్లు పాలించినట్టు. అట్టా అనే కానేక కులాలు పాలించినట్టు.

వెతికితే ఆధారాలు దొరక్కపోవు. కాని వెతికిన జాడ కన్పించదు. వెతికినా వెతికినదంతా ముందేసుక కూర్చొంటే అంతా దోపిడీ వర్గాల వక్రీకరణ. అగ్ర కుల పరిశోధకుల స్వీయ మానసిక కంపు. అంతే

విషాదమంతా ఎట్టా వుందంటే.

ఈ చరిత్రకి మట్టి వాసన, మనిషి వాసన తక్కువ.

చంద్రప్ప అన్నట్టు. నాగన్న అన్నట్టు అంతా మట్టి దిబ్బలు గుంటలు. గోతులు. లోయలు.

ఏ గోతిలో ఏ వాస్తవం విసిరివేయబడ్డదో తెలీదు.

ఏ మట్టి దిబ్బ కింద ఏ బతుకులు శాశ్విత సమాధులయ్యాయో లెక్కలేదు.

ఏ లోయలో ఏ నాగరికత ఉరితియ్యబడ్డదో అర్థంకాదు

మట్టిమీద ఆధిపత్యం

మనుషుల్ని నిర్దాక్షిణ్యంగా వేరుచేసి అణిచివేసిన కౌటిల్యం.

వర్గం

కులం.

విసిరేయబడ్డ బతుకులు.

సమాధి చేయబడ్డ బతుకులు.

ఉరితియ్యబడ్డ నాగరికతలు.

మాలలు, మాదిగలు.

వాళ్ళు రాజవీధుల్లో నడవలేదు.

నిజంగా నడవలేదు.

ఊరి బావుల్లో నీళ్ళు తాగలేదు.

మెడకు ముంత. ముడ్డికి తాటాకు.

మనుషులే. రెండు కాళ్ళు. రెండు చేతులు, ఒక మెదడు అందరిలాగే

బాపనాళ్ళకులాగే, రెడ్లకులాగే, కమ్మవాళ్ళకు లాగే, యింకా చాలామంది అగ్రకులాల వాళ్ళకు లాగే.

మనుషులే, మెదళ్ళే

తమిళదేశంలో పెరియాలు

కన్నడలో హుళీలు

మహారాష్ట్రలో మాంగ్‌లు, మహర్లు, భంగీలు, చమార్లు,

తెలుగులో మాలలు, మాదిగలు.

అట్టా చాలా చోట్ల. ఈ దేశం ప్రతిమూల

ఈ పవిత్ర భారతదేశంలో అపవిత్రంగా, అసహ్యంగా చూడబడ్డవాళ్ళు.

అంటరానివాళ్ళు

మాలలు

మాదిగలు

ఎల్లన్నలు, సుభద్రలు,

శివయ్యలు

శశిరేఖలు

ఈ దేశం సంస్కృతికి సిగ్గులేదు. ఉన్నదల్లా కుట్ర. ఈ దేశం సంస్కృతికి నిజాయితీలేదు. ఉన్నదల్లా మోసం యిక్కడ వేదం, మతం, మనువు, సహనం, సామరశ్యం అన్నీ కుట్రకి, మోసానికి పర్యాయపదాలు.

అంతే.

కుట్రకి, మోసానికి పర్యాయపదాలు

నిజంగా అంతే

శివయ్యని కుట్రచేశాయి. మోసం చేశాయి.

శశిరేఖనీ అంతే కుట్ర మోసం.

ఆ కుట్రే, ఆ మోసమే

శివయ్య, శశిరేఖల్ని ఆసవక తోపు మండు టెండలో ఏదైనా జరగనీ, యిసుక తుఫాను కప్పనీ, సజీవ సమాధి జరిగిపోనీ అనే స్థితిలోకి నెట్టింది

శివయ్య, శశిరేఖలు అట్టా ఎంతసేపు వున్నారో వాళ్ళకే తెలీదు.

సూర్యుడు కొండల్లో కుంగిపోతున్నాడు

శివయ్యని ఎవరో తట్టిలేపుతున్నట్టనిపించింది.

కళ్ళు తెరిచాడు. అసహనంగా చూశాడు.

ఎదురుగా అపరిచిత వ్యక్తి నవ్వుతున్నాడు. అతని మెడలో ఏదో గుర్తు వేలాడుతోంది.

ఆ గుర్తు 'సిలువ' అని శివయ్యకి తెలీదు.

# 14

ఓ నా ఒంటరి చుక్కా ! ప్రకాశింపుము. ఏ చుక్కా ప్రకాశించనంతటి వెలుగుతో, శతకోటి చుక్కలమధ్య, ప్రకాశింపుము. ప్రకాశింపుము.

ఇమ్మానుయేలు నుదుట

ఓ ఒంటరి చుక్కా ! ప్రకాశింపుము, ప్రకాశింపుము. భూ దిగంతాలనంతా నిండిపోతూ బెతిలహేములో జన్మించిన ఒంటరి చుక్కా ప్రకాశింపుము. ప్రకాశింపుము.

నెహెమ్యా ! నువ్వు రాసుకొన్నది నిజమగును గాక! యెరూషలేములో పుట్టిన ఆనంద ధ్వని, దూరమునకు బహుదూరమునకు వినబడుతుంది. ఓ నది వరదైనట్టు, వెల్లువైనట్టు, విస్తారమైన పంట పొలాలు తడిపినట్టు.

సహస్రాబ్ది తొలి కిరణాల ప్రత్యక్ష సాక్షీ !

ఒంటరి చుక్కా !

ప్రకాశింపుము. ప్రకాశింపుము.

రూతు జ్ఞాపకాలలో,దాగిన, రూబేను పాత పుస్తకాలలో రూతు గుర్తు తెచ్చుకొనే ఒంటరి చుక్క గీత మది. అది తన కంటపడ్డప్పుడల్లా రూబేను చదివిన, రాసుకొన్న పాత పుస్తకాల మధ్య కూర్చొని అతని డైరీలలోని కొన్ని పేజీలతోపాటు పదే పదే ఆ గీతం చదువుతుంది. ఈ వయసులోనూ అది స్పష్టంగా కన్పిస్తుంది. ప్రతి అక్షరాన్ని స్వేచ్ఛగా చదువుతుంది. నిజానికి ఆ గీతాన్ని మొదటిసారి రూబేను నోటి వెంటవిన్నది.

శివయ్యని చెబుతూ రూబేను, ఆ గీతం చెప్పాడు. నెల్లూరు పరిసర ప్రాంతాలలో అమెరికన్ బాప్టిస్టు మిషన్, లోన్‌స్టార్ (ఒంటరిచుక్క) పేరుతో ముందుకొచ్చిన వైనం ఆ గీతం వెంబడే ముందుకొస్తుంది. జ్ఞాపకం కొత్తగా అన్పిస్తుంది. ఆ జ్ఞాపకంలో క్రైస్తవులుగా మారిన అంటరాని జనాంగం. పదాలు కొత్తగా అన్పిస్తాయి. క్రీస్తు, మారుమనసు, రక్షణ అట్లా అంటరాని జీవితంలోకి అవసరంగానో, అనివార్యంగానో చోటు చేసుకొన్న పదాలు....

చాలామంది మాలామాదిగల్లా శివయ్య క్రైస్తవుడయ్యాడు. ఆ మాట చెబుతూ రూబేను బైబిల్ వచనం ముందుంచాడు.

"నక్కలకు బొరియలున్నాయి. ఆకాశ పక్షులకు గూళ్లున్నాయి. కాని మనుష్య కుమారునికి తలదాల్చుకోడానికి చోటు లేదు".

ఆ మాటలు ఆ రోజు రూబేను ఎందుకన్నట్టు. ఏదీ లేకుండా రూబేను ఏ మాటా పుట్టినే

అనడు. ఏదైనా తన గుండెని తాకకపోతే గుండె విప్పి మాట్లాడినట్టు మాట్లాడడు. రూతు జ్ఞాపకాలన్నీ అట్టా చెప్పినవే. దాచుకోలేక రూతు ముందు వెళ్ళగక్కినవే.

నిజానికి తన జ్ఞాపకాల అంటరాని వసంతంలో చాలా సన్నివేశాలు చోటు చేసుకోలేదు రూబేను చాలా వదిలేసి వుంటాడు తనని తాకిన సందర్భాలే చెప్పి వుంటాడు. అందుకే చాలా దాచుకోలేకపోయింది. యిప్పుడనిపిస్తుంది. రూబేను వదిలేసిన సందర్భాలు యిట్టా వుండేవని తెలిస్తే ఎంత బావుండు. ఎన్నెలదిన్ని వదిలేసిన మాతయ్య ఏమైనట్టు. ఎట్టా మిగిలినట్టు. ఆ రాత్రి అతను ఏరుదాటి వెళ్లిపోవటమే చెప్పాడు. ఎందుకో తెలీదు ఆ విషయం అనుకొంటే వెల్తిగా వుంటుంది. ఒక సాహసి చివరి క్షణాలు తెలీకపోవటం కన్నా దుర్మార్గం మనిషి జ్ఞాపకాలకు ఏది వుంటుంది. నిజానికి అది రూబేను వదిలేసిన సందర్భం కాకపోవచ్చు. తెలీని సన్నివేశం కావచ్చు

అంటరానివాళ్ల జీవితాల్లో తెలీని సందర్భాలు ఎన్ని. తెలిసీ ప్రపంచం చూడదల్చుకోని సంఘ టనలు ఎన్ని, అంతా చీకట్లో తడిసి చీకట్లో మిగిలి నట్టు.

ఇక్కడ తలదాల్చుకోడానికి చోటు దొరకని మనుష్య కుమారులెవరు ? పేదవాళ్లు. పేద వాళ్లల్లో ప్రత్యేకించి అంటరానివాళ్లు. శివయ్యలు, శశిరేఖలు.

ఆ రోజు ఆ సిలువ గుర్తు మనిషి శివయ్యని, శశిరేఖని చూడకపోతే ఏమై వుండేది.

ఎట్టా జరిగిందా రోజు.

అతను వాళ్ల మొహాలమీద యిన్ని నీళ్లు చల్లాడు. యిద్దరూ కళ్లు తెరిచి చూశారు. వాళ్లకు సిలువ గుర్తు మనిషి నవ్వు మొహం కన్పించింది. అట్టాగే చూశారు. నవ్వుతూనే వున్నాడు. తన పేరు చెప్పాడు.

మార్టిన్.

పేరు కొత్తగా వుంది. ఈ ప్రాంతం పేరులా లేదు. మాతయ్యలు తెలుసు, ముత్తయ్యలు తెలుసు. మల్లన్నలు, ఎల్లన్నలు అట్టా చాలాపేర్లు తెలుసు. మార్టిన్ తెలిసిన పేరులా లేదు. అయినా అతను తాగేందుకు నీళ్ళిచ్చాడు. తినేందుకు జొన్న రొట్టి యిచ్చాడు. ఆ రొట్టె తిన్నాక, ఆ నీళ్ళు తాగాక చుట్టూ ప్రపంచం కొత్తగా పరిచయం అవుతున్నట్టనిపించింది. నింపాదిగా కూర్చొన్నారు.

"క్రీస్తు దయామయుడు"

అతనన్న ఆ మాటల్లో క్రీస్తు ఎవరో శివయ్యకు తెలీదు. ఆ మాట అతను మరోసారి అన్నాడు. నింపాదిగా తమ ఎదురు కూర్చున్నాడు. శశిరేఖ అతని మెడలో సిలువకేసి చూస్తోంది, యిట్టాంటి దండలు కూడా వుంటాయా అని.

"మీ పేరు చెప్పలేదు" అతనన్నాడు. చెప్పాడు. ఊరిపేరు చెప్పాడు. బతుకు పోరు చెప్పాడు బకింగ్‌హాం కాల్వకి ఎట్టా వచ్చింది చెప్పాడు. ఏది జరిగిందీ చెప్పాడు. అతను చెప్తున్నప్పుడు మార్టిన్ అడ్డు ప్రశ్నలు వెయ్యలేదు. వింటున్నాడు. మధ్య మధ్య క్రీస్తు దయామయుడన్న మాట మాత్రం అంటున్నాడు. అంతా విన్నాక చెప్పాడు.

బకింగ్ హాం కాల్వ కూలిపనిలో, తాము చేసేదీ కూలిపని అయినా అగ్రకులాల కూలీలు మాలామాదిగలు తమతో కలిసి పని చెయ్యడానికి ఒప్పుకోలేదు. శివయ్యని, శశిరేఖని తరిమినట్టే కూలికోసం వచ్చిన ప్రతి మాలామాదిగని తరిమారు. కొట్టారు. పరిగెత్తి, ఆకలితో, అలసటతో, భయంతో ప్రాణాలు పోగొట్టుకొన్నవాళ్లున్నారు. అప్పుడు బాప్టిస్టు మిషన్ వాళ్ళు మాలామాదిగల కోసం ఒంగోలు దగ్గరి రాజుపాలెం వద్ద నాలుమైళ్ల పొడవు కాల్వ తవ్వటం కోసం ప్రత్యేకంగా తీసుకొన్నారు. మాలామాదిగలు అక్కడ కూలిపని మొదలెట్టారు. కనిగిరి, దొనకొండ, మార్కాపురం, ఒంగోలు, నెల్లూరు ప్రాంతాల నుండి మాలా మాదిగలు అక్కడికి చేరారు. ఆ సంగతి చెప్పాక మార్టిన్ శివయ్యని శశిరేఖని అక్కడికే బయల్దేరమన్నాడు మార్టిన్ ముందు నడుస్తున్నాడు. అతని వెంట ఆ యిద్దరూ.

ప్రయాణం కొత్తగా వుంది జీవితం ఏ మలుపు తిరుగుతుందో తెలీదు. తెలుసుకోవాలనే తపనా లేదు. కడుపులో ఆకలి. గుండె కోతల్లో అంట రానితనం.

ఎందుకిట్టా జరుగుతోంది

అంటరాని మనుషులు. అంటరాని కూలీ. ఆ పనికి ప్రత్యేక ప్రదేశం నాలుగుమైళ్ల వైశాల్యం. నవ్వేందుకు ఓపిక లేదు. ఏడ్చేందుకు శక్తి చాలదు.

ఓ చిన్న సత్యం వుంది. మనిషి మర్చిపోయిన అతి చిన్న సత్యం అది. ఆది ఈ నేల లోతుల్లో వుంది. అట్టడుగున వుంది. మట్టిని చీల్చుకొంటో మురికిని చీల్చుకుంటో మీదికి వస్తోంది.

మొహంజోదారోని తవ్విన పరిశోధనకి అట్టా చీల్చుకొని వచ్చిన ఈ అతి చిన్న సత్యం కన్పించ లేదు.

హరప్పా గుండె పగుళ్లలో నాగరికత వెతికిన మేధస్సుకి ఈ అతి చిన్న సత్యం చుట్టూ మట్టిని తొలగించి, మురికిని కడిగి ఇట్టా జరిగింది ఈ దేశంలో, ప్రత్యేకించి ఈ తెలుగు నేలమీద అని చెప్పాలనే ఆలోచన రాలేదు. అవసరం కలగలేదు.

అంటరాని కూలిస్థలం వైశాల్యం నాలుగు మైళ్లు. బకింగ్ కాల్వ పొడవెంత ? వెడల్పెంత ? వైశాల్యమెంత ? లెక్కలు తెలిసినవాళ్లు చెప్పరు. చెప్పాలనుకొన్నవాళ్లకి లెక్కలు తెలీవు.

ఆ నాలుగుమైళ్ల బతుకు తెరువులో ఎందరు శివయ్యలు. ఎందరు శశిరేఖలు.

శివయ్య చుట్టూ చూస్తూనే నడుస్తున్నాడు. యిసుక దారి. చాలా దగ్గర్లో సముద్ర హోరు. కన్ను చూడగలిగినంత దూరం సాగులో లేని యిసుక భూములు. గాలికి కొట్టుకుపోయిన యిసుకగట్లు. అక్కడక్కడా నాగుజెముడు బొంతల కరల మధ్య నారుకయ్యలు. కయ్యలు చేస్తున్న ఆనవాళ్లు లేవు. బొంతలు విరిగిపడి వున్నాయి. మొగిలి పొదలు మాత్రం అక్కడక్కడా బతికి వున్నాయి. మిన్నాగులు కూడా బతికే వుండొచ్చు. తప్పక బతికి వుంటాయి. వాటికి చావు వుండదు. ఆకలి వుండదు. ఆకలి మొగిలిచెట్లకుంటుంది. మొగిలి పొదలు లేకుండా మిన్నాగులు బతకగలవనుకొంటే మొగిలి పొదలు బతికివుండేవి కాదు. నిజానికి ఈ విశాల

దేశం అంతా ఈ మొగిలి పొదల్లో, మిన్నాగుల్లో చూడొచ్చు. కావచ్చు. మలామాదిగలు వూరి బయట మొగిలి పొదల్లాగే బతికివుండొచ్చు. మిన్నాగుల అవసరాల కోసమే బతికి ఉండొచ్చు. పొలంలో కంకి, కాలికి చెప్పు అవసరం లేదనుకొంటే చంపబడ్డవాళ్లు చంపబడగా, మిగిలినవాళ్లు కూడా బతికివుండేవాళ్లు కాదేమో !

శివయ్యకి చాలాదూరమే నడిచినట్టుంది. అప్పటిదాకా శివయ్య దారే చూశాడు. దారిపక్క యిసుక కయ్యలే చూశాడు. మొగలి పొదల్ని చూశాడు. ఆకాశం కేసి చూడలేదు. యిప్పుడు ఆకాశం కేసి చూశాడు. నెలవంక. నెలపొడుపు లాగుంది. గట్టిగా కళ్లు మూసుకొన్నాడు. పక్కనే నడుస్తున్న శశిరేఖ మొహాన్ని చేత్తో తనవైపు తిప్పుకొన్నాడు. అప్పుడు కళ్లు తెరిశాడు. శశిరేఖ మొహాన్ని చూసి నవ్వుతూ అన్నాడు నెలపొడుపు అని. శశిరేఖ పైకి చూసింది. నెలవంక కేసి అట్టాగే చూసింది. చూస్తూనే తలతిప్పింది. శివయ్య నవ్వు మొహం చూసింది. చాలనుకొంది. ఈ నవ్వు యిట్టాగే వుండాలనుకొంది. కాని ఎందుకో తెలీదు. ఏడ్పు గుండెల్లోంచి తన్నుకొచ్చింది. శివయ్య అది గమనించకపోలేదు. వెనుక్కి చూశాడు. మొగలి పొదలు తప్ప, నాగుజెముడు కరకయ్యలు తప్ప, ఎక్కడా ఏదీలేని యిసక భూమి. మాటా పలుకూ నడవని మూగనేల. నిశ్శబ్దంగా, మొండిగా, మూగగా, వంటిగా. నెలవంక నవ్విస్తే వెంటనే బతుకు ఏడ్పిస్తోంది. ఆ కాస్త నవ్వు యిట్టే పుట్టి అట్టే ఎందుకు మాయమైనట్టు. మబ్బులు పరిగెత్తినట్టు, పరుగెత్తి, పరుగెత్తి అలసిపోయి గుండె పగిలి కుండపోతలా మారినట్టు.

కూలీలు వుండేచోటుకు వచ్చారు. తాటాకు గుడిసెలు. నేలని ఆనుకొని వున్న గుడిసెలు. నడుము వొంచుకొని జొరబడే వాకిళ్లు. గుడిసెల ముందు ఈతాకు చాపలమీద ఎట్టా అంటే అట్టా నిద్రపోతున్న పిల్లలు. ఆ పక్కనే పొయ్యి. యిప్పుడే కూళ్లు వొండుతున్నట్టుంది. యిసుక దిబ్బలమీద మగాళ్లు మార్టిన్‌ను చూసి ముందుకొచ్చారు.

"వీళ్లంతా మనవాళ్లు"

శివయ్య వాళ్లకేసి చూశాడు. శశిరేఖ తలదించుకొని నిల్చొంది. మార్టిన్ రెండు మూడు మాటల్లో సంగతంతా చెప్పాడు. మామూలు కూలిపనికొచ్చిన వాళ్లయితే వేరు. అగ్రవర్ణాల చేత తరమబడ్డవాళ్లు వస్తే ఆ వార్త గుడిసె గుడిసెకు అందుతుంది. అదే జరిగింది. గుడిసెల్లో ఆడామగా అంతా చుట్టూ చేరారు. అదో రకం సందడి. మళ్లీ మళ్లీ విన్పించే కథలు. ఎవర్ని ఎట్టా తరిమారో, ఎట్టా కొట్టారో మరోసారి మాటల్లో కొచ్చాయి.

ఆ రాత్రి మార్టిన్ యింట్లోనే వున్నారు. మార్టిన్ భార్య శారమ్మ ఆప్యాయంగా చూసింది. అందరూ కలిసే అన్నాలకు కూర్చొన్నారు. శివయ్యకి కొత్తగా వుంది. శశిరేఖ ముడుచుకుపోతోంది. మార్టిన్ ఆ యిద్దర్నీ గమనిస్తూనే వున్నాడు. ఏదో మాట్లాడబొయ్యాడు. శారమ్మ "ప్రార్థన చేసు కొందాం" అని అంది. శివయ్య అదోలా చూశాడు. శశిరేఖ శివయ్యకేసి చూసింది. మార్టిన్ కళ్లు మూసుకోండీ అన్నాడు. శివయ్యకి అదే మంచిదనిపించింది. శివయ్య కళ్లు మూసుకోగానే శశిరేఖ కళ్లు మూసుకొంది. శారమ్మ కళ్లు మూసుకొనే మాట్లాడుతోంది. ఆ

మాటలు కొత్తగా వున్నాయి 'యెహోవా' అనే పదం మొదటిసారి ఆ యిద్దరూ వింటున్నారు ఆమె మాటల్లో శివయ్య పేరు విన్పించింది. శశిరేఖ పేరు విన్పించింది. అప్పుడు వాళ్లల్లో తెలీని ఆరాటం. తమకు మేలు జరగాలని ఆమె మాట్లాడుతోంది. మేలు చెయ్యమని ఎవరికో చెబుతోంది. 'యెహోవా' అంటోంది. ఆ యెహోవా తోనే చెబుతోంది. చివరగా "నీ ప్రియమైన కుమారుడు మా ప్రభువు అయిన క్రీస్తు నామమున వేడుకొంటున్నాము తండ్రీ" అని అంటూ "ఆమెన్" అని ముగించింది. మార్టిన్ కూడా "ఆమెన్" అన్నాడు. తాము ఏమనాలో ఆ యిద్దరికీ తెలీదు. కళ్లు మాత్రం గట్టిగా మూసుకునే వున్నారు. మార్టిన్ కళ్లు తెరవమన్నాడు. కళ్లు తెరిశారు. మార్టిన్ "యిక కానీండి" అన్నాడు.

ఆకలి చంపేస్తుంది. కొత్తచోటు, కొత్త పద్ధతి శివయ్యని యిబ్బంది పెడుతోంది. శశిరేఖ కయితే మరీ యిబ్బందిగా వుంది. మరోసారి వాళ్ల యిబ్బంది గమనించాడు మార్టిన్.

"తినండి. మీ ప్రాంతంలో ఎండు మాంసం బాగా దొరుకుద్దా" మార్టిన్ మాట కలిపాడు.

".... .......... ................ ."

"యిక్కడ దొరికినట్టు దొరకదు నాకు తెలుసు గోంగూరలో కలుపుకొని వండుకోవటం కూడా మీకు తక్కువే. తునకల గోంగూర శారమ్మ వండినట్టు యింకొకరికి కుదర్దు. తిని చూడండి.

శివయ్య ముద్ద నోట్లోపెట్టుకొన్నాడు.

"ఎట్టుంది."

"బాగుంది"

"యిదే కాదబ్బాయ్ రొయ్యలకారం కొడితేశా రమ్మే కొట్టాలి. కారం కొట్టిన రోట్లో సంగటి ముద్ద తిప్పి చేతికిచ్చిందంటే చాలు నోట్లో కరిగిపోద్దంటే నమ్ము".

"నేతి బొట్టు కలిపితే యింకా బాగుంటది"

ఆ మాట అన్న శశిరేఖకేసి ఆ ముగ్గురూ ఆశ్చర్యంగా చూశారు.

"చిలకమ్మ మాటాడింది శారమ్మా" మార్టిన్ శశిరేఖకేసి ఉత్సాహంగా చూస్తూ అన్నాడు. శారమ్మ ఆ పిల్లకేసి అట్టాగే చూసింది. శివయ్య శశిరేఖ అట్టా అనకుండా వుంటే బాగుండేదనుకొన్నాడు. అయినా అమ్మ గుర్తొచ్చింది. రోట్లో రొయ్యల కారం యింత వుంచి 'శశిరేకా' అని పిలిచేది. వుట్టిమీద వాసన కట్టిన నేతిబొట్టు పిడత దింపేది. పొయిలో నిప్పులు ముందుకు లాగి నేతిబొట్టు పిడత నిప్పులమీద వుంచేది. నేతిబొట్టు కరిగాక రోట్లో నేతిబొట్టు పోసేది. శశిరేఖ "సాలు సాలు" అంటూ వుంటే నవ్వుతూ రాగి సంగటిముద్ద రోట్లో వేసి కలిపేది. ఆ ముద్ద అట్టాగే కొడలుకిచ్చేది. శశిరేఖ ఆత్రంగా తినేది. అప్పుడు కాని బూదేవి అక్కడికొస్తే అంతా నువ్వేనంటే పిల్లా ఆ పిల్ల నోట్లో అంత పెట్టవా అనేది. ఎవరు ఎవరికి చిన్నపిల్ల ! ఎట్టా పుట్టారు బూదేవి, సుభద్రలు ఎన్నెల దిన్నిలో. ఎందుకట్టా చచ్చారు చావటం కోసమే పుట్టినట్టు ప్రేమంతా మట్టిని చేస్తో. శశిరేఖ మాత్రం ఉట్టినే అన్నదా "నేతిబొట్టు" మాట. ఊరికే అనలేదు. ఈ భూమ్మీద తన అత్తకన్నా ఏ వక్కరూ గొప్పకాదు. అందుకే అంది.

"నేతిబొట్టు కలిపితే అంత బాగుంటదా" శశిరేఖ కేసి చూస్తూ శారమ్మ అంది. శశిరేఖ మాట్లాడలేదు

"నువ్వు అట్టా చేస్తావా"

"నేను కాదు."

"మరి."

"అత్త సేత్తాది. రొయ్యలు ఏపి, రోట్లో పోసి, కారం కొట్టి, సంకటిముద్ద కలిపి, నేతిబొట్టు నిప్పులమీద పెట్టి......." ఆగిపోయింది.

వెక్కి వెక్కి ఏడుస్తోంది ఎంత ఏడ్పు ఏడుస్తోంది ఈ బిడ్డ. ఎందుకట్టా. నిజంగా ఏది పోగొట్టుకొంది. అత్తనా. అత్త చేతి నేతిబొట్టు సంగటి ముద్దనా.... రెండూ కలిపిన ప్రేమనా. కడుపున పుట్టటానికి, కడుపున పుట్టకపోవటానికి దూరాన్ని ఎంత తేలిగ్గా తుడిపేసింది ఈ పిల్ల అత్త. శారమ్మ అనుకొంటోంది. ఆ పిల్ల ఆగటం లేదు. "అత్త గుర్తొత్తుంది.... అత్త గుర్తొత్తుంది' ' అంటూనే ఏడుస్తోంది.

"యిట్టారా"

ఆగి చూసింది.

"మీరు తినండి".

శశిరేఖని తీసుకొని యింటి బయటకొచ్చింది. ఏం మాట్లాడుతుందో ఆ యిద్దరికీ తెలీదు. మార్టిన్ మాత్రం వాళ్ల యిద్దరి పళ్లాలు వాళ్లకిచ్చి వచ్చాడు. లోపల మగాళ్లు తింటున్నారు. బయట ఆడాళ్లు తింటున్నారు. మగాళ్ల మాటల్లో ఎల్లన్న పదాలు విన్పిస్తున్నాయి. ఆడాళ్ల మాటల్లో సుభద్ర ప్రేమ కన్పిస్తోంది.అన్నాలు అయ్యాక ఆరుబయట పక్కలు వేశారు. ఆకాశంలో లెక్కలేనన్ని చుక్కలు. ఆ చుక్కలకింద చాపలు పరుచుకుని పడు కొన్నారు. ఎవరి ఆలోచనలు వాళ్లవి.

ఆ చుక్కల్లో ఏ చుక్క బాలఏసును మొట్ట మొదట ప్రపంచానికి పరిచయం చేసింది. శారమ్మ వెతుకుతోంది. అత్త ముగ్గుకర్ర ఎన్ని చుక్కల్తో గీశాడు మామ. శశిరేఖ చుక్క చుక్కని కలుపు కొంటూ చూస్తోంది.

శివయ్య కళ్ళముందు ఎన్నెలదిన్ని. ఈ చుక్కలు అక్కడా వుంటాయి. ఎన్నెల దిన్నిని కప్పుకొని వుంటాయి. ఆ కప్పుకింద సమాధులు. యిసుక సమాధులు. శివయ్య కళ్ల ముందు ఎన్నెలదిన్ని యిసుక సమాధులు. చీకటి సమాధులు. చుక్కల వెలుతురు యిసుకలో దిగిపోదు. సమాధుల్లో అంతా చీకటి. యిసుక చీకటి. ఆ యిసుక చీకట్లో అయ్య, అమ్మ, తాతలు. అమ్మ మ్మలు, నాయనమ్మలు.... ఒకరకంగా వాళ్లు అదృష్టవంతులు. ఆ చీకట్లో ఆకలి వుండదు. అంటరానితనం ఉండదు. కప్పుకొన్న యిసుకలో కలిసిపోతారు. అట్టా కలిసిపోవటానికి కరణం అడ్డు రాడు. అచ్చిరెడ్డి అడ్డురాడు. వాళ్లే కాదు. వాళ్ల కులం, దేవుళ్లు, దెయ్యాలు అడ్డురావు. పిట్టోడు తాత ఓసారి మాదిగ మాతయ్య మాట చెప్పాడు. వాడు పెద్ద కరణం తల అడ్డంగా

నరికాడు. పెద్ద కరణాన్ని మట్టిలో పాతరపెట్టలేదు మంటల్లో కాల్చారు. వాడి వళ్లు మంటల్లో మాడి మసైంది. బూడిదైంది. ఆనక పెన్నలో కలిపారు. పెన్న చిన్నదా, బకింగ్ హాం కాల్వకి పదొంతులు కన్న పెచ్చు వుంటుంది. పిడికెడు బూడిద పెన్నకో లెక్కా. రేపు పిల్ల కరణం అంతే. మంటల్లో మాడి, పెన్నకి ఎందుకూ పనికిరాడు. కాలేప్పుడు మాత్రం మంటలు గాల్లో కలిసిపోతాయి గడుసుదయ్యాల్లా. ఆ మంటలు అట్టా అన్పిస్తాయి. నిజంగా గడుసు దయ్యాలే. ఎట్టా తరమాయి తనని. ఎట్టా తరిమాయి తన అయ్యని. మొత్తంగా తన కులాన్ని....

మార్టిన్ కళ్లముందు శశిరేఖ, శివయ్యలు నిల్చారు.

శశిరేఖ అత్త గుర్తొచ్చి ఏడ్చింది. శివయ్య ఆమె పేరు చెప్పాడు. సుభద్ర అన్నాడు. ఎల్లన్న కొడుకని తెలిశాక శివయ్యకేసి అట్టాగే చూశాడు. ఎల్లన్నని విన్నాడు. నెల్లూరులో వున్నప్పుడు విన్నాడు. అతని పాటలు విన్నాడు. మనిషి తెలీదు. చూసేవీలు కలగలేదు.

శివయ్య అతని కొడుకు అని తెలిశాక శివయ్యని తన దగ్గరే వుంచుకోవాలనుకొన్నాడు. తనతోటే వూళ్లు తిప్పాలనుకొన్నాడు.

పరిగెత్తే చుక్కలకేసి చూస్తూంటే జీవితం మొత్తం చుక్కల పరుగేననిపిస్తోంది. తెలిసిన ప్రతి జీవితం అట్టాగే వుంది. అడుగువేస్తే పాదాలంతా పల్లేరుకాయలు. అడుగుతీస్తే నెత్తుటి చుక్కలు.

శివయ్య అంత వయసప్పుడు - అప్పటి తన రూపం గుర్తొస్తోంది. వద్దనుకొన్నాడు. అదంతా గుర్తురాకపోవటమే మంచిదనుకొన్నాడు. మర్చి పోయాడు. అంతా మర్చిపోయాడు.

కాని ఆగటం లేదు. పల్లేటికాయలు, నెత్తుటిచుక్కలు పదే పదే గుర్తొస్తున్నాయి. శివయ్య అంత వయసప్పుడు. లాభం లేదు. వద్దనుకొన్నా ఆగదు. గట్టిగా కళ్లు మూసుకొన్నా అవే రోజులు.

మార్టిన్ మాటల్లో చెప్పుకొంటే అంటరాని జనాంగం క్రైస్తవ జనాంగంగా మారుతున్న తొలిరోజులు. మార్టిన్ మొదటి పేరు చిన్నోడు. కనిగిరి ప్రాంతంలో మరీ వెనుకబడ్డ ప్రాంతంలో మాదిగపల్లి. ఆ పల్లెల్లో పుట్టాడు. అక్కడే పెరిగాడు అయ్య చెప్పులు కుట్టేవాడు. అమ్మ కన్పించని గింజలకోసం కల్లాలు పట్టుక తిరిగేది. ఎందుకో తెలీదు తనకి చెప్పులు కుట్టాలని అన్పించేది కాదు. అన్న పేరు పెద్దోడు. వదిన పేరు చినజాలి. కష్టమంతా కాపులింట పోసి కాళ్లీడ్చుకొంటూ యింటికొచ్చేవాళ్లు. వాళ్లను చూస్తే బతుకు యింత దరిద్రంగా వుండకూడదనుకొనేవాడు. తన యింట్లో తనకు కన్పించే బతుకు బతుకులా అన్పించేది కాదు. తిండికి తప్ప యింటిపట్టున వుండేవాడు కాదు. కాలమంతా చెరువు గట్టున గడిపేవాడు. అయ్యకి అతన్ని చూస్తే కోపం వచ్చేది. అమ్మకి జాలేసేది. పెళ్లి చేస్తే బాగుపడ్తాడనుకొన్నారు. పెళ్లి చేశారు. పోలమ్మ కాపురానికొచ్చింది. అయినా చిన్నోడు మారలేదు. కూటివేళలు తప్ప యింటిపట్టున వుండటం లేదు. చెరువుగట్టున వుట్టినే కూర్చోవడం మానలేదు. పోలమ్మ అత్తతో కల్లాంగింజకెళ్లేది. అట్టా ఆమె వెళ్లడం అతనికి యిష్టం వుండేది కాదు. వదినతో కాపులింటికి చాకిరికెళ్తే చెప్పలేనంత విసుగు, కోపం వచ్చేది. తనమీద తనకే కసి పుట్టేది. ఆ విసుగుకు

కారణం అర్థం కాదు. తన కోపానికి రూపం కన్పించదు తనమీద తనకే ఎందుకంత కసి పుడ్తుందో అదో దొరకని జవాబు.

ఆ రోజులు ఎట్టా గడిచాయి. తనకేమీ కాకుండా ఎందుకట్టా వెళ్లిపోయ్యాయి మార్టిన్ కళ్లముందు తన 'చిన్నోడి రూపం' స్పష్టంగా కన్పిస్తోంది. కాళ్లమధ్య తలపెట్టుకొని చూపు అందినంత దూరం చూస్తో, ఎంత విసుగు ఆ చూపుల్లో, ఎంత కోపం, ఎంత కసి, ఏదీ తీరనప్పుడు ఎంత ఏడ్పు కళ్లనిండా. ఎవ్వరికీ కన్పించకుండా కళ్లని, వాటి నీళ్ళని గుండెల్లోకి నెట్టి ఎంత కుమిలిపోయ్యాడు. తాను అట్టాగే కూర్చొని రోజులు గడిపేస్తుంటే అయ్య ఏమన్నాడు అమ్మతో ఏమన్నాడు.

వీణ్ణీ, వీడి పెళ్లాన్ని నేను చాకలేనని తెగేసి చెప్పాడు అమ్మతో అయ్య. నువ్వు చాకలేకపోతే నా చాకిరితో వాణ్ణి చాకుతానని అంతే తెగేసి చెప్పింది అమ్మ. అన్నాలు తిన్నాక రాళ్లగుట్ట చాటుమంచం మీద పడుకొని వుంటే అమ్మ అయ్య మాటలు విన్పిస్తూనే వున్నాయి. అన్న మధ్యలో కల్పించుకొన్నాడు. వేరు కుండ పెట్టమన్నాడు. అయ్య తనలో వుంటాడన్నాడు కావలిస్తే పదిళ్ల కాపుల చెప్పులుకుట్టే పని గింజలు వాణ్ణే తీసుకోమని అన్నాడు అయ్య చుట్టపట్ల వూళ్లతో సహా పదిహేనిళ్ల చెప్పులు కుడ్తాడు. కుట్టినందుకు కుప్పల నురిపిడి రోజుల్లో యింటికిన్ని చాటలని కల్లాం గింజ కొలుస్తారు. వదిన అందుకు వొప్పుకోలేదు. మామ తన యింట్లో వుంటాడు కాబట్టి పదిహేనిళ్ల గింజ తమకే రావాలంది. అమ్మకి వదినకి వాదమే మొదలైంది. కల్లాంకు మూడు చాటల వడ్లు. మొత్తంగా వస్తే నలపై అయిదుచాటల వడ్లు.

ఎట్టి మాలకి, మాదిగకి కొలిచే చాటలు కాపులింట గొడ్ల కొట్టాంచూరుల్లో వేరుగా వుండేవి. మామూలుగా వాడుకొనే చాటల్లో సగం వుండేవి. ఆ అలవాటే కూలిగింజలు రోజులకి పిచ్చ మానికలయ్యాయి. యాడాదిలో అట్టా వచ్చిన గింజ ఎన్ని రోజుల గ్రాసం. మాలా మాదిగలు యివన్నీ ఎప్పుడూ లెక్కలు కట్టుకోలేదు. మేడి కింద మెడపట్టిన ఎద్దు ఎన్ని ఎకరాలు దున్నింది లెక్కెట్టుకుందా ఎప్పుడన్నా. ఎన్ని గంటలు దాని మెడమీద కాడే అట్టాగే వుంది గుర్తెట్టుకుందా ! పొదుగు పొంగి పాలిచ్చిన గేదే ఈ రోజు యిన్ని చెంబులు పాలిచ్చానని లెక్కేసుకొన్న పాపాన పోయిందా ఏ రోజైనా. బిడ్డ పరిగెత్తుకొచ్చి పొదుగు తాకితే తాగేది తన బిడ్డే కదా అని పాలన్నీ పొదుగులోకి తెచ్చుకొంటే, రొమ్ము సీకే పాలపళ్లకు బదులు చేతివేళ్లు అతి లాఘవంగా పాలను లాగుతుంటే కోపమొచ్చి జాడిచ్చి కాలితో తన్నిందా ఎప్పుడన్నా. వాటెడు గడ్డీ, తొట్టెడు కుడితీ చాలనేకదూ అనుకొంది.

కాపులు తిని కడిగిన నీళ్లేగా తొట్టెడు కుడితి. గింజెరాల్చి మిగిలిన ఎండేగా, గడ్డి. ఆ కుడితే, ఆ గడ్డే తన యింట్లో ప్రధాన ఆస్థిపంపకమైంది. అలుగుడైంది. అరుచుకోవడాలైంది. రాళ్ళదిబ్బ పక్క మంచంమీది సిన్నోడు పైకి లేసినా, పక్కలో పడివున్న పోలమ్మ నోరు తెరిచినా పెద్ద గొడవే జరిగేది. మాదిగ పల్లెంతా అక్కడకి చేరేది. కులపెద్ద తీర్పు, ఒకరోజుతో తెగిపోదు.

అమ్మ నోరు అయ్య అరుపుతో ఆగింది. వదిన వీపుమీద అన్న దెబ్బపడనే పడింది.

వదిన ఏడ్పు మొదలెట్టింది. ఏడ్పులో చిన్నోడ్ని, పోలమ్మని ఎత్తి పొడిచింది. పోలమ్మ ఆగలేకపోయింది. పైకి లేసింది. చిన్నోడు అది గమనించాడు.

"ఎల్లకు పడుకో"

చిన్నోడి మాటతో పోలమ్మ ఆగింది తోడికోడలి మీద, కట్టుకున్నవాడిమీద, వాణ్ని కన్నవాడిమీద కోపం కట్టలు తెంచుకొని ఏడ్పుగా మారింది.

"ఏడ్వకు నిదరపో"

అన్నాడే కాని పోలమ్మ ఏడ్పు ఆపలేదు. ఎవ్వరికి వినపడకుండా ఏడుస్తూనే వుంది. చిన్నోడికి నిద్ర రాలేదు. రాళ్లగుట్టలో పాముపిల్ల తన కిష్టమొచ్చిన రాతికంతల్లోకి వెళ్తుంటే చూస్తూ వున్నాడు. చంపబుద్ధి కాలేదు. అట్టా రోజూ అవి రాళ్ల గుట్టల్లో తిరుగుతాయి. నిద్రపోతారు కాబట్టి తెలీదు. అందుకే అది ఎట్టా కంతల్లో ఆడు కొంటుందో చూస్తున్నాడు. అప్పటదికది ముచ్చట గా వుందనిపించింది. అట్టా దానికేసి చూస్తూనే బొడ్లో చెయ్యి పెట్టాడు. అడ్డ కట్టు మడత ఖాళీగా వుంది.

"పువ్వాకు తుంపుందా"

పోలమ్మ బొడ్డుసంచి ఏడ్పుకొంటూనే తీసింది. ఏడ్పుకొంటూనే పువ్వాకు తుంపుకోసం వెతికింది. ఏడుస్తూనే యింత తుంపుతీసి చిన్నోడి కిచ్చింది. చిన్నోడు దాంట్లో కొంత తుంచుకొన్నాడు, నోట్లో పెట్టుకొన్నాడు. రెండు తిప్పులు తిప్పాడు. బుగ్గకిందకు కుక్కాడు. మిగిలింది పోలమ్మ కిచ్చాడు. వేసుకోమన్నాడు. పోలమ్మ మిగిలిన తుంపు నోట్లో కుక్కుకుంది. యింటిముందు గొడవ ఆగినట్టుంది. సందడి లేదు. అయ్య గురక విన్పిస్తోంది. రాళ్ల కంతల్లో పాముపిల్ల మాత్రం తన ఆట ఆడుతూనే వుంది. యిప్పుడు దాని ఆట చూడాలని లేదు. పోలమ్మని మంచంకింది కర్రందు కోమన్నాడు. పోలమ్మ ఏడ్పు ఆపి కర్రందుకొంది. కర్ర చిన్నోడి కిచ్చాక పాముపిల్ల తలమీద కర్రకొసని జాగ్రత్తగా చిన్నోడు నొక్కుతుంటే గట్టిగా కళ్లు మూసుకొంది. అట్టాగే నిద్రపోయింది. చిన్నోడికీ నిద్రొచ్చింది.

తెల్లారి అమ్మ వో కుండపెట్టి, వదినవో కుండపెట్టి వండారు. కల్లాం పనికి పోలమ్మ అమ్మతో పోయింది. చిన్నోడు వారించలేక పోయ్యాడు. అయ్య పెదకాపింటికి వెళ్తున్నట్టు అమ్మ వినేట్టు అన్నతో అని వెళ్లాడు. అంటే అయ్య చాకిరి అన్నది, అమ్మ చాకిరి తనది అని చిన్నోడికి తేలిసిపోయింది. అట్టా కావటం కష్టమనిపించింది. ప్రతిదీ అట్టాగే అన్పిస్తుంది. భూమ్మీద తనకిష్టంలేని పనులే జరుగుతున్నట్టనిపిస్తోంది. అందుకే దాదాపు మాట్లాడటం మానేశాడు. యిప్పుడు చెరువుగట్టనే కాదు ఎక్కడ పడితే అక్కడ కూర్చోవటం మొదలెట్టాడు. పిలిస్తే పలకటం, ఎవరేదన్నా మాట్లాడితే వినడం, అవసరమనుకొంటే ఏదో వొకమాట మాట్లాడటం చేస్తున్నాడు. ఆ మాట్లాడే మాటా యిష్టంగా వుండదు. చాలా కష్టంగా మాట్లాడుతున్నట్టు అన్పిస్తుంది. బిడ్డని చూస్తే అమ్మ కడుపు తరుక్కుపోతుంది. అయ్య మొహం చూట్టం మానేశాడు. పిల్లనిచ్చిన మామ అల్లుడికి గాలి తగిలిందన్నాడు. ఆ గాలిమనిషిని

పీక్కుతింటుందని చిన్నోడి అమ్మతో పోరిపోరి మరీ చెప్పాడు. అంతటితో ఆగలేదు. అంత్రం తెచ్చి కూతురుకిచ్చాడు. చిన్నోడు నిద్రలో వున్నప్పుడు చేతికి కట్టమన్నాడు. కట్టాక ఒకే మంచంమీద పడుకోవద్దన్నాడు. వారం రోజులు అత్తదగ్గరే పడుకోమన్నాడు. పోలమ్మ తలపై నీళ్లుపోసుకొని తలకి, అంత్రానికి సాంబ్రాణి పట్టించింది. నిద్రపోయే చిన్నోడి కుడిచేతికి కట్టింది. బుద్ధిగా అత్త పక్కలో పడుకొంది. అర్ధరాత్రి చిన్నోడు లేచిచూస్తే పోలమ్మ లేదు. దూరంగా అమ్మ పక్కలో పడుకోనుంది. అలిగిందేమోననుకొని పైకి లేవబోయ్యాడు. చేతికి ఏదో కట్టివుంటే చూశాడు. అంత్రం. అర్థమైంది. యిష్టంలేదు. చికాకు. కోపం. కసిగా దాన్ని తెంచేశాడు. విసిరి పోలమ్మ మీదికేశాడు. తేలుపైన పడ్డట్టు పోలమ్మ ఎగిరిపడిలేచింది. చూస్తే అంత్రం. గుడ్లనీళ్లు తిరిగాయి. ఏడుస్తూనే కూర్చొంది. అట్టా పోలమ్మ ఏడ్వటం చిన్నోడి కిష్టం లేదు. "ఛీ ఎదవబతుకు" అనుకొన్నాడు.

తెల్లారి వీధిన పడ్డాడు. ఈదింటికోటేసు వాకిట్లో మంచముంటే దానిమీద కూర్చొన్నాడు. అంతే. యింటికి పోకూడదనుకొన్నాడు. ఎదురుగా ఎర్రడి మాటలు వింటూ పని తొందర లేనివాళ్ళు తలా వో మంచంమీద కూర్చొని వున్నారు. చిన్నోడికి వాడి మాటలు వినాలని లేదు. యిష్టం లేదు. వాడు కాపుల మాటలే చెబుతాడు. పువ్వాక్కాడ విసిరేసి "యదవనాకొడుక్కి ఎంత పువ్వాకూ సాల్దు" అని తనకాపు అనేమాట అదేదో మెప్పుకోల్లా చెప్పేస్తాడు. చినకాపు తిట్టేకాదు, చినకాపు పెళ్లాం తిట్లు కూడా వాడికి ముచ్చటగానే అన్పిస్తాయి. ఎర్రోడి పెళ్లాన్ని పట్టుకొని "దీనికి నువ్వొక్కడివే చాలవ్‌రా" అని అన్నా, ఎర్రోడి తల్లిని పట్టుకొని "ఎవడి పక్కలో ఈడ్ని కన్నావే" అని అన్నా ఎర్రోడ్ని ఆ మాటలు యిబ్బంది పెట్టవు. పైపెచ్చు అందరి ముందూ చినకాపు అట్టా అన్నాడని గొప్పలు చెప్పుకొంటాడు.

ఎదవ బతుకు. నచ్చదు. చిన్నోడికి బొత్తిగా నచ్చదు. అందుకే ఎర్రోడి మాటలు వింటూ నేలమీద వుమ్మేశాడు. ఒకసారి కాదు పదే పదే వుమ్మాడు. ఎర్రోడి మొహం చూసేకన్నా ఉమ్మి చూట్టమే మేలనుకొన్నాడు.

ఇంతలో ఏమైందో తెలీదు. ఎర్రోడి గొప్పలు ఆగాయి. నవ్వులు ఆగాయి. అంతా ఒక్కసారి పైకి లేశారు. ఏమైందో చూడటానికి తలపైకెత్తాడు.

చినకాపు పల్లెలో కొచ్చాడు. ఎక్కడివాళ్లు అక్కడ లేచి నిలబడ్డారు. ఎందుకట్టా లేచి నిలబడటం. యిష్టం లేదు. చిన్నోడికి అట్టా లేచి నిలబడటం యిష్టం లేదు. లేచినవాళ్ల చేతులు కట్టుకొని నిలబడ్డారు. తలలు వంచుకొని నిలబడ్డారు. మూడుకాళ్ల ముసల్ది లేవలేక లేసి కూర్చొన్న మంచం తిరగేసి చతికిలపడింది. కాటికి కాళ్ళు చాపిన ముసలాడు 'కాపొచ్చేడు నన్ను లేపరా' ' అని మనవణ్ణి కేకలేస్తున్నాడు. నిలబడలేడు. నిలబెట్టి పట్టుకోవాలి.

ఎదవ బతుకు. ఎందుకట్టా అయింది. ఎందు కట్టా నిలబడాలి. తాను అట్టా లేచి నిలబడడు. ఏదైనా జరగనీ. నిలబడేది మాత్రం జరగదు. అంతే. నిలబడే ప్రయత్నం చెయ్యలేదు.

చినకాపు ఎదురుగా నిలబడ్డాడు. వాడివి మొరటికాళ్లు. మొరటి ముక్కు. గద్దముక్కు. చూపు అచ్చు తోడేలు చూపు మనిషి చూపుకాదు. మనిషి ఎట్టా వుంటాడు. గొడ్డులా వుంటాడు. మామూలు గొడ్డులా కాదు. ఎలుగ్గొడ్డు. ఆ ఎలుగ్గొడ్డుకి బాన కడుపు. బొంగురు గొంతు. వాడి భార్య వాడికేసి సరిగ్గా చూడదు. ఎప్పుడూ నేలకేసే చూస్తుంది. అట్టా కాకపోతే వాడితో కాపురం చేసేది కాదు యింతకాలం వాడి తాలూకూ రెండు పిల్ల ఎలిగ్గొడ్లని కని దేశంమీద వదిలేది కాదు. వాళ్లూ అంతే. ఎలుగ్గొడ్లలా గడ్డి కోసే ఆడాళ్లమీద దాడి చేస్తారు. అయినా ఎవ్వరూ మాట్లాడరు. బతుకు. ఎదవ బతుకు.

"లెగరా"

"............."

"లెగెహే"

లేవడు. లేసే సమస్యే లేదు. బలంగా తలపై తగిలిన తన్ను. చిన్నోడు నేలమీద పడ్డాడు. తన్ను తర్వాత తన్ను. ఎలుగ్గొడ్డు. చినకాపు తన్నుతూనే వున్నాడు. బాధ. అయినా అరవలేదు. ఎముకలు విరుగుతున్నా పైకి లేవలేదు. భూమిని వాటేసుకొంటో మౌనంగా రోధిస్తున్నాడు. ఈ భూమి బద్దలు కాలేదు. యిట్టాంటప్పుడు రెండుగా చీలిపోలేదు. భూమి కూడా సీతమ్మల కోసమే రెండుగా పగులుతుంది. సీతమ్మ మొగుళ్ల కోసమే సింహాసనమై వొదిగి వుంటుంది. అతని కోసం ఏదీ కాదు.

చినకాపు అలసిపోయ్యాడు. చిన్నోడి రెక్కలు కట్టాడు. మంచం వాడిపైన తిరగేశాడు. బరువైన మొద్దు మంచంపైన పట్టించాడు. ఆ తర్వాత వెళ్లాడు. అంతా చూస్తున్నారు. ఎవ్వరూ ముందుకు రాలేదు. కట్లు విప్పలేదు. మొద్దు తియ్యలేదు. మంచం తిరగెయ్యలేదు. చూస్తున్నారు. ఆ వార్త కల్లాందాకా వెళ్లింది. చిన్నోడి అమ్మా, చిన్నోడి భార్య గుండెలు బాదుకొంటూ వచ్చారు. అట్టా వచ్చిన అత్తాకోడళ్లని కూడా అట్టాగే చూస్తున్నారు. అత్తాకోడళ్లు బరి తెగించారు. మొద్దు నెట్టేశారు. మంచం తిరగేశారు. కట్లు విప్పారు. అతికష్టంమ్మీద చిన్నోడ్ని యింటికి తీసుకెళ్లారు.

పగలు గడిచిపోయింది. చిన్నోడితోనే గడిచి పోయింది. చిన్నోడి అమ్మకి అది కడుపు కోత కావచ్చు. పోలమ్మకి అది గుండె కోత కావచ్చు. చిన్నోడికి మాత్రం అదో సంఘర్షణ. తనకి నచ్చని దానిపై మూగగా చేస్తున్న తిరుగుబాటు.

పోలమ్మ చిన్నోడ్ని గమనిస్తూనే వుంది. ప్రతి రోజూ అంతే. మదన. విసుగు, నచ్చనిమాట. నచ్చని పని.

సరిగ్గా అప్పుడే జరిగింది అతని జీవితంలో అనుకోని మలుపు. ఊరిబయట కొత్తగా గుడారం వెలిసింది. ఆ గుడారాన్ని అంతా వింతగా చెప్పుకొంటున్నారు. అక్కడికెళ్లాడు. అక్కడికి తెల్లదొర తెల్లగుర్రమెక్కి వచ్చాడు. తెల్లదొరని, ఆయన తెల్లగుర్రాన్ని ఆశ్చర్యంగా చూశాడు. తెల్లదొర తన ఆశ్చర్యాన్ని గమనించినట్టుంది., దగ్గరకు రమ్మని సైగ చేశాడు. భయంగానే

దగ్గరకెళ్లాడు. తెల్లదొర చిన్నోడి చేతిని అందుకొన్నాడు. రెండో చేతిని భుజంమీద వేశాడు.

చిన్నోడి గుండెలు వేగంగా కొట్టుకొంటు న్నాయి. తెలీని ఉద్వేగం. ఏది జరుగుతోంది తన కళ్ల ఎదుట. నిజంగా అట్టా జరిగిందని నమ్మలేకపోతున్నాడు. నిజంగా ఏది జరిగింది.

తెల్లదొర రమ్మని సైగ చేశాడు.

భయంగా తాను వెళ్లాడు.

తెల్లదొర తన చేతిని అందుకొన్నాడు చేతిని తాకాడు. భుజంమీద చెయ్యి వేశాడు. భుజాన్ని తాకాడు.

యిప్పటికి, పుట్టి బుద్దెరిగిన తర్వాత తనని మాదిగాడు తాకాడు. మాలాడు తాకాడు. బ్రాహ్మణుడు తాకలా. అతనికి తన వళ్లు అంటరానిది. రెడ్డి తాకలా. అతనికీ అంతే. మిగతా కులాల వాళ్లకీ అంతే. అంటరానిది. తాకితే మైలపడేంత నీచమైంది.

కాని దొర తాకాడు. ఈ వూరివాడు కాదు. ఈ ప్రాంతంవాడు కాదు. ఈ మట్టికి, ఈ గడ్డకి కానివాడు. తాకాడు. ఈ వూళ్లో పుట్టిన మాదిగాణ్ణి. ఈ మట్టినే నమ్ముకొన్నవాణ్ణి, ఈ గడ్డపైనే పుట్టి ఈ గడ్డపైనే చచ్చేవాణ్ణి యిక్కడ పుట్టి పెరిగేవాళ్లు తాకని, జీవితాంతం తాకని తన వంటిని తాకాడు. తెల్లదొర తాకాడు. నీ వొళ్లు అంటరానిది కాదు అని చెప్పాడు. అట్టా మాటల్తో చెప్పలా. తాకి చెప్పాడు. అందుకే తెల్లదొర కేసి అట్టాగే చూశాడు చాలాసేపు. గుండెల్లో ఆందోళన, ఆరాటం, ఉద్వేగం తన అదుపులోకి వచ్చేంతవరకు చూశాడు. చూస్తూనే కన్నీళ్లు పెట్టాడు. ఆ కన్నీళ్లు క్రీస్తువన్నాడు తెల్లదొర. అంతే. చిన్నోడు తెల్లదొర గుంపులో కలిసి పొయ్యాడు. వాడి వెంట పోలమ్మ వుండిపోయింది. చిన్నోడి అమ్మ కూడా అదే మంచిదనుకొంది. "బిడ్డ పనిపాటకీ పనికిరాడు. వాడి వొంటిని కూడా గాలిపట్టింది. అట్టా తిరిగితేనే బాగుపడొచ్చు. అదే వాడికి మంచిది నువ్వు వాడితోనే వుండుపోలే" అని కోడలితో అంది.

అది జరిగిన నెలరోజుల తర్వాత చిన్నోడికి పోలమ్మకి నీళ్లతో బాప్తిజం యిచ్చాడు తెల్లదొర. బాప్తిజం తీసుకొన్నప్పుడు. తడిసిన ఒంటితోనే చిన్నోడు అడిగాడు.

"యిప్పుడు ఈ వొళ్లు, బాపనాళ్ల ఒళ్లులాంటి దేనా. రెడ్ల వొళ్లులాంటిదేనా. అంతా తాకొచ్చా ! అందర్నీ తాకొచ్చా !" ప్రశ్న ? ఆశ్చర్యం !

అడుగుతూనే వున్నాడు. తెలీని ఆశ్యర్యంతో మాట్లాడిన మాటే మాట్లాడాడు. దొరకి తెలుగు అర్థమౌతోంది. చిన్నోడి మాటలు విన్నాడు. వాడి గొంతుపలికే గుండె కోత విన్నాడు. కాని సూటిగా జవాబు చెప్పలేదు.

"క్రీస్తుకు ఏ వొళ్లూ అంటరానిది కాదు" ఆ మాట మాత్రం అన్నాడు. చిన్నోడు విన్నాడు. జవాబు సూటిగా లేదు. స్పష్టంగా లేదు. ఆ మాట మళ్లీ వినాలనుకొన్నాడు.

"నీ పేరు ఈ రోజునుండి మార్టిన్" మళ్లీ వినాలనుకొన్న మాట దాటిపోయింది.

"ఈమె పేరు శారమ్మ" మళ్లీ వినాలనుకొన్న మాట మరుగున పడిపోయింది.

మార్టిన్ శారమ్మలు నెల్లూరు చేరారు. నెల్లూరు మిషన్ కాంపౌండ్ వాళ్ల బతుకుల్లో

కొత్తదనాన్ని వుంచింది. ఆ కాంపౌండులోనే చాలా తెలుసు కొన్నారు. చదువు నేర్చారు. మార్టిన్ ఉపాధ్యాయ బోధకుడయ్యాడు. శారమ్మ బైబిల్ స్త్రీ అయ్యింది. అట్లా మొదలైంది కొత్త జీవితం. ఓవైపు మిషనరీల అండ వుంది. మరోవైపు క్రైస్తవ కుటుంబాల ఆదరణ వుంది. చాలా వూళ్లు తిరిగారు. మిషనరీలు ఉండమన్న చోట వున్నారు. తాము ఉండాలను కొన్నచోట వున్నారు.

జీవితం కొత్తది. అనుభవాలు కూడా కొత్తగా వున్నాయి. నిన్నటిదాకా కుంచుకపోయిన మనసు, ఈ రోజు తలెత్తుక తిరుగుతోంది. కాని తలెత్తుక తిరగటం అంత సులువుగాలేదు. అంటరాని తనానికి దూరం కావటానికి తాను క్రైస్తవుడ య్యాడు కాని యిక్కడ క్రీస్తు అంటరానివాడ య్యాడు. అనుకొంటే నవ్వు వస్తోంది. కాని ఆ నవ్వు నిండా ఎంత విషాదముందో తనకి తెలుసు. తన కొత్త జీవితం ఊరికో అనుభవాన్ని చవిచూసింది.

ఊళ్లో గొడ్డు చస్తే మాదిగాళ్లని పిలుస్తారు. మాదిగలు లేకపోతే మాలల్ని పిలుస్తారు. మాదిగాళ్లు ఆ గొడ్డును ఊరు బయటకు తీసుకెళ్తారు. అక్కడ దాన్ని పూడ్చి పెట్టరు. కోస్తారు. గొడ్డు కోసేటప్పుడు మాదిగపల్లి, మాలపల్లి నుంచి కూరసట్లు తీసుకొని దానిచుట్టూ చేరుతారు. గొడ్డు శరీరంలో మంచి భాగాలు కోసి తలో యింత వేస్తారు. అక్కడా మొహమాటాలు, అరుపులు, గొడవలు. సట్టిమీద సట్టిపెట్టి పోటీ. అప్పటికే ఆ చుట్టుపట్ల చెట్లమీద గద్దలు చేరుతాయి. చుట్టూతా కుక్కలు కాసుకొని వుంటాయి. తిట్లు, నెట్టుకోవటాలు, చెట్లపైన గద్దలు, చెట్లకింద మనుషులు, కుక్కలు, చచ్చిన గొడ్డు మాంసంకోసం- అదో వింత సన్నివేశం. చివర్లో చచ్చిన గొడ్డు చర్మంలో మంచి ముక్కలు రెండు మూడు వుంచుకొని చర్మాన్ని చుట్టి చచ్చిన గొడ్డును తెచ్చిన కట్టెకు కట్టుకొని గొడ్డును కోసిన మాదిగ వెళ్లిపోతాడు. అతను వెళ్లీ వెళ్ళటంతోటే పైన గద్దలు, కింద కుక్కలు ఒకేసారి దానిమీద పడతాయి.

మార్టిన్‌కు ఈ దృశ్యం మారాలనిపించింది. ప్రార్థనలో ఆ మాటే చెప్పాడు. చచ్చిన గొడ్డు మాంసం తినగూడదని చెప్పాడు. అంతా ఆశ్చర్యంగా చూశారు. అదేదో వినకూడని మాట విన్నట్టు విన్నారు. అది ఎట్టా కుదురుతుందని మదనపడ్డారు. యిది ఈ రోజు మాటా ! ఏ రోజు మాట. ఎప్పటిమాట. ఈ రోజు ఎట్టా వీలౌతుంది. వాళ్లకి వింతగా వుంది. మార్టిన్ చెప్పాడు. చాలా చెప్పాడు. చివరకు కులపెద్ద చచ్చిన గొడ్డును మనం తీసుకోవటం మన కులహక్కు అన్నాడు. మార్టిన్‌కు నవ్వొచ్చింది. క్రిష్ణానది పొలాలు కమ్మవాళ్ల హక్కు. పెన్నానది పొలాలు రెడ్ల హక్కు. అక్కడా, యిక్కడా చచ్చిన గొడ్లు మాత్రం మాదిగాళ్ల హక్కు. నవ్వు ఆగలేదు. నవ్వాడు. నవ్వుతూనే చెప్పాడు. చివరకు ఆ పల్లె సరేనంది. చచ్చిన గొడ్డును చచ్చినా తినేది లేదనుకొన్నారు.

ఈ మాట ఊళ్లోకి పాకింది. మునసబు అరుగుమీద చర్చ కొచ్చింది. మునసబు చినచౌదరి విన్నాడు. బుచ్చి చౌదరికేసి చూశాడు. బుచ్చి చౌదరి ఊ కొట్టి వూరుకొన్నాడు. చిన చౌదరి అట్టా వూరుకోలేదు.

"మాదిగలు చచ్చిన గొడ్డు తినరంట."

“తినరు. ఎత్తేస్తారుగా”

“ఎత్తేస్తారు”

“ఎత్తేసేటప్పుడు ఆడు తింటే మనకెందుకు, తినకపోతే మనకెందుకు”

“ఈ రోజు తిననంటాడు. రేపు ఎత్తి వెయ్యనంటాడు.”

“అట్టొచ్చావా. అయితే నీ యిష్టం.”

చచ్చిన గొడ్డుకు సంబంధించి యింకో విచిత్రమైన విషయం వుంది. చచ్చిన గొడ్డును తీసుకొన్న మాదిగ మాంసం తీసుకొని దాని చర్మం నుంచి గొడ్డును యిచ్చిన చౌదరికో, రెడ్డికో చెప్పులు కుట్టివ్వాల్సి వుంటుంది. చచ్చిన గొడ్డు మాంసం మాదిగలు తినకపోతే చెప్పులు మాట వుండదు. అవన్నీ బుచ్చి చౌదరికి ఆ తర్వాత గుర్తొచ్చాయి. అదేదో తేల్చాసిందే రా చినచౌదరీ” అని మరోసారి అన్నాడు.

తేల్చే రోజు రానే వచ్చింది. వెంకాయమ్మ గారిచిన జాలయ్య ఎద్దు చచ్చింది. ఆ వార్త మాదిగపల్లెకు చెప్పేకన్నా ముందు జాలయ్య చినచౌదరికి చెప్పాడు. చినచౌదరి బుచ్చి చౌదరిని పిల్చాడు. అప్పుడు మాదిగపల్లెకు కబురెళ్లింది. సినెంకడు, వాడి కొడుకు వచ్చారు. ఎద్దును ఎత్తుకెళ్తుంటే బుచ్చిచౌదరి పనయ్యాక యిటురారా సినెంకా అని అన్నాడు. సినెంకుడు ఊరిబయట చెట్టుకింద గొడ్డును దింపాడు. యిప్పుడు చెట్టుపైన గద్దలు, చెట్టుకు దూరంగా కుక్కలు మాత్రమే వున్నాయి. కూర సట్లతో మనుషులు మాత్రం లేరు. సినెంకడు ఎద్దు చర్మం వొలిచి తీసుకొన్నాడు. దాని ఎముకల్ని, మాంసాన్ని గుంటతీసి పూడ్చిపెట్టాడు.

సినెంకడు ఎద్దు ఎముకల్ని, మాంసాన్ని పూడ్చి పెట్టాడనే వార్త చౌదర్లకి అందింది. తోలు మాత్రం వొలుచుకెళ్లాడని కూడా తెలిసింది. కూరసట్టెలు పట్టుకొని మాలామాదిగలు ఎప్పట్లా గొడ్డు చుట్టూ చేరలేదనేది కూడా విన్నారు.

“నీకెట్టా వుందిరా పెదజాలమ్మ అల్లుడా” అని చినజాలమ్మ అల్లుడు అన్నాడు.

“వూరు వల్లకాడౌతుందే సినయ్యా” అని పెద్ద జాలమ్మ అల్లుడన్నాడు. చినచౌదరి అరుగుమీద రోజుకన్నా ఎక్కువమంది చేరారు.

గొడ్డు తోలు నట్టింట్లో మొచ్చుకు కట్టి బుచ్చిచౌదరి యింటికెళ్లాడు సినెంకడు. బుచ్చి చౌదరి లేడు. చినచౌదరి యింట్లో వున్నాడని తెలిసి అక్కడికెళ్లాడు. అక్కడ చౌదర్లు చాలామంది వున్నారు. దూరంగా నిలబడ్డాడు. బుచ్చిచౌదరి రాత్రికి యింటికిరా పనుందని అన్నాడు. సినెంకడు వెళ్లబొయ్యాడు. యెంకాయమ్మగారి చినజాలయ్య సినెంకడ్ని అప్పుడే చూసినట్టు చూశాడు. కాస్త ఆగరా అన్నాడు. సినెంకడు ఆగాడు. చెప్పులు ఎప్పుడు యిస్తావని చాలా మామూలుగా అడిగినట్టు అడిగాడు. అంతా అంతే. ఏమి జరగనట్టు, చాలా మామూలుగా జరుగుతున్నట్టు ప్రవర్తిస్తున్నారు.

“ఎముకా, మాంసం పూడ్చేశా”

సినెంకడి మాటలకు అంతా ఒక్కసారి ఆశ్చర్యంగా చూశారు.

"మాంసం తినటానికి తీసుకోలా"

మరోసారి చూశారు. చిన్నది కాదు. ఓ అంటరానివాడు అట్టా మాట్లాడటం భూమ్మీద తాపీగా కూర్చొనేంత చిన్నదికాదు.

"కాబట్టి చెప్పులు కుట్టియ్యాల్సిన పన్లేదురా చినజాలా" ! బుచ్చి చౌదరి మామూలుగానే అన్నాడు. అసలు అతను కోప్పడుతూ ఎప్పుడూ మాట్లాడడు. నడుంకి మడిచిన కాళ్లకి పై గుడ్డ కట్టుకొని, ముందుకీ వెనక్కీ ఊగుతూ మాట్లాడుతాడు. చాలా మామూలుగానే, ఏది తననుంచి జరగటం లేదన్నట్టు చూరుకింద నింపాదిగా కూర్చొని చూరుకు నిప్పెట్టేస్తాడు. అదే చేశాడు. నిప్పుపెట్టి చుట్ట కాల్చుకొంటున్నాడు.

"మతం మారాడుగా. కిరస్తానీ వాళ్లు చచ్చిన గొడ్డును తినరు. మార్టినే కదరా, మీ పెద్దాయన. తినొద్దని చెప్పాడు?"

చుట్ట పొగ వదులుతూ, దీనమ్మ ఎదవ పువ్వాకు అంటో కొస పళ్లకింద నొక్కుతూ అన్నాడు.

మంట ప్రశాంతంగానే మండింది. మామూలుగానే మండింది.

"ఎత్తుడికి తోలుసెల్లు. మాంసం తింటే సెప్పు సెయ్యాలి. వాడు మాంసం తిన్లా. అంతేగా సినెంకా." బుచ్చి చౌదరి మంటని ఎగదోస్తున్నాడు. ఒక్కసారి మంటలు ఆకాశానికెగిరాయి.

"పూడ్చిందాన్ని తీసి తిన్రా ఎదవ నాకొడకా"

అంతా ఆ మాట అన్నవైపు చూశారు. చినచౌదరి ఊగిపోతున్నాడు. సినెంకడు చౌదరికేసి చూశాడు. అట్టా చూడటమే చౌదరికి విపరీతమైన కోపం తెప్పించింది. పైకి లేశాడు. బారు కర్ర తీసుకొన్నాడు. సినెంకడ్ని గొడ్డును బాదినట్టు బాదటం మొదలుపెట్టాడు. దెబ్బలు చిన చౌదరితోనే ఆగలేదు. ఎన్ని దెబ్బలు పడుతున్నాయో తెలీదు.

"తన్నుకొంటూ అక్కడికి తీసుకెళ్దాం"

చినచౌదరి మాటతో సినెంకడ్ని ఊరిబయట గొడ్డును కోసినచోటు దాకా తరుముకొచ్చారు. గుంట మట్టి తోడమన్నారు. సినెంకడు తోడాడు. మట్టి కొట్టుకొన్న మాంసాన్ని తీసుకొని వండుకొని తినమన్నారు. అట్టా కాకపోతే ఆ గుంటలోనే పెడ్తామన్నారు. గొప్ప అచారాన్ని కాపాడినట్టు వెళ్లిపొయ్యారు. మట్టి కొట్టుకున్న మాంసం చేతిలో పట్టుకొని పల్లెకొచ్చిన సినెంకడ్ని యిప్పటికీ మర్చిపోలేడు మార్టిన్. ఆ రోజు అతని మొహంలో కన్పించిన నిస్సహాయత, నిరాశ యిప్పటికీ వెన్నాడుతూనే వుంది.

చిన్నది కాదు. తలెత్తుక తిరగటం అంత చిన్నది కాదు. తినటం, తినకపోవటం కూడా చిన్న విషయం కాదు. అసలు సొంత యిష్టాలు వుండటం కూడా మామూలు మాట కాదు. మార్టిన్‌కు అంతా గుర్తొస్తోంది. చిన్నోడిగా తన బతుకు. మార్టిన్‌గా తన మనసు.

కొత్త జీవితం.

కొత్త అనుభవం జీవితం బండ సందులలో ఎగురుతోంది. బండలంతా నెత్తుటి సారికలే. అనుభవం కూడా అంతే. నెత్తుటి నరాల అల్లిక. ఊరికో అల్లిక.

తన కొత్త జీవితం తొలి రోజుల్లో సినెంకడు చివ్వరి రోజుల్లో శివయ్య. వేట మృగాల వేట. మృగాల్ని మనుషులు వేటాడటం లేదు. మనుషుల్ని మృగాలు వేటాడుతున్నాయి. అవి మామూలు మృగాలు కాదు. రెండు యినుపకాళ్ల క్రూరమృగాలు. ఒక కాలు మతం మరో కాలు కులం అట్టా అనేక అనుభవాలు గుర్తొస్తున్నాయి. ఒకదాని వెంట ఒకటి, ఒకదానికి భిన్నంగా మరొకటి అన్నిట్లో కన్పించేది ఒక్కటే తలెత్తుక తిరగటం. చిన్నదికాదు.

జాముకోడి కూసింది. మార్టిన్ తృళ్లిపడి చూశాడు. వర్తమానంలోకి వచ్చాడు. శారమ్మ కేసి చూశాడు. శారమ్మ కూడా నిద్రపోయినట్టు లేదు. "నిద్రపోలా" అని అంది." మార్టిన్ లేదన్నాడు.

"శివయ్య ఎల్లన్న కొడుకు."

"శశిరేఖ చెప్పింది. సుభద్రని ఎల్లన్నని సమాధిచేసి వచ్చారట."

"చెప్పాడు. గొప్ప పాటగాడు ఎల్లన్న. పేరు విన్నాను. చూడలేకపొయ్యా... నెల్లూరులో వున్నప్పుడు ఆ పేరు చాలాసార్లు విన్నా.

"........"

"వీళ్లు మన దగ్గరే వుంటారు.

"ఆ పిల్లని దగ్గరుంచుకోవాలనుంది.

"క్రీస్తు దయామయుడు"

ఆ రాత్రి అట్టాగే గడిచిపోయింది. తెల్లవారింది. శివయ్యని తనతో రమ్మన్నాడు మార్టిన్ ఎక్కడికి ఎందుకు అని శివయ్య అడగలేదు. వెళ్లాడు. శశిరేఖ శారమ్మ దగ్గరే వుండిపోయింది.

శివయ్య మార్టిన్‌తో ఊళ్ళు తిరుగుతున్నాడు. శశిరేఖ శారమ్మకు తోడుగా కాల్వ పని కూలీల పిల్లలతో కాలం గడుపుతోంది. వాళ్లతోపాటు అఆలు తానూ నేర్చుకొంటుంది.

కాలవ పని పూర్తయినా వలస కూలీల్లో చాలామంది అక్కడే ఉండి పోవాలనుకున్నారు. కొద్ది మంది పుట్టిన గడ్డకి ప్రయాణం కట్టారు. శివయ్య మనసులో ఇప్పుడు ఎన్నెలదిన్ని లేదు. వచ్చేటప్పుడు ఎప్పటికైనా అక్కడికి చేరాలనుకున్నాడు. ఇప్పుడైతే చచ్చే లోపు ఎప్పుడైనా చేరొచ్చనే అభిప్రాయాని కొచ్చాడు. మార్టిన్ శారమ్మాతో యిక్కడే వుండి పోదామన్నాడు. అతను ఆ ప్రాంతానికి అంకితమయ్యాడు. కన్పించినంత దూరం యిసుక తిన్నెలు. నీళ్ళ దొరువులు. దొరువుల కింది నారు కయ్యలు. నిత్యం విన్పించే సముద్రహోరు. ఎందుకోగాని ఈ ప్రాంతం అతనికి బాగానే నచ్చింది. శారమ్మ కయితే శశిరేఖతో పెంచుకొన్న బంధం, కూలీల పిల్లల మీద ఏర్పడ్డ వాత్సల్యం అక్కడే కట్టిపడేస్తున్నాయి. ఇప్పటిదాకా అనేక వూళ్ళు తిరిగారు. చివరి రోజులు యిక్కడే గడిచిపోతే చాలనుకొంది. యిక్కడికి శశిరేఖ తనని వెతుక్కొంటూ వచ్చినట్టనిపిస్తోంది. ఈ బంధాన్ని క్రీస్తే కలిపాడు. తన కడుపున కాయ కాయలేదు. ఈ పిల్లే

తన బిడ్డ అనుకొంది ఈ బిడ్డ కడుపు పండితే చాలు మనవణ్ణో, మనవరాల్నో గుండె మీద పెట్టుకొని ప్రశాంతంగా నిద్రపోవచ్చు అని అనుకొంది "మన సమాధులకు మట్టి ఈ యిసుక నేలలోనే" అని మార్టిన్‌తో అంది. ముప్పయి కుటుంబాలతో అక్కడ వలసపాడు ఏర్పడింది. అక్కడ రెండే రెండు కులాలు. మాలలు, మాదిగలు అక్కడ నుండి అరమైలు నడిస్తే తప్ప ఊరులేదు. ఆ వూళ్ళో అన్ని కులాలు వున్నాయి.

పల్లెల్లో మార్టిన్ ఎట్టా మాట్లాడుతాడో, క్రైస్తవ యిళ్ళల్లో ఎట్టా కలిసిపోతాడో, ప్రార్థనల్లో ఏయే మాటలు ఎక్కువ వివరిస్తాడో శివయ్య గమనిస్తూనేవున్నాడు. అన్నిటి కన్నా మించి మార్టిన్‌లో స్పష్టంగా కన్పించే ఆవేశం, ఉద్రేకం, సూటిగా మాట్లాడటం శివయ్యకి బాగా నచ్చింది మార్టిన్‌లా తానూ మాట్లాడానులకొనేవాడు. అట్లాగే ప్రార్థన చేయాలనుకొనేవాడు. మార్టిన్ ఆవేశం, ఉద్రేకం తనకూ వుండాలనుకొనేవాడు. బైబిల్ వచనాలు కూడ బలుక్కోగలుగుతున్నాడు. చదవటం కష్టంగానే ఉంది. అయినా అట్టాగే చదవమనేవాడు మార్టిన్. పదే పదే చదివించేవాడు తమాషా ఏమిటంటే శివయ్య అక్షరాలు నేర్చుకోలేదు. కాని ధ్వనిని బట్టి అక్షరాల్ని పోల్చుకొంటో కూడా బలుక్కొంటో చదువుతున్నాడు. మార్టిన్ "క్రీస్తు ఆశ్చర్యకరుడు" అని అనేవాడు. ఓ రోజు శివయ్యతో అన్నాడు నిన్ను క్రీస్తు తన కోసం వాడుకోవాలను కొంటున్నాడు. యిష్టమేనా అని. శివయ్య మౌనంగా వుండి పోయాడు.

శివయ్య సీమోను అయ్యాడు.

"పిలాతు తీర్పు చెప్పాడు. క్రీస్తును ప్రధాన యాజకులకు, శాస్త్రులకు, అధికారులకు అప్పగించాడు. ఇక సిలువ వేయడం వక్కటే మిగిలి వుంది. సిలువ వేయడానికి ఆయనను తీసుకువెళ్తున్నారు. అప్పుడు కన్పిస్తాడు సీమోను. పల్లెటూరివాడు. కురేనీయుడు. క్రీస్తుతో పాటు సిలువ మోయమని సీమానును బలవంతం చేస్తారు. అతను సిలువ మోస్తాడు. నీది ఆ సీమోను పేరే. సిలువ మోసిన సీమోను పేరే నీది శివయ్య""

మార్టిన్ సీమోను అనే పేరుకు బైబిల్‌లో ఏమనుందో చెప్పాడు.

నిజానికి శివయ్యలు సీమోనులుగా మారకపోయినా సిలువలు మోయంది ఎప్పుడు. మోయ టానికే పుట్టారు. మోసి, మోసి, అలసి పోయాక, శూలాలతో డొక్కల్లో పొడింపిచు కోవటానికే పుట్టారు. అట్టాకాకుండా ఇంకా ఎట్టా జరుగు తోంది.

సిలువ మోయటం కొత్తకాదు
సిలువ ఎక్కటం కొత్తకాదు
అక్కడ ప్రాణాలు యివ్వటం కొత్తకాదు
ప్రతిక్షణం ... ప్రతిమూల ... ఈ దేశం నిండా

యిట్టా చెప్పుకోవచ్చు. సిలువ మోసే మార్టిన్ వెంట, సిలువ మోసే సీమోను, సిలువ మోసిన క్రీస్తును చెబుతూ తిరిగాడు.

ఎక్కడి మాట అక్కడ మాట్లాడుకోవటం చరిత్రకు మంచిది. ఈ దేశంలో మాల,

మాదిగలే కాదు బ్రాహ్మణులు క్రైస్తవులయ్యారు రెడ్లు అయ్యారు చౌదర్లు అయ్యారు.

మార్టిన్‌లు, శివయ్యలు అంటరానితనం పోగొట్టుకోవటానికి క్రీస్తును నమ్మారు. ఆకలి తీర్చుకోవటానికి నమ్మారు అన్నింటి కన్నా ముందు మనుషుల వేట నుంచి తమని తాము రక్షించుకోవ టానికి క్రీసుని నమ్మారు. చిన్నోడు మార్టిన్ అయినా, శివయ్య సీమోను అయినా అందుకే చేశారు.

విచిత్రం. జాన్‌పాల్ రెడ్లు, యిమ్మానుయేలు శాస్త్రులు, యెహషువా చౌదర్లు పుట్టుకొచ్చారు. నెల్లూరులో ఎన్నెలదిన్ని పిల్ల కరణం అల్లుడు సువార్త సభల్లో కన్పించినప్పుడు సీమోను ఆశ్చర్య పోయాడు. యిమ్మానుయేలు శాస్త్రి పిల్ల కరణం అల్లుడే అని తెలుసుకొన్నప్పుడు సీమోనుకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. పిల్ల కరణం కూతురు ఆ సభల కొచ్చింది. కొడుకుల చేతుల్లో బైబిల్ పుస్తకాలు కన్పించాయి. వాళ్ళ మెడలలో బంగారు సిలువ గొలుసులు. వాళ్ళుపై చదువుల్లో వున్నారు.

"అతను ఎన్నెలదిన్ని పిల్ల కరణం అల్లుడు. పెద్ద వయసులో క్రైస్తవుడయ్యాడు" మార్టిన్ చెవిలో మెల్లగా అన్నాడు.

"అతన్ని చూడు. జాన్‌పాల్‌రెడ్డి." సీమోను మార్టిన్ చూపిన వైపు చూశాడు. నున్నంగా గొరిగిన మూతి, తెగబలిసిన ఒళ్ళు. జాన్‌పాల్‌రెడ్డి గున్నేనుగులా వున్నాడు.

"అతని పక్క నుంది యెహోషువా చౌదరి. క్రిష్ణాప్రాంతం. కాటన్ దొర ఆ ప్రాంతాన్ని మార్చాడు. చౌదరి పొలం అప్పట్నుండి బంగారం పండుతుంది."

సీమోను తలపాగా చౌదరి కేసి అట్టాగే చూశాడు. బుర్ర మీసాలు. బంగారు పొన్ను కర్ర. రంగుకోటు సభలో కూర్చొన్నాడే గానీ సిమోను బుర్ర నిండా అనేక అనుమానాలు.

సభలు ముగిశాక యింటికొచ్చారు. సీమోను లో తెలియని భయం వెన్నాడుతోంది. అతనుండే ప్రాంతంలో అట్టా రెడ్లు, బ్రాహ్మణులు, చౌదర్లు క్రైస్తవులుగా లేరు. కాని ఈరోజు కాకపోతే రేపు రెడ్డి క్రైస్తవుడు కావచ్చు. కమ్మ కావచ్చు. శాస్త్రి కావచ్చు. అయితే ఒక వేళ అదే జరిగితే, నిద్ర పట్టడంలేదు. తన వంటిని పదే పదే చూసు కొన్నాడు. తన కడుపును ఎందుకు తవుడుకొన్నాడో తెలీదు. అనేకసార్లు అట్టా చేశాడు.

"క్లౌ దొర వప్పుకోలేదు. ఆయన భార్య వొప్పుకోలేదు. వాళ్ళు మాల, మాదిగల్లోనే కలిశారు. వాళ్ళనే క్రైస్తవులుగా మార్చారు. క్లౌ దొరసానమ్మ అస్పృశ్యుల రక్షణే క్రీస్తు నిర్ణయం అంది. క్లౌ అదే నమ్మాడు అగ్ర కులాల వాళ్ళ కోసం అంటరాని వాళ్ళకు చర్చిగేట్లు మూత వేయలేనని ఆయన అన్నాడు. కాని దొరల్లో అందరూ క్లౌ దొరలాంటి వాళ్ళు కాదు". కాటన్ లాంటివాళ్ళు కాదు.

మార్టిన్ చెప్పిన మాటలు సీమోను వింటు న్నాడు.

"ఈ పొలాల వెంట నేను చాలాసార్లు నడచాను. వందలసార్లు, వేలసార్లు నడిచాను. ఇంకా ఎంత కాలం నడుస్తానో తెలీదు. కాని బతికినంత కాలం నా నడక మాల పల్లెల్లోకే

వుంటుంది. మాదిగ పల్లెల్లోకే వుంటుంది."

సీమోను ఏదీ మాట్లాడటంలేదు వింటున్నాడు

"ఎన్నెలదిన్ని పిల్ల కరణం అల్లుడికి కోర్టులో పెద్ద పేరుంది నెల్లూరు ప్రాంతం భూమి తగాదాలన్నీ అతనే చూస్తాడు. అందుకు తెల్లదొరల అండ కావాలి అందుకే క్రైస్తవుడయ్యాడు. అతను రోజులో మూడొంతులు దొరల పంచల్లోనే వుంటాడు.

సిలువ చేసేవాడ్ని సిలువ మోసే వాడ్ని ఒకే కప్పు కింద సీమోను ఊహించు లేకపోతున్నాడు. కాని క్రీస్తు దయామయుడు ఎది ఎట్టా వేరుచేయాలో ఆయనకు తెలియంది కాదు. ఆ ఆలోచన రాగానే సీమోను చాలారోజులు తర్వాత కాస్త ప్రశాంతంగా నిద్రపోయాడు. మనిషి మనసు ఎప్పుడూ అంతే. ఎక్కడో ఒకచోట దేన్నో వెతుకున్నట్టు వెతుక్కొని దొరికింది యిన్నాళ్ళకని తృప్తిపడుతుంది. అందాకా ఆరాటమే.

కాలం సీమోనులో అనుమానాల్ని ఆశల్ని సమానంగా పంచుతూనే గడిచిపోతోంది. శశిరేఖ నీళ్ళోసుకొంది. సంబరం సీమోనుది కాదు. శారమ్మది. శశిరేఖకు కూడా లోపల దిగులు తీరిపోయింది. పెళ్ళయి యిన్నేళ్ళయినా పిల్లలు పుట్టకపోవడంతో పైకి అనకపోయినా లోపల దిగులుపడుతూనే వుంది. ఆ దిగులు తీరింది. శశిరేఖ పొద్దాక బియ్యం ఏరుతాను, రాగులు చేస్తాను అంటుంటే శారమ్మకి అనుమానం వచ్చి ఓ రోజు గమనించింది. బియ్యం ఏరుతూ మట్టిగడ్డలు నోట్లో వేసుకొంటోంది శశిరేఖ. రాగులు చేసేటప్పుడు కూడా అంతే. తన అనుమానం నిజమైంది. శశిరేఖ ఒట్టి మనిషి కాదని తేలిపోయింది. మొదట ఆ మాట మార్టిన్‌తోనే అంది. మార్టిన్ ఎగిరి గంతేశాడు. శారమ్మ అమ్మమ్మ అయిందంటూ గోల మొదలెట్టాడు. నిజమే శారమ్మ అమ్మమ్మే. శశిరేఖే తన బిడ్డను కొంది. శశిరేఖ సుభద్రని కలపరించడం మానేసేలా చేసింది. ఏ బిడ్డ. ఆడా, మగా. ఏదైనా ఫర్వాలేదు. బిడ్డ పుడితే చాలు. అట్టా రోజులు, వారాలు నెలలు లెక్కెడుతూ కూర్చొంది శారమ్మ.

బిడ్డ పుట్టాడు. బిడ్డని శారమ్మ తన వొళ్ళోనే వుంచుకొంటోంది. పాలు ఇవ్వటం వరకే శశిరేఖ పని. మిగిలిందంతా శారమ్మే. ఆమెలో ఎప్పుడూ చూడని వింత వెలుగు మార్టిన్ చూస్తున్నాడు.

"ఈ బిడ్డ మీ బిడ్డకాదు. శారమ్మ బిడ్డ. శారమ్మ కోసం పుట్టాడు" మార్టిన్ మాటల్ని శశిరేఖ కాదనలేదు. బిడ్డ శారమ్మ దగ్గరే నిద్రపోతాడు. శారమ్మ నీళ్ళు పోస్తేనే పోసుకొంటాడు. నీళ్ళు పోసేప్పుడు వాడి చేతి వేళ్ళని, కాలి వేళ్ళని పదే పదే చూస్తుంది శారమ్మ.

"వాడి తాత కాళ్ళ వేళ్ళు. ఆయనకి చేతి వేళ్ళు పొడుగ్గా సన్నగా వుంటాయి. కాలు కూడా అంతే" శివయ్య అనేవాడు "మొకం అత్తది" శశిరేఖ వెంటనే అనేది బిడ్డలో అత్తకి దక్కకుండా ఏ భాగం లేదు అంటే ఒప్పుకోటానికి సిద్ధంగా వుండదు. శారమ్మకు శశిరేఖ అంటే అందుకే అంత యిష్టం. అమ్మ చాటు బిడ్డల్ని చూసింది. శశిరేఖ అత్తచాటు బిడ్డ. అట్టా కొద్ది మందే వుంటారు. సుభద్రలూ అంతే. కొద్ది మందే అట్టా కోడళ్ళ గుండెల్లో గూడు కట్టుక పోతారు.

"పోన్లే బిడ్డా ... ఈ వేళ్ళు ఎల్లన్న. ఈ వేళ్ళూ ఎల్లన్నే. ఈ ముక్కు, మూతి .. " అంతా మా అత్త" అప్పుడు కాళ్ళ మీద చంటి బిడ్డని, కంట్లో శశిరేఖని వుంచుకొంది శారమ్మ, బతికినంత కాలం ఆ యిద్దర్నీ అట్టాగే వుంచుకోవాలని పదే పదే అనుకొంది.

కాలం వేగంగా పరుగుతీస్తోంది. కాలంతో పాటు మార్పు కూడా , మాల, మాదిగలు క్రైస్తవ మతంలో చేరడం ఓ ఉద్యమంగానే జరుగుతోంది. వేలాదిమంది ఒకేరోజు బాప్తీస్మం తీసుకున్న సంఘటనలు కూడా చోటు చేసుకొంటున్నాయి మరోవైపు క్రైస్తవులపై దాడులు కూడా మొదలయ్యాయి. క్రైస్తవులపై దాడులు అనేకన్నా మాల, మాదిగ క్రైస్తవులపై దాడులంటే బాగుంటుంది. కృష్ణాజిల్లా క్రైస్తవ చౌదరులపై దాడులు జరిగినట్టు వార్తలు లేవు. నెల్లూరు జిల్లా రెడ్ల క్రైస్తవులపై దాడుల వార్తలు లేవు. ప్రభుత్వ ఆఫీసుల్లో తిష్టవేసిన బ్రాహ్మణ క్రైస్తవులపై దాడులు జరిగిన ఉదాహరణలు లేవు. జరిగిందల్లా మాలలపైనే, మాదిగలపైనే అంటరాని క్రైస్తవుల పైనే.

రోజుకో వార్త. ఊరికో కధ. మార్కాపురంలో 16 మంది మాల, మాదిగ క్రైస్తవుల్ని బంధికానాలో వుంచారు. చిత్రహింసలు పెట్టారు. క్రీస్తుని మరచి కృష్ణున్ని భజన చేయమన్నారు. వాళ్ళు క్రీస్తు పాటలే పాడారు. కనిగిరిలో నడిబజారులో మాదిగ క్రైస్తవుణ్ణి అర్థనగ్నంగా తిప్పారు. అతని చేతిలో బైబిల్ కాల్చి వేశారు బండ్లమూడి క్రైస్తవులపై అర్ధరాత్రి దాడి జరిగింది. దాడి వివరం వూరికో విధంగా పాకింది. కూచపూడిలో నీళ్ళలో ముంచటం తీసుకొన్న పదిమంది క్రైస్తవుల్ని ఆ వూరి మునసబు పిలిపించాడు. వూరి చెరువులో మునిగి క్రైస్తవ అంటుపోగొట్టుకోమన్నాడు. వాళ్ళు చెర్లో మునగడానికి నిరాకరించారు. మనుషుల్తో వాళ్ళని చెర్లో నెట్టించాడు. అక్కడ పోలెరమ్మకు దున్నపోతును బలిచ్చారు. మేకను నరికారు. విగ్రహానికి బలవంతంగా మొక్కించారు. దున్న నెత్తురు వాళ్ళ మొహాలకు రాశారు. చిందులు వేయించారు. చిందులు వేశారు. చీమకుర్తి దరిదాపుల్లో మాదిగ కుర్రాణ్ణి తరిమి తరిమి పట్టుకొన్నారు. అతను రెండు నేరాలు చేశాడు. చేతిలో బైబిల్ వుంది. కాళ్ళకు చెప్పులున్నాయి. ఊరిలో నడుస్తున్నాడు. ఊరిలో అంటరానివాడు నడవకూడదు. నడిచే అవకాశమే వస్తే చెప్పులు వేసుకోరాదు. తలపై గుడ్డ వుండరాదు. చేతిలో గొడుగు వుండకూడదు. దించిన తల ఎత్తకూడదు. పొరపాటున పక్కకి చూడకూడదు. ఆ సందర్భాలలో అగ్రకుల స్త్రీ బయటకొస్తే ఆమె వాడి మొహం చూస్తే వీడు చచ్చినట్టే. అందుకే కొన్ని వూళ్లలో అదోరకం శబ్దం చేస్తూ నడవాలి. అట్టా శబ్దం చేస్తే కుల స్త్రీలు బయటకు రారు. శబ్దం చేసిన నాలుగు వీధులు వినేలా చేయాలి. ఎక్కడో దొడ్లో పనుల్లో వుండే కుల స్త్రీ ఆ శబ్దం వినకపోతే, బయటకొస్తే ఆ తప్పు ఆమెది కాదు. శబ్దం చేసినా వాడితప్పే అవుతుంది. అంత జరగాల్సి వుంది. కాని ఆ కుర్రాడు చేతిలో బైబిల్‌తో వున్నాడు. మతం మారాడు. కాలి చెప్పుతో వున్నాడు. ఆచారాన్ని కాలరాశాడు. అంతే జరిగింది. వాణ్ణి తరిమారు. ఊరి బయట దాకా తరిమారు. బరిసెల్తో పొడిచారు. కొండ పక్క చిట్టడవిలో చెట్టుకు వాడి శవాన్ని కట్టారు. ఆ చిట్టడవి దారిలోనే మాల, మాదిగలు చుట్టుపట్ల వూళ్ళకి వెళ్తారు. ఆ

వార్త వూరూరా పాకింది. ప్రతిచోటా భయం. ఏ వూళ్ళో ఏది జరుగుతుందో తెలీని ఆందోళన. మాల, మాదిగలు కొందరు శుభ్రమైన బట్ట కట్టారు ఆ బట్టపైన దాడి జరిగింది. ఆదివారం పనికి రామన్నారు ఆ విరామం మీద దాడి జరిగింది. చచ్చిన గొడ్డును తినమన్నారు. అట్టా "తినటాన్ని" తమ ఇష్టంగా భావించటం పైన దాడి జరిగింది. మిషన్ స్కూళ్ళలో కాస్తా కూస్తో చదవడం మొదలెట్టారు ఆ చదువు మీద దాడి జరిగింది. అక్కడక్కడా అంటరాని వాళ్ళు కాస్త తలెత్తి చూశారు. వాళ్ళ తలల మీద దాడి జరిగింది

చేతులు నా వంటే చేతుల మీద దాడి
కాళ్ళు నా వంటే కాళ్ళమీద దాడి
కళ్ళు నా వంటే కళ్ళమీద దాడి
వేళ్ళు నా వంటే వేళ్ళమీద దాడి.

దాడి. మాలాళ్ళ మీద. దాడి. మాదిగాళ్ళ మీద దాడి. మాలక్రీస్తు మీద దాడి. మాదిగ క్రీస్తు మీద. క్రీస్తు అంటరానివాడైతే చాలు. దాడి జరిగి తీరుతుంది. మార్టిన్ మౌనంగా వూరుకోలేదు. దాడిని ఖండిస్తూ మట్లాడటం మొదలెట్టాడు.

"మనం మౌనంగా వుండటానికి మతంలో చేరలేదు. మన వంటిని ముడుచుకోవటానికి ముంచటం తీసుకోలేదు." అట్టాంటి సందర్భాల్లో మార్టిన్ గొంతు బొంగురు పోతుంది. ప్రార్థనల్లో మాటాడిన ఆ మాటలే పదే పదే మాటాడి అతని గొంతు బొంగురుపోతుంది. దాడి జరిగిన ప్రతి చోటుకు వెళ్తున్నాడు. అధికార్లకు ఆ విషయం చెప్తున్నాడు. సీమోనుకు మార్టిన్ ఎంతో గొప్పగా అన్పిస్తున్నాడు. మార్టిన్‌తోటే పరుగుతీస్తున్నాడు. ఎక్కడ ఆర్తనాథం వింటే ఆ వైపుకు, అలుపులేని ఆ ముసలాడి తోటి.

"ఇదిగో ... నేను స్పష్టంగా ప్రకటిస్తున్నాను. నా గొంతు నరాలు తెగిపోయేంత బిగ్గరగా ప్రకటిస్తున్నాను. నా యెషయా మాటలు నేను మరోసారి గుర్తు చేస్తున్నాను. విశ్రాంతి దినాన, సమాజ మందిరంలో క్రీస్తు నజరేతులో, తన జనాల మధ్య చదివిన యెషయా మాటలు మీ ముందు వుంచుతున్నాను.

అట్టా మొదలౌతుంది మార్టిన్ బోధ.

"ప్రభువు ఆత్మ నా మీద వుంది. పేదలకు సువార్త ప్రకటించడానికి ఆయన నన్ను అభిషేకించాడు. చెరలో వున్న వారిని విడిపించడానికి ఆయన నన్ను ఎన్నుకొన్నాడు. నలిగిన వారిని విడించడానికి ఆయన నన్ను పంపించాడు. అట్టా కాకపోతే నేనందుకు మాటా డాలి. అట్టా కాకపోతే నేనెందుకు క్రీస్తుకు దగ్గర కావాలి."

అవి మాటలుగా సీమోనుకు అన్పించవు. నిజాయితీకి అచ్చమైన రూపాలుగా అన్పిస్తాయి.

"వాళ్ళు దాడి చేసేవాళ్ళు. వాళ్ళ చేతులు రక్తం చేత అపవిత్రమౌతాయి. వాళ్ళ వేళ్ళు దోషం చేత అపవిత్రమౌతాయి. వాళ్ళ పెదాలు అబద్దాలు, వాళ్ళ నాలుక కీడుని మాటాడుతాయి.

వాళ్ళ సాక్ష్యం నీతిని బట్టి వుండదు. వాళ్ళ తీర్పు సత్యాన్ని బట్టి వుండదు. వాళ్ళు చెడును గర్భంగా ధరిస్తారు. పాపాన్ని కంటారు.''

సూటి మాటలు ఎక్కుపెట్టిన బాణాలు. కరణాల మీద, కాపుల మీద, శాస్త్రుల మీద క్రీస్తు మాటాడినట్టు, కొండ మీద మాటాడినట్లు, జన సమూహాల మధ్య మాటాడినట్టు, అట్టా మాట్లాడటానికి తనకి పూర్తి అధికారమున్నట్లు మార్టిన్ మాటలు.

"ఇదిగో నేను ఈ వొళ్ళు అంటరానిది కాదు అని ప్రకటిస్తూ నీళ్ళులో మునిగాను. ఆప్రకటన వ్యర్థమైనప్పుడు, ఈ శరీరమే నాకు వ్యర్థమను కొంటాను క్రీస్తు సాక్షిగా చెప్తున్నాను. తలెత్తటం నేరమైతే ఆ నేరం చేస్తాను. అందుకు మూల్యం తల పోగొట్టుకోవటమైతే ఆ తలని పోగొట్టుకొంటాను. ఆయన తన శరీరాన్ని రొట్టిగా మార్చి అందుకే ఇచ్చాడు. తన రక్తాన్ని పానియంగా అందుకే పంచాడు. సత్యం కొరకు శ్రమలు పొందడానికే ఆ రొట్టి తిన్నాము. ఆ పానియం తాగాము.''

మార్టిన్ మాటలు అట్టాగే వుంటాయి. నిర్ణయాల్లా వుంటాయి. కోత కొయటానికి సిద్ధమైన పంట కత్తుల్లా వుంటాయి. సీమోను ఆ మాటల్లో జీవిస్తూ మార్టిన్ ఎదుట కూర్చొంటాడు. గుండెంతా అలజడి. అణువూ అణువూ పొంగుతున్న నరాలు.

"ఇదిగో .. మీ ముందు నా తండ్రిని వుంచుతున్నాను. ముళ్ళ కిరీటం. ఊదారంగు వస్త్రం. నా తండ్రి పిలాతు ముందు నిలబడ్డాడు. ప్రధాన యాజకుల అరుపులు. నా తండ్రిని సిలువ వేయమంటున్నారు.''

జనంలో కదలిక. వాళ్ళ కళ్ళ ముందు వో దృశ్యం. శిలువను మోసే క్రీస్తు. శిలువపైన క్రీస్తు. చిందే నెత్తురు. అంతా మార్టిన్ మాటల్లో. అంతా మార్టిన్ ఆవేశంలో. అతను శ్రమలు పడటాన్ని ఉన్నతం చేయటం కోసమే అదంతా చెబుతాడు. చివరగా అంటాడు మనం పిరికి వాళ్ళంలా పారిపోము. క్రీస్తు దయామయుడు. ధైర్యంగా ముందుకు పోదాం. ప్రభు యేసు రక్తమునకు జయము. అపవాది క్రియలకులయము.''

మార్టిన్ ఆ చివ్వరి మాటలు అన్నప్పుడు సీమోను అందుకొనేవాడు.

ప్రభు యేసు రక్తమునకు జయము.

అపవాది క్రియలకులయము.

పదే పదే ఆ మాటలు ప్రార్థనా మందిరమంతా మారు మోగేవి.

సరిగ్గా ఆ నేపథ్యంలోనే మార్టిన్ వుంటున్న వలసపాడు సమస్య ముందుకొచ్చింది. ఆ పల్లె అంతా క్రైస్తవులు కాబట్టి అరమైలు దగ్గర్లో ఊరు వాళ్ళు పనికి పిలవమన్నారు. ఆదివారాలు ఎద్దేవా చేశారు. ఆ వూళ్ళో మాలామాదిగిళ్ళు వున్నది అయిదే. మిమ్మల్ని చూసి వాళ్ళు చెడిపోతారని అన్నారు. కూలికి చాలా దూరం వెళ్ళాల్సివస్తోంది. అక్కడ అదే సమస్య. దానికి తోడు క్రైస్తవులపై దాడులు. ఒకప్పుడు బతకడానికి ఇక్కడికి వలస వచ్చారు. యిప్పుడు మరోచోటికి వెళ్ళాల్సి వచ్చేలా వుంది. కాకపోతే మళ్ళీ వచ్చిన వూళ్ళ దారి పట్టాల్సి వుంది.

అప్పుడు వాళ్ళ దృష్టికి కాలవకు పటమట వున్న బంజరు వచ్చింది. పాతిక ఎకరాలకు మించి వుంటుంది ఆక్రమించాలనుకొన్నారు. మార్టిన్ అధికార్లను కలిశాడు. విషయం వివరించాడు. తప్పక చేస్తామన్నారు పదిరోజుల తర్వాత కన్పించమన్నారు. పదిరోజుల తర్వాత వెళ్తే అది బంజరు కాదని తేల్చారు. కరణాన్ని కలిస్తే అది యిద్దరు రైతులదని చెప్పాడు. లాభం లేదని దొరని కలిశాడు. దొర కరణాన్ని పిలిచాడు. కరణంతో పాటు మునసబు వెళ్ళాడు. ఆ యిద్దరు రైతుల్ని వప్పిస్తే తమకు అభ్యంతరంలేదని ఆ యిద్దరూ అన్నారు. నిజానికి అది ఆ యిద్దరు రైతుల్ది కాదని మార్టిన్ వాదించాడు. దొర దాన్ని నమ్మాడు రైతుల ఆస్తులు క్రైస్తవులు కాజేస్తున్నారని పుకారు పుట్టింది. ఊళ్ళల్లో అగ్ర కులాల్ని రెచ్చగొట్టారు. కోర్టులో కేసు వేశారు. అగ్ర కులాల తరపున ఆ కేసు వాదిస్తోంది ఎన్నెలదిన్ని పిల్ల కరణం అల్లుడు యిమ్మానుయేలు శాస్త్రి. మార్టిన్ అతన్ని కలిశాడు.

"రెండు విషయాలు మీ ముందు వుంచుతున్నాను. మొదటగా అది ఏ రైతుదీ కాదు. రెండోది మీరు క్రైస్తవులు. మీరు నిలబడాల్సింది క్రైస్తవుల తరఫున" అని మార్టిన్ అన్నాడు. శాస్త్రి తాపీగా మార్టిన్‌కేసి చూసి అన్నాడు.

"ఆ యిద్దరు రైతులూ క్రైస్తవులే"

మార్టిన్ అతని మాటలు విని ఆశ్చర్యపోయాడు. వాళ్ళు క్రైస్తవులు ఎప్పుడయ్యారు. ఎవరు ముంచట మిచ్చారు. అంతా అయోమయంగా వుంది.

"వాళ్ళు క్రైస్తవులు ఎప్పుడయ్యారు. ఎక్కడరయ్యారు."

"కేసు నా దగ్గరకు రాకముందు అయ్యారు. వాళ్ళకి నెల్లూరులో బాప్తిస్మం ఇచ్చారు."

మార్టిన్ అతని కేసి అనుమానంగా చూశాడు.

"నేను క్రైస్తవుణ్ణి. క్రైస్తవుడు నా దగ్గర కొచ్చాక కాదనలేకపోయాను".

"కాని వీళ్ళు పేద క్రైస్తవులు. మాలా మాదిగలు."

"కాని క్రైస్తవుడన్న తర్వాత క్రైస్తవుడే. ఇక్కడ రెడ్డి, కమ్మ, బ్రాహ్మణ, మాలా మాదిగ ఎవరైనా కావచ్చు. అంతా క్రైస్తవులే. కాదని మీరూ అనరు."

మార్టిన్‌కు అర్థమైంది. తిరుగు ముఖం పట్టాడు.

"క్రైస్తవుడన్న తర్వాత ఎవడైనా క్రైస్తవుడే" అన్న కరణం అల్లుడు మాటలు పదే పదే గుర్తొస్తున్నాయి. అతను చాలా తెలివిగా మాట్లాడాడు.ఆ తెలివిలో మోసం వుంది. అసలు మోసం చేయడానికే తెలివి వాళ్ళు సొంతం చేసుకొంటారు. సంపదలా పెంచుకొంటారు. సీమోనును కలిసేంత వరకు మనసు మనసులో లేదు. జరిగిందంతా సీమోనుకు చెప్పాడు.

"అతనికి తెలియకుండా ఏది జరగలేదు" సీమోను అన్నాడు. దొరను కలిశారు. అంతా చెప్పారు. అది ఆ పేదలకు దక్కకపోతే నా ప్రాణం ఈ భూమ్మీద వుండదని మార్టిన్ చెప్పాడు. పదే పదే దొరని కలిశాడు. ఒంటరిగా కలిశాడు. సీమోనుతో కలిసి కలిశాడు. ముప్పయి

కుటుంబాలని చిన్న పిల్లలతో సహా తీసుకుని వెళ్ళి దొర బంగాళాలో కూర్చొన్నాడు. ఆ వార్త వూరూరా పాకింది. అగ్రకులాల రచ్చల్లో గొప్ప చర్చగా మారింది.

చివరకు మార్టిన్ అనుకొన్నది సాధించాడు. ఆ భూమి బంజరని తేలింది. దాన్ని సాగుచేసుకొనే హక్కు ఆ వూరి పేద క్రైస్తవులకు యివ్వటం జరిగింది. సంఘటన చిన్నది కాదు. అగ్రకులాలకు మింగుడు పడేదికాదు. అదివాళ్ళు ఓటమిగానే భావించారు. ఆ ఓటమి వొప్పుకోవటానికి వాళ్ళు సిద్ధంగాలేరు. చౌదర్లు, రెడ్లు ఏకమయ్యారు.

క్రిస్మస్ దినాలు

డిసెంబర్ 24 రాత్రి దాకా తిరగాల్సిన వూళ్ళన్నీ తిరిగి, 25న యింటి దగ్గరే వుండాలను కొన్నారు మార్టిన్ సీమోనులు. భూమి దక్కిన ఆనందం కూడా ఆ వూరి జనాని కుంది. పండగ గొప్పగా జరుపుకోవాలనుకొన్నారు. కొత్త పొలాల్లో డేరాలు కట్టి అక్కడే ప్రార్థనలు, భోజనాలు చేయాలనుకొన్నారు. యింటికిన్ని తిండి గింజలు తీసిపెట్టారు. అ పనులు చూడటానికి ఓ యిద్దరు కుర్రాళ్ళను నియమించాడు మార్టిన్. ఆడాళ్ళంతా శారమ్మ దగ్గర చేరారు రోట్లో ఒడ్లు పోసి రెండు రోజులు దంచారు. కారం దంచారు. అంతా అదో సందడి. శారమ్మ బిడ్డని ఒళ్ళో కూర్చోపెట్టుకుని అంతా చూస్తూ వుంటే ఆమె మనసంతా తెలీని ఆనందంతో నిండిపోయింది. ఒడ్లు దంచేవాళ్ళ హుషారు కోసం శశిరేఖ పాటలు పాడింది. అన్నీ ఎల్లన్న పదాలు. ఆ పాటలు వింటో "మీ తాత పదాల్రా చిన్నా" అని బిడ్డని గుండెలకు హత్తు కుంటూ పదే పదే అంది. వాడు బోసి నవ్వులు నవ్వేశాడు. మధ్యలో వొడిలోంచి లేసి చిన్ని చిన్ని నడకలు నడుస్తూ అంతా తిరిగాడు. "మనవడు పెళ్ళికి ఎన్ని రోళ్ళు మోగాలో శారమ్మ" అని సుబ్బరత్నం అంటే శారమ్మా అదోలా అయిపోయింది. అప్పటిదాకా బతకాలనుకొంది. వీడి పెళ్ళి దాకా బతకాలనుకొంది.

డిసెంబర్ 24న మార్టిన్, సిమోన్ ముఖ్యమైన వూళ్ళు తిరిగారు. చివరి వూరు పూర్తయ్యే సరికి రాత్రి పొద్దుపోయింది. దాదాపు మూడు గంటల ప్రయాణం వుంటుంది. మధ్యలో వూళ్ళున్నాయి. అయినా అక్కడ ఆగాల్సిన పనిలేదు. యిద్దరూ దారిపట్టారు.

"గమనించావా సీమోను ప్రార్థన అయ్యాక ముచ్చటల్లో యింత మడి చెక్క చూడమంటూ మనవాళ్ళు అడగటం"

"అవును. అవసరం కూడా"

"తలెత్తుక తిరగటానికి మడి చెక్కా కావాలి"

"అవును"

"ఒక టను కొంటే, యింకొటి ముందుం టుంది. ఈ శరీరం అంటరానిది కాకుంటే చాలనుకొన్నా. ఈ వంటి కింత తిండి సొంతంగా వుండటం తోసుకొస్తుంది. రెండూ కావాలి. రెడ్డికి రెండూ వున్నాయి. చౌదరికి రెండూ వున్నాయి."

"ఎన్నెలదిన్నిలో పెద్ద కతే జరిగింది"

"విన్నా. నారయ్య, మాతయ్య, నాగన్న పేర్లు కూడా విన్నా."

"అయ్య వాళ్ళ మీద పాట అల్లాడు"

"పాట కూడా విన్నా ... ఎన్నెలదిన్ని పిల్ల కరణం అల్లుడు ... యిమ్మానుయేలు శాస్త్రి ... క్రైస్తవుడైనా తోకపోలా. శాస్త్రి అట్టాగే వుంది. జాన్‌పాల్‌రెడ్డి, యోహోషువా చౌదరి .. మతం మారినా కులం పోలా ..."

కాస్త దూరంలో కుక్కల అరుపులు విన్పిం చాయి. చుట్టూ చూసి యింత కఱ్ఱపుల్ల తీసుకొన్నాడు సీమోను.

"తొందరగా పద క్రీస్తు పుట్టక మందు యిళ్ళు చేరాలి."

కుక్కల అరుపు మరీ దగ్గరైంది.

"బిడ్డకి రేపు పేరు పెట్టాలి. ఏ పేరు పెడ్దాం.'

"నువ్వే పెట్టు"

"శారమ్మని అడుగుదాం ... ఈ పేరు ఎట్టా వుంది."

'ఏ పేరు'

పేరు చెప్పబోయి ఆగాడు. ఎదురుగా మనుషులు. వాళ్ళు చుట్టూ మూగుతున్నారు. కుక్కల అరుపులు భయంకరంగా వున్నాయి. ఆ మనుషులు ఒక్కసారిగా పైన పడ్డారు.

మార్టిన్ కడుపులో, వీపులో, డొక్కలో దిగబడ్డ బాకులు. మార్టిన్ నేలకొరిగాడు. ఏం జరుగుతుందో తెలుసుకొనేలోపే సీమోను పై దాడి మొదలైంది. అతన్ని కత్తుల్తో పొడవలేదు. నెత్తురు కారేలా కొట్టారు. చంపినా బాగుండేదన్నంత విపరీతంగా కొట్టారు. నేలకు అతుక్కు పోయిన సీమోనును పైకి లేపారు. సీమోను నిలబడలేకుండా వున్నాడు. నిలబడమని కొట్టారు. బలవంతంగా నిలబడ్డాడు. నెత్తుటిమడుగులో వున్న మార్టిన్‌ని ఎత్తుకోమన్నారు. ఎత్తుకొనేంత వరకూ కొడుతూనే వున్నారు. అతికష్టం మీద మార్టిన్‌ను భుజాల మీదికి ఎత్తుకొన్నాడు. మోసుకెళ్ళమన్నారు. అడుగు పడటంలేదు. అడుగు పడేంతవరకూ కొట్టారు. సీమోను అతికష్టం మీద నడుస్తున్నాడు. భుజాలమీద మార్టిన్. అంత బాధలోనూ మార్టిన్ మాటలు గుర్తొచ్చాయి.

"నీది శిలువ మోసిన సీమోను పేరు"

ఆ సీమోను క్రీస్తు శిలువ మోసాడు. ఈ సీమోను క్రీస్తు బోధకుని శవం మోస్తున్నాడు.

సీమోను లేని సత్తువ తెచ్చుకున్నాడు. తెల్లారేలోపు అక్కడికి చేరాలనుకొన్నాడు. అడుగు తీసి అడుగు వేశాడు. కాస్త బలంగా, యింకాస్త వేగంగా నడవడం మొదలెట్టాడు.

భుజాలమీద కారుతున్న మార్టిన్ నెత్తురు.

కారకుండా వుండాల్సిన నెత్తురు.

ఇంకొంత కాలం ఈ భూమ్మీద చెమటలా తడవాల్సిన నెత్తురు.

నీతికోసం ఆకలిదప్పులు కలిగిన నెత్తురు.

నీతి నిమిత్తం హింసించబడ్డ నెత్తురు.

ఈ లోకంలో కనికరం, ప్రేమ, దయ నింపుకున్న నెత్తురు.

శిలువపైన చిందిన నెత్తురు. కాల్వలై పారిన నెత్తురు.

నెత్తురు. అంటరాని నెత్తురు.

నెత్తుటి జ్ఞాపకం.

రూతు జ్ఞాపకాల్లో మిగిలిన నెత్తుటి జ్ఞాపకం.

రూతు కళ్ళముందు కన్పించే మారణ హోమం.

వలస పాడు చేరిన సీమోను

భుజాలమీద మార్టిన్ నెత్తుటి దేహాన్ని వుంచుకొని సీమోను చూసిన పిశాచ నృత్యం. వలసపాడు వల్లకాడు దృశ్యం.

మాల మాదిగల్ని బరిశలతో, గొడ్డళ్ళతో తరుముతున్న అగ్రకులాలు. వెర్రిగా భయంగా పరిగెడుతున్న అసహాయులు. వాళ్ళ ఆక్రందనలు. పల్లెను వలయంలా చుట్టిన పిశాచగణం.

ఎందర్ని చంపారో తెలీదు. ఎందరు ఎటు పరుగెత్తారో తెలీదు. కాలుతున్న తాటాకు గుడిసెలు. ఆకాశాన్ని అంటుకున్న మంటల పొగలు...

శారమ్మ శవమైంది. శశిరేఖ శవమైంది. ఆ శవాల్ని, వాటి చుట్టూ మంటల్నీ గుడ్లప్పగిచ్చి చూస్తున్న సీమోను. జ్ఞాపకం ఏడుస్తోంది.

జ్ఞాపకం గుండెల్ని పిండుతోంది.

జ్ఞాపకం ఆ బిడ్డ వెర్రి ఆక్రందనని విన్పిస్తోంది. మంటల మధ్య, తెగిపడ్డ దేహాల మధ్య, ఆక్రందన,వెర్రి కేకలు, పసివాడి కేకలు. ఆ బిడ్డను చూసిన సీమోను, వీడన్నా బతకాలని, తన వంశం ఈ భూమ్మీద ఈ బిడ్డతోనైనా బతికివుండాలని, బిడ్డను తీసుకొని పరుగు తీసిన సీమోను.

ఆ బిడ్డే తన రూబేను.

ఆ వెర్రికేక, ఆక్రందన తన రూబేనుదే.

దృశ్యం.

ఎప్పటికీ చెరిగిపోని దృశ్యం.

నెత్తురు గీసిన దృశ్యం.

ఆ దృశ్యం అనుకొంటే యిప్పటికీ తట్టుకోలేదు రూబేను మొదటి సారి ఆ దృశ్యాన్ని తన ముందు వుంచిన రోజు పెద్ద పెట్టున ఏడ్చింది. అప్పుడు రూబేన్ తనని ఓదార్చాడు. యిప్పుడు వోదార్చేందుకు రూబేను లేడు. అందుకే ఆ దృశ్యం అనుకొన్నప్పుడల్లా, ఆ సంఘటన జరిగిన చాలా సంవత్సరాలకు రూబేను రాసుకొన్న డైరీలు ముందు వుంచుకుంటుంది. వాటిలో తనకు కావాల్సిన పేజీల కోసం వెతుక్కుంటుంది. వాటిని పదే పదే చదువు కుంటుంది.

చాలా చిన్న వయసులో రూబేను ఆస్పత్రి బోధకుడయ్యాడు. ఆస్పత్రి బోధకులకి దినచర్య రాసుకొవటం అలవాటైన అంశం. అట్టా డైరీలే కాదు. చాలా వాటిని దాచాడు రూబేను. దాచిన వాటిల్లో ఒంటిరి చుక్క గీతం, తాను బోధకుడైన తొలి రోజుల్లో రాసుకొన్న డైరీలలో కొన్ని పేజీలు ఆమె యిష్టంగా చదువుకుటుంది. ఎందుకట్టా వాటిని పదేపదే చూస్తావని అడిగితే జవాబు చెప్పదు. జవాబు చెప్పడం యిష్టంలేక కావచ్చు. లేకపోతే ఆ జవాబు తనకే పరిమితం అనుకొవచ్చు.

రూతు యిష్టంగా చదువుకొనే ఆనాటి రూబేను డైరీలలో కొన్ని పేజీలు ఎలాంటి మార్పు లేకుండా.

- 1920 నవంబర్ 17

ఆస్పత్రి బోధకుడుగా చేరి నెల దాటింది. రోగుల్లో ఎవరో "యింత చిన్న బోధకుడా' అని పక్క రొగితో అంటుంటే విన్నాను. ఆ అన్న మనిషికేసి చూశాను. చాలా పెద్ద వయస్సు. అట్టా అప్పుడ ప్పుడు రోగులు అనుకోవటం నేను వింటూనే వున్నాను. వాళ్ళు నన్ను ప్రశంసిస్తారు. ఆ ప్రశంశలు నన్ను వెన్నాడుతూనే వుంటాయి. అయితే ఆ ప్రశంశల్లో పాలు పంచుకొనే నా అన్న వాళ్ళు నాకు లేరు మిషన్ కాంపౌండ్ అనాధా శ్రమంలో అనాధగానే మిగిలాను. కొందరు ఈ అందమైన కుర్రాడు ఎవరు అని అనటం కూడా నా చెవిన పడుతుంది. ఈ అందమైన కుర్రాణ్ణి కన్న అందమైన తల్లి, తండ్రి ఈ భూమ్మీద వుండి వుంటారు. కనీసం నన్ను కన్న రోజైనా ఆమె నన్ను తన వొడిలో వుంచుకొని వుంటుంది. ఆయన నా చిన్ని వొంటిని పదే పదే చూసి వుంటాడు. ఎట్టా వుండి వుంటారు వాళ్ళు. ఏమై వుంటారు. యిప్పటికీ జవాబు దొరకని ప్రశ్నలు. ఒంటరిగా వున్నప్పుడు కుమిలి కుమిలి ఏడ్చే సందర్భాలు.

- 1920 నవంబర్ 18

భూమ్మీద కొన్ని అద్భుతాలు జరుగుతాయి. అలాంటి అద్భుతమే ఈ రోజు జరిగింది. అనాధ శరణాలయంలో తొలి దినాల్లో పని చేసిన ఫ్రాన్సిస్ ఈ రోజు యిక్కడికొచ్చారు. ఆయన వయసు పైబడిపోయి వుంది. చివ్వరి రోజుల్లో తను పని చేసిన శరణాలయాన్ని చూడాలని వచ్చాడు. అప్పుడప్పుడే ప్రాణం పోసుకొంటున్న మిషిన్ ఆసుపత్రిని చూడాలనే ఆశతో కూడా వచ్చాడు. ఆయన యిప్పటిదాకా హనుమకొండ మిషన్ ఆస్పత్రిలో పనిచేసి రిటైర్ అయ్యారు. అంత వయసులోనూ ఆస్పత్రి గదులన్నీ తిరిగారు. ఆయనకు తోడుగా నేను తిరిగాను. అట్టా తిరిగేప్పుడు నిన్న "యింత చిన్న బోధకుడా" అన్న పెద్దాయన దగ్గరకు రాగానే ఆ పెద్దాయన "మీరు ఫ్రాన్సిస్ కదూ" అని అన్న మాటే రెండు మూడు సార్లు అన్నాడు "అవును" అంటూ ఫ్రాన్సిస్ అతన్ని గుర్తు తెచ్చుకొనే ప్రయత్నంలో పడ్డాడు. గుర్తువచ్చినట్టుంది. 'యాకోబు' అనే మాట ఫ్రాన్సిస్ నోటి గుండా పూర్తిగా రాకముందు ఆ పెద్దాయన 'అవును' అనే మాట పదే పదే అంటూ మంచం దిగాడు. ఆ యిద్దరూ గది బయటకొచ్చారు. నాకోసం ఫ్రాన్సిస్ వెనక్కి చూడలేదు. యిద్దరూ ఆశ్రమం వరండాలో కూర్చొన్నారు. ఏం మాట్లాడుకొంటున్నారో తెలీదు. నేను నా పనిలో వుండి పొయ్యాను. పని పూర్తయ్యాక నా గదికి వెళ్తుంటే ఫ్రాన్సిస్ రమ్మన్నారనే కబురు అందింది. ఆయన దగ్గరకెళ్ళాను. ఆ పెద్దాయన అక్కడేవున్నాడు. వాళ్ళ ముందు పాత రిజిస్టర్ల కట్టవుంది. ఒక రిజిస్టర్ తెరచివుంది. ఆ పెద్దాయన నాకేసి అట్టాగే చూస్తున్నాడు.

"రూబేను నీ పేరే కదూ" ఫ్రాన్సిస్ అన్నారు. అవునన్నాను. రిజిస్టర్ కేసి మళ్ళీ చూశాడు. "డిశంబరు 24, క్రిస్మస్ వేడుక జరుగుతున్న రాత్రి 11-45 నిముషాలు" తనలో తానే అనుకొన్నట్టు చదువుతున్నాడు".

"అవును..." ఆ మాట పదేపదే అంటూ ఆ పెద్దాయన నన్ను వాటేసుకొన్నాడు. అట్టా చేస్తూ 'సీమోను' అనే మాట పదేపదే అన్నాడు ఒక్క అద్భుతం తెలిసొచ్చింది. ఈ పెద్దాయన యాకోబు. ఈయనే నన్నిక్కడ చేర్చాడు. నా తండ్రి పేరు సీమోను. తల్లి శశిరేఖ.

- 1920 నవంబర్ 19

యాకోబు నుండి మరిన్ని వివరాలు సేకరించాను. క్రిస్మస్ రోజు వలసపాడు నుండి మా నాన్న నన్ను యాకోబు ఊరికి తీసుకొచ్చాడు. మనిషి రక్తసిక్తంగా వున్నాడు. నన్ను యాకోబు చేతిలో వుంచాడు. మార్టిన్ పేరు కలవరిస్తూ మళ్ళీ వలసపాడే వెళ్ళాడు. యాకోబు మార్టిన్ అనే ఉపాధ్యాయ బోధకుడి వివరాలు చెప్పాడు నాన్న మార్టిన్‌ని అగ్ర కులాల పెద్దలు ఎలా చంపింది యాకోబుకు చెప్పాడు. ఓ దారుణ దృశ్యం కళ్ళముందు కదలాడింది. ఆ తర్వాత యాకోబు వలసపాడు వెళ్ళాడు. వలసపాడు బూడిదైవుంది వలసపాడులో స్థిరపడ్డ వలస కూలీల వివరాలు యాకోబుకు పెద్దగా తెలీవు. నాన్న ఏ వూరు నుంచి వలస వచ్చింది సరిగ్గా తెలీదన్నాడు. మార్టిన్‌తోనే నాన్న పరిచయం. కనిగిరి, దర్శి, మార్కాపురం, దొనకొండ, ఒంగోలు చుట్టుపట్ల ప్రాంతాల నుండి అప్పుడు వలసలు వచ్చారని చెప్పాడు. నెల్లూరు ప్రాంతం కూడా వలసల్లో వుందన్నాడు. మనసు నిండా తెలీని ఆరాటం. ఏదో తెలుసుకొవాలి. నన్ను నేను గుర్తించుకోవాలి.

- 1920 నవంబర్ 25

మార్కాపురంలో నాకు దొరకాల్సిన సమాధానం దొరకలేదు. అప్పటి వలస కూలీల్లో కొందరు వలసపాడులోనే వుండిపొయ్యారు. అట్టా వుండిపొయినవాళ్ళు తిరిగి మళ్ళీ యిక్కడకు రాలేదు. వలసపాడులో వుండకుండా అక్కడ నుంచి వచ్చిన వాళ్ళు బతుకుతెరువు వెతుక్కొంటూ నైజాం వెళ్ళారు. కనిగిరిలో కూడా అంతే. కాకపోతే కనిగిరి వాళ్ళు పట్నం వెళ్ళారు. అక్కడ కక్కస్ దొడ్లు శుభ్రం చేసే పనిలో చేరిపొయ్యారు.

- 1920 నవంబర్ 27

దొనకొండ అనుమానంగానే వెళ్ళాను. కాని ఎంత అనుమానంగా వెళ్ళానో అంత అమూల్యమైన నిజం దొరికింది. మా అమ్మ, నాన్న ఎన్నెలదిన్ని నుండి వలస వచ్చిన కూలీలు. అమ్మ నాన్న, మార్టిన్ శారమ్మల యింట్లో వున్నారు. శారమ్మ అమ్మని కూతురులా చూసింది. నన్ను తన వొళ్ళో పెంచింది. నాన్న అసలు పేరు శివయ్య. ఆ క్రిస్మస్ రోజు ఆ వూరి నుండి ప్రాణాలు బిగపట్టుకొని తప్పించుకొని వచ్చిన ఎంకటేసు ఆ మారణకాండ కళ్ళముందువుంచాడు. అమ్మ, శారమ్మ మార్టిన్ పదేపదే గుర్తొస్తున్నారు. నాన్న ఏమైందీ తెలీదు. నన్ను తీసుకొని పిచ్చిపట్టిన వాడిలా పరిగెత్తడం మాత్రం ఎంకటేసు చూశాడు. అక్కడే మరో పెద్దాయన కలిశాడు. పేరు జింకోడన్నాడు. చాలా చెప్పాడు.

- 1920 డిసెంబరు 1

ఎన్నెలదిన్ని. అప్పుడు ఎలావుండేదొ తెలీదు. యిప్పుడు నాన్న తాలూకూ ఎవరున్నారో

తెలీదు. నేనే ఫలానా అంటే దగ్గరకు తీసుకొనే వాళ్ళు వుంటే బాగుండు. అన్నీ సందేహాలే. సందేహాలతోనే ఎన్నెలదిన్నిలో అడుగుపెట్టాను. కరువుకు బాగా దెబ్బ తిన్న పల్లెల్లో ఎన్నెలదిన్ని ఒకటని తెలుసుకొన్న తర్వాత నా సందేహాలు మరీ ఎక్కువయ్యాయి. కాని నా సందేహాలను పక్కకు నెడుతూ ఆ పల్లెలో వాళ్ళు మొదట వింతగా ఆ తర్వాత ఆత్మీయంగా చూశారు. నాన్న పేరు కన్నా, అమ్మ పేరు కన్నా అక్కడ తాత పేరు, నానమ్మ పేర్లే ఎక్కువగా విన్పించాయి. ఎల్లన్న, సుభద్రల మనవడు అని అంతా అనుకోవడం వింతగా అన్పించింది. ఇదీ మీ నాన్న, తాత వున్న యిల్లు అని చూపారు. అక్కడ మొండి గోడలు మిగిలి వున్నాయి. ఆ మొండి గోడల పక్కనే నాన్న తాతని, నానమ్మని పూడ్చాడని చెప్పారు. అక్కడ తాడిచెట్టు మాత్రం మొలిచివుంది. నాన్నకు దగ్గర బంధువు నన్ను వెళ్ళనివ్వలేదు. రాత్రి ఆ యింట్లోనే వున్నాను. పల్లె కట్టకట్టుకుని వకచోట కూర్చొన్నట్టు జాము పొద్దుదాకా ఆ యింటి ముందే చాలామంది కూర్చొన్నారు. మా వాళ్ళని గూర్చి చెప్పటం, చెప్పుకోవటం మొదలెట్టారు. అప్పుడు తెలిసింది. మా తాత ఎల్లన్న పాటలు అల్లేవాడని, పాడేవాడని. ఆయనకు ఉరుముల నృత్యం వచ్చు. వీధి భాగోతం తెలుసు. ఆయన పాటల్లో మా నానమ్మ సుభద్ర దాగి వుంది. అప్పుడని పించింది. నేను యింతకాలం ఓ గొప్ప వారసత్వానికి దూరంగా వున్నానని. కన్నీళ్ళు ఆగలేదు.

- 1920 డిసెండరు 2

తాత పాటలు విన్నాను. ఆయన జీవితం కథలు కథలుగా చెప్పారు. నానమ్మను చెబుతుంటే ఆశ్చర్యమని పించింది. అంతేకాదు నా వాళ్ళు పుట్టిన ఎన్నెలదిన్నికి ఎంతో గొప్ప చరిత్ర వుందని పించింది.

- 1920 డిసెంబర్ 3

మాలాడిదిబ్బ చూశాను. మాతయ్యను, నారిగాడ్ని, నాగన్నని తెలుసు కొన్నాను. మాలాడిదిబ్బ చరిత్రంతా తాత పాటగా రాశాడని విన్నాను. అదో వీరగాథ. రాత్రంతా గానం చేస్తారు. పూర్తిగా పాడగలవాళ్ళు దొరకలేదు. కాని మాలాడి దిబ్బ వీరగాథ తప్పనిసరిగా వినాలి. నన్ను నేను తెలుసుకొంటూ మొదలైన నా ప్రయాణం ఎన్నెల దిన్ని గుండెలోతుల్లోకి చొచ్చుకపోయింది. నిజంగా నా అన్వేషణ యిప్పుడే మొదలైంది.

1920 చివ్వరలో మొదలైన అతని అన్వేషణ 1924 డిశంబర్ దాకా సాగింది. ఆ నాలుగు సంవత్సరాల డైరీల్లో అతను చేసిన నిరంతర అన్వేషణ అంతా రాశాడు. చాలాదూరం తిరిగాడు. చాలామందిని కలిశాడు. అనుకొంటే ఆశ్చర్యమేస్తుంది. 1924 చివ్వరి రోజుల్లో మాలాడిదిబ్బ వీరగాథ పూర్తిగా పాడగలిగే వ్యక్తి హనుమకొండలో వున్నాడని తెలిసింది. తాతపాట కోసం హనుమకొండ వెళ్లాడు.

అక్కడ జీవితం అనుకొని మలుపే తిరిగింది. తాత రాసిన వీరగాథ వినటమే కాదు, తన తోడు రూతును కూడా అక్కడే పొందగలిగాడు. రూతు ఫ్రాన్సిస్ కూతురు. పాటకోసం ఫ్రాన్సిస్ యింటికే వెళ్లాడు. పాటంతా ఆ యింట్లోనే సాంబయ్య పాడితే విన్నాడు. సాంబయ్య

నాన్న ఎల్లన్నతో తిరిగాడు. ఎల్లన్నలాగే పాడుతాడు, ఆడుతాడు అనే పేరు సాంబయ్య నాన్నా దిబ్బయ్యకుంది. సాంబయ్య ఆ పాటవాళ్ల నాన్న దగ్గరే నేర్చుకొన్నాడు. మా తాతను చూశావా అని సాంబయ్యని రూబేను అడిగాడు. చూడలేదనకుండా వుంటే బాగుండేదనుకొన్నాడు. చూస్తే ఆయన్ని గూర్చి యింకేమన్నా చెబుతాడోమోనని అనుకొన్నాడు. కాని సాంబయ్య ఎల్లన్నని చూడలేదు. అయినా రూబేనుకు నిరాశ అన్పించలేదు. తన అన్వేషణ పూర్తయింది. తన జీవితం తన కళ్లముందుకు వచ్చింది. యిప్పుడు తాను ఎవరనేది తెలిసింది. ఈ రోజు తనకు వో గుర్తింపు వుంది. తాను ఎన్నెలదిన్ని కాపురస్తుడు ఎల్లన్న కుమారుడు శివయ్య కొడుకు.

తన తల్లి శశిరేఖ, నానమ్మ సుభద్ర. వాళ్ల వెనకాత గొప్ప జీవితం వుంది. గంగలా ఉబికిన కన్నీళ్లు వున్నాయి. వెన్నెల్లా కురిసిన ఆనందాలు వున్నాయి. అంతేకాదు. ఆకలి వుంది. అంతటితో ఆగలేదు. అంటారానితనం వుంది. రూబేను అని అనుకొంటే అంతగతముంది. ఆ గతం నవ్విస్తుంది. ఆ గతం ఏడ్పిస్తుంది ఆ గతం అనేక ప్రశ్నల్ని ముందు వుంచింది. అనేక జవాబుల్ని తనకోసం రాసి వుంచింది. యిప్పుడు తాను వేసే ప్రతి అడుగులో ఆ నవ్వు వుంటుంది. ఆ ఏడ్పు వుంటుంది. ఆ ప్రశ్నలు, ఆ జవాబులు ఒక దాని వెంట ఒకటి. ఎప్పుడూ అట్టాగే వుంటుంటుంది లాగుంది జీవితం. నిన్న, నేడు, రేపు అచ్చు అట్టాగే నవ్వుల్తో, ఏడ్పుల్తో, ప్రశ్నల్తో, జవాబుల్తో ...

మీ తాత పాట బాగా రాశాడని అన్నాడు ఫ్రాన్సిస్. రాయలేదు అల్లాడు అని అన్నాడు రూబేను. రాయటానికి అల్లటానికి వున్న తేడా వూహించింది రూతు. రాయటం కన్నా అల్లటం గొప్పనుకొంది. తాను కథలు రాస్తుంది. తన అమ్మమ్మ కథలు అల్లుతుంది. తాను గొప్పా, అమ్మమ్మ గొప్పా. ఎవర్నోకొర్ని ఈ సందేహం అడగాలనుకొంది. అమ్మమ్మని అడిగితే రాతగాళ్ళే గొప్ప అంటుంది. రాత ఆమెకు రానిది. రాసే వాళ్ళంతా గొప్ప వాళ్ళని ఆమె అనుకొంటుంది. కాని ఎల్లన్న పాట విన్నాక, తనకి అమ్మమ్మ కథ మరోసారి గుర్తొచ్చింది. అల్లటమే గొప్ప. అట్టా అలవొకగా ఏమీ జరగనట్టు. గుండెలకు హత్తుకొనేలా చెప్పుకపోవటం చిన్న మాటకాదు. అట్టా ఆలోచిస్తూ కూర్చొంది రూతు.

ఫ్రాన్సిస్ భార్య మరియకు మాత్రం యివన్నీ పట్టలేదు. రూబేనును చూశాక రూతును అతని ప్రక్కన పెట్టి ఆలోచించటం మొదలెట్టింది. ఆమాట మొదట తన అమ్మతో అంది. అమ్మ కాదనలేకపోయింది. కుర్రాడు బాగున్నాడు. వెనకా ముందూ లేరు. రూతుకు ఈడూ జోడు. కదిపి చూడే పిల్లా అంది. మరియకు ఎక్కడ లేని ధైర్యం వచ్చింది.ఫ్రాన్సిస్‌తో అంది. ఫ్రాన్సిస్ మరియ కేసి చూశాడు. అత్తని పిలిచాడు. నీ కూతురు మాట విన్నావా అన్నాడు. విన్నానంది. కూతురు యిష్టమే తన యిష్టమంది.

ఆ సాయంత్రం క్రిస్‌మస్ దాకా వుండరాదటోయ్ అన్నాడు రూబేనుతో ఫ్రాన్సిస్. రూబేనుకు ఆ అవకాశంలేదు. వెళ్ళాల్సి వుంది. అదే మాట అన్నాడు. ఫ్రాన్సిస్ అసలు మాట అడగాలనే అనుకొన్నాడు. కాని ఎందుకో ఆగాడు. ఓ మాట రూతుతో అంటే బాగుంటుందను

కొన్నాడు. చదువు కొన్న పిల్ల. యిష్టా యిష్టాలు వుండకుండా వుంటాయా. పైగా కథలూ రాస్తుంది. అందుకే ఆ క్షణంలో అడగలేకపోయాడు.

రాత్రి అన్నాలు అయ్యాక అడిగావా అంది మరియ. అడగలేదన్నాడు ఫ్రాన్సిస్ ఆరు బయట అమ్మమ్మ పక్కలో పడుకొని ఓ కథ అల్లవే అమ్మమ్మా అంది రూతు. అల్లుతా గాని అడిగిందానికి అట్టా యిట్టా అనకుండా జవాబు చెబుతావా అంది అమ్మమ్మ. అడుగు అంది రూతు. మీ అమ్మ రూబేను అల్లుడైతే బాగుంటుందని నాతో అందని చెప్పింది పడుకొన్నదల్లా ఎగిరిపడి కూర్చొంది. కూర్చొన్నదల్లా అమ్మమ్మ బుగ్గల్ని అటూ యిటూ లాగింది. అట్టాంటి మాటలు మాటాడితే గుంట తొవ్వి గుంటలో పెడ్తానంది. గుంటపైన చెట్టు నాటుతానంది. చెట్టు పెద్ద కాయకాస్తే ఆ కాయని నాలుగు భాగాలు చేసి తూర్పుకో భాగం, ఉత్తరానికో భాగం, పశ్చిమానికో భాగం, దక్షిణానికో భాగం వేస్తానంది. అదంతా అమ్మమ్మ కథలో అల్లిన మాటలే. ఆ చెట్టూ, ఆ కాయ అమ్మమ్మవే. యిష్టంగా విన్న అల్లికే. అదంతా తిట్టులా, కోపంలా మాటాడుతోంది. అమ్మమ్మ పుస్తకాలు చదివింది కాదు. జీవితం చదివింది. తెల్లారి ఫ్రాన్సిస్‌తో దానికి యిష్టమే అనే మాట చెప్పింది.

నిజానికి రూతుకు యిష్టా యిష్టాలు లేవు. నాన్న ఫలానా అంటే కాదనే దంటూ లేదు కథలు రాస్తుంది. అమ్మమ్మ కథలే. అవంటే తన కిష్టం. కాకపోతే ఈ మధ్యనే చెడుగా తిరిగి మారిన మనుషుల్ని రాస్తోంది. ఒకడు తాగుబోతు చివరకు క్రీస్తును నమ్ముతాడు. మరో కథలో యింకోడు జూదరి వాడు జూదంలో సర్వం పోగొట్టుకొంటాడు. చివ్వరకు ఓ పాస్టర్ అతన్ని దగ్గరకు తీస్తాడు. మారిపోతాడు. కథలన్నీ అట్టాగే సాగేవి. కాకపోతే ఇంగ్లీష్ బాగా వచ్చు. ఆ నవలలు బాగానే చదివింది. కొంతకాలం మద్రాసులో చదివింది. ఎంత చదివినా, ఎక్కడ తిరిగినా అమ్మమ్మ పక్కలో పడుకుని గండా బేరండ పక్షులు చెప్పుకునే కథలు వినటానికి యిష్టపడుతుంది. కాని రాత్రి మాలాడిదిబ్బ వీరగాథ విన్నప్పుడు తను చూడని ప్రపంచం చాలా వుందనుకొంది. తాను యిప్పటికీ ఆ భాష చదవలేదు. ఎల్లన్న వాడిన భాష పుస్తకాల్లో లేదు. తాను పుట్టటమే చదువుకొన్న యింట్లో పుట్టింది. ఆ పాట మళ్ళీ మళ్ళీ వినాలనుకొంది. అట్టా ఆలోచించిందేకాని రూబెన్‌ను అతనొచ్చినప్పటి నుండి ప్రత్యేకంగా చూడలేదు. కాకపోతే అమ్మమ్మ ఆ మాట అన్నప్పుడు చూడాలనుకొంది. చూసింది. బాగున్నాడనుకొంది. నాన్న యిష్టపడ్డట్టుంది. అమ్మ ఆ మాట ఎత్తినట్టుంది. అమ్మమ్మకు కూడా యిష్టమే. తనక్కావాల్సిన వాళ్ళు ఆ ముగ్గురే. అందులో ఏ ఒక్కరికి నచ్చినా తనకు నచ్చుతుంది. ముగ్గురూ నచ్చాక తనకు నచ్చకుండా వుండేదిలేదు.

అనాల్సిన మాట రూబేనుతో అనేశాడు ఫ్రాన్సిస్. నేను అడిగేశాను. నీ మాట ఏమిటనట్టు చూశాడు. అతనెప్పుడూ అంతే అడగాల్సింది అడిగేసి వూరుకొంటాడు. చెప్పాల్సింది అవతలి మనిషి కాబట్టి ఏ అదుర్దా లేకుండా వినటానికి సిద్ధపడతాడు. ఈ అలవాటు ఈరోజుది కాదు. పెళ్ళికాక ముందు నుంచీ వుంది. ఆ అలవాటే రూబేనును మూడేళ్ళ బిడ్డగా యాకోబు

అనాధాశ్రమానికి తీసుకొని వచ్చినప్పుడు ఎవరు చేర్చిందీ రాయాలా అయితే నా పేరు రాసుకోండి, నా పేరు యాకోబు అని యాకోబు అన్నప్పుడు బిడ్డ చేరటం ముఖ్యం. ఎవరు చేర్చారని కాదు అని తేలిగ్గా కొట్టేశాడు. యిప్పుడూ అదే చేశాడు. నువ్వేది చెబుతావో చెప్పు అన్నట్టు వుండిపోయాడు. రూబేనుకు ఏది చెప్పాలో అర్థం కాలేదు. ఎట్టా చెప్పాలో తెలియలేదు.

"మీకు ఇష్టమేనా" ఆ మాట మాత్రం అన్నాడు. ఆ మాటకి ఫ్రాన్సిస్ అయోమయంగా చూశాడు అడిగిందానికి చెప్పకుండా ఏమిటా ప్రశ్న అని అన్నట్టు చూశాడు. మరియ చూసింది. ఫ్రాన్సిస్ ఏదేదో మాట్లాడి బిడ్డని బెదరకొడ్తాడనుకొంది. రంగంలో కొచ్చింది. చెప్పింది. రూతుతో సహా అందరికీ యిష్టమంది. నీకూ యిష్టమైతే పెళ్ళి జరిపిస్తామంది. ఉన్నది ఒక్కగానొక్క కూతురంది. మీరు వుండదల్చుకొంటే హనుమకొండలో వుండొచ్చు కాదంటే ఒంగోలులో వుండొచ్చు అంతా మీ యిష్టమంది. యిక్కడైతే మీ యిద్దరితో మేమ్ముగ్గురం వుంటాం, అక్కడైతే మీతో మా అమ్మ వుంటుంది. మరియ మాట్లాడుతుంటే ఫ్రాన్సిస్ ప్రశాంతంగా కూర్చొన్నాడు. తాను మాట్లాడాల్సింది యింకొకరు మాట్లాడుతుంటే ఆ జీవికి అంతకన్నా ఆనందం మరొకటి వుండదు అతన్లో వుండే ఆ ప్రత్యేక గుణం పెళ్ళయిన కొత్తలోనే తెలుసుకొంది మరియ. అందుకే చెప్పాలనుకొన్నదంతా చెప్పేస్తుంది. "డబ్బుకు కొదవలేదు. దేవుడు బాగానే ఆశీర్వదించాడు. మా అల్లుడి వయ్యాక నీకు నా అనే వాళ్ళు లేరనుకోలేవు. అది మనస్ఫూర్తిగా చెప్పగలను. టీచర్‌గా నాకొచ్చేది నాకొస్తుంది. ఆయన రిటైర్ అయ్యారు. నేనూ యింకో అయిదేళ్ళలో రిటైరవుతాను. పిల్ల ఆలస్యంగానే పుట్టింది. ఒక్క దాన్నే కదా ఎప్పుడు పుడ్తే ఏం పోయిందనుకొందేమో. నిదానంగా పుట్టింది" ఆ మాట మరియ అన్నప్పుడు రూబేనుకు నవ్వు ఆగలేదు. పైకే నవ్వాడు. పొరపోయింది 'మంచినీళ్ళు' అంటూ మరియ కేకపెట్టింది. మంచినీళ్ళ గ్లాసుతో రూతు అక్కడకొచ్చింది. గ్లాసు అక్కడ పెట్టి వెళ్ళిపోయింది. నీళ్ళు తాగి రూబేను ఆ యిద్దరి కేసి చూశాడు. ఆ రాత్రి రూబేనుకు తన తండ్రి గుర్తొచ్చాడు. ఆయన ఏమైంది తెలీదు. బతికున్నాడో, చనిపొయ్యాడో తెలీదు. జీవితాంతం అదో జవాబు దొరకని ప్రశ్నగానే వుండిపోతుంది.

చర్చిలో పెళ్ళి గొప్పగానే జరిపాడు ఫ్రాన్సిస్. పెళ్ళికి ముందు ఎన్నోలదిన్ని వెళ్ళాడు రూబేను. తన వాళ్ళని రమ్మన్నాడు. తన అమ్మ వూరు వెళ్ళాడు. వాళ్ళనీ రమ్మన్నాడు. అంతా వచ్చారు. వాళ్ళకి పెళ్ళి వింతగా అన్పించింది. చర్చిలో కూర్చోవడమే వాళ్ళకి కొత్తగా వుంది. ఫాస్టర్ చేసే పెళ్ళి అర్థం కానట్టు వుండిపోయింది. అయినా వాళ్ళకు రూబేనును చూస్తుంటే ఆనందంగా వుంది. భోజనాల దగ్గర వాళ్ళతో కలిసి తినాలనుకొన్నాడు రూబేను. వాళ్ళ మధ్యలోకి వెళ్ళి కూర్చోవాలనుకొని వాళ్ళ దగ్గరకు వెళ్ళి చూస్తే ఆశ్చర్యమనిపించింది. వాళ్ళ మధ్య రూతు కూర్చొనివుంది. వాళ్ళలో వక మనిషిగా కలిసిపోయి నవ్వుతోంది. తన దగ్గర తీసుకోని చొరవ వాళ్ళు ఆమె దగ్గర తీసుకొంటు న్నారు. వాళ్ళ దగ్గర కెళ్ళాడు. నవ్వులు ఆపి అతని కేసి చూశారు. వింతని పించింది. తన కన్నా రూతే వాళ్ళకి దగ్గరలా అన్పిస్తోంది. 'కానీండి' అంటూ వచ్చేశాడు. గుండెల నిండా ఆనందం. చాలు ఈ జీవితానికి ఈ రూతు అనుకొన్నాడు.

# 15

నిజమే.

రూతు అన్నట్టు రూబేను ఆమె జీవితంలోకి నిశ్శబ్దంగానే వచ్చాడు. అంతే నిశ్శబ్దంగా వెళ్ళాడు. ఆమే అన్నట్టు వెళ్ళినవాడు వుట్టినే వెళ్ళలేదు. ఇదిగో ఈ జ్ఞాపకం యిది నీ గుండెల్లో దాచుకోమని వెళ్ళాడు.

ఎట్టాంటి జ్ఞాపకం అది ....

ఓ దృశ్యం.

చంద్రుణ్ణి వెన్నెల్ని చూసే చిత్రకారుడి హృదయం లాంటి జ్ఞాపకం. ఎట్టా వుంటుంది అట్టా చంద్రుణ్ణి వెన్నెల్ని మాత్రమే చూసే హృదయం. మంచుకొండల్లో అతుక్కుపోయిన వర్ణచిత్రాల్ని అడగమంటుంది రూతు.

వర్ణాలు. దృశ్యం నిండా. ఉష్ణవర్ణాలు. శీతల వర్ణాలు. ఒకదానితో ఒకటి కలిసిపోతో వెన్నెల్ని చంద్రుణ్ణి, కరిగి పారే మంచు నీటిని, సూర్యుణ్ణి చూపగలిగే వర్ణాల సంగమం. ప్రతి మలుపులో ఎంత చిక్కగా అల్లుకపొయ్యాయి. చెరిపేసినా చెరగని నవ్వు. తడి ఆరని ఏడుపు.

ఓ జీవిత దృశ్యం

ఓ అంటరాని వసంతం.

నిజమే. రూబేను వసంతాన్నే చెప్పాడు. వెన్నెల వాననే చెప్పాడు. సెలఏటి కదలికనే చెప్పాడు. అందుకు సాక్ష్యం ఎన్నెల పిట్ట.

ఎన్నెలపిట్టని తాను చూసిందా ? చూడలా. పెళ్ళయ్యాక అతన్తో నడిచిన ఏటి గట్టు వెన్నెలదారిలో అక్కడ ఎన్నెలపిట్ట రొద విన్నది. దాని దూకుడు అనుభవించింది. అదిగో ఎన్నెలపిట్ట అనేంతలో చాలాదూరం వెళ్ళిపోయింది.

ఎల్లన్నకి తెలిసినట్టు ఎన్నెలదిన్ని ఎంతమందికి తెలుస్తుంది. అట్టా చూడటానికి ఎంతమందికి ఎల్లన్నలయ్యే సత్తావుంటుంది. చుక్కల ముగ్గు కట్ర ఊహ చిత్రాన్ని ఎన్నిసార్లు మనసులో గీసుకొంది రూతు. అయినా సుభద్ర రూపం కళ్ళముందు బొమ్మ కట్టించుకోగలిగిందా. లేదు. అట్టా దాచేసుకొని వెళ్ళాడు ఎల్లన్న. జానపదానికి అంత మగతనముంది. అంత ఆడతనముంది. అట్టా అట్టా వళ్ళంతా తాకుతో పలవరించే సౌందర్యం వుంది. అందుకే అది జానపదమైంది. అందం, అభినయం, అల్లిక జానపదానికి ఎంతో సహజంగా అతుక్కుపోయిన ఆభరణాలు.

అట్టా వెతుక్కొంటూ వెళ్తోంది రూతు తన జ్ఞాపకాల్లోకి. తన జ్ఞాపకాల గుడారంలోకి. అంతా వో వినూత్న శోభ. అంతా వో విషవలయం. జ్ఞాపకమంతా తడిసిన కన్నీళ్ళు, కసి, కోపం. ఉన్నట్టుండి బ్రద్దలయ్యే అగ్నిపర్వతం. ప్రవహించేలావా. ఓ ఊరటకావాలి తన ముసలిగొంతు మంట ఆర్పేందుకు ఇన్ని చల్లటి నీళ్ళు కావాలి ఎవరిస్తారు

రూబేను లేడు.

యిమ్మానుయేలు లేడు

జెస్సీ రాడు

ఉన్నదల్లా మేరీసువార్త. తన కోడలు. దగ్గరున్న ఒకే వక్కతోడు. అట్టాగే చూస్తుంది. తన లోతు కళ్ళల్లోకి, తన పగిలిన గుండెలోకి, మడతలు పడ్డ శరీరంలోకి. ఓ దార్చే ప్రయత్నం. ఎవర్ని ఎవరు ఓదార్చాలి. తనని తన కోడలా. తన కోడల్ని తానా. ఎవర్ని ఎవరు. అట్టా ఈది యిట్టా వడ్డున కూర్చొంటే వరదకింతని కోసుకొంటూ వెళ్తోంది వొడ్డు ప్రవాహం దాన్ని ఎప్పుడు మింగేస్తుందో తెలీదు.

పైకి చూస్తే ఒంటరి చుక్క.

కిందికి చూస్తే మిషన్‌కాంపౌండ్ శిధిలాలు. ఆ శిధిలాల మధ్య పడకుండా వుండటానికి నిరంతరం శ్రమిస్తున్న సగం విరిగి నిలబడ్డ సిలువ మోసే క్రీస్తు తైలవర్ణ చిత్రం గోడ. ఆ మధ్య వీచిన తుపాను గాలికి అదిపడిపోతుందనుకొంది. కాని అదిపడిపోలేదు. తనతో పోటీపడుతోంది. ఈ సహస్రాబ్ది ముందు వెళ్తుందో, తాను ముందు వెళ్తుందో తెలీదు. ఈ వర్ణచిత్రం గోడ మాత్రం తన తర్వాతే పడిపొయ్యేలా వుంది. కేవలం తన కోసమే అట్టా మిగిలివుంది.

ఎల్లన్న అత్తవడిలో పడుకొని కధలు విన్నాడు. తాను అమ్మమ్మ ఒడిలో పడుకొని కధలు వింది. కధల మీద యిష్టం అట్టా పుట్టింది. రాయాలనే ఆలోచన అట్టావొచ్చింది. రాసింది. బోలెడు నీతికధలు రాసింది. కధలంటే అంతే అనుకొంది. కాని ఆరోజు ఎల్లన్న మాలాడి దిబ్బ వీరగాధ విన్నాక తన ఆలోచనల్లోనే పెద్దమార్పు వచ్చింది. కధల్లో పోగొట్టుకొన్న జీవితం బయట చాలా సహజంగా వుంది. సూటిగా వుంది. దాని పద్ధతి వేరు. అది మాట్లాడే మాటలు వేరు. ఆ మాటలు చాలా నిజాయితీగా వున్నాయి. చాలా మామూలుగా వున్నాయి. నిజాయితీ అంత మామూలుగా వుండటం అబ్బురమే అన్పించింది. రూబేను చెప్పాడు. ఆ నిజాయితీని, ఆ మామూలు తనాన్ని, ఆ సూటి దనాన్ని చెప్పాడు. తన పూర్వీకుల్ని చెబుతూ జీవితాన్ని ముందుంచాడు. నిజంగా అన్పిస్తుంది. రూబేనులో బోధకుడికన్నా తిరుగుబాటుదారుడే ఎక్కువ. బహుశా తన పూర్వీకుల జీవిత లోతులు అతన్ని అట్టా మార్చి వుండొచ్చు. తనని తాను తెలుసుకోవటానికి తాను గొప్ప శ్రమ పడ్డాడు. జీవితాన్ని చదివాడు. సమాజాన్ని చదివాడు. సాహిత్యాన్ని, కళని చదివాడు. అంతా రూతు జ్ఞాపకాల్లో దాచాడు.

రూతు పెళ్ళయ్యాకే నర్సు ట్రైనింగ్ చేసింది. మిషన్ ఆస్పత్రిలోనే నర్సుగా చేరింది. రూబేను మిషన్ ఆస్పత్రి బోధకుడుగా, తాను నర్సుగా ఆ ప్రదేశంతో గొప్ప అనుబంధాన్నే

పెంచుకొన్నారు. ఈ రోజు ఈ శిథిలాల్లో ఆ అనుబంధాన్నే వెతుక్కొంటోంది రూతు వెతికి అలిసినట్టు రూబేను వెళ్ళాడు. వెతకటానికి మిగిలినట్టు తాను వుండిపోయింది.

హాస్పిటల్‌లో క్వార్టర్సు యిచ్చారు పెంకుటిల్లు. ఒకహాలు, రెండు గదులు అమ్మమ్మ వాళ్ళతో వుండిపోయింది. యింటి ముందు సంపంగి పూల కొమ్మ నాటాడు రూబేను. రెమ్మలు త్వరలోనే ప్రాణం పోసుకొన్నాయి. బతకటానికి, ఎదగటానికి, పూలు పూయడానికి అది అట్టే కాలాన్ని వృధా చేయలేదు. యింట్లో చేరిన కొత్తలో ఓ రోజు ఓ పావురం యింట్లోకి తొంగి చూసింది. బియ్యం నూక వాకిట్లోంచి హాలు మధ్యకు గీతలాపోసింది. అది నూక తింటూ హాల్లో కొచ్చింది. మరో రోజు తలుపు వేసి వుంటే కిటికీలోంచి తొంగిచూసింది. కిటికీ పక్క నూక పోస్తే నూక తిని హాలంతా తిరిగింది. మూడో రోజు నేరుగా హాలు మధ్యకే వచ్చింది. నూక ఎక్కడుందో వెతుక్కోవడం మొదలెట్టింది. యిల్లంతా వెతికింది. వెతికి పట్టుకొని తినటం మొదలెట్టింది ఆరోజు నుంచి అది యింట్లో సభ్యురాలై పోయింది. అది కన్పించకపోతే "మీ ఆడబిడ్డ ఎటెల్లింది రూతు" అని రూబేను అనేవాడు. నిజం అది అచ్చు అర్ధమొగుడు లాగే ప్రవర్తించేది. ఎంత బడాయి ఆడబిడ్డో అది.

ఓ సారి రూబేనుతో అంది రూతు ఎన్నెల దిన్నిలో పడిపోయిన గోడలు లేపుదామని ఓ యిల్లు కడదామని. ఎందుకట్టా అడిగిందో తనకు తెలీదు. కాని ఎన్నెలదిన్ని తన సొంతమనిపిస్తోంది. కనీసం ఎండల్లోనైనా అక్కడ గడపగలిగితే చాలనుకొంది. మొదట ఆశ్చర్యపడ్డాడు రూబేను. ఆ తర్వాత అట్టాగే చేద్దామన్నాడు. ఎండల్లో ఎన్నెలదిన్నిలో యిల్లు కట్టారు.

అక్కడే.

సుభద్ర జీవితం పెనవేసుకొన్న ఆ చోటులోనే.

ఎల్లన్న పిల్లాడుగా మేనత్తపై పాటలల్లిన చోటులోనే.

ఒకె వక్క తేగకోసం శివయ్య యిద్దరు మనుషులకు సరిపడ్డగుంట తవ్విన ఆ చోటులోనే.

యిల్లు కట్టారు. ఎప్పుడెప్పుడు ఎండలొస్తాయా అని ఎదురు చూసేది రూతు. ఎండా కాలమంతా అక్కడే గడిపేవాళ్ళు. ఎండల్లో పొన్నంగి పిట్టలు యింట్లో కొచ్చేవి. యింటి కప్పులో చోటు చూసుకొనేవి. ఓసారి ఎండల్లో ఏమనుకొందో, ఏద్దైందో తెలీదు. ఓ పొన్నంగి పిట్ట యిద్దరి మధ్యా వాలింది. రూతు పట్టుకొంది. రూతు చేతుల్లో వొదిగి వొదిగి కూర్చొంది. దాని అందం తీరే వేరు.

పల్లెలో పొన్నంగిపిట్ట. నిజంగా అది ఎంత అందమైంది. బతుకంత అందమైంది.

పట్టణంలో పావురాయి మాత్రం. చిన్నా చితకదా. అద్భుతమైంది. బతకటమంత అద్భుత మైంది. బతుకు, బతకటం. అందం, అద్భుతం.

ఆ అందం, ఆ అద్భుతం తనని వెతుక్కొంటూ వస్తాయనుకోలేదు. ఆస్పత్రిలో రోగుల మధ్య అలుపు తెలీదు. అలసట తెలీదు. వాళ్ళని ఎప్పుడూ తాకాలనిపిస్తుంది. గుండెల మీద

ధైర్యం పుయ్యా లనిపిస్తుంది. ఎన్నెలదిన్ని వస్తే అన్వేషణ. పదాల కోసం, దృశ్యాల కోసం. వెన్నెల వచ్చిందంటే చేల గట్టు మీద రూబేనుతో నడుస్తో ఎల్లన్న యిష్టపడ్డ బాతుల గుంపు బృందగానం వింటో- అప్పుడప్పుడూ రూబేను పాడే ఎల్లన్న పదాల్లో సుభద్రని వెతుక్కొంటో....

నిజంగా అన్పిస్తోంది. జీవితం పరిగెత్తుతున్నట్టే వుందని. అదో నిరంతర ప్రవాహమని.

ఆ ప్రవాహం కాలం తర్వాతి కాలాన్ని కలుపు కొంది. తరం తర్వాతి తరాన్ని తాకుతుంది. ప్రతి కాలం నిన్నలా వుండదు. ప్రతితరం ముందుతరంలా వుండదు.

కాని ఇక్కడో ప్రత్యేకత వుంది.

ఈ దేశం మాల, మాదిగల జీవితాల్లో ఆ ప్రత్యేకత మరీ ప్రత్యేకమైంది.

అంటరానితనం. అది ఎప్పుడూ ఒకేలావుంది. అన్ని కాలాల్లో వుంది. అన్నితరాలకూ వుంది. అది తాకకుండా, అది కలవకుండా వాళ్ళ జీవితంలేదు వంశం లేదు.

సిన సుబ్బడి తర్వాత ఎల్లన్న. ఎల్లన్న తర్వాత ఎర్రెంకడు. ఎర్రెంకడు తర్వాత ఎల్లన్న. ఎల్లన్న తర్వాత శివయ్య. శివయ్య తర్వాత రూబేను. రూబేను తర్వాత యిమ్మానుయేలు, యిమ్మానుయేలు తర్వాత జెస్సీ.

అట్టాగే

సిన సుబ్బి తర్వాత లచ్చిమి. లచ్చిమి తర్వాత లింగాలు. లింగాలు తర్వాత సుభద్ర. సుభద్ర తర్వాత శశిరేఖ. శశిరేఖ తర్వాత రూతు. రూతు తర్వాత మేరీ, మేరీ తర్వాత రూబీ.

తరం ఏదైనా కావచ్చు. జీవితం ఎవరిదైనా కావచ్చు. తాకకుండాపోలేదు. అంటరానితనం కాటెయ్యకుండాపోలేదు.

వంశం. సిన సుబ్బడికి ముందు ఎప్పుడు మొదలైందో తెలీదు. సిన సుబ్బి అత్త ఎట్టా వుండేదో తెలీదు. కాని వాళ్ళ జీవితం ఊరికి దూరంగా నిరంతరం పారిన ఓ ప్రవాహంలో మాత్రం ఈదు లాడింది. ఇది వాస్తవం. చరిత్ర యింకా వెనక్కి వెళ్ళినా ఈ వాస్తవాన్ని గుర్తించవచ్చు. ఆ వంశంలో తెలిసిన సినసుబ్బడు మొదలు రూబేను దాకా సిన సుబ్బి మొదలు రూతు దాకా ... మామూలు మనుషులు కావచ్చు. కవులు కావచ్చు. కళాకారులు కావచ్చు. మతం మారొచ్చు. కాస్తో కూస్తో మడి చెక్కకు ఆసామి కావచ్చు. కాని -

అంటరానితనం అది అతక్కుండా మాత్రం వుండదు.

రూతు అట్టా ఆలోచిస్తోంది. అట్టా ఆలోచిం చడం ఆమె తప్పు కాదు అట్టా ఆలోచించకూడదనే అనుకొంటుంది. కాని తప్పడంలేదు. జ్ఞాపకమంతా ఆ వాస్తవం చుట్టే తిరుగుతున్నప్పుడు అట్టాగే ఆలోచిస్తుంది. తాను పుట్టిన వంశం, మెట్టిన వంశం, మొత్తంగా తాను పుట్టి పెరిగిన కులం అంతా ఆ వాస్తవాన్నే ముందు వుంచుతోంది.

అందుకే తన రూబేనును "నా అందమైన అంటరాని వాడా" అని పదే పదే పిల్చేది. అట్టా అంటూ అతని వంటిని ముద్దులతో ముంచెత్తేది. రూతు అనే అమ్మాయి "ఓ పిచ్చిది. పదహారణాలపిచ్చిది" అంటూనవ్వేవాడు రూబేను. ఆ నవ్వు వినటం రూతుకు చాలా యిష్టంగా

వుండేది అందమైన నవ్వు ఎప్పుడూ అట్టాగే వుంటుంది. రూబేను నవ్వులాగా వుంటుంది. అట్టాకాకపోతే అది నవ్వేకాదు. ఆ మాటే రూబేనుతో అనేది.

"స్వార్ధం నీది"

"కావచ్చు ఈ నవ్వు నా బిడ్డకు రావాలను కొంటున్నాను చూడగలిగే అవకాశం వుంటే నా బిడ్డ బిడ్డకీ రావాలనుకొంటున్నాను. ఎన్నెలదిన్నిలో ముసలాళ్ళు చెప్పారు. నీ నవ్వు నీది కాదని, మీ తాతదని, ఎల్లన్నదని. క్రీస్తు దయామయుడు. ఆ నవ్వు చెరిగిపోనీడు"

అట్టా అన్పించేది. అట్టాగే అన్పించేది. పిచ్చి. అట్టా అనుకోవటం అంతా వో పిచ్చి భ్రమ. అయినా ఆ పిచ్చి ఎంత ఆనందాన్నిస్తుంది మనసులో పడ్డ ఆ ముద్రకు ప్రతి రూపమే కావచ్చు. యిమ్మానుయేలు ఆ నవ్వుతోనే పుట్టాడు. ఆ తర్వాత జెస్సీ మాత్రం. యిమ్మానుయేలు కొడుకు. రూతు రూబేనుల ముద్దుల మనవడు. అట్టాగే ఆ నవ్వు నవ్వుతూనే పుట్టాడు.

ఇమ్మానుయేలు .....

జెస్సీ ......

జ్ఞాపకాలు ......

అనుభవం తాలుకూ జ్ఞాపకాలు

ఎల్లన్న జ్ఞాపకాల్లా, సుభద్ర జ్ఞాపకాల్లా, విన్నవి కాదు. వింతగా అట్టా వుండేదా అని ఆశ్చర్యపడ్డవీ కాదు.

తన బిడ్డవి.

వాడి బిడ్డవి.

తన కళ్ళముందు కదలాడిన దృశ్యాలు. పేగుతెంచుకొని పుట్టిన జ్ఞాపకాలు

నువ్వు వట్టి మనిషివి కాదు. యిప్పుడు ఎన్నెలదిన్ని వెళ్ళొద్దన్నారు. కాని పట్టు పట్టింది. అట్టా చూసి యిట్టా వస్తానంది. రూబేను సరేనన్నాడు. అమ్మమ్మ తానూ వస్తానంది. వద్దంది. మొహం యింత చేసుకొంది. ఎందుకో గాని ఆ యింట్లో తానూ రూబేను తప్ప మరొకరు వుండకూడదనుకొంది. అట్టా అన్పిస్తుంది. అందుకే వద్దంది. తీరా రేపు బయల్దేరుతారనగా అమ్మ వచ్చింది. నాన్న నిన్ను తీసురమ్మన్నాడంది. గొడవ చేసింది. తొలి బిడ్డ పుట్టింట్లో పురుడు పోసుకోవటం ఆచారమంది. ఎన్నెలదిన్నే కళ్ళముందు నిలుస్తోంది. ఎల్లన్న అక్కడే పుట్టాడు. సుభద్ర అక్కడే పురుడు పోసుకొంది. రూబేను ఒక్కడే వలసల్లో పుట్టాడు. తన బిడ్డ అక్కడే పుట్టాలి. తన తాతలు పుట్టిన చోటే పుట్టాలి. ఎందు కట్టా అన్పిస్తోంది ? నీ వెర్రి అంది అమ్మ. కావచ్చు. అయినా ఈ బిడ్డ అక్కడే పుట్టాలి.

ఎన్నెలదిన్నిలో. ఆ రాత్రి అంతా నిద్రపోతున్నప్పుడు అప్పుడే వేగుచుక్క మబ్బులోంచి పొడుచుకొచ్చి యింత కళ్ళు చేసి భూమిని చూస్తున్నప్పుడు. ఈ భూమిని తాకాలని, యిన్ని మాసాలు గర్భంలో జాగ్రత్తగా తనని దాచుకొన్న తన తల్లి రూపం చూడాలని బిడ్డ ఆరాటం మొదలైనట్టుంది. నొప్పులు మొదలయ్యాయి. రూబేను కంగారుపడ్డాడు. లక్ష్మి పిన్నిని పిలవాలని

బయటకు వెళ్ళబోయాడు. అంత నొప్పిలోనూ రూబేను కంగారు చూసి రూతుకు నవ్వొచ్చింది. వద్దని సైగ చేసింది. రూబేను ఆగి చూశాడు.

"లక్ష్మి పిన్నిని పిలుస్తాను"

"కాస్త ఆగు. బిడ్డ ఆరాటం యిప్పుడే మొదలైంది."

రూబేను అయోమయంగా చూశాడు.

"యిట్టా కూర్చో"

రూబేను మంచం మీద కూర్చొన్నాడు. అతని ఒడిలో తలపెట్టి పడుకొంది.

"కొద్దిసేపు యిట్టాగే పడుకోని ఆ తర్వాత మీ పిన్నిని పిలువు"

రెండు నిమిషాలు అలసినట్టు అట్టా పడు కొందో లేదో విపరీతమైన నొప్పులు మొదలయ్యాయి.

"పిలువ్... మీ పిన్నిని పిలువ్"

రూతు బాధతో అంది. రూబేను కేకేస్తూనే వెళ్ళాడు. లక్ష్మి పరిగెత్తుకుంటూ వచ్చింది. అప్పటికే బిడ్డ ప్రయత్నం బిడ్డ చేస్తున్నాడు. వాడి ప్రయత్నం గట్టిదే. నింపాదిగా లక్ష్మి చేతుల్లోకి వచ్చి చేరాడు. బిడ్డ ఏడుపుతో బయటున్న రూబేను లోపలికొచ్చాడు. అలసినట్టున్న రూతు. అరిచిగోల చేస్తున్న బిడ్డ.

యిమ్మానుయేలు.

తియ్యటి జ్ఞాపకం.

యిమ్మానుయేలు తర్వాత రోజీ. కళ్ళముందే కాలం పరుగుతీసింది. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు.

రోజీకి పెళ్ళయి అత్తగారింటికి వెళ్ళింది. వందనం రెవెన్యూలో ఉద్యోగి. యిక్కడే వుండి పొమ్మన్నాడు రూబేను. తర్వాత అట్టాగే వస్తానన్నాడు.

యిమ్మానుయేలు టీచర్ ట్రైనింగ్ చేస్తానన్నాడు. చేయమన్నారు. పల్లెటూళ్ళో ఉద్యోగం వస్తే వెళ్తానన్నాడు. అట్టాగే అన్నారు. ఓ ఎండల్లో మేరిసువార్తంటే తనకిష్టమన్నాడు. మేరిసువార్త రూతు పెదనాన్న కొడుకు కూతురు. అంతకన్నా కావాల్సింది మరొకటి లేదన్నారు. యిమ్మానుయేలు యిష్టాన్ని వాళ్ళెప్పుడూ కాదనలేదు. పెళ్ళి మేరీసువార్తతోనే జరిపించారు.

పెళ్ళిరోజు ఓ అద్భుతం జరిగింది. రామానుజం వచ్చాడు. పెళ్ళిరోజు వచ్చాడు. ఊహించలేదు. అతను వస్తాడని వూహించలేదు. యిమ్మానుయేలు తో పనిచేసే వాళ్ళంతా పెళ్ళికొచ్చారు. ఆ వచ్చిన వాళ్ళలో రామానుజం వుంటాడనుకోలేదు. మాతో పాటు మా స్కూల్లో పన్జేస్తున్నాడని యిమ్మానుయేలు చెప్పాడు. ఎప్పటినుంచి చేస్తున్నాడు?

**రామానుజం!**

ఎన్నెలదిన్నిలో పరిచయమైన రామానుజం.

అవలపాడును పరిచయం చేసిన రామానుజం.... జ్ఞాపకాలు............

రూబేనైతే రామానుజం కేసి ఆశ్చర్యంగా చూశాడు. రామానుజం కూడా అంతే. యిమ్మానుయేలు మీ కొడుకా అని సంబరపడ్డాడు.

"చాలా ఏళ్ళయింది"

"అవును. చాలా ఏళ్ళు"

ఆ రాత్రంతా మాటలు. బోలెడు గతం ముందేసుకొని.

ఎన్నెలదిన్ని, హరిజనసేవా సంఘ కార్యకర్తలు

వెంకట్రాది ... లింగారెడ్డి ... ఎక్కడ మొదలవ్వాలి ఈ గతం. అప్పుడు విడిపోయిన వాడు ఇప్పుడు ఎట్టా కలిశాడు. అదీ యిమ్మానుయేలును కలుపుకొని రూబేనును వెతుక్కొంటూ ఎట్టా వచ్చాడు. రూబేను మిత్రుడుగా విడిపోయినవాడు, యిమ్మానుయేలుతో పని చేసేవాడుగా ఎట్టా మళ్ళీ కలిశాడు.

"ఎప్పుడు విడిపోయాం మనం"

రామానుజం వెతుకుతో .... విడిపోయిన రోజు కోసం చాలా వెనక్కి వెళ్ళి వెతుకుతో ....

గుర్తొస్తోంది. ఎట్టా వీలౌతుంది. మర్చిపోవటం ....

ఏదీ మర్చిపోలేము.

ప్రతిదీ వెన్నాడుతుంది.

రామానుజం ! యిమ్మానుయేలు !!

జ్ఞాపకం ... ఒకర్ని ఒకరు తోసుకుంటో, ముందు నిలుస్తో ...

ఎందుకోగాని యిమ్మానుయేలును అను కొంటే రామానుజం ముందు నిలుస్తాడు. నిజానికి అక్కడి నుంచే యిమ్మానుయేలును చూడాలని కొంటుంది రూతు.

రామానుజం ఎన్నెలదిన్నికి చదువు చెప్పటానికి మాత్రమే రాలేదు. బతకటానికే వచ్చాడు. చదువుకున్న వాడివి కాబట్టి పిల్లలకు చదువు చెప్పమన్నారు. మాలా, మాదిగ పల్లెల మధ్య ఓ పాకా వేశారు. అక్కడే ఆయన పిల్లలకు పాఠాలు చెప్పేవాడు. ఎన్నెలదిన్ని వెళ్ళిన కొత్తలో అతను రూబేనును కలిశాడు. వాళ్ళిద్దరూ చాలా విషయాలు మాట్లాడుకొనే వాళ్ళు. అప్పుడప్పుడూ రూతు వాళ్ళ మాటల్లో కలిసేది.

ఓసారి "గాంధీగారి 'హరిజన' పదం నీకేమనిపిస్తుంది" అని అడిగాడు రూబేను. కాసేపు మౌనంగా వుండిపొయ్యాడు రామానుజం. ఆ తర్వాత అన్నాడు. "మాలా, మాదిగ పదాల కన్నా ఎందులో గొప్ప ఆ పదం" అని మాత్రం అన్నాడు. అంతటితో ఆగలేదు. ఆ పదం తనకు బొత్తిగా నచ్చలేదన్నాడు. ఈ బ్రాహ్మణీయ సమాజం మాలా మాదిగల్ని అంటరానివాళ్ళని చేసింది. హరిజన పదంతో గాంధీ గారు అనాధల్ని కూడా చేస్తున్నాడు అని అన్నాడు. రూతుకు అది నిజమేననిపించింది.

అట్టా జరిగేవి రామానుజంతో మాటలు. రామానుజంకు పెళ్ళికాలేదు. చేసుకోవాలనే అభిప్రాయం కూడాలేదు. కాని అతని కళ్ళెప్పుడూ కలలు కంటున్నట్టు కన్పించేవి. అయితే

అతని కళ్ళల్లో అతని ప్రేయసి మాత్రం వుండదు. తన కోసం ఉన్నతంగా వూహించుకొనే సొంత రూపం కూడా వుండదు. అంతవరకు నిజం ఎందుకంటే అతనెప్పుడూ తనని గూర్చి మాట్లాడేవాడు కాదు. ఓ రోజు యిది విన్నారా అంటూ వచ్చాడు. ఏమిటన్నాడు రూబేను. అప్పుడు క్రిస్మస్ రోజులు. క్రిస్మస్ అయ్యాక ఎన్నెలదిన్ని వెళ్ళారు.

"రేపు యిక్కడికి హరిజన సేవా సంఘ కార్యకర్తలొస్తున్నారు "

"హరిజన ........!"

"అదే గాంధీ గారి హరిజన సేవాసంఘ కార్యకర్తలు" ఆ రాత్రి చర్చ సేవాసంఘం మీద జరిగింది.

మరుసటిరోజు హరిజన సంఘ కార్యకర్తలు రానే వచ్చారు. వచ్చిన వాళ్ళల్లో ఆ వూరి లింగారెడ్డి వున్నాడు. లింగారెడ్డి మునగారెడ్డి శివారెడ్డి మనవడు. ఎన్నెలదిన్నిలో అచ్చిరెడ్డి తర్వాత అచ్చిరెడ్డి పెత్తనాన్ని పక్కకునెట్టి శివారెడ్డి ముందుకొచ్చాడు. అచ్చిరెడ్డి కొడుకు మల్లారెడ్డి. అంత గట్టివాడు మాత్రం కాదు. మల్లారెడ్డి కొడుకు చదువుల్లో వున్నాడు. అట్టా కావటానికి పట్నం వెళ్ళిన పిల్లకరణం పరోక్షంగా కారణమంటారు. అది ఎంతవరకు నిజమో తెలీదు.

లింగారెడ్డి గాంధీ శిష్యుడయ్యాడు. గాంధీ గారు ఆంధ్రదేశానికి వచ్చినప్పుడు ఆయన్తో పాటు తిరిగాడు. లింగారెడ్డిలో మరో ప్రత్యేకత వుంది. గాంధీగారి గుణగణాల్ని పొగిడే ప్రాంతీయ బ్రిటీష్ అధికార్లతో మంచి సంబంధాలు పెట్టుకొన్నాడు. బ్రిటీష్ అధికార్లతో సంబంధాలు భూమిని పెంచాయి. గాంధీ గారితో సంబంధాలు దేశ భక్తుల జాబితాలో చేర్చాయి. ప్రస్తుతానికి నెల్లూరు ప్రాంతం హరిజన సేవాసంఘం బాధ్యత తన నెత్తిమీద వేసుకొన్నట్టే లెఖ్ఖ. అదే సందర్భంలో జస్టిస్ పార్టీ హనుమప్పచౌదరితో దగ్గర సంబంధం కూడా పోగొట్టుకోలేదు. రామానుజం దృష్టిలో లింగారెడ్డి మహా తెలివైన కాంగ్రెస్ నాయకుడు. అందుకే సేవాసంగ కార్యకర్తలు రాబోయే ముందు లింగారెడ్డి రామానుజంతో మాట్లాడినా రామానుజం వినీ విననట్టే వుండి పోయాడు. కాని లింగారెడ్డి వొదిలిపెట్టలేదు. రామానుజానికి తమ ప్రోగ్రామ్ చెప్తూనేవున్నాడు. పల్లెకు రావటం తోటే రామానుజాన్ని అడిగాడు. రామానుజం మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళాడని తెలిసింది.

వచ్చిన హరిజన సేవా సంఘ కార్యకర్తలు ఒక్క చోట గుమ్మిగూడారు. గాంధీ గారికి జై అన్నారు. ఆ తర్వాత కర్ర చీపుర్లు పట్టారు. ఖద్దరు పంచలు పైకి కట్టారు. పైజమాలైతే పైకి మడచారు. మాలా, మాదిగ పల్లెల్లో బజార్లు వూడ్వటం మొదలెట్టారు. వాళ్ళని మాదిగాళ్ళు, మాలాళ్ళు వింతగా చూశారు. వాళ్ళ మొహాలు చూస్తుంటే వాళ్ళు అట్టా చేస్తున్నందుకు చాలా గర్వపడుతున్నట్టనిపించింది. ఊడ్చేటప్పుడు పాటలు కూడా పాడారు. ఆ పాటలు జనానికి అర్థం కాలేదు. అయినా పాడుతూనే చిమ్మారు. ఆ చిమ్మే వాళ్ళల్లో లింగారెడ్డి వున్నాడు. మాలా, మాదిగాళ్ళకి యిది మరీ వింతగా వుంది.

ఆ తర్వాత అంటరానివాళ్ళ యిళ్ళల్లో మంచినీళ్ళు తాగటం. అదో ప్రహసనం లాగే జరిగింది. గొప్ప తమాషా అనిపించింది. రాముల వారి నవమి రోజు పానకం కలిపే పెద్దబాన

పెల్లె మధ్యలో వుంచారు. ఆ బానలో యింటికో చెంబు నీళ్ళు పొయ్యమన్నారు. పొయ్యకపోతే తప్పుపడ్తారని యింటికో చెంబు నీళ్ళు పోశారు. అక్కడా పాటలు పాడారు. మాటలు మాట్లాడారు. అంటరాని తనం దుర్మార్గమన్నారు. దాన్ని నిర్మూలించడానికే యిదంతా చేస్తున్నామన్నారు. బాన దగ్గర ఉపన్యాసాలు దాదాపు గంట జరిగాయి. ఆనక తలా గ్లాసు నీళ్ళు ఆ బానలోవి ముంచుకొని తాగారు. అట్టా తాగుతూ గర్వపడ్డారు. ఒక కార్యకర్తయితే పూనకం వచ్చినట్టు ఊగిపోయాడు. "మీ చేతుల్తో యిచ్చిన ఈ నీళ్ళు తాగి నా జీవితం పవిత్రమైందన్నాడు. యింకాస్త ముందుకు పోయి నన్ను నేను కడుక్కొంటున్నాను. అక్కడ మీరు వుమ్మి వేయండి. నా నాలుకతో దాన్ని అందుకొంటాను. అట్టా మిమ్మల్ని యింతకాలం అంటరాని వాళ్ళనిగా చూసినందుకు నన్ను నేను శుద్ధి చేసుకొంటాను. మీలో కలిసిపోతాను." అట్టా అంటో ఊగిపోతున్నాడు. ఉద్రేకంగా మాట్లాడుతున్నాడు. అంతే ఉద్రేకంగా ఆ కార్యకర్తల్లో ఒకరు "గాంధీగారికీ జై" అన్నాడు. ఆ నినాదాన్ని అంతా అందుకొన్నారు. అంతటితో ఆ రోజు కార్యక్రమం అయిపోయింది అప్పుడు వచ్చాడు రామానుజం. లింగరెడ్డి రామానుజాన్ని అందరూ చూసేట్టు కౌగలించు కొన్నాడు. నువ్వు వుండాల్సిందన్నాడు. రేపు దేవాలయ ప్రవేశానికి గట్టిగా రమ్మన్నాడు. రేపు హరిజనుల శివాలయం ప్రవేశమని ప్రకటించి ఆ కార్యకర్తలు వెళ్ళిపొయ్యారు.

ఆ రాత్రి రామానుజం యింటికొచ్చాడు. జరిగిందంతా చెప్పాడు. దేవాలయ ప్రవేశం ప్రకటన కూడా చెప్పాడు.

"మచిలీపట్నంలో సనాతనులు గాంధీగారికి ఉత్తరం రాశారట"

"దేనిమీద"

"హరిజనుల దేవాలయం ప్రవేశం మీద"

"గాంధీ గారేమన్నారు"

"సనాతనులకు, అస్పృశ్యతా నివారణ సంఘానికి రాజీగా కాశీ రామకృష్ణమాచార్యుల పథకం ముందు కొచ్చిందని విన్నాను. దాని ప్రకారం మాలామాదిగలకు శైవ, వైష్ణవ మతాలను ఇప్పించి వారి దేవాలయంలో ప్రవేశించే అర్హత యిస్తారట".

"మా తాత శైవభక్తుడు. మా నాన్న పేరు శివయ్య. ఎన్నెలదిన్నెలో చాలామంది శివుడి భక్తులే. పార్వతమ్మ కులదేవత. మరి యింతకాలం వీళ్ళని శివాలయంలోకి ఎందుకు రానియ్యనట్టు"

రామానుజం రూబేను మాటకు అట్టాగే చూశాడు.

"ఈ ప్రశ్న నాకూ వుంది. అసలు హరిజన అనే పదమే నాకు నచ్చదు. కుల విధానాన్ని గాంధీగారు వ్యతిరేకించ లేదు. పైపెచ్చు వర్ణాశ్రమ ధర్మాన్ని సమర్థించాడు. అందులో పాపం లేదన్నాడు. దాన్ని అట్టాగే వుంచి అంటరానితనం పోవాలంటే ఎట్టా వీలౌతుంది"

రూబేను రామానుజం మాటకు అవునన్నట్టు తలూపాడు.

"ఆయన వేదాలను ప్రమాణంగా స్వీకరిస్తాడు. ఈ మాట ఆయన విజయవాడ

దుర్గాకళామందిరం లో చాలా స్పష్టంగా చెప్పాడు. హరిజనులు కూడా ఆగమశాస్త్ర విధులకు కట్టుబడి వున్నప్పుడే దేవాలయ ప్రవేశానికి అర్హులన్నాడు".

"యింతకన్నా గొప్ప హాస్యం మరొకటి లేదు"

రామానుజం ఆశ్చర్యంగా చూశాడు.

"వాళ్ళన్నట్టే మాలామాదిగలు అలగా జనాలే అనుకొందాం. కాని ఆ అలగాజనానికి ఓ కళ ఉంది. సాహిత్యముంది. సంస్కృతి వుంది. అదంతా యిప్పటిదాకా ఆలయం బయటే జరిగింది. సజీవంగా జరిగింది. మా తాత గంగని ఆలయం బయటే జనం మధ్యే ఆకాశం నుంచి కిందికి దింపాడు తన పాటలో, నాట్యంలో. జీవం లేని పెనుగులాట ఆలయంలో వుంది. ప్రాణం లేనిదాని కోసం ప్రాణం వున్నదాన్ని వదులుకోమనటం ప్రజల కళని, వాళ్ళ సాహిత్యాన్ని, కలబోసుకున్న సంస్కృతిని కించపరచడమే".

వెంటనే రామాను.జం అందుకొన్నాడు.

"శుద్ధి యజ్ఞమంటున్నారు. శుద్ధి ఎవరికి ? మనకా ? వాళ్ళకా ?" అవర్ణులు సవర్ణులు అంతా ఆత్మ పరిశుద్ధతలోని ప్రాముఖ్యత గుర్తించా లంటారు. దాన్నే శుద్ధి యజ్ఞమంటారు. చిత్రంగా వుంది. హరిజనులు శారీరకంగా మానసికంగా పరిశుద్ధులుగా వుండాలంటారు. పరిశుద్ధతకు ఆగమశాస్త్ర విధుల్ని ముందుపెడతారు. ఆంతరంగిక పరిశుద్ధతకి "రామ నామం", బాహ్య పరిశుద్ధతకి "స్నానం". గొడ్డుమాంసం తినకూడదు. గోమాంసం తినకూడదు. వాటికి అలవాటుపడ్డ వాళ్ళు హిందువులు కాదు. వారికి దేవాలయంలో ప్రవేశించే అర్హత లేదు. ఎట్లా వుంది యిదంతా చెప్పండి. మీకేమనిపిస్తోంది.'

"విచిత్రం. మాలామాదిగలు క్రైస్తవులుగా మారినప్పుడు చచ్చిన గొడ్డును తినమని అంటే వాళ్ళచేత బలవంతంగా వీళ్ళే తినిపించారు. గ్రామాల్లో ఈ సంఘటనలు చాలా వున్నాయి."

"ఇది నిజంగా హరిజనోద్ధరణ కాదు. హిందూమతాన్ని రక్షించుకోవటం. బలమైన వర్ణాల్ని, వర్గాల్ని దానికి దూరం కాకుండా కాపాడుకోవటం. అక్కడా మాలా మాదిగలపై ఆంక్షలే. శుద్ధి పేరుతో చట్రంలో బిగించటమే !

"ముమ్మాటికీ నిజం"

"బిర్లా ఎవరు ?"

"కరుడు గట్టిన హిందూ"

"అతను అస్పృశ్యత వ్యతిరేక సమితికి అధ్యక్షుడు. ఎట్లా వుంది ఈ విచిత్రం ?"

"డా॥ అంబేడ్కర్ వీళ్ళ మోసం చాలా స్పష్టంగానే చెప్తున్నారు. ఆయన అన్నట్టు మాలామాదిగలు మేకలుగా వున్నంతకాలం బలిపీఠంమీద నరకబడుతూనే వుంటారు. పులులుగా బతకాల్సి వుంది".

"గాంధీ వున్నారు జాగ్రత్త !"

ఆ మాటకు ఆ యిద్దరూ నవ్వుకొన్నారు. రూతుకూ నవ్వొచ్చింది. గాంధీ వున్నారు జాగ్రత్త ! ఆ మాటే తనలో తాను అనుకొంది.

"వద్దు. మనకోసం ఈ శుద్ధి యజ్ఞాలు వద్దు. మన యిళ్ళల్లో మంచినీళ్ళు తాగి వాళ్ళేదో మనల్ని వుద్ధరిస్తున్నారే ఫోజూ వద్దు. ఎవడి కులం గొప్ప వాడికుంది. నేను వాడికి అంటరానివాణ్ణయితే వాడు నాకు అంటరానివాడే వీళ్ళు మనల్ని చంపుతూ పెద్దవాళ్ళవుతున్నారు. మనల్ని ఉద్ధరిస్తామంటూ గొప్ప సంస్కర్తలౌతున్నారు. అఖ్ఖర్లేదు. వీళ్ళ సానుభూతి అక్కర్లేదు. సానుభూతితో బతికేకన్నా చావడమే మేలు. తొగొద్దు. అట్టా నీళ్ళు తొగొద్దు. మనకోసం పాడుబడ్డ దేవుడి గుళ్ళనీ ఉద్ధరించొద్దు. వీళ్ళ సంస్కరణలో నిజాయితీ వుంటే వో చిన్న పని చెయ్యమనండి. మాలాడిదిబ్బని ఆనుకొని బోలెడు భూమి వుంది. అది మాలామాదిగలు ఆక్రమిస్తారు చూస్తూ వూరుకోమనండి. చాలు. ఆ మాట గాంధీగారు మాట్లాడరు. ఈ హరిజనసేవా కార్యకర్తలూ మాట్లాడరు"

ఆఖరిమాట దగ్గర ఆగింది చర్చ. ఆ మాటే రామానుజం పదేపదే గుర్తుచేస్తూ వెళ్ళాడు.

అతను వెళ్ళాక తన డైరీలో రూబేను యిట్టా రాసుకొన్నాడు. రాస్తున్నంతసేపూ రూతు మాట్లాడలేదు. రాశాక చదివి వినిపించమంది.

*"నా పూర్వీకులు పోగొట్టుకొన్న దాన్ని వెతుకు తున్నాను నేను*

*నానమ్మ చెప్పింది మీ తాత యిట్టాగే వెతికాడని. అమ్మ అంది మీ నాన్న వెతుకుతూనే వెళ్ళిపొయ్యాడని. తర్వాత నానమ్మా వెతికింది. అమ్మా వెతికింది."*

*యిప్పుడు నేను వెతుకుతున్నాను. నా పూర్వీకులు పోగొట్టుకొన్న దాన్ని వెతుకుతున్నాను. నాతోపాటు నావాళ్లంతావెతకటం మొదలెట్టారు. వెతగ్గా, వెతగ్గా, భూమంతా వెతగ్గా. ఆ అంచు నుంచి ఈ అంచు కొచ్చాక నావాళ్ళు పోగొట్టుకొన్న భూమి లెక్క తేలింది. బతుకు లెక్క తేలింది".*

ఓ పాస్టర్ డైరీలా లేదు అది.

దాన్నిండా ఆత్మగౌరవం తాలూకూ పదాలు - భూమి తాలూకూ అన్వేషణలు.

"రామానుజం అన్న ఆఖరిమాట విన్నావా? అది అతన్లో మరో వ్యక్తిని చూడమంటుంది. ఎందుకో రామానుజం చాలా లోతుగా అన్పిస్తున్నాడు."

నిద్రపోతూ ఆ రోజు రూబేను అన్న మాటలు యిప్పటికీ గుర్తొస్తాయి రూతుకు.

ఆ మాటలు అక్షరాలా నిజం.

దేవాలయ ప్రవేశం కోసం ఊరు బయట శివాలయం బాగు చేశారు. అట్టహాసంగా సేవాసంఘం కార్యకర్తలొచ్చారు. ఆలయప్రవేశ ఊరేగింపు మొదలెట్టారు. ఊరి పెద్దలు "రండ్రా" అని అందర్నీ పిలుస్తున్నారు. కార్యకర్తలైతే హరిజనుల ఆలయ ప్రవేశం మీద పాటలు పాడారు. ఉపన్యాసాలు యిచ్చారు. ఊరేగింపు మొదలైంది. ఊరేగింపులో రామానుజం కూడా వున్నాడు. రామానుజం వచ్చినందుకు లింగారెడ్డి ఆనందం వ్యక్తం చేశాడు. ఊరేగింపు ఊరి

దగ్గరగా వెళ్ళింది. అయితే ఊళ్ళోకి వెళ్ళటం లేదు ఊరికి పక్కగా వెళ్తోంది. ఊరికి కాస్త దూరంలో శివాలయం వుంది. పాడుపడి వుంది. ఇప్పుడు బాగు చేశారు. ప్రవేశం ఆ దేవాలయంలోకే.

"ఆగండి"

ఊరేగింపు ఒక్కసారి ఆగింది. ఆ మాట అన్న రామానుజం ఊరేగింపు ముందుకొచ్చాడు.

"ఊరేగింపు ఊళ్ళోకి వెళ్ళాలి"

అంతా బిత్తరపోయి చూశారు. మాలా మాదిగలు రామానుజంకేసి చూస్తూ వున్నారు. తెలీని ఉద్వేగం. లింగారెడ్డి ఏం మాట్లాడలేదు.

"శివాలయం ఊళ్ళో లేదు". గ్రామ పెద్దల్లో ఒకాయన అన్నాడు!

"విష్ణాలయం వుంది. దాని పక్క రామాలయం వుంది" రామానుజం అన్నాడు.

"ప్రవేశం శివాలయంలో" సేవా సంఘ కార్యకర్త అన్నాడు. యిప్పుడూ లింగారెడ్డి మాట్లాడ లేదు.

"మేం విష్ణాలయంలోకి వెళ్దామను కొంటున్నాం" రామానుజం గట్టిగానే అన్నాడు.

"మా కార్యక్రమంలో వుంది శివాలయం" ఈ మాటా లింగారెడ్డిది కాదు.

"మేం వెళ్ళాలనుకొంటోంది విష్ణాలయం లోకి. కాకపోతే రామాలయంలోకి".

వాదం మొదలైంది. కార్యకర్తలు రామాను జానికి నచ్చచెప్పబోయారు. రామానుజం వినలేదు. జనానికి కూడా రామానుజం మాటబాగుందని పించింది. జనంలో యువకులైతే రామానుజం పక్కగా నిలబడ్డారు. ఆ రాత్రి రామానుజం వాళ్ళతో మాట్లాడాడు. యువకుల్లో ఇద్దరు ముగ్గురు గట్టివాళ్ళున్నారు. వాళ్లకు సేవాసంఘ కార్యకర్తల పనంతా అదోలా అన్పించింది. మొదటవాళ్ళే రామానుజంతో 'యిదంతా నిజమేనా' అంటూ మాట్లాడారు. ఆ తర్వాత రామానుజం చాలా ముందుకే వెళ్ళాడు. ఊరేగింపు ఊళ్ళోకి మళ్ళించలేకపోతే వెనక్కి తిరగాలని నిర్ణయించు కొన్నారు. యిదంతా మాలా మాదిగ పల్లెల్లో పెద్దలకి తెలీదు. లింగారెడ్డి మాత్రం రామానుజాన్ని తక్కువగా అనుకోలేదు. అయినా మాట్లాడలేదు.

"ఏ విషయం చెప్పండి. మా ఆలయ ప్రవేశం ఊళ్ళో దేవాలయంలో జరగాలని మేం కోరుకుంటు న్నాం అట్టాకాకపోతే వెనక్కిపోతాం."

యిప్పుడు లింగారెడ్డి మాట్లాడాడు. ఊరేగింపు ఊళ్ళోకి పోవాలన్నాడు. కార్యకర్తలు ఆశ్చర్యపోయారు. కార్యకర్తల ప్రోగ్రాంలో ఊళ్ళో దేవాలయం ప్రవేశం లేదు. కాని యిప్పుడు లింగారెడ్డి ఊరేగింపు ఊళ్ళోకి పోవాలంటున్నాడు. వాళ్ళ యిష్టం. వైష్ణవాలయంలోకి వెళ్దామంటే వైష్ణవాలయం ప్రవేశం, రామాలయంలోకి అంటే రామాలయ ప్రవేశం అంటో జనాన్ని ఉద్దేశించి మాట్లాడుతున్నాడు. గ్రామస్తులైతే లింగారెడ్డి ఎందుకిట్టా మాట్టాడుతున్నాడని అతన్ని పక్కకులాగి మాట్లాడే ప్రయత్నం చేశారు. కాని లింగారెడ్డి "రామానుజం ఊరేగింపు ఊళ్ళోకిపోనీ" అని అన్నాడు.

ఊరేగింపు ఊళ్ళోకే వెళ్ళింది. విష్ణాలయం కాంపౌండులోకి మాలామాదిగలు లింగారెడ్డి ముందునడుస్తుంటే ప్రవేశించారు. ఆలయం కాంపౌండ్ విశాలంగానే వుంటుంది సరిగ్గా ఆలయం మొదటి మెట్టు దగ్గరే ఆగాడు లింగారెడ్డి. కాంపౌండ్‌లో చెట్ల చల్లని నీడ వుంటుంది. కాంపౌండ్‌లోకి అడుగు పెట్టిన మాలామాదిగలకు ఆ వాతావరణం వింతగా వుంది. అది లింగారెడ్డి గమనిస్తూనే వున్నాడు అదేకాదు తనకేసే చూస్తున్న రామానుజాన్ని గమనిస్తున్నాడు. దయ చేసి అందరూ కూర్చోండన్నాడు లింగారెడ్డి. అంతా కూర్చొన్నారు. యిప్పుడు గాంధీగారికి జై అనమన్నాడు అంతా జై అన్నారు.

"ప్రియమైన హరిజనులారా !" అంటూ మొదలెట్టాడు. హరిజన అనే పదం ఎంత గొప్పదో చెప్పటం మొదలెట్టాడు. అట్టా చెబుతూ రామానుజం కేసి చూశాడు. అతనికి తెలుసు ఆపదం రామానుజానికి నచ్చదని. అందుకే అంత పొగిడేస్తున్నాడు. రామానుజం ఆలోచనని కేవలం ఆపదం దగ్గరే బందీ చేసే ప్రయత్నం చేస్తున్నాడు. ఒక రకంగా లింగారెడ్డి అనుకొన్నది సాధిస్తూనే వున్నాడు. లింగారెడ్డి ఓ తెలివైన మేధావి. మనుషుల్ని పదాల దగ్గర అతుక్కునేట్టు చేసే వేదిక ఏర్పాటు చేసి అసలు విషయానికి వాళ్ళని దూరం చెయ్య గలడు. అసలు విషయం ఆలయప్రవేశం. కూర్చొన్నది కాంపౌండులో. చర్చ మొదలైంది హరిజన పదంమీద. రామానుజానికి లింగారెడ్డి హరిజన పదాన్ని అట్టా పొగడటం కోపాన్ని తెప్పిస్తోంది. ఆపదం ఎంత మోసపూరితమో చెప్దామనే తొందరలో వున్నాడు.

"నిజానికి రామానుజానికి ఈపదం నచ్చదు. అది నాకు తెలుసు. నేను అహింసావాదిని. సత్యం అహింసకు మూలసూత్రం. ఆ సత్యం తెలుసు కోడానికే ఆపదం రామానుజానికి ఎందుకునచ్చదో మీ సమక్షంలో వినాలనుకొంటున్నాను."

లింగారెడ్డి అట్టా అంటాడని రామానుజం వూహించలేదు అయితే తనని ఎట్టా లాగుతున్నాడో, ఎందుకు లాగుతున్నాడో అర్థం అవుతూనే వుంది.

"చెప్పు రామానుజం..... కాదంటే గాంధీగారి పదాన్ని వొప్పేసుకో...."

సవాల్ విసిరాడు లింగారెడ్డి. తప్పదు. రామానుజం మాట్లాడటం మొదలెట్టాడు.

యింతలో హరతితో పూజారి గర్భగుడిలోంచి బయటకొచ్చాడు. జనాలలో సందడి మొదలైంది. రామానుజం అసహనంగా చూశాడు. లింగారెడ్డి ఉద్రేకం ఆపుకోలేనట్టుగా నటిస్తూ' 'హరతి మన దగ్గరకే వచ్చింది. హరతి కళ్ళకద్దుకోండి. ప్రసాదం పంచండి" అంటో ఉద్రేకంగా అరవటం మొదలెట్టాడు. హరతి కోసం జనంలో తొక్కిసలాట. ప్రసాదం పంపకం మొదలు. అంతా ఉన్మాదంగా జరుగుతోంది. కార్యకర్తలు గాంధీగారికి జై అంటూనే వున్నారు. చాలా విచిత్రంగా కాంపౌండ్ ప్రవేశంతోనే ఆలయ ప్రవేశం జరిగిపోయింది. అంతా బయటకొచ్చారు. గ్రామ పెద్దలు "ఎంతైనా చదువుకొన్నోడు చదువుకొన్నోడే" అని లింగారెడ్డిని మెచ్చుకొన్నారు. ఆ రాత్రి లింగారెడ్డి దగ్గరేవుండి దేవాలయ కాంపౌండును, మెట్లని ఆవుపేడతో, పంచకంతో పూజారుల మంత్రాల మధ్య కడిగించాడు. ఆ కార్యక్రమంలో కూడా హరిజన సేవా సంఘ కార్యకర్తలు లేకపోలేదు.

హరిజన దేవాలయ ప్రవేశం అనే సాంఘిక సేవని ఎంత ఆదర్శంగా చేశారో, దేవాలయ శుద్ధి కార్యక్రమాన్ని అంత పవిత్రంగా చేశారు. అసలు గాంధీగారి పద్ధతిలోనే ఆవెసులుబాటుంది. అదే లేకపోతే లింగారెడ్డి లాంటి వాళ్ళకి గాంధీగారు అంత గొప్పగా కన్పించేవాడు కాదు.

కాని లింగారెడ్డికి ఓ విషయం తెలీదు. వెంకటాద్రి అనే కుర్రాడు కృష్ణాజిల్లా నుంచి వచ్చిన కార్యకర్తల్లో వున్నాడని తెలీదు. అతను హరిజనుడని తెలీదు. అతను గుంటూరు జిల్లా హరిజన డాక్టర్‌కు సన్నిహితుడని తెలీదు. రాజమహేంద్రవరం హరిజన కవి అభిమానుల్లో ఒకడని తెలీదు. ఆ విషయం కృష్ణాజిల్లా కార్యకర్తలకు తెలుసు. వాళ్ళ ప్రోగ్రాంలో శివాలయం వుంది. శివాలయ ప్రవేశమే జరిగితే ఏగొడవా వుండేదికాదు. కాని అంతా తారుమారైంది. వెంకటాద్రికి దేవాలయ శుద్ధి కార్యక్రమం మింగుడు పడలేదు. అంతా మోసంగా అన్పించింది. అక్కడ వుండబుద్ధి కాలేదు. పల్లెకొచ్చాడు పల్లెలో రామానుజాన్ని కలిశాడు. రామానుజంతోపాటు వున్నకుర్రాళ్ళని కలిశాడు. అంతా చెప్పాడు. లింగారెడ్డి ఎంత మోసం చేసిందీ చెప్పాడు. రామానుజం ఆశ్చర్యపోలేదు.

"నాకు తెలుసు. మాలామాదిగల్ని హిందూ చట్రంలో బిగించే కార్యక్రమంగానే ఈ హరిజనోద్ధరణ జరుగుతోంది. 1924 గుర్తుందా మీకు ?"

వెంకటాద్రి రామానుజం ప్రశ్నకు జవాబుకోసం వెతికాడు. 1924లో అంటరాని కులాల ఆలయ ప్రవేశంకోసం వైకం సత్యాగ్రహం జరిగింది. అందులో పెరియార్ పాల్గొన్నాడు. గాంధీగారు దాన్ని హిందువుల అంతరంగిక విషయంగా మాట్లాడాడు. పెరియార్ కాంగ్రెస్ సనాతనవాదనాయకుల కపటత్వాన్ని ఎండగట్టాడు. అయితే దాన్ని యిప్పుడు రామానుజం ఎందుకు గుర్తు చేస్తున్నాడో వెంకటాద్రికి అర్థంకాలేదు.

"మీరు లింగారెడ్డి అట్టా చేసినందుకు ఆశ్చర్యపోతున్నారు. నేను గాంధీగారి శుద్ధియజ్ఞానికే ఆశ్చర్యపోను."

"అంటే"

"గాంధీగారి మీద మీకున్న భ్రమలు నాకు లేవు"

ఆ రాత్రి అక్కడే వుండిపొయ్యాడు వెంకటాద్రి. ఉదయం రూబేను వాళ్ళని కలిశాడు. యింటికి రమ్మన్నాడు. అప్పుడు గాంధీగారు రెండు రోజుల్లో బిట్ర గుంటమీదుగా ప్రయాణం చేస్తాడని వెంకటాద్రి చెప్పాడు. రూబేనుకు గాంధీగార్ని చూడాలనే వుంది. రూతుకూ అట్టాగే అన్పించింది.

ఎన్నెలదిన్నె నుంచి తెల్లారుజామున బయల్దే రారు. గాంధీగారిని కలిసి జరిగింది చెప్తానన్నాడు వెంకటాద్రి. నీకు భ్రమలు చాలా ఎక్కువన్నాడు రామానుజం. దారంతా మాట్లాడుతూనే నడుస్తున్నారు. రూతు మౌనంగా వింటోంది.

"బ్రిటీష్ పాలన కుల వ్యవస్థకి కొత్త ఊపిరి పోస్తోందనిపిస్తోంది."

రామానుజం ఆమాట అని రూబేను కేసి చూశాడు.

"చెప్పండి. క్రైస్తవుణ్ణని మీరు చెప్పదల్చుకొన్నది మానుకోవద్దు. మొదట నేను అంటరాని వాణ్ణి."

"వీళ్ళు కులవ్యవస్థని న్యాయవ్యవస్థలో చొప్పించారు."

"నేనైతే కులవ్యవస్థకి వీళ్ళు స్వయంప్రతిపత్తి యిచ్చి గౌరవించారని కూడా అంటాను."

"చాలా సూటిగా చెప్పారు. ఈ ఇంగ్లీష్ న్యాయ మూర్తులకి సలహాదారులు బ్రాహ్మణపండితులు. వాళ్ళు సహజంగా ఏది కోరుకొంటారు ? గమనించారో లేదో యింగ్లీష్‌తో పాటు సంస్కృత అధ్యయనం పెరుగుతోంది. సంస్కృత గ్రంథాల అనువాదం పెరుగుతోంది".

"వెంకటాద్రి మాట్లాడటం లేదు"

"అతని మనసు గాంధీగారి నుండి బయటపడలేదు."

వెంకటాద్రి మౌనంగానే నడుస్తున్నాడు. అతని బుర్రలోంచి ఆ రాత్రి సంఘటన యింకా తొలగిపోలేదు. యింతకాలం అంటరాని వాళ్ళకి హరిజన సేవాసంఘం ఏదో వొరగబెడ్తుందని అనుకొన్నాడు. ఆ అనుకోవడమే తనని యింటికి దూరం చేసింది. కాని అంతా అయోమయంగా వుంది. నిజాయితీలోపించినట్టుంది. వెంటనే వెళ్ళిపోయి గుంటూరు జిల్లా డాక్టర్నో, రాజమహేంద్రవరం కవినో కలిస్తే బాగుండుననుకొన్నాడు. గాంధీగారిని కలవటం వీలుపడకపోతే అదే చెయ్యాలి. అంత దాకా మనసు శాంతంగా వుండేలా లేదు. రామానుజం, రూబేను మాత్రం వాళ్ళ మాటల్లో వాళ్ళు వుండిపొయ్యారు.

"సత్యశోధక్ సమాజ్ 'తమాషా' బృందాల గూర్చి మీకు తెలుసుగా".

"షెట్ జీలపైన భాట్‌జీలపైన పూలే తిరుగుబాటు చాలా శక్తివంతమైంది".

"తమిళనాడులో ఆత్మగౌరవ ఉద్యమం విన్నారుగా అది సోషలిజాన్ని సమర్థిస్తోంది. అదో కొత్త పరిణామం".

"బహుశా పెరియార్ రష్యా పర్యటన ప్రభావంకావచ్చు"

"సోవియట్ రష్యా ప్రభావం ఈదేశం మేధవుల మీద బాగానే పడుతోన్నట్టుంది."

వాళ్ళమాటల్లో కమ్యూనిజం అనే పదం విన్పించింది.

అట్టా మాట్లాడుతూనే నడుస్తున్నారు. బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాల చర్చ ఎక్కువగా సాగింది.

రూబేను రూతుకు ఆశ్చర్యంగా అన్పిస్తున్నాడు. నేను మొదట అంటరానివాణ్ణి అని అన్నప్పుడు తాను ఏ విషయం ఎక్కువ తీవ్రంగా ఆలోచిస్తున్నాదో అర్థమౌతూనే వుంది. తిరిగేది దొరలమధ్య. తాను వుండే చర్చిలో దొరలు. తిరిగే హాస్పిటల్‌లో దొరలు. కాని ఆంగ్లేయపాలన మీద అతని అభిప్రాయాలే వేరు. క్లై దొరమీద తప్ప తక్కిన వాళ్ళమీద రూబేనుకు గొప్పభావం లేదు. ప్రభుత్వ కార్యాలయాల్లో, కోర్టుల్లో, ఆస్పత్రుల్లో బ్రాహ్మణుల ఆధిక్యతని రూబేను సహించలేక

పోతున్నాడు తన తండ్రి సీమోను భయాలే రూబేనును వెన్నాడు తున్నాయేమోననిపించేది మతం మార్చుకొన్న అగ్రకులాలంటే మరీ ద్వేషించేవాడు "వాడు క్రీస్తుకోసం రాలేదు. పెత్తనం చెయ్యటాని కొచ్చాడు " అని అనేవాడు మిషన్ స్కూళ్ళలో ఒకదానికి రెడ్డిని ప్రధాన ఉపాధ్యాయుడుగా పెట్టినప్పుడు "ఏంమాల క్రిష్టియన్ దొరక లేదా వీళ్ళకి, మాదిగ క్రిష్టియన్ కనిపించలేదా వీళ్ళకి, రెడ్డి క్రిష్టియన్ కావాల్సి వచ్చాడ్రా" అంటూ ఎగిరిపడ్డాడు ఆమాట చాలా చోట్ల అన్నాడు. అట్టా అన్నందుకు మిషన్ పెద్దలు రూబెనును కలిసి అట్టా అనొద్దన్నారు రూబేన్ వొప్పుకోలేదు అట్టాగే అంటానన్నాడు.

"అతను క్రిష్టియన్"

"కాదు రెడ్డి"

మిషనరీ పెద్దలు యిక మాట్లాడటం అనవసరమనుకొన్నారు ఒక్కోసారి కులంకోసం తన పాస్టరీపనినే వదులుకుంటాననే లావుండేవాడు రూబేను. బిట్రగుంట స్టేషన్‌కు చేరేప్పటికే తెల్లవారింది. జనం గాంధీగారి రైలుకోసం ఎదురు చూస్తున్నారు ఆయన కలకత్తా మెయిల్‌లో వస్తాడన్నారు. ఆయనకు స్వాగతం చెప్పేందుకు పెద్దలు ముందున్నారు. వాళ్ళలో లింగారెడ్డిని గమనించాడు వెంకటాద్రి కోపంతో ఊగిపోయ్యాడు.

"నెల్లూరురెడ్లకు వీడి అసలు రూపం బైట పెడ్తాను" వెంకటాద్రి ముందుకు పోబొయ్యాడు

"వాళ్ళూ రెడ్లే. ఆవిషయం మర్చిపోకు" రామానుజం ఆమాట సూటిగా అన్నాడు. వెంకటాద్రి ఆగాడు యింతలో కలకత్తా మెయిల్ స్టేషన్‌కు రావటం, జనం" గాంధీగారికి జై' అంటో తోసుకోవటం జరిగిపోయింది దూరంగా వుండే ఆతతంగ మంతా చూసింది రూతు. రామానుజం మాటతో వెంకటాద్రి ఆగిపొయ్యాడు గాంధీగారు కారులో కావలి వెళ్తున్నట్టు చెప్పుకొన్నారు.

ఆరోజు డిశంబరు 30. కొత్త సంవత్సరాది. ఒంగోలు చేరాలన్నాడు రూబేను. ఎన్నెలదిన్ని వెళ్ళకుండా ఒంగోలు బయల్దేరారు. వెంకటాద్రి ఒంగోలు దాకా తోడుగా వచ్చాడు. ఉండమన్నా ఉండలేదు. గుంటూరుజిల్లా డాక్టర్‌ని కలవాలంటూ వెళ్ళాడు. మళ్ళీ కలుస్తానంటూ రామానుజం ఎన్నెలదిన్ని దారి పట్టాడు. మళ్ళీ ఎండల్లో ఎన్నెలదిన్నె వెళ్ళినప్పుడు రామానుజం అక్కడ లేడు. అట్టావిడిపోయినవాడు యిప్పుడు కలిశాడు. యిట్టాకలిశాడు.

"ఆ తర్వాత అక్కడ వుండబుద్ధికాలేదు. ట్రైనింగ్ స్కూల్‌లో చేరాను. ట్రైనింగ్ అయ్యాక ఎయిడెడ్ స్కూల్లో టీచర్‌గా చేరాను. ఒక స్కూలుకాదు. దాదాపు పదిస్కూళ్ళు మారాను "

"ఎందుకు"

"జవాబు దొరకదు కానినేను వొక్కడిగా వుండలేక పోతున్నాను. ఎన్నిలదిన్నిలో వుండలేక పోయినట్టు. ఏదో ఒక సన్నివేశం ఏదో ఒక సందర్భం..."

రామానుజం చెప్పుకుపోతున్నాడు.

"ఆగష్టు 15, 1947 మీరెక్కడున్నారు"

"ఒంగోలులో"

"కాని మీరు నాకు గుర్తొచ్చారు. మీకు తెలిసిందో లేదో నాకు తెలీదు. కాని మిమ్మల్ని కలిస్తే చెప్దామనుకొన్నాను. ఇది విన్నారా అంటో చెప్దామనుకొన్నాను.'

రూబేను అతన్నే చూస్తున్నాడు. అదే ఉద్వేగం. లేకపోతే కాస్త వయసు పైబడ్డ ఉద్వేగం

"ఏమిటని అడగరేం"

"చెప్పండి"

"పెరియార్ ఆగష్టు 15 సంతాప దినంగా పాటించమని పిలుపిచ్చాడు. నాకైతే ఆనందమైంది. అతను బ్రాహ్మణ రాజ్యాన్నుంచి స్వాతంత్రం కోరాడు. నిజంచెబుతున్నాను. నల్లజండా ఎగరవేద్దామనుకొన్నాను. నేను వుండేయింట్లో పొంతకుండ పక్కన మసిగుడ్డవుంటే పుల్లతో ఎత్తిపట్టి బజారులో నిలబడ్డాను. అంతే ఆవూరి కాంగ్రెస్ వాళ్ళతో గొడవొచ్చింది. ఆవూరు మారలేదు. యిప్పుడు నేనుంది పదో స్కూలు. యిది నా జీవితంతో ముడిపడి పోయింది. జీవితం రాటు తేలింది."

అవును. రామానుజం అన్నట్టు జీవితం రాటుతేలింది. ఏ జీవితం అది. ఎందుకురాటు తేలింది అది. ఎట్టారాటు తేలింది అది. ఆ రోజంతా ఇదే. ఏది చెప్పాడు రామానుజం. ఎందుకట్టా పదే పదే. కేవలం దోసెడు నీళ్ళకోసం. జానెడు పొట్టకోసం. ఎంత సుదీర్ఘ ప్రయాణం ఇది.

ఒక తెగ వ్యవస్థ శిథిలమైన వేళ -

అదనపు ఉత్పత్తి వ్యవసాయపరమైన తొలి సంధ్యలో

ఒక విభజనగా శ్రమ మారిపోయినప్పుడు

బూమి సొంత ఆస్తిగా మారుతోన్నప్పుడు

రూబేనూ !

నీ పూర్వీకుడు ఎట్టా అరచాడు

రామానుజం, ఆ అరుపుని నువ్వయితే ఎట్టా గుర్తిస్తావు. ఎక్కడ వెతకాలి ఆ అరుపు. పూజారుల్లో, వర్తకుల్లో, గహపతుల్లో, బానిసల్లో, శూద్రుల్లో అంతకన్నా తక్కువలో అతి తక్కువలో

ఎక్కడ వెతకాలి ఆ అరుపుని

రాజ్యాలు పుట్టినప్పుడు. రాజ్యాలు ధ్వంసమైనప్పుడు. సామ్రాజ్యం విస్తరించినప్పుడు. సామ్రాజ్యాలు ఛిన్నాభిన్నమైనపుడు.

నాగరికత నట్టింట నాట్యంచేసినపుడు

శిధిలాల్లో శిధిలమై చరిత్రకారుల తవ్వకాలుగా మారినపుడు.

ఇనుప నాగలి. యజ్ఞం. మనవు. మాయ. కుషానులు, శాక్యులు, మౌర్యులు, గుప్తులు, చీకటి యుగాలు. స్వర్ణయుగాలు....

ఎంత చరిత్ర నడిచింది ఈదేశం గడ్డమీద

ఏ మలుపులో వెతకాలి ఆ అరుపు. ఆ రాటుదేలిన అరుపు.

చతుర్వర్ణ పడగనీడలో మలినమైన పనులన్నీ మాలా మాదిగలకి పంచి యిచ్చిన క్రూరమైన దయ ఏ వేదంలోది, ఏ శాస్త్రంలోది, ఏ ఉషస్సును మింగిన తమస్సులోది. .

మహామద్‌ల దండయాత్రలు, మొగ లాయీల సామ్రాజ్యాలు, చొచ్చుకొచ్చిన ఆంగ్ల వ్యాపారులు. స్థిరపడ్డ ఆంగ్ల సామ్రాజ్యం ఆగష్టు 15, 1947 ....

ఆ తర్వాత మార్పుకు గురైన ఈదేశం పల్లె జీవితం. . . భూమిపైన క్షీణించిన బ్రాహ్మణ ఆధిపత్యం. . .. పేరుగా మిగిలిపోతున్న రాజుల వంశచరిత్ర. ... భూమిపైన స్థిరమైన కాలుమోపిన రెడ్లు, -- కమ్మలు, పాటిదార్లు, లింగాయతులు, వెల్లాటులు.. ...... పెత్తనాల్లో మార్పు..... కీలకమైన ప్రభుత్వ శాఖల్లో బ్రాహ్మణులు.. . ఉన్నతమైన న్యాయ వ్యవస్థలో పాలక వర్గాలలో బ్రాహ్మణులు, క్షత్రియులు, రెడ్లు, కమ్మలు. వాళ్ళ కొట్లాటగా మారిన రాజకీయాలు. ఎట్టా విన్పిస్తోంది. అప్పుడు మొదలైన కేక. యింకా అట్టాగే ఎందుకు విన్పిస్తోంది.

ఎన్ని దశలు చూసింది దేశం ........

ఎంత మారింది దేశం........

యిక్కడ, యిప్పుడు, ఎట్టా విన్పిస్తోంది. ఎందుకింకా అట్టాగే విన్పిస్తోంది....రూతుకు అన్నీ ప్రశ్నలే. అంతా జవాబుల కోసం వెతుకులాటే.

కేవలం గుక్కెడునీళ్ళ కోసం. ఎది చెపుతోంది ఆవలపాడు కథ .. రామానుజాన్ని, యిమ్మాను యేల్ని కలుపుకొన్న ఆవూరి మాలపల్లికథ...... మాలాళ్ళ కథ.

రామానుజం దృశ్యాన్ని కళ్ళముందు వుంచినట్టు చెప్పాడు, ఆరుబయట చుక్కలు కాస్తున్నప్పుడు. రూబేను వింటున్నాడు. రూతు వింటోంది. ఎప్పుడు వచ్చారో తెలీదు కొత్త దంపతులు యిమ్మానుయేలు మేరీ సువార్త వింటున్నారు. మధ్యలో మేరీ సువార్త టీ తెచ్చింది. పెళ్ళికూతురు కొత్తేంకాదు. ఈ యింట్లో ఏ వస్తువు ఎక్కడుందో ఆ పిల్లకు బాగా తెలుసు.

మామయ్యకు చక్కర తగ్గించేవా అని అంది. మేరీ సువార్త నవ్వి వూరుకొంది. యింక నువ్వుకాస్త నోరుమూసుకోమని ఆ నవ్వుకర్థం.

అన్నీ తెలుసు. తానేంటో, రూబేనేంటో, యిమ్మానుయేలు ఏంటో అన్ని తెలుసు......

అన్నీ తెలిసే ఈయింటికొచ్చింది

అన్నీ తెలిసే........ .

వద్దు జ్ఞాపకం అక్కడి దాకావొద్దు. నా ప్రియుడా ! నాదేవుడా ! నా జ్ఞాపకం రామానుజం దగ్గరే ఆగనీ.

అక్కడే రామానుజం దగ్గరే అక్కడే ఆగిపోనీ....

రూతు అట్టా అనుకొంటుంది. బిడ్డ జ్ఞాపకం తట్టుకోలేదు. రామానుజం దగ్గరే, జ్ఞాపకం ఆగిపోవాలనుకొంటుంది. అట్టా ఆగుతుందో లేదో తెలీదు. కాని ఆవలపాడు మాత్రం ముందు నిలుస్తోంది.

# 16

వందిళ్ళమాలపల్లి ఆవలపాడులో వుంది. ఊరు మూడొందల కడప. వందిళ్ళు రెడ్లు. వందిళ్ళు కమ్మలు. మిగిలినవి మిగిలిన కులాలు.

విచిత్రం. అక్కడ మాలపల్లె దూరంగా లేదు. మాలపల్లికి వూరికి మధ్య పెద్దబాట మాత్రమే వుంది. ఆబాటలో జొన్నసొప్పబారుకట్టిన బండి తేలిగ్గా పోవచ్చు. ఊరిమధ్య చెరువుంది. చెరువుచుట్టూ యిళ్ళు. చెరువు గట్టునే శివుడిగుడి, విష్ణువుగుడి, జాలమ్మగుడి, యింకా బోలెడు అమ్మల గూళ్ళు లాంటి గుళ్ళు.

చెరువు నిండా నీళ్ళు. పల్లెనానుకొనే వుంది చెరువు. కాని ఆ చెరువులో నీళ్ళు మాలాళ్ళు దిగి ముంచుకోరాదు. చెరువు గట్టుకు దూరంగా బుంగలతో నిల్చుంటారు. అగ్రకులాలవాళ్ళు చెర్లోదిగినప్పుడు నీళ్ళు పోపించుకొంటారు. పనికట్టుకొని ఎవ్వరూ మాలామాదిగకి నీళ్ళు పొయ్యరు. 1947కు ముందూ అంతే. 47కు తర్వాతా అంతే. అన్ని వూళ్ళలాగే. అక్కడా అంతే. అన్నింటికన్నా ఘోరం అక్కడ బావి తవ్వితే మంచినీళ్ళుపడవు. అందువల్ల నీళ్ళకు మరోమార్గంలేదు. వాడకం నీళ్ళకి వూరుకు మూడు దిక్కులావున్న ఏట్లోంచి నీళ్ళు తెచ్చుకొంటారు. ఏరు దూరంలో వుంది.

గ్రామ పెత్తందార్లు వూహించని పరిణామం ఆవూళ్ళో జరిగింది. 47కు ముందే కమ్యూనిస్టులు ఆవూళ్ళో అడుగు పెట్టారు. ఏది ఎట్టా జరిగిందో తెలీదు. మాలపల్లెకి జిల్లాస్థాయి నాయకులు, రాష్ట్రస్థాయి నాయకులు వచ్చి పొయ్యేవాళ్ళు. పార్టీ మీద నిషేధం పెట్టినప్పుడు ఆ పల్లె అగ్రనాయకులకు ఆశ్రయంగా వుండేది. పార్టీ మాలపల్లెలోనే కాదు చాకలి పాలెంలో కూడా వుండేది. రెడ్లలో సన్నకారు రైతుల్లో కూడా వుండేది. రామిరెడ్డి ఆగ్రామం పార్టీ ముఖ్యుల్లో ఒకడు.

రూతుకు కమ్యూనిస్టు పదం ఎప్పుడూ దూరంగా లేదు. దగ్గర పదంలా వుంటుంది. కమ్యూనిష్టుల్ని చూసింది. మాటాడింది.

రష్యామాట తెలుసు. చైనామాట వింటోంది. తాను వినటమేకాదు ఆవలపాడు మాలపల్లి కూడా అవి వింటోందని రామానుజం మాటల్లో అర్థమైంది. ఆవలపాడు మాలపల్లి ఏ ఆశల్తో కమ్యూనిస్టుల్ని తనలో దాచుకొంటోందో. అర్థం కావటానికి ఆమెకి ప్రత్యేకమైన ఆలోచన అఖ్ఖరలేదు. తాను పుట్టింది హనుమకొండలో. తెలంగాణా పరిస్థితులతో తనకు పరిచయం వుంది. చాకలి అయిలమ్మ కౌలుభూమి కధ తనకి తెలుసు. విసునూరు దేశముఖ్ తన గూండాలతో ప్రజల ఊరేగింపుపై కాల్పులు జరపటం, దొడ్డి కొమరయ్య మరణించటం, వేలాదిగా ప్రజలు ఆయన భౌతికకాయానికి అంత్యక్రియలు జరపటం తనకి తెలియందికాదు. ఆ సంఘటనకి

తాను ప్రత్యక్షసాక్షి కాకపోయినా చాలా దగ్గరగానేవిన్నది. అనేక గ్రామాల్లో ప్రజలు దొరలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న విషయం తనకు తెలియందికాదు అప్పుడుతాను ఆప్రాంతంలో లేకపోయినా అమ్మవచ్చినప్పుడు అవన్నీ చెబుతూనే వుంది. అక్కడి దొరల పెత్తనం ఎంత దారుణమైందో తనకు తెలుసు కాబట్టి తన మనస్సులో అట్టా ప్రజలు తిరగబడటం మంచిదిగానే అన్పించేది. ఆ తిరుగుబాటు ఆశ్చర్యమనిపించలేదు.

ఆశ్చర్యమనిపించింది తెలంగాణాలో కొమరయ్య మరణాన్ని గుర్తు చేసుకొంటో కోస్తాలో ఆవలపాడులో సభజరగటం. అదే అద్భుతంగా అన్పించింది. రామానుజం ఆరోజు ఆ విషయం చెప్తున్నప్పుడు తెలీని ఉద్వేగం అనుభవించింది.

"మాలపల్లి మధ్యలో సభజరిగింది. సభలో రామిరెడ్డి మాట్లాడాడు. జనంలో మాలపల్లి ఆడా, మగా వున్నారు. చాకలి పాలెం నుండి అట్టాగే వచ్చారు. సభ జరుగుతున్నంత సేపూ చెరువు కట్టమీద పది పది హేసు మంది యువకులు కూర్చొన్నారు. ఊరు ఎక్కువభాగం కాంగ్రెస్ వాళ్ళు. కమ్యూనిష్టుల పై నిషేదం వుంది. అప్పటికీ పల్లెలో యిద్దరు ముఖ్యమైన నాయకులున్నారు. సభ చాలా రహస్యంగానే జరిగిందనొచ్చు. చాకలి పాలెం నుంచి దీపాలు పెట్టకముందే ఒక్కొక్కరే మాలపల్లి చేరారు. ఆ తర్వాతైతే కష్టం. మాలపల్లి ఈ వైపుంటే చాకలి పాలెం ఆవైపువుంది. మధ్య కమ్మవాళ్ళ యిళ్ళు. రెడ్ల యిళ్ళు."

"పల్లెలో సభకి రామిరెడ్డి తాలూకూ రెడ్లు వచ్చారా ?"

"వచ్చారు. ముఖ్యమైన మనుషులకి రాత్రి భోజనాలు అక్కడే జరిగాయి. సభ జరిగిన చోటే కూర్చొన్నారు."

"అంతా కలిసే కూర్చొన్నారా"

"కలిసే కూర్చొన్నారు. భోజనాలు అయ్యాక ఊరి చెర్లో మాలాళ్ళు నీళ్ళు ముంచటం. చర్చ కొచ్చింది".

రూబేనుకు యిష్టమైన అంశం. మరోసారి టీకావాలి రూతూ అన్నాడు. టీ కలపటానికి రూతు లేవబోయింది. యిమ్మాను యేలు తను పెడ్తానన్నాడు. మేరీసువార్త యిమ్మానుయేలుతో వెళ్ళింది.

ఆకాశమంతా చుక్కల పందిరి. రామానుజం చేతిలో చెయి కలిపాడు రూబేను.

"నువ్వు కొత్త ఆశ చెబుతున్నావు రామానుజం. యిప్పుడు నా కళ్లముందు ఎన్నెలదిన్ని అర్ధరాత్రి నీటిదొంగలు నిలుస్తున్నారు." ఆ మాటలంటో రూబేను చాలా ఉద్వేగానికి గురౌతున్నాడు. ఆవలపాడు మాలలు ప్రత్యక్షంగా, అందరూ చూసేప్పుడు, రెడ్లు చూసేప్పుడు, కమ్మలు చూసేప్పుడు, బ్రాహ్మణులు చూసేప్పుడు, శివుడు చూసేప్పుడు, జాలమ్మ తల్లి చూసేప్పుడు ఊరి చెరువులో దిగబోతున్నారు. ఆ దృశ్యమే రూబేను కళ్లముందు తాను వూహించుకొన్న పరిధిలో మెదిలాడుతోంది. నిజానికి ఆవలపాడులో ఏం జరిగింది రామానుజం చెప్పకముందే విన్నారు. కాని అందులో భాగం రామానుజం. అతను చెబుతుంటే ఆసక్తిగా వుంది. కళ్లముందు

చూస్తున్నట్టు వుంది

చుక్కల పందిరి చెల్లాచెదరౌతోంది. వానకు ముందు గాలి వాసన వస్తోంది. పగలంతా విపరీతమైన ఎండ అందుకే అన్పించింది.

జాముకోడి కూసింది. టీ తెచ్చారు యిమ్మానుయేలు మేరీలు. టీ తాగాక రామానుజం చెప్పటం మొదలెట్టాడు.

చెర్లో నీళ్లు ముంచటం రోజుకోసం చాలా నెలలు ఎదురు చూడాల్సి వచ్చింది నెలలు అనేకన్నా దాదాపు ఓ సంవత్సరం అని అనొచ్చు. కాని ఆ సంవత్సర కాలం వుట్టినే పోలేదు అనేక చెదురుమదురు సంఘటనలు. సంఘటనలు చెదురుమదురుగా జరిగినా మాలపల్లెలో గొప్ప ఆత్మస్థయిర్యాన్ని అవి పెంచుతూనే వచ్చాయి పల్లెలో కుర్రాళ్లు కొత్త విషయాలు తెలుసుకోవటం మొదలెట్టారు. చదవటం, రాయటం నేర్చుకొన్నారు. ప్రతిరోజూ పనుల నుండి వచ్చాక, రాత్రి కూళ్లు తిని పల్లెమధ్యకు చేరేవాళ్లు. వెన్నెల రోజులైతే గొప్ప సందడిగా వుండేది. కోలాటం ఆడేవాళ్లు. కొత్త పాటలు నేర్చుకొన్నారు.

"చింతల్ల చెలరేగే, చింతల్ల చెలరేగే
వాసాలకేమొచ్చె, మోసమోయ్ రాజా
క్రీడలోనే చిన్నదాన్ని
నేచిన్నదాన్ని మోసపోయి రాజా
క్రీడలోనే చిన్నదాన్ని"

ఆ పాట పదాలు మారాయి. అర్థాలు మారాయి.

"చింతల్లు మనకేల, చింతల్లు మనకేల
సుత్తికొడవలి వచ్చే, సాగవోయి కూలి"

అంటూ సాగేది. జతలు కట్టి ఆడేవాళ్లు. అంతా కొత్తపాట. నాట్ల పాటలు మారాయి. కోతల పాటలు మారాయి. అంతా కొత్త. ఊరిపెత్తందార్లకు అంతా వింతగా వుంది. పల్లెలో ఏదో మార్పు జరుగుతోంది. పల్లెకి కొత్త వ్యక్తులు వస్తున్నారు. ఎప్పుడూ జరగని సంగతులూ మొదలయ్యాయి.

పెద నరసిమ్మ జొన్న సొప్పకోసం నాయుడు యాలాంకేసి వెళ్లాడు. నాయుడు నరిసిమ్మ కేసి ఎగాదిగా చూశాడు. "ఎవుర్రా పల్లెకొచ్చే కొత్త మనుసులు' అని నిలదీశాడు. అనుకోని ప్రశ్న. నరిసిమ్మ మాట్లాడలేదు. "కమ్మిట్టోల్లా" నాయుడు అన్నాడు. నరిసిమ్మ మాట్లాడలేదు. "మాటాడవేంది రా గాడిద కొడకా" అన్నాడు. అప్పటికీ నరిసిమ్మ మాట్లాడలా. "మాటాడతావా తన్నమంటావా' అని నాయుడు కట్టు మడితాడు విప్పాడు. తాడు బలంగా తిప్పి నరిసిమ్మ వీపుమీద మోదబొయ్యాడు. నరిసిమ్మ తాడు పట్టుకొన్నాడు. పట్టుకొన్న వూపుకు నాయుడు వయసులో పెద్దాడు ముందుకు పడ్డాడు. పక్కయాలం రోశయ్య నాయుడు చూశాడు. గావుకేక పెట్టి కట్టుమడికొయ్యపీక్కొని నరిసిమ్మకేసి పరుగు తీశాడు. ఊహించని పరిణామం. నరసింహం

పరుగు తీశాడు. నాలుగువైపుల యాలాలు. యాలాల్లో చౌదుర్లు చుట్టూ మూగారు. ఏం జరిగిందీ ఎవ్వరూ అడగలా. నాయుడు నరిసిమ్మని తరమటమే చూశారు. తప్పంతా నరసిమ్మదే నరిసిమ్మ మధ్యలో చిక్కుకపొయ్యాడు. ప్రాణం మాత్రం మిగిలుంది ఎట్టా కొట్టారో చౌదర్లకే తెలీదు. ఎట్ట బతికాడో నరిసిమ్మానికే తెలీదు.

ఆ రాత్రి పల్లె నిద్రపోలేదు. కుర్రాళ్ల నెత్తురు వుడుకుతోంది. పెద్దల గుండెల్లో ఆందోళన ఏదో చెయ్యాలనే ఆరాటం. ఏది చెయ్యాలో అర్థంకాని పరిస్థితి. గతంలో అయితే ఏది జరిగినా భయంతో వణికేవాళ్లు. తప్పు తమమీదే వేసుకొని చౌదర్లని, రెడ్లని, బతిమిలాడేవాళ్లు. కాని యిప్పుడు అట్టా అనుకోవడం లేదు. పెద్దమాల ఊళ్లో కెళ్లొస్తానన్నాడు. కుర్రాళ్లు వద్దన్నారు. గతంలోనైతే అట్టాంటి సంఘటన జరిగితే పెద్దమాల ఊళ్ళో పెద్దల్ని కలిసేవాడు. మా వాళ్లు తప్పు చేస్తే కొట్టారుగా అంతటితో తప్పు కాయమని బతిమిలాడేవాడు. అట్టా బతిమిలాడటానికి వెళ్లిన పెద్దని కూడా తిట్టిన సందర్భాలు, తన్నిన సందర్భాలు వున్నాయి. పరిస్థితి యిప్పుడు అట్టా లేదు. ఏదో ఒకటి చెయ్యాలి. ఏది చెయ్యాలి. అదే అర్థం కావటం లేదు.

బయట నుంచి వచ్చిన పార్టీ మనుషులు ఆ రోజే పక్కూరు వెళ్లారు. వాళ్లతోపాటు రామానుజం కూడా వెళ్లాడు. పని పూర్తి చేసుకొని అక్కడ అర్థరాత్రి బయల్దేరారు. అరగంట ప్రయాణం వుంటుంది. మనిషి కన్న మూరెడు ఎత్తున జొన్నచేలు. చేలమధ్య బాట. మంచు వాలటం అప్పుడే మొదలైంది. జొన్న కర్రలు వంటికి తగులుతుంటే వళ్ళంతా తడిసిపోతోంది. అట్టా తడుస్తూనే రామానుజం ఆ యిద్దరు పార్టీ మనుషులు నడుస్తున్నారు. నడుస్తుంటే ఎడమవైపు చేలో అలజడి విన్పించింది. అక్కడే ఆగారు. జొన్న కర్ర పీకుతున్న శబ్దం విన్పించింది. రామానుజం ముందుకు పోబొయ్యాడు. పార్టీ మనిషి అతన్ని ఆపాడు. కాస్త పరిశీలనగా చూస్తూ నిలబడ్డారు. చాలా వేగంగా జొన్నకర్ర పీకుతున్న సందడి. చేను కంకితో వుంది. ఎందుకోగాని పార్టీ మనిషికి అనుకోని ఆలోచన వచ్చింది. రామానుజాన్ని రెండో మనిషిని అక్కడే వుండమన్నాడు. జొన్నకర్రల్ని శబ్దం రాకుండా పక్కకు లాక్కొంటూ ముందుకు పొయ్యాడు. వెళ్లి పదినిముషాలు దాటింది. ఎంతకీ రాడు. రామానుజంలో ఆందోళన. రెండో మనిషి ఆలోచిస్తూ మొదటి మనిషి వెళ్లినవైపు చూస్తున్నాడు. వెళ్లిన మనిషి నింపాదిగా వచ్చాడు. వచ్చాక తనతో రమ్మన్నాడు. ఏమైంది చెప్పమంటే చెప్పలేదు. వచ్చి చూడండన్నాడు. పది అడుగులు వేశారో లేదో చేను మధ్యలో గుండ్రటి మైదానం కన్పించింది. పదీ పదిహేనుమంది పడిలోపల జొన్నకర్రలు పీకుతున్నారు. బైటకి చేను బాగానే కన్పిస్తోంది. లోపల గుండ్రంగా గీతగీసినట్టు పీకుతున్నారు. దాదాపు అరెకరా నేల. పంటంతా నేలమట్టమైంది. వీళ్లను చూసి పీకటం ఆపి దగ్గర కొచ్చారు.

మాలపల్లి మనుషులు. మాలాళ్లు. అంతా కుర్రాళ్లు. వాళ్లల్లోసిన సుబరాయుడు అన్నాడు.

"వాడ్ని అట్టా యిట్టా కొట్లా. మొద్దోడు. బతికేడు. ఏది సెయ్యాలో పాలుపోలా. పెద్దల్ని నిద్రపోనిచ్చి నాయుడి సేను పీకాలను కొన్నాం."

ప్రశాంతంగానే చెప్పాడు. ఆ తర్వాత అంతా కలిసి చుట్టూతా పదికర్రల బారు వదిలి

పీకారు. బయటకు చూస్తే చేనుకు ఏమీ జరగనట్టు అన్పిస్తుంది. లోపలి కొస్తే అసలు విషయం బయటపడ్తుంది.

"తప్పయిందా"

దార్లోసిన సుబరాయుడు అన్నాడు.

"లేదు"

పార్టీ మనిషి అన్నాడు.

"తెల్లారి చూసి నా కొడుకు గుండాగి సత్తాడు"

సుబ్బరాయుడే అన్నాడు.

"పీకేప్పుడు శబ్దం రాకుండా వుండేలా చూడాలి.

పార్టీ మనిషి అన్నాడు. ఆ మాటకు రామానుజం ఆశ్చర్యంగా చూశాడు.

"పల్లె కెళ్లాక ఆలోచిద్దాం. తొందరగా పీకటం, శబ్దం లేకుండా వుండేలా చూసుకోవడం. ఆలోచించాల్సి వుంది."

సిన సుబరాయుడు ఆ మాటలు వింటూ నడుస్తున్నాడు. అతని వెనక పధ్నాలుగుమంది కుర్రాళ్లు.

సిన సుబరాయుడికి తండ్రి లేడు. తల్లి వుంది. ఎప్పుడు కనపడ్డా "పిల్లోడికి పెళ్లి సెయ్యాల పంతులా" అని అంటుంది. ఈ ముక్కు బేసర వచ్చేదానికిత్తా పంతులా అంటో ముక్కుబేసర చరిత్ర ముందేస్తుంది. అది యిత్తడి ముక్కు బేసర. పెళ్లయిన కొత్తలో వాళ్లత్త ఆమె ముక్కుకున్న ముక్కు బేసరతీసి ఈమె ముక్కుకు పెట్టింది. సచ్చేలోపు రాళ్లకమ్మ సేయిత్తానే కోడలా అని కూడా అంది. అత్త సచ్చింది. రాళ్లకమ్మ చేయించలా. "అయితే ఏ మాటకా మాట చెప్పుకోవాల పంతులా" అంటో అత్త రేపు చస్తుందనగా ఈ రోజు బొడ్డున అయిదు బేడలు డబ్బుల్ని తీసి తన పైటకొంగుకు కట్టి వాడికి చెప్పొద్దే బిడ్డా అని అంది. ఆ మాట చెప్పి కళ్లంట నీళ్లు పెట్టుకొంటుంది. ఆ ఏడ్పు ఆగదు. అట్టాంటి మారాజు పుట్టదు. పెళ్లి మాట పక్కకు పోతుంది. అత్త మాటతో ఆగిపోతుంది. ఎప్పుడు కనపడ్డా అంతే. విచిత్రమేమిటంటే ఆమె అత్త ఆమెను ఎప్పుడు సరిగ్గా చూసి ఎరగదు. ఎప్పుడూ ఏదో వక గొడవ పెడ్తూనే వుండేది. యిది చస్తేగాని నాకు సుఖం లేదని ఆమె బహిరంగంగానే అంటుండేది. కాని చచ్చాక అత్తని చాలా గొప్ప మనిషిగా మాట్లాడుతోంది. ఈ జీవితాల్లో యిదో అద్భుతమనిపిస్తుంది.

ఆ అద్భుతం గుండెల్ని తాకుతుంది.

రూతు మేరి సువార్తకేసి చూసింది.

మేరి కంటిరెప్పలు కొట్టుకుంటున్నాయి.

మబ్బు కుదురుగా ఓ చోట కూర్చొని చల్లబడ్డట్టుంది. తుంపర మొదలైంది. యిమ్మానుయేలు బైటవున్న వస్తువులు లోపల సర్దాడు. ఆ తర్వాత వానలో తడిసే ఎర్రక్రోటన్ల కేసి చూస్తూ కూర్చొన్నాడు.

"కురిసే వాన కాదు, చెప్పు రామానుజం. సుబరాయుడ్ని. చెప్పు. వదలకుండా చెప్పు' 'వానకేసి అసహనంగా చూస్తో రూబేను అన్నాడు. రామానుజం చెప్పకపోతున్నాడు

సుబ్బారాయుడు ఒంటరిగాడు చిన్నప్పుడు నాయుడి దగ్గరే జీతానికి వున్నాడు. కాస్త పెద్దవాడయ్యాక మానేశాడు. మట్టి పని దొరికితే మట్టి పనికిపోతాడు. కుప్ప నురిపిళ్లలో కుప్ప నురిపిళ్ల కెల్తాడు. వామి వెయ్యటంతో మంచి పేరుంది. వడ్ల పాతర్లు తిరిగెయ్యటం వుంటే సుబరాయుణ్ణే పిలుస్తారు. అట్టా ఏదో ఒకటి చేస్తూనే వుంటాడు చుట్ట తాగడు. బీడి తాగడు. పనుల్లేక పోతే బిళ్లకోడు ఆడుతాడు. ఎంత ఎత్తు బిళ్లనైనా యిట్టే కొట్టేస్తాడు. బొంగరం గాల్లోకి విసిరి అరచేతిలో వేసుకొని అలవోకగా తిప్పుతాడు. ఆ చేతిలో బొంగరం ఎంత గుక్కపడుతుందో చూస్తే ఆశ్చర్యమే అనిపిస్తుంది. సందకాడ కూడు తిని కట్టమీద కొస్తాడు ఏదో వక ఎడ్లబండి మీద నిద్రపోతాడు. ఏ బండీ లేకపోతే ఏ చోటైనా వక్కటే. నిద్ర రాకుండా పోదు.

సుబరాయుడు అంతే అనుకొంటే పొరపాటు. సుట్టిల్లు కోటేసు కూతురు ఎంకాయి. యిటు పుల్ల తీసి అటు వెయ్యమంటే పదహారు వొత్తులు వత్తాలి. అట్టాంటి పిల్ల. ఏ పనీ చెయ్యదు. మాట మాత్రం చుప్పనాతి మాట. మాటన్నదంటే అవతల మనిషిగిరికీలు తిరగాల్సిందే. అబ్బ నోరు అంటుంది వాళ్లమ్మ. సుట్టింటి కోటేసు నోరు మంచిది కాదు. నోరెత్తితే బూతు. ఆ నోట్లో వూడిపడింది ఈ కూతురు. వాళ్ళమ్మ "దీన్ని పంపిన మూడురోజే వాళ్ల కొంపకాల్చి పుట్టింట పడుద్ది పంతులా, దీన్తో ఎట్టా సావాలో అంటూ వాపొయ్యేది. అట్టాంటి ఎంకాయి అమ్మ బలవంతాన ఏటికి గుడ్డలు వుతకటానికి అమ్మతో వెళ్లి జొన్న చేను మధ్య నడిసొస్తోంది. వాళ్లమ్మ కాస్త ముందెళ్లింది. అమ్మకి తనకి కాస్త దూరమే. అమ్మని తొలగేస్తూ ఎవరా ఎదురొచ్చే మనిషి అనుకొంది. సిన సుబరాయుడు. వరసైనోడే. వాగుడు నోరు. వూరుకొనేలా లేదు. సుబరాయుడు దగ్గరకి రానేవచ్చాడు. ఆగి చూసింది. ఈ గట్టుమీద కాలుతీసి ఆ గట్టుమీద వేశాడు. ఓ గెంతు గెంతి మళ్లీ ఈ గట్టుమీదికొచ్చి వెనుక్కి చూడకుండా వెళ్లబొయ్యాడు.

"సచ్చుగొడ్డు. కడుపుకింత కుడితి తాగితే సాలా" నోరు అట్టాంటిది. అనకుండా వుండదు.

సుబరాయుడు ఆగాడు. జొన్న చేను చివ్వరకొచ్చిన వెంకాయి అమ్మ వెనక్కు తిరిగి చూస్తే దార్లో వెంకాయి కనబడలేదు. రెండు కేకలేసింది. బదులు లేదు. వెనుక్కి వచ్చింది. చేను మధ్యకొచ్చి కేకేసింది. జవాబు లేదు. మళ్లీ కేకేసింది. తనని దాటి వచ్చిన సిన సుబరాయుడు గుర్తొచ్చాడు. నేరుగా ఏటి గట్టుదాకా వెళ్లింది. అక్కడ నుంచి చూస్తే ఏ మనిషి జాడాలేదు. వెనుక్కి తిరిగింది. ఆ దార్నే యింటికొచ్చింది. వచ్చిన గంట తర్వాత వెంకాయి వచ్చింది.

మాలామాదిగపల్లెల్లో ఏదీ కృత్రిమ్మంగా దాగదు. ఉన్నది ఉన్నట్టు బైటికి కక్కడమే అక్కడ కన్పించేది. తన పిలక తనచేత్తో పట్టుకొని ఎదుటివాళ్ల పిలకలు ముడేసి తన్నుకొనేలా చేసే కుచ్చితబుద్ధి వాళ్లకుండదు. ఏదీ దాచుకోరు. ఆ మొహాలు అట్టాగే వుంటాయి. మనసులూ అట్టాగే వుంటాయి. కోపం వస్తే కోపాన్ని లోపల దాచి నవ్వుని పైకి నెట్టె గొప్ప సంస్కారం వాళ్లకుండదు. కోపాన్ని కోపంగా చూపే మామూలు సంస్కారం వాళ్లది. వాళ్లు కరణాలు కాదు.

కడుపు కాలినవాళ్లు. కడుపు చల్లగుంటే అది నిండుతుంది. తెమిలినట్లు వుంటే అది వాంతి చేసుకొంటుంది. మానవ సంబంధాలూ అంతే. కోపంవస్తే అరుచుకోవటం, కష్టంవస్తే కడుపుకోసి మరీ పెట్టడం. అది చాలా సహజంగా వచ్చిన సంస్కారం. లోపల్లోపల కుములిపోవడం, బైటకు చెప్పుకోలేక వంటరి గదుల్లో ఏడ్వటం అక్కడ కుదరదు. అక్కడ ప్రేమ కృత్రిమం కాదు. ద్వేషం కృత్రిమం కాదు. అక్కడ రెండు మొఖాల మనుషులుండరు. అందుకే వాళ్లని అగ్రవర్ణాలు అలగాజనం అన్నారు. అలగా బతుకులో కృత్రిమం లేదు. దాని సంస్కృతి చాలా సహజమైంది.

వెంకాయి తల్లి తన కోపం దాచుకోలేదు సిన సుబరాయుడు తల్లిమీద కెళ్లింది. తన బిడ్డని జొన్నచేలోకి లాక్కుపోయేంత మొగోడా నీ కొడు కని అంది. వాడంత మగాడయ్యాడా అంది. వాడ్ని రానీ ఉప్పు పాతర పెడ్తానంది. సుబరాయుడి తల్లికి మొదట అర్థంకాలేదు. ఆ తర్వాత అర్థమైంది. మాటకి మాట అంటించడం మొదలెట్టింది. ఆడాళ్ల తగవు మగాళ్లు యిళ్లకొచ్చేదాకా ఆగలేదు. వెంకాయి అన్నలు సుబరాయుడు మీదికి కఱ్ఱలతో వచ్చారు. సుబరాయుడు సచ్చినా వక్కడ్నే. బతికినా వక్కడ్నే. రంఁడ్రా అంటో బజార్లో గీత గీశాడు.

రామానుజం చూస్తూ నిలబడ్డాడు. ఏదో మాట్లాడబోతున్నాడు. యింతలోనే ఎంకాయి అన్న కఱ్ఱ సుబరాయుడు తలమీద పడింది. సుబరాయుడి తల్లి సచ్చేఁడ్రా నా బిడ్డ అంటో వెఱ్ఱికేక వేసింది. తగాదా ఆగింది.

ఆ రాత్రి రామానుజం సుబరాయుడి పక్కనే కూర్చొన్నాడు. తలకి కట్టుకట్టాడు. తడిక దగ్గర ఎవరో మనిషి నిలబడి వుంటే ఎవరన్నట్టు అక్కడికెళ్లాడు. మొదట ఎంకాయి అనుకొన్నాడు. ఎంకాయి అమ్మ. కాస్త దూరంలో ఎంకాయి నాన్న వున్నాడు. ఎంకాయి అమ్మ రామానుజం చేతులు పట్టుకొంది. "ఆడికెట్టా వుంది పంతులూ" అంది. బెదురు దెబ్బే. రెండు రోజుల్లో కోలుకుంటాడన్నాడు. లోపలికి రమ్మ న్నాడు. "దాని నోరు మంచిదికాదు. నా కడుపు మంట. నేను తిట్టాను. అది తిట్టకుండా వుంటే గొడవ అయ్యేది కాదు. ఆడికంత దెబ్బ తగిలేది కాదు. తండ్రి లేనోడు." రామానుజం ఆశ్చర్యపోతున్నాడు. ఆమె యింకా మాట్లాడుతూనే వుంది. అప్పటిదాకా చూడలేదు. ఎంకాయి ఆరుగురు అన్నదమ్ములు తడికపక్కనే కూర్చొని వున్నారు.

ఆ ఆరుగుర్ని పొరపాటున సినసుబరాయుడు చూసి "రంఁడ్రా లోపల్కి" అంటే ఆ యింట్లోకి పరుగెత్తేలా వున్నారు. లోపలికి రావటానికి మొహం చెల్లక వాళ్లు వెళ్లిపొయ్యారు. ఓ గంట తర్వాత ఎంకాయి వచ్చింది. రామానుజం ఆశ్చర్యపోలేదు. మీవాళ్లు రానిచ్చేరా అని మాత్రం అన్నాడు. వాళ్లంతా నిద్రపోతున్నారని చెప్పింది. నిద్రపోనిచ్చి వచ్చానని చెప్పింది. వాళ్లు నిద్రపోలేదని, ఎంకాయి వస్తున్నా నిద్రపోతున్నట్టు వుండిపొయ్యారని ఆ పిల్లకి తెలీదు. ఆ పిల్లని చూసి సుబరాయుడు అమ్మ మొహం అటు తిప్పి కూర్చొంది. "కూడు తిన్నావా" అని ఎంకాయి ఆమెని అడిగింది. ఆమె పలకలేదు. అప్పుడు తీసింది పైటచాటున సంకలోవున్న కూటిపళ్లెం. "తిను" అంటో ఆమె ముందు పెట్టింది. ఏమనుకొందో ముద్దకలపటం మొదలెట్టింది. "ఎదవముండ. వాగకుండా వుంటే దీనత్తసొమ్ము ఎదిపోద్ది" ఎంకాయి మాటతో సుబరాయుడు

అమ్మ యింతెత్తున లేసింది. "నీయమ్మ నోరుమూపియ్యే. అసలు ఆడ్ని సేలోకి లాగిందాన్ని తన్నుకోమను నా బిడ్డేంసేసేడు" ఆమె రెట్టిస్తోంది. "లాగింది నేనే. ఎందంట, లాగితే ? ఈడు గంగిరెద్దులా ఎందుకొచ్చేడు. రాకుండా పట్టుకోక పోయావా?" ఎంకాయి నిలదీసింది. రామానుజానికి నవ్వొచ్చింది. వీళ్ల మాటల్లో ఎక్కడా తడబాటు లేదు యిట్టా మాట్లాడితే అవతలవాళ్లు ఏమనుకొంటారో అనే ఆలోచనా లేదు. అంత గొడవ పడుతూనే సుబరాయుడు అమ్మ కూడు తింది. ఎంకాయి కూటి పళ్లెం కడిగి పక్కన పెట్టింది. కుక్కి మంచం బైటేసి యింక పడుకో, నేనుంటాలే అని ఎంకాయి అంది. మారు మాట్లాడకుండా ఆమె వెళ్లి పడుకొంది. ఈడితోపాటు యింకో నలుగుర్ని కంటే ఈ దెబ్బలు తగలుతాయా అని ఎంకాయి అంది. ఆశ్చర్యంగా చూశాడు రామానుజం.

ఆ రాత్రి గడిచిపోయింది. మూగసైగలతో మరో నెల గడిచిపోయింది. ఎండలొచ్చాయి. ఎండల్లో సుబరాయుడు ఆరుగురు అన్నదమ్ములకు బావమరది అయ్యాడు. సుబరాయుడు అమ్మ ముక్కు బేసర ఎంకాయి కిచ్చింది. రాళ్లకమ్మ సేయిత్తానే కోడలా అని కూడా అంది.

నాయుడి అరెకరా చేను పీకిసిన సుబరాయుడు ముందు నడుస్తుంటే వెనకాల నడుస్తున్న వాళ్ళలో ఆరుగురు ఎంకాయి అన్నదమ్ములే. సుబరాయుడు బావమరుదులే. ఆ పల్లెలో సుట్టిల్లు కోటేసు బలగం చిన్నది కాదు. కోటేసు అన్నదమ్ములే పదిమంది. అంత బలగంలో కలిసిపొయ్యాడు సుబరాయుడు. పార్టీ మనుషుల్ని తొలిసారి యింటికి పిలిచింది కూడా సుబరాయుడే. పార్టీ వాళ్లంత తొందరగా ఆ పల్లెలో కలిసి పోవటానికి వున్న కారణాల్లో అదొక కారణం కావచ్చు.

పల్లెలోకొచ్చాక సుబరాయుడు, మరో యిద్దరు పార్టీ మనుషుల్తో ఆగారు. మిగిలినవాళ్ళు యిళ్లకెళ్లి పడుకొన్నారు. రామానుజం యింట్లో కూర్చొన్నారు. జరిగిందంతా వివరంగా చెప్పాడు సుబరాయుడు. తెల్లారి పరిస్థితి చర్చకొచ్చింది.

తెల్లారి నాయుడు పొలం చూశాడు. నాయుడుతోపాటు మిగతా చౌదర్లలో ముఖ్యులు కూడా చూశారు. వెంకటచౌదరి పంచాయితీ చేశాడు. పంచాయితీ ఎట్టా జరిగిందో తెలీదు. చౌదర్లు మాత్రం ఏదీ జరగనట్టు వుండిపొయ్యారు. పల్లెలో కుర్రాళ్లు కర్రసాము నేర్చుకోవటం మంచిదన్నాడు పార్టీమనిషి. మొచ్చుమీది కర్రలు బయటకు తీశారు. కర్రసాము నరిసిగాణ్ణి పిలిపించారు. వాన చినుకుల మధ్య చినుకు తాకకుండా కర్ర తిప్పుతాడనే పేరుంది. అన్నాలు తిన్నాక పల్లెపక్క కోసిన కందిచేను చదును చేశారు. సగం రాత్రిదాకా కర్రల శబ్దం విన్పిస్తూనే వుంది. ఊరిపెద్దల్లో అదీ చర్చయి పోయింది.

సరిగ్గా జొన్న చేను సంఘటన జరిగిన మూడు నెల్ల తర్వాత మరో సంఘటన జరిగింది. అది కలిసొచ్చిన సంఘటన అంటాడు సుబరాయుడు. రామానుజానికి అది అనుకోని సంఘటనగా మాత్రం అన్పించదు. బాలకోటడు అంత గుండె వున్న మనిషేం కాదు. పడమట చేను మామిడితోపు పక్కనొస్తుంటే అంటు మామిడి చెట్టు కాయలు వాణ్ణి కదలనియ్యలేదు. అటూ యిటూ చూశాడు.

ఎవ్వరూ లేరు. తెగించాడు. అట్టా వాడు తెగిస్తాడని ఎవ్వరూ అనుకోరు. మొలగుడ్డ తీశాడు. కాయలు కోసి గుడ్డతో చుట్టాడు. చెట్టు దిగి చుట్టూ చూశాడు. ఎవ్వరూ లేరు. కంచె దాటబోతున్నాడు. వీపుమీద తన్ను ఎట్టా పడిందో తెలీదు. ముళ్ల కంచలో పడేసి కాపలా కఱ్ఱ తిరగేసి చౌదరి కోటయ్య కొడుతుంటే నెత్తురు ముద్దే అయ్యాడు. నెత్తురు ముద్దలా పల్లెకొచ్చాడు. ఆ రోజు గడిచిపోయింది. వారం రోజులు అట్టాగే గడిచాయి. ఎనిమిదో రోజు చౌదరి కోటయ్య కట్టుమడి దున్న కఱ్ఱ అదృశ్యమైంది. కట్టుమడి గొడ్లని గుట్టు చప్పుడు కాకుండా విప్పక రాగలిగే తెలివి పీసోడికుంది. పీసోడితోపాటు సిన్నోడు, నల్లోడు సరిసమానమైన మెలకువ చూపుతారంటాడు సుబరాయుడు. చౌదరి కోటయ్య దున్న కఱ్ఱ పోవటాన్ని వెంకట చౌదరి పంచాయితీ చేశాడు. పంచాయితీలో మాలపల్లి మీద అను మానం వుందని తేల్చాడు. రామిరెడ్డి ఎట్టా అనుమానమో తేల్చమన్నాడు. రామిరెడ్డి అట్టా పల్లెని వెనకేసుకొని వస్తాడనుకోలేదు వెంకట చౌదరి. అప్పటికి ఆ చర్చ ఆపాడు. సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

దొంగ గడ్డికోస్తుంటే పల్లెలో ఆడాళ్లని పట్టుకొన్నారు. చౌదరి యాలం దగ్గర ఆడాళ్లని కట్టేశారనే వార్త పల్లెలో గుప్పుమంది. రామానుజం వూహించలేదు. పల్లె పల్లె కదిలింది. కాపుల చేలకు అడ్డంపడి చౌదరి యాలాం దగ్గరకొచ్చారు. చేలకడ్డం పడినడిచే మాలాళ్లని చేలదగ్గరి రెడ్లు, చౌదర్లు ఆశ్చర్యంగా చూశారు. మరొకప్పుడైతే చేను కడ్డంగా అట్టా నడిస్తే నడిచినవాడి జాతకం తారుమారయ్యేది. అంతమందిని వక్కసారి చూడటం మొదటి ఆశ్చర్యం. చేను దగ్గర ఎవరున్నారనేది పట్టించు కోకపోవటం రెండో ఆశ్చర్యం అట్టా చేనుకు అడ్డం పడి నడిచే వాళ్లలో మగాళ్లే కాకుండా ఆడాళ్లు కూడా వుండటం అంతకన్నా ఆశ్చర్యం. అంతకన్నా ఆశ్చర్యం చాకలిపాలెం నుంచి చాకలాళ్లు వచ్చారు. వాళ్లు అంత బహిరంగంగా వస్తారని వెంకట చౌదరి వూహించలేదు. రామిరెడ్డి అనుచరులు కూడా రావటం వెంకట చౌదరిని యిబ్బందుల్లో పెట్టింది. వివాదం వాదానికి మాత్రమే పరిమితమైంది. ఆడాళ్లని తీసుకొని పల్లెజనం పల్లెకొచ్చారు. వెంకట చౌదరి యింకొంతమందిని తీసుకొని టౌనుకెళ్లాడు. టౌన్లో పోలీస్ స్టేషన్ కెళ్లాడు. ఆవలపాడు జీవనం మరో మలుపు తిరుగుతోంది. స్టేషన్‌కెళ్లటం వాళ్ల తొలి వోటమి అని అన్నాడు రామానుజం. ఊరు వేడెక్కుతుంది.

ఆవలపాడు చెరువులో మాలలు నీళ్లు ముంచడానికి పల్లె మధ్య సమావేశం జరిగింది. సమావేశంలో రామానుజం వున్నాడు. రామిరెడ్డి వున్నాడు. చాకలిపాలెం ముఖ్యులూ, మాలపల్లి ముఖ్యులు వున్నారు.

"వాళ్లు దాడిచేస్తారు"

"దాడి తిప్పికొడదాం"

ఎవరు ఎక్కడ వుండాలో, ఎవరు ఎట్టా చెయ్యాలో చెర్లో ఎట్టా దిగాలో విస్తృతంగానే చర్చ జరిగింది. సిన సుబరాయుడు వయస్సు వాళ్లతో విడిగా సమావేశం జరిగింది. ఎంకాయి వయస్సు ఆడవాళ్లు బుంగలతో మొదట చెర్లో దిగాలనే నిర్ణయం జరిగింది. అదో అద్భుతం. బండిబాట ఎదురు రేవు. ఓ చారిత్రక సన్నివేశానికి దారి చూపుతోంది.

బుంగలు పట్టుకొని చెరువు గట్టుకు దూరంగా గంటలు గంటలు బుంగెడు నీళ్లకోసం ఎదురు చూసిన మాలాళ్లు బుంగలతో ఆ రేవు దగ్గర కొచ్చారు. ఓ వైపు రామిరెడ్డి. మరోవైపు రామానుజం. బుంగ తీసుకొని ముందు నిలబడ్డ ఎంకాయి. వెనుక మిగతా ఆడాళ్లు... వందల్లో.. మాలాళ్లు.

చెర్లో దిగారు...

మొదటిసారి. మాలాళ్లు.. బుంగలు పట్టుకొన్న ఆడాళ్లు. చెర్లో దిగారు. చెర్లో మొదటిసారి పాదం పెడ్తున్నప్పుడు, ఆ పాదం కింది భూమి ఎట్టా వుంది. వింత అనుభవం. ఉద్వేగం...... కాళ్లను చుట్టుతున్న చెరువునీళ్లు. అద్భుతమైన గిలిగింత. ఎట్టా ఆలోచించాలి ఈ సన్నివేశాన్ని. ఏ పదాలతో దాచుకోవాలి.

ఎంకాయి బుంగలో చెర్లో నీళ్లు నిండుతుంటే, కళ్లల్లో పొంగిన నీళ్లు చెర్లో పడ్తున్నాయి

పెద ఎంకటి రంగాయి. అరవై ఏళ్ల వృద్ధుడు. ఏమైందో తెలీదు గట్టుమీద కూర్చొని ఎందు కేడుస్తునాడో తెలీదు. రామానుజం పెద ఎంకటి రంగాయికేసే చూస్తున్నాడు. రంగాయి కెదురుగా చెరువుకు అవలిగట్టుమీద దేవాలయం వుంది. ఆ దేవాలయం గోపురం చాటు నక్కిన ఆలయం ధర్మకర్త చినరెడ్డికి గోపురం వొరిగినట్టనిపించింది మరో ధర్మకర్త చౌదరి రంగనాయకులకైతే వొరిగిన గోపురం విరిగినట్టుంది.

చెర్లో దిగిన ఆడాళ్లు రేవు దాటి ముందుకెళ్తున్నారు. అట్టా వెళ్లాలనిపించింది వాళ్లకి. ఒడ్డున వున్నవాళ్ల గుంటలుంటాయే ముందు కెళ్లొద్దని అరుస్తున్నారు. కాని వాళ్లు ఆగటం లేదు. వాళ్లకి చెరువంతా తిరగాలని వుంది. కాళ్లతో చెర్లో నీళ్లు తోసుకుంటూ వెళ్లాలనుంది. ఎన్ని వందల ఏళ్ళ ఆశ అది. ఈ దేశంలో యిట్టాంటి చెరువులు ఎన్ని పుట్టాయి. అంటరాని వాళ్ల పాదాలు తాకకుండానే ఎన్ని పూడిపొయ్యాయి. ఎన్నేళ్లు. వందల ఏళ్లు. ఎన్ని శతాబ్దాలు...... ఈ సహస్రాబ్ది చివ్వరి శతాబ్దం ఏది చూస్తోంది. ఎట్టా నడవటానికి యిష్టపడుతోంది.

నీళ్లల్లో మాలాళ్ల పిల్లలు దూకారు. చేతులు బార్లు చాపి ఈత మొదలెట్టారు. గోపురం పక్క చినరెడ్డి ఆగలేకపొయ్యాడు. సైగ చేశాడు. దేవాలయం లోపల కర్రలు, బరిసెలు, పల్లె రేవు వైపు పరుగు తీశాయి. ఇది ఊహించని పరిణామం కాదు. సరిగ్గా గోపురం వైపు చూస్తున్న చింతచెట్టు కొమ్మల్లో దాక్కొన్న మాలాళ్ల మునయ్య ఈల మోగింది. సమయం కోసం కాసుకకూర్చొన్న సుబ్బరాయుడు, సిన్నోడు, పీసోడు అట్టా వకరు కాదు పల్లె కుర్రాళ్ళు సగంమంది కర్రల్తో, బరిసెల్తో వస్తూన్న ఊరి పెద్దలవైపు పరుగు తీశారు. ఆ పరుగు ఊపులోనే సుబరాయుడు తొలి దెబ్బ చౌదరి మాల్యాద్రి నడుంమీద పడింది. వెర్రికేక వేస్తూ వాడు నేలమీద పడ్డాడు. ఆ బెదురు దెబ్బే ఊరిపెద్దల మీద పెద్ద ప్రభావం చూపింది. పిక్కబలం చూపారు. యిప్పుడు పారిపోవటం ఊరిపెద్దల వంతయింది. తరుంకోవటం పేదోళ్లవైపయింది. అవలపాడు జీవనంలో ఆ పొద్దు యిటు పొడిచింది. చుట్టుపట్ల ఈ వార్త సంచనలమే రేపింది. మాలా మాదిగ పల్లెల్లో ఈ వార్త ఓ వినూత్నమైన వూపునే యిచ్చింది. అగ్రవర్ణాల్లో అట్టా ఎందుకు జరిగిందనే చర్చా

మొదలైంది. ఓ విచిత్రమైన సన్నివేశం మొదలైంది చుట్టుపట్ల మాలామాదిగ పల్లెల్నుంచి ఒకరిద్దరు మనుషులు ఆవలపాడు మాలపల్లి వచ్చిపోతున్నారు అట్టా వచ్చిన మాలాడ్ని, మాదిగాడ్ని ఆ వూరి కాపులు పిలిచి ఆవలపాడు వెళ్లావా అని ప్రశ్నించడం, అనుకొంటే వింతగానే వుంది గాని ఆశ్చర్యపడాల్సిన అంశం మాత్రం కాదు. అంతేకాదు రామానుజం, సినసుబరాయుడు పేర్లు చుట్టుపట్ల గ్రామాల్లో విన్పిస్తున్నాయి. ఆవలపాడు కలలు కంటోంది. కలల్లోనే అది ఆగిపోవటం లేదు. వాస్తవాల్లోకి వాటిని తర్జుమా చేస్తోంది.

కాని అంటరానివాళ్ల కలల్లో ఎంతో దుర్మార్గం చూస్తాయి ఈ అగ్రవర్ణాలు. ఎంతో దుర్మార్గంగా అణుస్తుంది ఈ రాజ్యం. 47 తర్వాతి రాజ్యం. స్వతంత్ర దేశం మనది అని ప్రకటించుకొన్న రాజ్యం.

వెంకట చౌదరి పోలీస్‌స్టేషన్‌లోనే కాపురం పెట్టాడు. చెత్తోడు రంగప్రవేశం చేశాడు. చెత్తోడు పోలీస్ అధికారి. దయ, జాలి, కరుణ లాంటి పదాలు వాడి పరిధిలో లేవు.

ఆవలపాడుకు పోలీసులు వస్తున్నారనే వార్త అందింది. సుబరాయుడులాంటి యువకులు పల్లె వదిలారు. ఏరు దాటారు. పొలాల్లో సురక్షితమైన చోటుకోసం వెతికారు. పల్లెల్లో ఆడాళ్లు మిగిలారు. పిల్లలు మిగిలారు. ముసలాళ్లు మిగిలారు. పల్లెని కాపలా కాయటానికి నడివయస్సు వాళ్లు వో అయిదుగురు అక్కడే వుండిపొయ్యారు. రాత్రులు వాళ్లు తడికల చాటు చీకట్లో కూర్చొనేవాళ్లు. కూర్చొన్న దగ్గర రాళ్లగుట్ట వుంచుకొనేవాళ్లు. ప్రస్తుతానికి అవే వాళ్ల చేతుల్లో ఆయుధాలు. ఎప్పటిదో చింత చెట్టు, ఎప్పుడు పుట్టిందో తెలీదు. ఆ చెట్టు కొమ్మల్లో మనిషి. రెప్పలు ముయ్యకుండా, ఏ అలికిడి జరిగినా అప్రమత్తమౌతో. పల్లె మధ్యవాగు. వాగు గట్టుమీద గుట్టగా ఎదిగిన ఎదురు గూమి. ఆ గూమి మధ్యలో చెక్క కట్టి మంచె చేశారు. అక్కడ కూర్చొంటే పల్లెంతా కన్పిస్తుంది. ముగ్గురు మాత్రం నిత్యం పల్లెలో తిరుగుతూనే వుండేవాళ్లు. పల్లె నిద్రపోవటం లేదు. తిరిగేవాళ్లు పల్లెలో ప్రతి యింటిని పలకరిస్తూనే వున్నారు. తూర్పు పొలం యాలాల్లో యిరవైమంది పోలీసులు దిగారనే పుకారు వచ్చింది. ఆ యాలాలు పాడుపడి వున్నాయి. అవి ఏటిగట్టునే వున్నాయి. అక్కడనుంచి ఏరు కొడవలి ఆకారంలో తిరిగి వుంటుంది. అట్టా తిరిగిన మెట్టంతా నిలువెత్తు కందిచేను. కందిచేను మధ్యలో బాట. ఆ బాటనే దారిపడితే ఏరు వంపు మళ్లీ కలుస్తుంది. గుండాల రేవు దాటలేరు. ఏరు అక్కడ సుడి తిరుగుతుంది. నిజానికి యిప్పుడు అక్కడుంది పోలీసులు కాదు. సుబరాయుడు అతనితోపాటు కుర్రాళ్లు. గుండాల రేవు దాటగలిగేవాళ్లు అందులో అయిదుగురున్నారు. అట్టా అని పల్లెలో తిరిగేవాళ్లకి తెలిసినా పుకారు వింటున్నారే గాని ఫలానా అని చెప్పలేదు.

అప్పుడే ఎవ్వరూ వూహించని సంఘటన జరిగింది. అర్ధరాత్రి సుబరాయుడు యింటిమీద దాడిచేసి సుబరాయుణ్ణి పట్టుకొని పోవడానికి కానిస్టేబుల్ వచ్చాడు. పోలీసులు మూకుమ్మడిగా దాడిచేస్తారని పల్లె అనేక జాగ్రత్తలతో వున్న సంగతి పోలీసులకి తెలీదు. నిజానికి దాడిచేస్తారనే పుకారు ఊరిపెద్దలే చేశారు. పల్లెని భయపెట్టడానికి అట్టా చేశారు. దాడి జరగటం

వట్టిది కాదు గాని ఈ రోజో రేపో జరగటం మాత్రం లేదు. అప్పటికి సుబరాయుణ్ణి పట్టుకోవాలనేది వుంది. ఆ పనిమీదే కానిస్టేబుల్ వచ్చాడు. తోడుగా వచ్చిన మరో కానిస్టేబుల్ వూళ్లోనే వుండిపొయ్యాడు.

పల్లెలో కానిస్టేబుల్ అడుగు పెట్టాడు. చింతచెట్టు కొమ్మల్ని పట్టుకొని చెట్టుమీది మనిషి గట్టిగా వూపాడు. చెట్టుమీది కొంగలు, యితర పక్షులు గొడవ చేస్తూ వక్కసారిగా పైకి లేచాయి. అదే సంకేతం. పల్లెలో తిరిగే ముగ్గుర్లో ఒకడు తూర్పు యాలంకేసి పరుగుతీశాడు. మిగిలిన యిద్దరూ పక్కకు తప్పుకొన్నారు కానిస్టేబుల్ సద్దు చెయ్యకుండా లోపలికి వస్తున్నాడు. యిళ్ళ తడికెలు, తలుపులు మూతలు పడుతున్నాయి. సందు మలుపు తడిక దగ్గరకి కానిస్టేబుల్ వచ్చాడు. ఆ మలుపు తిరిగి కుడివైపు వెళ్తే సుబరాయుడు యిల్లు. ఆ తడికచాటు రాళ్లగుట్ట. అక్కడ దాక్కున మనిషి కానిస్టేబుల్‌ను గమనిస్తూనే వున్నాడు. కానిస్టేబుల్ మలుపు తిరిగాడో లేదో ఒక్క ఉదుటున కానిస్టేబుల్ మీదకు దూకాడు. అనుకోని సంఘటనకి కానిస్టేబుల్ బిత్తరపోయాడు. ఆ వూపుకి కిందపడ్డాడు. తుపాకి దూరంగా పడిపోయింది. వెర్రికేక వేశాడు. పల్లెలో యిళ్ల తడికల తలుపులు అలికిడైన శబ్దం విన్పించింది. కానిస్టేబుల్ చాలామంది దాడికి వస్తున్నట్టు భావించాడు. బలాన్ని తెచ్చుకొని పరుగెత్తడం మొదలెట్టాడు. కానిస్టేబుల్‌పై దూకిన పెంచిలి రాళ్లు తీసుకొన్నాడు. పరిగెత్తే కానిస్టేబుల్ మీద రాళ్లవర్షం కురిపించాడు. కానిస్టేబుల్‌కు రాళ్లు బలంగానే తగిలాయి. పరుగు తీస్తూనే వూరు దాటాడు. అవలపాడుకు పోలీస్‌స్టేషన్ వుండే వూరికి మూడు మైళ్ల దూరం. అక్కడికెళ్లాక గాని తెలిసిరాలేదు తుపాకీ మర్చిపోయిన సంగతి.

పెంచిలి పోలీసు మర్చిపోయి అక్కడ పడివున్న తుపాకీ కేసి చూశాడు. దాన్ని చేతిలోకి తీసికొన్నాడు. విచిత్రమైన అనుభూతి. వింత భయం. దాన్ని ఏం చెయ్యాలో తెలీటం లేదు. దాన్లో గుళ్లు వుంటాయని తెలుసు. అవి అవతలివాళ్లని చంపుతాయని తెలుసు. అది పోలీసుల చేతుల్లో వుంటుందని తెలుసు. ఈ వూరికి పదిమైళ్ల దూరంలో వుండే చింతలపాలెంలో నాయుడు గోరి బుచ్చియ్య చౌదరి దాన్ని చేతిలో పట్టుకొని తిరిగేవాడని విన్నాడు. కాని అది మాలపల్లె మొదట్లో యిట్టా పడి వుంటుందని ఊహించలేదు. అది మాలాడి చేతిలో అట్టా అనుకోకుండా వచ్చి పడుతుందని అనుకోలేదు. ఎట్టా కాలుస్తారు దీన్ని. తెలిస్తే బాగుండు. చాలా దిగులనిపించింది. దిగులు పడుతూనే తలెత్తాడు. సగం పల్లె తన చుట్టూతా వుంది. అంతా తనకేసి, తన చేతిలో తుపాకీ కేసి చూస్తున్నారు. బహుశా తుపాకీ చేతపట్టిన తొలిమాలాడు పెంచిలే. అందుకే ఆ తర్వాత రోజుల్లో పెంచిలిని తుపాకోడు అనే పిలిచారు. పెంచిలి పేరు పత్తా లేకుండా పోయింది. తనకేసి చూస్తున్న జనం కేసి చూశాడు. యిద్దరు ముగ్గురు పెద్దలు దగ్గరకొచ్చారు. తాకి చూశారు.

"దీన్తోనేరా నాయుడు గోరి బుచ్చియ్య పెళ్లాన్ని కాల్చింది" ఆ ముగ్గుర్లో మరీ పెద్దాయన అన్నాడు.

"ఆడు యదవ నాకొడుకు కాబట్టి పెళ్లాన్ని కాల్చాడు. దాన్ని నా సేతికియ్. ఆడ్ని యిట్టా రమ్మను. ఆడ్ని కాల్చి పారేత్తా".

మరో పెద్దాయన అన్నాడు.

మూడో పెద్దాయన పోలీసులొస్తే ప్రమాదం దాన్ని దాచెయ్‌రా పెంచిలే అని ఆదుర్దాగా అన్నాడు. నిజమేననిపించింది పెంచిలికి. దాచిపెట్టడానికి పల్లె దాటాడు. కట్ట కింది వాముల్లో ఓ వామి గుర్తు పెట్టుకొని వామి అడుగున వుంచి గడ్డి యధాతథంగా వుంచాడు. ఎందుకో అక్కడనుంచి కదలాలని పించలేదు. ఆ రాత్రంతా అక్కడే వుండాలనుకొన్నాడు. తెల్లారకట్ల లేచి పల్లెకేసి వస్తుంటే దూరంగా పోలీసులు ఊళ్లోకి రావటం చూశాడు. చేలకడ్డం పడ్డాడు. ఏరు దాటాడు. చేనుడొంకనే నడిచాడు. ఓ గంట నడిస్తే మేనమామ వూరుంది

ఆ రాత్రి పరిగెత్తుతూనే కానిస్టేబుల్ స్టేషన్‌కెళ్లాడు. తుపాకీ మర్చిన సంగతీ, తనమీద దాడి జరిగిన పద్ధతి చెప్పాడు. వెంటనే వార్త పట్టణానికెళ్లింది. చెత్తోడు ఒంగోలులో దిగి వున్నాడు. ఆవలపాడు మాలపల్లి మామూలుగా కన్పించలేదు. పోలీసులు కథ అల్లడం మొదలెట్టారు పల్లెజనం చెర్లో నీళ్లల్లో దిగారు. ముంచేప్పుడు ఘర్షణ జరిగింది. రైతుల్ని తరిమి తరిమి కొట్టారు. రైతుల స్త్రీలమీద దాడిచేశారు. పోలీసు కథ అల్లుకపోతున్నారు. చీకటి రాత్రి సాక్ష్యం చెప్పదు. అట్టా మాలాళ్ళు నేరం చేశారు. నీళ్లలోకి దిగేప్పుడు పోలీసులకు చెప్పలేదు. అట్టా చట్టాన్ని గౌరవించలేదు. పోలీసులకు పరిస్థితి రైతుల ద్వారా మాత్రమే తెలిసింది. వెంకట చౌదరి పెద్ద మనిషి. వూరంతా గౌరవించే మనిషి. అట్టాంటి మనిషి మాలాళ్లు రైతుల యిళ్లపై బడి ఆడాళ్లని అవమానపరచాడని చెప్పాడు. పెద్దాయన అబద్ధం చెప్పడు. ఆయనకి ఆత్మాభిమానం వుంది. ఆయన చౌదరి. మామూలు చౌదరి కాదు వందెకరాల చౌదరి. స్వాతంత్ర్యం రాకముందు వాళ్ల నాయన జస్టిస్ పార్టీలో వుంటే ఈయన తండ్రిమాట కాదని కాంగ్రెస్‌లో చేరాడు. గాంధీ ఆంధ్ర దేశం వచ్చినప్పుడు ఆయన సమావేశాలకు చాలావరకు హాజరయ్యాడు. అట్టాంటివాడు. అట్టాంటివాళ్లకు ఆత్మగౌరవం ఎక్కువ. కాని తన ఆత్మ గౌరవాన్ని కూడా పక్కన పెట్టి తమ స్త్రీలని మాలాళ్లు అవమానపరచారని ఫిర్యాదు చేశాడంటే ఆ అలగాజనం ఎంత ఘోరంగా, దుర్మార్గంగా, అనాగరికంగా ప్రవర్తించారో అధికారులు అర్థం చేసుకోగలరు. అధికారుల మనసుల్ని ఆత్మాభిమానం, ఆత్మగౌరవం, అధికారం, డబ్బు వున్న కాంగ్రెస్ వాది వెంకట చౌదరి ఫిర్యాదు కదిలించింది. అట్టా కదిలించినందుకు ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. కదిలించకపోతేనే ఆశ్చర్యపడాలి. అదీకాక వెంకట చౌదరి తన ఫిర్యాదులో ఓ అమూల్యమైన సమాచారం కూడా ఇచ్చాడు. ఆ సమాచారం చిన్నది మాత్రం కాదు. కమ్యూనిస్టుల సమాచారం. గొప్ప సమాచారం. వెంకట చౌదరిలాంటి పెద్ద మనిషి మాత్రమే యివ్వగలిగే సమాచారం. వెంకట చౌదరి అంతటితో ఆగలేదు. మీరు వస్తే ఆ కమ్యూనిస్టుల్ని యిల్లిల్లూ తిరిగి పట్టిస్తానన్నాడు. అంత గొప్ప మనిషి అంత గొప్ప సహకారం అందించడానికి సిద్ధంగా వున్నాడు. పోలీస్ శాఖ ఆయన్ని అభినందిస్తూ ఆ రాత్రి విలువైన కాలంలో వో అయిదు నిమిషాలు గడిపింది.

అన్నిటికన్నా వాళ్ళు, ఆ మాలాళ్ళు, ఆ కమ్యూనిస్టులు పోలీసు తుపాకీ లాక్కొన్నారు. కాబట్టి తప్పదు. పల్లె సర్వ నాశనమైనా ఈ దుర్మార్గాన్ని సహించడానికి వీలులేదు.

పేర్లు ప్రాధమిక రిపోర్టులు రాయటం మొదలెట్టారు.

సిన సుబ్బరాయుడు. వయస్సు 30ఏళ్ళు - కులం మాల - కమ్యూనిస్టు

పీసోడు. వయస్సు 30 ఏళ్ళు - కులం మాల - కమ్యూనిస్టు.

అట్టా రాస్తోపోయారు. వెంకట చౌదరి దాదాపు యిరవై పేర్లు చెప్పాడు. అందరికన్నా గట్టి పేరు రామానుజం. అదే కులం . ఉపాధ్యాయుడు. కమ్యూనిస్టు నాయకుడు. ఆ పేర్లతో పాటు అగ్ర కులాల్లో పేర్లు మూడున్నాయి. చాకలిపాలెం పేర్లు మూడున్నాయి. కావాల్సిన కాయితాలు చేతికి తీసుకొన్నాడు చెత్తోడు. ఆవలపాడులో పోలీసు బలగం దిగింది. తెల్లారిజామున టిఫిన్ చేసినట్టు ముప్పయి కోళ్ళని తిన్నారు ముప్పావుయి సీసాలు ఖాళీ చేశారు.

తెల్లారింది. పల్లె మీద దాడి మొదలైంది. పల్లె జనం బిత్తరపోయారు. ఆడాళ్ళు, ముసలాళ్ళు, పిల్లలు ఏమి జరగబోతుందో ఎవ్వరికీ తెలీదు. చెత్తోడి పక్కన వెంకట చౌదరి. మొదటి పనిగా స్కూల్‌కేసి వెళ్ళారు. రామానుజం క్లాసులో వున్నాడు. పిల్లలు కొద్దిమందే వచ్చారు.

''వాడే రామానుజం''

వెంకటచౌదరి రామానుజం కేసి చూపిస్తూ పెద్దగానే అన్నాడు. రామానుజాన్ని అక్కడికక్కడే అరెస్టు చేశారు. సిన సుబ్బరాయుడు పల్లె వదిలి వెళ్తూ రామానుజాన్ని కూడా రమ్మన్నాడు. కాని తాను ఉపాధ్యాయుడు కాబట్టి తనని తాకకపోవచ్చు అనే నమ్మకంతో వున్నాడు. తన నమ్మకం వమ్మయింది. కళ్ళముందే తమ పంతులిని పోలీసులు లాక్కెళుతుంటే పిల్లలు బిత్తరపోయారు. ఆ స్కూలు హెడ్మాస్టరు యలమంద ఎందుకట్టా చేస్తున్నారని అన్నాడు. చెత్తోడి లాఠీ పంతులు వీపు మీది పడింది. ముసలి ప్రాణం అల్లల్లాడిపొయ్యింది. రామానుజం తో పాటు ఆయన్నీ అరెస్టు చేశారు. నిజానికి యల్లమంద చాలా భయస్తుడు. మాలాడే. కాని ఆ పల్లెలో అంత జరుగుతున్నా తొంగి చూసిన పాపానపోలేదు. ఎంత దూరంగా వున్నాడో పాపం. చెత్తోడి మొదటిలాఠీ దెబ్బ తన మీదనే పడ్తుందని వూహించలేదు. యిదంతా పక్క క్లాసుల్లో వుండి చూస్తున్న యిద్దరు కుర్ర పంతుళ్ళు గోడ దూకి పరుగు తీశారు. పోలీసులు వాళ్ళ వెంటపడ్డారు. అట్టా వెంటబడ్డ వాళ్ళు పల్లెలో జొరబడ్డారు. ఆ వెనుకే చెత్తోడు, వెంకట చౌదరి పల్లెలో కొచ్చారు.

యిళ్ళు గాలించటం మొదలెట్టారు. తుపాకీ తీసిందెవరో చెప్పమంటున్నారు. ఎక్కడ పెట్టారో చెప్పమంటు న్నారు. విచక్షణలేదు. ఆ డాళ్ళని లేదు. పిల్లలని లేదు. ముసలాళ్ళని లేదు. కొడ్తున్నారు. తమ దగ్గరున్న జాబితాలో పేర్లని వాకబు చేస్తున్నారు. వెంకట చౌదరి వీడు పలానా వాడి అబ్బ. ఇది ఫలానావాడి అమ్మ. ఇది వాడి పెళ్ళాం అంటో చూపిస్తున్నాడు. అట్టా చూపించిన వాళ్ళని చెత్తోడు మరీ బాధిస్తున్నాడు. ఉదయం ఎనిమిది గంటలకు మొదలైన దాడి పదకొండు దాకా విరామం లేకుండా సాగింది. సాయంత్రం మళ్ళీ వస్తాం. అడుగుతాం. ఈ లోపు తుపాకీ ఎక్కడ దాచింది, ఎవరు దాచింది చెప్పమన్నాడు చెత్తోడు. అట్టా అంటో ఊరినీ

పల్లెని వేరు చేసే బాట దగ్గర కెళ్ళాడు. చింతచెట్టు నీడన వెంకటచౌదరి తెప్పించిన కుర్చీలో కూర్చొన్నాడు. ఏమనుకొన్నాడో పల్లెలో పదిమంది పిల్లల్ని తీసుకరమ్మన్నాడు. పిల్లలు ఏడుస్తున్నా లాక్కొచ్చారు. వచ్చిన పిల్లల్ని లెక్కేశాడు. యిరవైమంది వున్నారు. ఒక్క గంటలో పిల్లాడికి రొండు కోళ్ళని పట్టుక రమ్మన్నాడు. పిల్లలు బిత్తరపోయారు. అట్టా తీసుకు రాకపోతే మిమ్మల్ని కోసుకతింటానన్నాడు.

పిల్లలు పల్లెలోకి పరుగు తీశారు. ఎట్టా కోళ్ళ వెంట పరుగుతీశారో తెలీదు. తలా రెండు కోళ్ళని పట్టుకొచ్చారు. కోళ్ళ కాళ్ళు కట్టేసి వరసగా పడుకోబెట్టారు. పిల్లలు చూస్తూనే వున్నారు. వాళ్ళ లేత గుండెలు కొట్టుకుంటున్నాయి. వాళ్ళ చూపులు ఆ దారుణాన్ని చూడలేక మూసుకపోతున్నాయి. వళ్ళంతా వణికిపోతోంది. చెత్తోడు పొడవాటి కత్తి తీసికొన్నాడు. పిల్లలు కెవ్వున కేకవేశారు. తలలు తెగిన కోళ్ళు, మొండాలు ఎగిరి పడుతున్నాయి. తెగిన తలలు అంత దూరంలో ఎగిరిపడ్డాయి. పిల్లలు వకర్ని వకరు వాటేసుకొన్నారు. అంత ఘోరం వాళ్ళ జీవితంలో మొదటిసారి చూశారు. చాలా ఏళ్ళు ఆ దృశ్యం వాళ్ళ మనస్సులోంచి చెరిగిపోలేదు. ఆ సంఘటన జరిగిన సంవత్సరం తర్వాత స్కూళ్ళ యిన్‌స్పెక్టర్ ఆ స్కూలుకు తనిఖీ కొచ్చి పోలీసులు ఏది చేస్తారో చెప్పమన్నప్పుడు- తమ పుస్తకాల్లో చదివిన మాటలు వాళ్ళకు గుర్తు రాలేదు. కోళ్ళని కోసుకతింటారని చెప్పారు. ఆ యిన్‌స్పెక్టర్ ఆశ్చర్యపోయాడు. టీచర్ విషయం వివరించాక అతని మనస్సు కరిగిపోయింది. సెంటర్ క్లాసులో అది ఉపాధ్యాయులకు చెబుతూ కళ్ళ నీళ్ళు పెట్టాడు. అట్లాంటి దృశ్యం అది. భయపడ్తున్న పిల్లలకేసి చూసి చెత్తోడు నవ్వాడు. అది పిల్లలకి నవ్వులా అన్పించలేదు. ఆ తర్వాత తలా రెండు కోళ్ళని వలవమన్నాడు. పిల్లల కళ్ళ నిండా నీళ్ళు.

ఆవలపాడు చెరువు అందుకు సాక్ష్యం.

అక్కడున్న చింతచెట్టు అందుకు సాక్ష్యం.

అక్కడ నుంచి మొదలై, చేల మధ్య సాగి ఏటిదాక వెళ్ళే ఆబళ్ళ బాట అందుకు సాక్ష్యం.

ఏడుస్తూ కోడిబొచ్చు పీకుతున్న పిల్లలు. అంటరాని వాళ్ళు.

పక్క గుడిసె పీకారు. తాటాకు మంట వేశారు. కోళ్ళు కాళ్ళు పట్టుకొని మంటల మీద కోళ్ళని పిల్లలే కాల్చారు. వాటిని కాలుస్తుంటే వాళ్ళు కాలిపోతు న్నట్టు అన్పించింది వాళ్ళకి. కాల్చిన కోళ్ళని తట్టలో పెట్టి వెంకటచౌదరి యింటికి పంపారు. వాటితో పాటు వెంకటచౌదరి వెళ్ళాడు. చెత్తోడు పేర్లు మరో సారి చూశాడు. రామిరెడ్డి పేరుంది. ఈ రామిరెడ్డికి మాలాళ్ళకి సంబంధం ఏమిటనుకొన్నాడు. కమ్యూనిస్టు. అదే సంబంధం. ఆ తర్వాత జాల రామయ్య పేరుంది. కులం చాకలి అనుంది. సింగంరాజు కులం రాజు అని వుంది. వీళ్ళంతా కమ్యూనిస్టులు. అందులో రామిరెడ్డి, జాలరామయ్య చాలా ప్రమాదకరమైన వ్యక్తులు.

భోజనాలయ్యాక రామిరెడ్డి పేరు అడిగాడు, వెంకటచౌదరిని చెత్తోడు. అక్కడికి రావటానికి

చౌదరి సుముఖంగా లేడు. గుర్తు చెప్పాడు. చెత్తోడు రామిరెడ్డి యింటికెళ్ళాడు. రామిరెడ్డి లేడు. రామిరెడ్డి భార్య వుంది. వెంకటచౌదరి అక్కడికి రానన్నా రామిరెడ్డిని రెండోసారి మాలాళ్ళకు సపోర్టు రాకుండా భయపెట్టాలన్నాడు. చూచాయగా యింటినిండా ధాన్యముందన్నాడు. దానర్థం యిల్లు తగల బెట్టమనే అని చెత్తోడు అనుకొన్నాడు. అంతే. రామిరెడ్డి విశాలమైన పెంకుటిల్లు కాలటం మొదలెట్టింది. పెంకు కింద మంచి ఎదురు బొంగు వేశారు. ఎదురుబొంగు శబ్దం చేస్తూ పగులుతుంటే పెంకులు దూరంగా ఎగిరిపడ్తున్నాయి. చుట్టూ అగ్గిసెగలు. యిప్పుడు రెడ్లు కూడా చెల్లా చెదరౌతున్నారు. కాలే రామిరెడ్డి యింటి మంటల్ని చూసి మాలపల్లి వొణికిపోయింది.

చాకలిపాలెం జాలరామయ్యని అరెస్టు చేశారు. అడ్డమొచ్చిన అక్కని నడిబజార్లో లాగారు. యిష్టమొచ్చిన మాటలన్నారు. రామానుజాన్ని, యలమంద పంతుల్ని, జాల రామయ్యని పోలీస్ వ్యాన్‌లో అప్పటికప్పుడే ఒంగోలు పంపారు.

సాయంత్రం ఆరు గంటలకి మళ్ళీ పల్లెమీద పడ్డారు. అవే మాటలు - తుపాకీ ఎక్కడ దాచారు. ఎవరు లాక్కొన్నారు చిన సుబరాయుడు ఎక్కడ. ప్రతి మాటకి ఓ దెబ్బ.

దృశ్యాలు

రూతు కళ్ళ ముందు

రామానుజం ముందుంచిన దృశ్యాలు.

చిన్నపిల్లల ఏడుపు. కాలుతున్న రామిరెడ్డి యిల్లు. గుండెలు బాదుకొంటున్న పల్లె జనం. విడివిడి దృశ్యాలు. కేవలం గుక్కెడు నీళ్ళ కోసం. 47 తర్వాత ... 47 జ్ఞాపకాలు యింకా నెమరు వేసుకొంటున్న తొలి దశలో ...

దృశ్యం వెనుక దృశ్యం.

ఎంత దారుణం ఒక్కో దృశ్యం. నొప్పులు పడుతున్న సుబ్బయ్య భార్య సెంద్రి. ఎట్టా ముగిసింది ఆ దృశ్యం. తుపాకీ సంఘటన రోజు నెప్పులు మొదలయ్యాయి. ఆ రాత్రంతా నెప్పులతోనే పోరు చేసింది. ఆ రోజే ప్రసవం జరుగుతుందను కొన్నారు. మంత్రసాని ప్రసవం కోసం అట్టాగే కూర్చొంది. తెల్లారిజామున నెప్పులు ఆగాయి. కరకర పొద్దు కాడ మళ్ళీ మొదలయ్యాయి. పోలీసుల దాడి జరుగుతూనే వుంది. అయింట్లో మంత్రసాని అట్టాగే వుంది. అంత నెప్పుల బాధతోనే లాఠీ దెబ్బతింది సెంద్రి. ప్రసవం కోసం ఎదురు చూస్తున్న మంత్రసానీ లాఠీ దెబ్బతింది. సాయంత్రానికి నెప్పులు ఎక్కువ య్యాయి. సాయంత్రం ఏడు గంటలు. చీకట్లు అలుముకొన్న సమయం. విపరీతమైన నొప్పులు. పల్లెలో జనాల్ని చెట్టు దగ్గరికి తోలమన్నాడు చెత్తోడు. తన్నుకొంటూ తెస్తున్నారు. అరుచుకొంటూ జనం చెట్టు కిందికి చేరుతున్నారు. చెట్టు కింద పెట్రోమాక్సు లైటు వెలుతురు తప్ప మరొకటి లేదు. సెంద్రినీ తరిమారు. తరుముతూ తన్నారు. మంత్రసాని సెంద్రిని వదలలేదు. యిద్దరి జుట్టు పట్టుకొని లాక్కొచ్చారు. ఆడాళ్ళనందర్నీ ఒక చోట వుంచారు. ఎదురుగా మగాళ్ళనుంచారు. పిల్లలు ఎటో

చూస్తున్నారు. కోళ్ళ దృశ్యం వాళ్ళ మనస్సుల్లోనే ముద్రపడి వుంది. అవే ప్రశ్నలు. ప్రశ్నకో దెబ్బ. ఆడాలేదు. మగాలేదు. పోలీసుల యిష్టం.

సెంద్రి నెప్పులు ఎక్కువయ్యాయి. పెద్దగా అరుస్తోంది. కుప్పకూలినట్టు కూర్చొంది. మంత్రసాని మౌనంగా సెంద్రినే చూస్తోంది. పోలీసు దెబ్బలు ఆమెకు గుర్తులేదు. వాళ్ళు ఏమడుగుతున్నారో ఆమె పట్టించుకోలేదు. రాత్రి నుంచి ఓ అంటరాని వాడు ఈ భూమ్మీద పడటానికి తొలి చూపుల్తో ఈ దారుణాన్ని చూడటానికి ఘర్షణ పడ్తున్నాడు. వాడి కోసం ఎదురు చూస్తోంది. ఖచ్చితంగా మగబిడ్డే. కదిలికంతా అట్టాగే వుంది. సెంద్రి ఆగి ఆగి అరుస్తోంది. మంత్రసాని సెంద్రి చుట్టూ అంతా నిలబడండి అని అంది అంతే. ఆడాళ్ళంతా సెంద్రి చుట్టూ దడి కట్టారు. చెత్తోడు పెట్రోమాక్సు లైటు తీసుకొని అక్కడికి వచ్చాడు 'కంటోందా' అంటో లోపలికి తొంగి చూడబోయాడు ఆడాళ్ళు ఛీ అంటో చుట్టు గుడిశలా సెంద్రి చుట్టూ మూగారు. చెత్తోడి లారీ దెబ్బలు వాళ్ళ మీద పడుతున్నాయి పోలీసులు వాళ్ళ చేతుల మీద, కాళ్ళ మీద కొడ్తున్నారు. కాని ఆ మానవ చుట్టు గుడిసె కూలిపోలేదు. చెదిరిపోలేదు. వాళ్ళ దృష్టంతా సెంద్రి పైనే. పైన పడుతున్న లారీ దెబ్బలు బాధపెట్టడంలేదు. పోలీసుల బూతులు విన్పించటంలేదు. అంత బీభత్సంలో ఓ వెర్రికేక ... ఓ పిల్లాడి ఆర్తనాదం వో అంటరానివాడి తొలికేక.

నిశ్శబ్దం.

మంత్రసాని తన పని తాను చేసుకొంటోంది. బిడ్డను చేతిలో తీసుకొని ఎత్తి చూపింది. ఏడుస్తున్న బిడ్డ. నల్లరంగు. నల్ల జత్తు. ఎంత అందం. నలుపు చాలా అందమైంది. అంత దారుణంలోనూ, అంత విషాదంలోనూ ఓ అందం వికసించి చుట్టూ చూస్తోంది.

బతుకు గొప్ప పోరాటం.

ఆ బిడ్డ తెలుసుకొన్న తొలి సమాచారం. చెత్తోడు వెనుక్కి తగ్గాడు. నలుగురు ఆడాళ్ళు డోలికట్టారు. బిడ్డని తల్లిని డోలీలో వుంచారు. డోలీ మోసుకుంటో సెంద్రిని ఆమె యింటికి చేర్చారు. చెత్తోడు చూస్తూనే వున్నాడు వెంకట చౌదరి చూస్తూనే వున్నాడు. పోలీసులు చూస్తూనే వున్నారు. మంత్రసాని మౌనంగానే, తల్లీ బిడ్డ కేసి చూస్తూనే డోలీ పక్కనే నడిచింది. వాళ్ళు పల్లెలోకి వెళ్ళిందాకా చూశాడు చెత్తోడు. ఒక్కసారి కోపాన్నంతా మగాళ్ళ మీద చూపాడు. దెబ్బ మీద దెబ్బ. గాయం పక్క గాయం. వళ్ళంతా నెత్తురు. అంత చీకట్లోనూ నెత్తురు కన్పిస్తూనే వుంది.

ఈదేశంలో పీల్చే గాలికి కులముంది
తాగే నీటికి కులముంది
పారే పంట కాల్వకి, పండే భూమికి కుల ముంది
బడికి, గుడికి, రచ్చబండకి కులముంది
తినే తిండికి, వుండే ఇంటికి, కట్టే బట్టకి కులముంది
మాటాడే మాటకి కులముంది
సాహిత్యానికి, సంస్కృతికి కులముంది

రాజ్యానికి కులముంది, దాని చట్టానికి కులముంది
న్యాయానికి, న్యాయస్థానానికి కులముంది
శవానికి, శ్మశాన వాటికకు కులుముంది
దేవుడికి కులముంది, దెయ్యానికి కులముంది

అందుకే ఆ నెత్తురు అట్టా కారింది అట్టా కారిన నెత్తురుకూ కులముంది. అయితే ఆవలపాడులో కారిన నెత్తురుకు ఓ ప్రత్యేకత వుంది అది ఆవలపాడు మాలపల్లి మాలల నెత్తురు. అది ఆవలపాడు మాలపల్లి కమ్యూనిస్టుల నెత్తురు.

నెత్తుటి జ్ఞాపకం
నెత్తుటి దృశ్యం

ఆ దృశ్యం అట్టాగే రెండు రోజులు సాగింది పోలీసుల వర్తమానం తెలియడంతో సిన సుబరాయుడు అతని మిత్రులు విడిపోయారు. ఏరుదాటి పక్క వూళ్ళోకెళ్ళారు. మూడో రోజుగాని సిన సుబరాయుడికి తుపాకీ వుదంతం తెలిసిరాలేదు. ఆరా తీశాడు. పెంచిలి తీసి వుంటాడని అనుకొన్నాడు. పెంచిలి పల్లెలో లేడు. కాబట్టి పెంచిలి మేనమామ ఊరికి మనిషిని పంపాడు. పెంచిలిని కలిసి తుపాకీ ఎక్కడ పెట్టిందీ తెలుసుకొన్నాడు. నిజానికి తుపాకీ కోసం అంత కథ జరుగుతోందని పెంచిలికి తెలీదు ఆ రాత్రే ఆ యిద్దరూ యితర వూళ్ళల్లో వున్న మిత్రుల్ని కలిశారు. చర్చించుకొన్నారు. తుపాకీ ఆచూకీ చెత్తోడికి అందేలా చూడాలనుకొన్నారు. అట్టా జరగకపోతే పల్లె మీద దాడి మరీ ఎక్కువ కావచ్చనే అభిప్రాయానికొచ్చారు. సుబరాయుడు చాకలి మంగయ్యని కలిశాడు. ఆ కబురు వెంకటచౌదరికి అందేలా చూడమన్నాడు. గాలి వార్తలా వెంకటచౌదరి చెవిలోకి ఆ వార్త అందేలా మంగయ్య చేశాడు.

దాడి ఆగింది.

ఆ దృశ్యం అట్టా ముగిసింది. అయితే పల్లెలో యాభైమంది అరెస్టయ్యారు. సిన సుబరాయుడ్ని, రామిరెడ్డిని యిది జరిగిన వారం రోజులకి అరెస్టు చేశారు. కాల్చెయ్యాలనే ఆలోచనకూడా పోలీసులు చేశారు. కాని ఆ ప్రయత్నం ఎందుకాగిందో తెలీదు. దాదాపు సంవత్సరం పాటు కోర్టుకు అరవైమంది మాలపల్లి వాళ్ళు తిరిగారు.

కోర్టు చుట్టూ తిరగడానికి వాళ్ళకు డబ్బులుండేవి కాదు. నెలకోసారి తిరగాల్సి వచ్చేది. రామానుజం, సినసుబరాయుడు, పెంచలి అయితే ఒక్కొసారి నెలలో మూడు సార్లు తిరగాల్సి వచ్చేది రామానుజం ఉద్యోగం వూడుతుందనుకొన్నాడు. అది క్రిస్టియన్ ఎయిడెడ్ స్కూల్. అందుకే నిలిచింది.

అట్టా కష్టాలుపడ్డా వాళ్ళకా కష్టాలు లెక్కనిపించలేదు. కారణం వక్కటే. తరాల నాటి కోర్కె తీరింది. చెర్లోకి దిగుతున్నారు. నీళ్ళు ముంచు కొంటున్నారు. అడ్డుకొనే ధైర్యం పెత్తందార్ల చేయలేక పోతున్నారు.

గుక్కెడు నీళ్ళ కోసం అక్కడ యుద్ధమే జరిగింది. అట్టా అని వాళ్ళు యుద్ధ ప్రియులు కాదు. శాంతి మార్గాల్లో నీళ్ళు దక్కితే వాళ్ళంత శాంతి ప్రియులు మరొకరు లేరు. కాని వాళ్ళ జీవితం వాళ్ళకి ఏదైనా యుద్ధం చేస్తేనే దక్కుతుందని చెప్పింది. అందుకే వాళ్ళు యుద్ధం

చేశారు. బహుశాదాన్ని యుద్ధం అని చరిత్రకారులు అనకపోవచ్చు. యిట్లా అనొచ్చు. గొడవపడ్డారనొచ్చు. కొట్లాడారనొచ్చు. ఏదైనా అనొచ్చు. ఒక్కటి మాత్రం నిజం. ప్రాణం యివ్వటం వల్ల మాత్రమే ఆత్మగౌరవం దక్కుతుందని వాళ్ళ జీవితం వాళ్ళకి చెబితే వాళ్ళు ప్రాణం యివ్వటానికే సిద్ధపడ్డారు.

రామానుజం ఆవలిపాడును చెప్తున్నప్పుడు రూతుకు కోస్తాలోని ఆవలపాడుతో పాటు తెలంగాణా మొత్తం ముందు నిలిచింది. నెహ్రూ ముందు నిలుస్తున్నాడు. ఆయనతోపాటు ఆయన సైన్యం. సర్దార్‌వల్లబాయి పటేల్, కెప్టన్ సంజప్ప ముందు నిలుస్తున్నారు. వాళ్ళ అమానుషత్వం గుర్తొస్తోంది. వాళ్ళ క్రూరత్వం గుర్తొస్తోంది. ప్రజా జీవితంమీద దాడి చెయ్యడానికి వాళ్ళు కనుగొన్న పైశాచిక మార్గాలు గుర్తొస్తాయి.

తెలంగాణాలో ప్రతిపల్లె ఓ మిలటరీ కాంప్. పల్లెనిండా పోలీసులు మద్రాసు సాయుధ పోలీసులు. మలబారు సాయుధ పోలీసులు. మహారాష్ట్ర సాయుధ పోలీసులు. ప్రతి వక్కడూ ఓ ఆవలపాడు "చెత్తోడు". మనుషుల్ని చంపడానికి అధికారయుతమైన లైసెన్సు. ఎదురుకాల్పుల్లో మనుషుల్ని చంపడం అప్పుడే మొదలైంది

నెహ్రూ

పటేల్

సంజిప్ప

తూర్పున యింకా తెలవారదు దాడి మొదలు. లారీల్లో పోలసులు. వాళ్ళకి సహాయపడుతూ కాంగ్రెస్ కార్యకర్తలు. తుపాకీ మడమలు చింతబరికలు. బూట్ల కాళ్ళు, బాయినెట్లు, జనం గుండెల్లోకి, స్త్రీల మానాల్లోకి. తగలబడే తిండిగింజలు. తగలబడే పైరుపంటలు. తగలబడే యిళ్ళు. చెరచబడ్డ స్త్రీలు, బాలింతలు, పసిపాపలు. శవాలౌతున్న యువతీ యువకులు. అరెస్టులు

తెలంగాణా నెత్తుటి దృశ్యం. అమ్మ చెప్పిన దుర్మార్గమైన వాస్తవం.

చెబుతూ అమ్మ ఏడ్చింది.

చెబుతూ అమ్మ ఏడ్పించింది.

ఎందుకట్లా ?

చాలా వాటికి సమాధానం జీవితమే అవుతుంది. రూతుకు అది నిజమేననిపిస్తుంది.

రామానుజం బడిపంతులు. కమ్యూనిస్టు ఎందుకయ్యాడు. జైలుకెందుకెళ్ళాడు. కోర్టు చుట్టూ ఎందుకు తిరిగాడు. జవాబు జీవితమే చెప్పాల్సి వుంటుంది. ఆ రాత్రంతా ఆవలపాడును చెప్పాడు. రామానుజం ఆ తర్వాత చాలా చెప్పాడు. రూతుకు యిప్పుడు అన్నీ గుర్తు లేదు. నెహ్రూ సైన్యం తెలంగాణాలో అడుగుపెట్టడం. నిజాం లొంగుబాటు. కమ్యూనిస్టుల్ని అణిచివేయడం. తెలంగాణా పోరాట విరమణ. 1952 సాధారణ ఎన్నికలు. అట్లా చెప్పుకొంటోపోయాడు. ప్రతి చోట ఆవలపాడును కలుపుతున్నాడు.

కాని రూతుని, రూబేనును ఆశ్చర్యపరచిన అంశం ఒకటుంది. రామానుజం మధ్య మధ్య గుర్తు తెచ్చుకోవటానికి తంటాలు పడ్తున్నప్పుడు అతనికి యిమ్మానుయేలు అందిస్తున్నాడు. తేదీలతో సహ గుర్తు చేస్తున్నాడు.

# 17

రామానుజం మర్చిపోయిన అంశాలు అందించడమే కాదు, కాలం గడిచేకొంది యిమ్మానుయేలుకు సంబంధించి చాలా ఆసక్తికరమైన అంశాలే తెలిసొచ్చాయి. కొన్ని రూతుకు కాస్త ఆందోళన కూడా కల్గించాయి. రూబేను మాత్రం ఆశ్చర్యపోలేదు. వెనుక్కి చాలా వెనుక్కి వెళ్ళి మాట్లాడాడు. అది ఏటికి ఎదురీదడం అన్నాడు అట్టా ఈదడం తన వంశంలోనే వుందన్నాడు. తన వంశం పెనవేసుకొన్న స్నేహాల్లోనూ వుందన్నాడు. పార ఎత్తి నీళ్ళ మడవ మీద నిలబడ్డ సుభద్రని గుర్తుచేశాడు. నారిగాడ్ని, మాతయ్యని ముందుంచాడు. ఎల్లన్న పదాల్ని వక్కొక్కటే గుర్తు చేశాడు.

అది ఎన్నెలదిన్ని వారసత్వమన్నాడు.

ఆవలపాడు ఓ యవ్వనుడుకి యిచ్చిన జీవితమన్నాడు.

నా శరీరం నన్ను ప్రతిక్షణం ప్రశ్నిస్తుందంటాడు. మార్టిన్‌ని ప్రశ్నించినట్టు. సిమోనును భయపెట్టినట్టు.

ఆ ప్రశ్న ఆ భయం తనను వెన్నాడుతున్నాయని పదే పదే అనేవాడు. ఆ భయం, ఆ ప్రశ్న యిప్పటిది కాదనేవాడు. ఎర్రెంకడికి ముందు నుంచి వస్తుందనేవాడు.

"కాని ...."

రూతు చెప్పమన్నట్టు చూసింది. చాలా ప్రశాంతంగా చూశాడు. కళ్ళనిండా చదవాల్సిన వెలుగు.

"యిమ్మానుయేలు భయం వెన్నాడని రూబేను"

భయం వెన్నాడని రూబేను ఎట్టా వుంటాడు. యిమ్మానుయేలులా వుంటాడు. యిమ్మానుయేలు ఎవరు. తన బిడ్డ. రోజీ కన్నా ముందు పుట్టినవాడు. అంతేనా. యింకా ఏదీ అనుకోవటానికి లేదా తన బిడ్డను అనుకొంటే. వుంది. చాలా వుంది. సినసుబరాయుడు యిమ్మానుయేలును గూర్చి చాలా విషయాలే చెప్పాడు.

ఎమన్నాడు సిన సుబరాయుడు తన బిడ్డని. ఎట్టా అన్నాడు. ఆవలపాడు వెళ్ళే రోజు. దారిలో తోడై. ఎట్టా అన్నాడు తన బిడ్డని.

"శానా మంచోడు. నక్సలయిట్"

అప్పుడు అర్థం కానట్టు అతనికేసి చూసింది. అర్థమయ్యాక ఆందోళన పడింది. అల్లకల్లోలమయ్యే గుండెని అదుపు చేసుకోడానికి చాలా గట్టి ప్రయత్నమే చేసింది. దారంతా

అదే మాట. శానామంచోడు. నక్సుయిట్. రూబేను కేసి చూసింది. నడుస్తూనే వున్నాడు. రెండడుగులు ముందుకేశాడు. సినసుబరాయుడు రూబేను ఏం మాట్లాడు కొంటున్నారో వినబడటం లేదు. యిమ్మానుయేలే ముందు నిలుస్తున్నాడు.

కుటుంబారాధనలో చాలా వినయంగాకూర్చొనే యిమ్మానుయేలు. పాట పాడినా, వచనం చదివినా, ప్రార్థన చేసినా అంకితమయ్యే యిమ్మానుయేలు. ఎట్టా అయ్యాడు. దేన్ని వెతుక్కొంటో పరుగు తీస్తున్నాడు.

"మీకు తెల్వదా. రామానుజం పంతులు యిప్పుడు ఆవలపాడులో లేడు. సీకాకులం ఎల్లాడు".

సినసుబరాయుడు అన్న ఆమాట విన్పించింది. కోస్తా ప్రాంతంనుండి యువకులు, మేధావులు, విద్యార్థులు శ్రీకాకుళం వెళ్తున్న వార్తలు వింటూనే వుంది.

రామానుజం ఆవలపాడులో లేడు.

శ్రీకాకుళం వెళ్ళాడు.

రామానుజం నక్సలైట్. సినసుబరాయుడు మాటల్లో నక్సుయిట్. తన బిడ్డ ! యిమ్మానుయేలు !

ఆవలపాడు చాలా దూరం వెళ్ళింది. ఆ దూరంలో యిమ్మానుయేలు. యిప్పుడు వెనక్కి రమ్మని పిలిచినా విన్పించకపోవచ్చు.

సినసుబరాయుడు మాటలు వినాలనుకొంది. ఆ యిద్దరి పక్కనే నడుస్తోంది. కాస్త నడక తగ్గించమంది. రూబేను ఏదీ మాట్లాడటం లేదు. వింటున్నాడు. నీళ్ళవాగు దగ్గర నీళ్ళు తాగుతారా అని అన్నాడు సుబరాయుడు. నీళ్ళు తాగటం కన్నా కాస్త బండల మీద కూర్చొవాలనిపించింది. పొగతోటల నుండి పచ్చాకు బండ్లు వస్తున్నాయి.

పచ్చాకు బండ్లు రోడ్డు మీదికొచ్చాయి. బండి వెనకాల పచ్చాకు కూలీలు. మడ్డిపాంటుల్లో, మడ్డి చొక్కాల్లో వింతగా వున్నారు. బండ్లని తోలగేసి అడ్డదారిన పడ్డారు. బండ్లు తూర్పుపాలం చుట్టుబాటలు వెళ్తాయని ఆ బళ్ళు పచ్చాకు పందిరి దగ్గరకు వెళ్ళేటప్పటికి వీళ్ళు అడ్డదార్ని పల్లెచేరి బిడ్డలకిన్ని పాలిచ్చి, పొయ్యి కిందకి పుల్లలు చూసి, ఏటికి అడ్డంపడి పచ్చాకు పందిరి చేరుతారని, తిరిగి ఏదో జాముకొచ్చి కూళ్ళు వండుకుంటారని సినసుబరాయుడు చెప్పాడు. తాను రైజ్ చేస్తానని చెప్పాడు. తన కింద ముగ్గురు టోకర్లు వుంటారనీ చెప్పాడు.

"ఏదో మోటోడ్ని. మోటి మాటల్తో చెబుతున్నాను. నలభై యెమ్మిదిలో కంనిస్టయ్యా. యాభై రెండు దాకా పోరాటం మాటలే. కాని మారింది. ఎలచ్చన్లలో పడ్డాకే అంతా మారింది. మా వూరు మాలపల్లి సెల్లోకి యాభైరెండు ముందేదిగింది. ఆ తర్వాతైతే అట్టా కుదిరేది కాదు."

రూతు వింటూ వుంది.

"నా యన్ని మోటి మాటలు. మోటాలోచనలు."

కావచ్చు. కాని సినసుబరాయుళ్ళు జీవితం చదివినవాళ్ళు. సినసుబరాయుడు 'నక్సయిట్' అని అన్నా. 'కంనిస్టు' అన్నా 'సీపెం' అన్నా, 'సీపై' అన్నా, సీకాకులమన్నా. ఆ పదాలు రూతుకు అచ్చుతప్పుల్లా అనిపించవు. సహజంగా అన్పిస్తాయి. అచ్చు తప్పులు చదుకొన్నవాళ్ళకి. మొరటు బతుకుల్లో అచ్చు తప్పులేదు. వాళ్ళు ఎట్టా పలికితే ఆ పలుకే అసలైంది. "రెండు సిలోన్ బుడ్లు కట్టాక జొరం తగ్గిందే మావా" అని అంటే అసలైన పదం సెలైన్ బాటిల్‌కాదు, సిలోన్‌బుడ్డే. అది యింగ్లీష్ పదమేకాదు. సంస్కృత పదమైనా అంతే. 'కూడు' పోతన పద్యాల్లోనే అచ్చమైన తెలుగుకాలేదు మాలామాదిగ యిళ్ళల్లో ప్రతినిత్యం అద్భుతంగానే అందంగానే వాడబడుతోంది.

"సీకాకులం ఎల్లాల. రామానుజం పంతులు సెప్పకుండా ఎల్లేడు. ఎట్టా ఎల్లాలో సెప్పమంటే యిమ్మానుయేలు సెప్పడు. కాని ఎల్లాల."

సుబరాయుడు తన యింటిదారి పడుతూ అన్న ఆఖరి మాట అది.

రూబేను ఏది ఆలోచిస్తున్నాడో తెలీదు.

యిల్లు దగ్గర పడింది. జెస్సీ పరిగెత్తుకొంటూ వచ్చాడు. ఎగిరి తాత మెడ పట్టుకొన్నాడు. మేరీ సువార్త కళ్ళనిండా నవ్వు. యిమ్మానుయేలు స్కూలునుండి యింటికొచ్చి మళ్ళీ ఎటో వెళ్ళాడట. పొద్దుపోవచ్చు అని అంది మేరీసువార్త.

కలిసి తిందామని యిమ్మానుయేలు కోసం ఎదురు చూశారు. పచ్చాకుపందిరిలో ఆకు దింపిన కూలీలు యిళ్ళ కొస్తున్నారు. మడ్డిగుడ్డలు మూటకట్టి చెర్లో నీళ్ళకోసం పరుగు తీస్తున్నారు. అంతా యుద్ధంలా వుంది పరుగుల్తో నీళ్ళు తెచ్చే తల్లి వెంట నిద్ర కళ్ళ పసిపాపలు ఏడుస్తూనే వెంబడిస్తున్నారు. కొందరు తల్లులు బుట్టలు తీసుకొని అంగడికెళ్తున్నారు. బియ్యం తెచ్చుకోడానికి, యింత పప్పు తెచ్చుకోడానికి. అదీ పరుగే. వాళ్ళ వెంట పసిపిల్లలు. తిరిపెం బెల్లం ముక్క కోసం .... సందడి. ఆకలి తీర్చుకొనే సందడి. బెల్లంముక్క ఏడ్పు సందడి.

అట్టా తెచ్చుకొన్నాక, ఎవరో తరుముతున్నట్టు వండుకొన్నాక, బతకాలంటే తినాలి కాబట్టి యింత కాలే ముద్ద నోట్లో కుక్కుకొన్నాక నిద్ర.

అలసిపోయి తీసే కునుకు. బిడ్డకు రొమ్ము వదిలేసి నిద్ర.

ఓ జాము పొద్దున మేస్త్రీ అరుపులు.

మళ్ళీ మడ్డి పొంట్లు. మడ్డి చొక్కాలు. పచ్చాకు పందిరికేసి పరుగులు .....

సినసుబరాయుడు వచ్చాడు. రైజుకెళ్తున్నానన్నాడు. వచ్చేప్పుడు ఎంకాయిని తోడుకొచ్చాడు. ఎంకాయి వంట్లో నలతగా వుంటే పనికి పోలేదు. యిమ్మానుయేలు వచ్చినట్టు లేదు, వాళ్ళకి తోడుండు అని ఎంకాయికి చెప్పి సుబరాయుడు వెళ్ళాడు. ఎంకాయి అక్కడే వుండిపోయింది. తన గోడు మొదలెట్టింది. ముగ్గురు కూతుళ్ళంది.

పెద్దదాన్ని బయటిచ్చారు. యిద్దర్ని వూళ్ళోనే యిచ్చారు. అత్తచ్చిన ముక్కు బేసర చూపమంది రూతు. నవ్వి చూపించింది. రాళ్ళ కమ్మలు పెట్టినట్టులేదు. పెట్టలేకపోయినానే కోడలా అని కన్ను మూసింది. "సుచీ మచీ లేని ముండ. ఎట్టాగో బతికింది. రేపు పోతాదనగా ముందు రోజు కూడా పక్కింటితో గొడవే. దాన్నోరు మంచిది కాదు. అయితే ఏమాట కామాట. నా నోటి ముందు దిగదుడుపే. కుక్కిన పేనులా యింట్లో వుండేది. నోటి గుల తీరాలంటే పక్కిళ్ళతో గొడవ పడేది. పిచ్చి ముండ రాళ్ళ కమ్మల మాట ఎన్ని సార్లందో. ఆ సంగతి మర్సిపోయే అత్తా అన్నా అదే మాట. అదే సివరి మాట." అట్టా చెప్పుకపోయింది ఎంకాయి. ఒక్కొ ఆకూ తీసి బండ మీద పెట్టింది. పచ్చడి రోకలి తుడిసి వాటిని నలగ కొట్టింది. పళ్ళు వదులయ్యాయంది. ఆకు వక్క నమలకపోతే పళ్ళు తీపి పుడ్తాయంది. నిజానికి అంత వయస్సు లేదు. ఆకలి రూపాన్నే మారుస్తుంది.

యిమ్మానుయేలు యింకా రాలేదు. యిప్పట్లో వచ్చేలా లేడు మీరు తినండని అంది మేరీ సువార్త. తాతా నానమ్మల మధ్య కూర్చొన్నాడు జెస్సీ. చెరో ముద్దా పెట్టాలన్నాడు. అట్టా వాళ్ళు పోటీలు పడి ముద్దలు కలుపుతుంటే వాడి ఆనందం అంతాయింతా కాదు. ఆరు బయట మంచాలు వేసింది మేరి. ఎంకాయి ఎప్పుడు నిద్రపోయిందో తెలీదు. అరుగు మీద పైట పరుచుకుని పడుకుంది. ఆమె అంతే మీరు పడుకోండని అంది మేరి.

తాత నానమ్మల మధ్యకి దూరాడు జెస్సీ. రూతుకు ఎన్నెలదిన్ని పొన్నంగిపిట్ట గుర్తొచ్చింది. ఆ పిట్ట చేతిలోకి వొదిగి పోయింది. ఈ పిట్ట తలని తన పొట్టపై పెట్టి కాళ్ళని తాత గెండెల మీద పెట్టింది. అంతే తేడా. నవ్వొచ్చింది. 'పొన్నంగి పిట్ట' ముద్దుగా జెస్సి బుగ్గల్ని నిమురుతూ అంది. అదేంటో చెప్పమన్నాడు జెస్సీ. ఎన్నెలదిన్ని యిళ్ళు, పొన్నంగి పిట్ట రావటం చెప్పింది. వాడు అక్కడితో ఆగలేదు. ఎన్నెలదిన్నిలో ఎందుకున్నారన్నాడు. అది మా అత్తగారిల్లంది. మీ అత్త పేరేంటన్నాడు. శశిరేఖ అంది. "శశిరేఖ పేరు భలేగా వుంది" అని అన్నాడు. వాళ్ళ అత్త పేరు సుభద్ర అంది. మీ కంతా అత్తలేనా అమ్మల్లేరా అని అన్నాడు. రూతుకు నవ్వొచ్చింది. రూబేనుకూ నవ్వొచ్చింది. మీ అత్త పేరేంటి అని మేరీని అడిగాడు. నోర్ముయ్యరా అని మేరి నవ్వుతూ అంది. రూబేను నే చెబుతారా చిన్నా అన్నాడు. జెస్సీ చెప్పు అంటో గిర్రున తిరిగి తల తాత పొట్టమీద పెట్టి కాళ్ళు నానమ్మ మీద పెట్టాడు.

"ఎన్నెల పిట్ట"

రూబేను నవ్వుతూ అన్నాడు.

"ఎన్నెల పిట్ట .... పొన్నంగి పిట్ట ..... ఎన్నెల పిట్ట ... పొన్నంగి పిట్ట" జెస్సీ పదేపదే అంటో పైకి లేసి ఎగరసాగాడు. అంతటితో పిట్ట పాట ఆగలేదు. "ఏమేమి పిట్ట' ' రూబేను అన్నాడు. "ఎన్నెల పిట్ట" జెస్సీ అన్నాడు. "ఎట్టాంటి పిట్ట" మళ్ళీ వాడే అన్నాడు. "పొన్నంగి పిట్ట" రూతు అందుకొంది. నవ్వులు ... అవలపాడు పొలిమేరలు

తాకేంత నిండైన నవ్వులు .....

రూతుకు యిప్పటికీ స్పష్టంగా విన్పించే నవ్వులు.

జెస్సీ నవ్వులు.

పొన్నంగి పిట్ట నవ్వులు ...

రూతు కళ్ళల్లో రాలుతున్న నీటి బొట్లు. గుండెల్లో దాచుకోలేని జ్ఞాపకాల అలజడి ...

ఆ రాత్రి అట్టా నవ్వుతూనే నిద్రపోయ్యాడు జెస్సీ. పొన్నంగి పిట్ట. యిద్దరి మధ్య, యిద్దరూ చెప్పకుండా పారిపోతారని గట్టిగా వాటేసుకుని. రూబేను నిద్రపొయ్యాడు. గుర్తుగా చిన్న గురక మొదలెట్టాడు. జెస్సీ ఎన్నెలపిట్టనీ పొన్నంగి పిట్టని కలవరిస్తూనే వున్నాడు. రూతుకూ నిద్రొచ్చింది. ఓ జాము కాడ ఎందుకో మెలుకువ వస్తే అట్టాగే కూర్చొని వున్న మేరీ కన్పించింది.

"రోజూ యింతేనా"

మేరి ఉలిక్కిపడి ఆ మాట అన్న అత్తకేసి చూసింది.

"తిన్నావా"

అత్తకేసే చూస్తూ వుండిపోయింది. మాటాడలేదు.

"ఎదురు చూడటం ఈ యింటి కోడళ్ళకే చెల్లింది.""

అత్త ఏం మాట్లాడుతుందో మేరీకి అర్థం కాలేదు.

"సుభద్రా ఎదురు చూసింది. శశిరేఖా ఎదురు చూసింది. మేరీ సువార్తా అంతే. ఒక్క నేనే మినహాయింపు. రూబేను యిప్పటికీ నన్ను ఎదురు చూసేలా చెయ్యలా. రేపటి సంగతి చెప్పలేను. పద అన్నం తిను."

ఆ మాట అంటూ రూతు లోపలికి నడిచింది. మేరి అత్తతోపాటే లోపలికెళ్ళింది. అన్నం పళ్ళెంలో రూతే పెట్టింది. కూరలు వడ్డించి ఎదురుగా కూర్చొంది.

"తిను"

మేరీ సువార్త వాకిట్లోకి చూస్తోంది.

"తిని చూడొచ్చు."

"కలిసి తినటం ...."

"నాకు తెలిసి నువ్వు వాడితో పెళ్ళయ్యాకే కలిసి తిన్నావ్. కానీ ఈ యింటి కోడలు, నాకన్నా ముందుది. నా అత్త అత్త. పెళ్ళికాకముందే దొంగచాటుగా కట్టుకోవాలనుకున్న వాడితో కలిసి తిన్నది. తనవాడి కోసం బొమ్మిడాయి పులుసు దొంగచాటుగానే వండింది. పెళ్ళయ్యాక అదే పులుసు అందరి ముందూ వండి యిష్టంగా కలిసి కూర్చునే తింది. సుభద్ర అట్టా తింది. జీవితాంతం అట్టా తినాలనుకొంది. జరిగిందా ? జరగలా. వెళ్ళినవాడు ఆఖరి క్షణాల్లో వచ్చాడు. కరువు తినగా మిగిలిన

కొనవూపిరిగా వచ్చాడు. ఏది చేసింది మనకన్నా ముందుది. కలిసి తినేందుకు బొమ్మిడాయి పులుసు కాదు, కుండలో వక్క మెతుకు కూడా లేదు. మొగుడికేసి అట్టాగే చూసింది. బిడ్డ చేతిలో మొగుడు తన పేరు తప్ప మరొకటి మాట్లాడటంలా. అప్పుడు తన వాడిలో ఎవర్ని చూసింది సుభద్ర. కలిసితిన్న సుభద్ర. కలిపిపెట్టిన సుభద్ర. ఎవర్ని చూసింది. బిడ్డని చూసింది. "యిట్టా ఈరా ఆ బిడ్డని" అని తన బిడ్డని అడిగింది. పవిట చాటున తన వాడి తలని వుంచుకుంది. ఎదకి హత్తుకుంది. ఎందుకట్టా చేసింది."

రూతు ఆగింది. చెప్పలేకపోతోంది. ఏదో అర్థంగాని ఆవేదన. మేరీ సువార్త అత్తకేసి చూస్తో వింటోంది.

"ఎందు కట్టా చేసింది. చెట్టంత బిడ్డ. పెళ్ళయిన బిడ్డ. సుభద్ర బతికుంటే పసి రూబేనును ఆమె చేతుల్లో వుంచే బిడ్డ. అదంతా ఆలోచించిందా. తన భర్త తల నిమురుతో అన్ని ఏళ్ళ తర్వాత కూడా తన వంట్లో పాల చుక్క తిరిగి తిరిగి ఈ బిడ్డ గొంతులో పడితే బాగుండు అనుకొంది. జరగదు. అట్టా జరగదు. కాని జరుగుతున్నట్టే భ్రమ. ఆ భ్రమతోనే కళ్ళు మూసింది. మళ్ళీ తెరవలా. కలిసి తిన్న సుభద్ర. కలిపిపెట్టిన సుభద్ర. అట్టా కలిసిపోయింది."

రూతు మళ్ళీ ఆగింది. ఈ సారి మళ్ళీ మాట చెప్పటానికి చాలా సమయమే తీసుకుంది. ఆ మౌనాన్ని మేరీ సువార్త భరించలేకపోతోంది.

"తిను ... యిట్టానా కలిపేది .... ఈ ముద్ద పట్టు".

"నేను తింటాను."

"నీకు చిన్నప్పుడు యిట్టాగే పెట్టాను. యింకా నీకు ముసలితనం రాలా. యిట్టా నువ్వు నాకు కలిపి పెట్టే రోజు ముందుంది. అప్పుడు ఈ రోజు గుర్తొస్తే నీకు విసుగని పించదు."

"చాలు నేను తింటాను."

"తిను."

పళ్ళెం మేరికిచ్చి యిమ్మానుయేలు టేబిల్‌కేసి చూసింది. చాలా పుస్తకాలు. కొన్ని పేజీలు తీసి అట్టాగే వున్నాయి. కాస్త ముందుకు జరిగి రెండు పుస్తకాలు అందుకొంది. వాటిని తిరగేసింది. ఆ పుస్తకాల మధ్య రాసుకొన్న నోట్సు వుంది. అది గుర్తుకోసం రాసుకొన్నట్టుంది. ప్రసంగానికి ముందు రూబేను యిట్టాగే రాసుకొంటాడు. ఆ పేజీల కేసి చూస్తూ కూర్చొంది. అంతా వర్తమానంలాగుంది. చూడటం మాని చదవటం మొదలెట్టింది. వర్తమాన చరిత్రని రాసుకొన్న గుర్తులు.

ఓ పోరాటం.

గాయాల పోరాటం.

గుండె గాట్ల పోరాటం.

నక్సల్‌బరీ పోరాటం.

అదో నిప్పురవ్వ.

వీచిన పోరాట గాలి.

రూతు కొత్త ప్రపంచాన్ని చదువుతోంది పెద్ద అక్షరాలలో శ్రీకాకుళం అని రాసివుంది. అండర్‌లైన్ చేసి వుంది.

నోట్సు అక్కడితో ఆగింది. యిమ్మానుయేలు రాత తనకి బాగా తెలుసు. తన బిడ్డే రాశాడు. కళ్ళు గట్టిగా మూసుకొంది.

కళ్ళముందు ....

అదో ప్రపంచం.

వినూత్నంగా వుంది.

ఆందోళనగా వుంది.

భూమి మీద గొప్ప అద్భుతం జరుగుతోంది.

ఆ అద్భుతంలో యిమ్మానుయేలు.

ఎందుకట్టా అద్భుతంలో కలిశాడు యిమ్మానుయేలు. భూమితో మాట్లాడు అది జ్ఞానాన్ని యిస్తుంది. చాలాసార్లు చదువుకొన్న వాక్యం. యిప్పుడెందుకు గుర్తొస్తోంది.

తన బిడ్డ. యిమ్మానుయేలు భూమితో మాట్లాడి వుంటాడు. నిజంగానే అదే చేశాడు. భూమితో మాట్లాడాడు. ఏది చెప్పి వుంటుంది భూమి. బోలెడు రహస్యాలు చెప్పి వుంటుంది. నిత్యం తనని నమ్ముకొని తనని సొంతం చేసుకోలేని తన బిడ్డల కధలు చెప్పి వుంటుంది. కల్లాం గింజల బతుకులు చెప్పి వుంటుంది. అంతేనా. తనని తన బిడ్డలకు దక్కకుండా చెరలో వుంచిన భూస్వాముల మోసం కూడా చెప్పి వుంటుంది.

యింకా ఏది చెప్పింది భూమి.

ఎట్టా చెప్పి వుంటుంది.

ఇన్నేళ్ళు ..

ఇంత దోచేశాక .... యిక్కడ తన గుండెలమీద ఏదీ మిగల్చకుండా తనని చెరలో వుంచిన వాళ్ళు, దోపిడీదార్లు. సమస్త వనరుల్ని పీల్చేశాక ఏం మిగిల్చారు, ఈ పేద జాతికి, చూడమని అడిగి వుంటుంది.

ఈ నేలమీది యింతెత్తు నెత్తుటి చారిక చూపి వుంటుంది. తన గుండె పొరల్లో యింకిన పేదల చెమటని పరిచయం చేసి వుంటుంది.

ఎంత పొర్లినా యింత మట్టి వాళ్ళకు దక్కలా. రాత్రి పగలు తనని పెనవేసుకొని బతికినా వాళ్ళ వంటికి యింత మట్టి అంటలా. చూశావురా బిడ్డా అని చెప్పి వుంటుంది.

వడ్లు పండాయి. జొన్నలు, సజ్జలు, రాగులు, కొర్రలు, ఆరిగలు, సమస్త ఆహారధాన్యాలు పండాయి.

ఏవీ వీళ్ళ యింట యింత చిన్న గాదెగా మారలేదు.

ఓ అనుదిన వాస్తవం ఆకలి. అది వీళ్ళతోపాటు అట్టా పుట్టి యిట్టా పెరిగింది. చాలా యిష్టంగా నిట్టాడిని ఆనుకొని కూర్చొంటుంది.

అట్టా చెప్పి వుంటుంది భూమి.

ప్రకృతిలో వున్న రుతువులు కాక తన బిడ్డల కోసం మరో రుతువు కావాలని అడిగి వుంటుంది.

చరిత్ర కొలిమిని రాజేసి నిప్పు కణికలు ఎగదోసి వుంటుంది.

ఆ నిప్పు కణికల వెలుతురులో

మాలా మాదిగలు

గూడు లేదు. నేల లేదు. పని లేదు. కూడు లేదు.

పెత్తనం. అంతా మీది పెత్తనం. అగ్రవర్ణాల పెత్తనం. పెత్తందార్ల పెత్తనం.

రుతువు మారింది. దాని పేరు మారింది.

శిశిరం, వసంతం, గ్రీష్మం. అట్టా కాదు. దోపిడీ రుతువు. దొంగల రుతువు. దౌర్జన్యాల రుతువు. ఆకలి రుతువు. నెత్తుటివాసన రుతువు -

ఒక బతుకు.

ఒక దోపిడి.

ఒక చావు ....

అంతే. భూమి అట్టా చెప్పి వుంటుంది.

ఓ పుస్తకంలా తన పేజీలు తానే తిప్పుతో చదవమని అడిగివుంటుంది.

ఓ ప్రేమలా గుండెల్ని తాకి వుంటుంది.

మరణించి, మరణించి, మరణించి మరణం మీద విసుగెత్తి పుట్టింతర్వాత చచ్చినా చావనని ప్రకటిస్తో నిలబడ్డ సాహసిలా మాట్లాడి వుంటుంది.

ఎట్టాంటివాడు తన బిడ్డ. చాలా మెతక. జాలి గుండె. వర్షించే కళ్ళు. స్పందించే గుండె. మండే నెత్తురు. మొత్తంగా గొప్ప ప్రేమికుడు. ఓ అందమైన, అద్భుతమైన ప్రేమికుడు.

ఏడ్చుంటాడు.

బిడ్డ ఏడ్చుంటాడు.

భూమి తల్లిని వాటేసుకొని, చిన్నప్పుడు పాలకోసం తనని వాటేసుకొని ఏడ్చినట్టు. కన్నీళ్ళ రాత్రులు గడిపి వుంటాడు.

అట్టా పడివుంటుంది తన బిడ్డ అడుగు శ్రీకాకుళం వైపు - ప్రేమికులంతా అంతే కావచ్చు. పోరాటం వైపే నడుస్తారు కావచ్చు. ప్రేమించటం చాతైన వాళ్ళంతా అంతే కావచ్చు. ఎప్పుడూ అంతే కావచ్చు.

అట్టా అనుకొంటూ కళ్ళు తెరిచింది. మేరీ సువార్త వాకిలి కేసి చూస్తోంది. యిమ్మానుయేలు కోసమే చూస్తోంది.

ఎంకాయి నిద్రలో బూతులు తిడుతోంది. నోరారా తిడుతోంది. ఎప్పుడూ అంతేనంది మేరి. తెల్లారే లోపల కనీసం రెండు సార్లయినా అట్టా చేస్తుంది.

"ఎవర్ని అట్టా తిడుతోంది."

"చెత్తోడ్ని."

ఎంకాయి బూతులు ఆగలేదు. ఆగకుండా ఉంటే బాగుండు అనుకొంది రూతు. ఆ ప్రపంచం తనకి చాలా దగ్గరగా జరుగుతున్నట్టు అన్పిస్తోంది. అది అట్టా జరక్కపోతే తానే జరగాలనుకొంటోంది.

తాతా మనవడు పడుకొన్న మంచం దగ్గరకి వెళ్ళలేదు రూతు. మేరీ మంచం మీదే పడుకొంది. మేరీ చేతిని తన చేతిలోకి తీసుకొంది. శశిరేఖ చెప్పిన సుభద్ర రొయ్యల కారం గొప్పతనం చెప్పాలనుకొంది. చెప్పింది. చెప్పాక వాడొస్తే నిద్రలేపుతాడు పడుకో అంది. మేరీ నిద్ర పోయింది. ఎంకాయి బూతులు ఆగినట్టున్నాయి. పచ్చాకు పందిరిలో గుర్రాలు అల్లుతో కూలీలు పాడే పాటల్ని రాత్రంతా గాలి మోసుకొస్తోంది.

నిద్ర రాలేదు.

బిడ్డ వచ్చేదాకా నిద్ర పోకూడదనుకొంది.

అనుకోకుండా రోజీ గుర్తొచ్చింది. యిమ్మానుయేలు తర్వాత పుట్టింది. రోజీ భర్త వందనం. బతకనేర్చిన భక్తుడు. అసలు రెవెన్యూ ఉద్యోగం నుండి భక్తుడు కావడమే ఓ వింత అంటాడు రూబేను. దొరల్తో బాగా సన్నిహితంగా వుండేవాడు. దొరలు వాళ్ళ దేశం వెళ్ళేప్పుడు వాళ్ళని అంటిపెట్టుకొనే వున్నాడు. అతన్తోపాటు రోజీ కూడా వుంది. ఓ దొరైతే వందనానికి బహూమతిగా తాను వున్న యింటిని యిచ్చాడు. రూబేనుతో మీ అల్లుడు గొప్ప భక్తుడన్నాడు. అట్టాంటి భక్తుడికి ఈ యిల్లు ఓ చిన్న కానుక మాత్రమే అని అన్నాడు. అంత గొప్ప భక్తుడుగా వందనం ఎప్పుడయ్యాడో రూబేనుకు అర్థంకానట్టు రూతుకేసి చూశాడు. రూతుకూ అర్థం కాలేదు. రోజీ కేసి చూస్తే రోజీ దొరమాటలకు ఆనందంగా నవ్వు కొంటోంది.

ఆ తర్వాత అన్నిటి కన్నా ఆశ్చర్యం జరిగింది. వందనం మిషన్ ఫీల్డు పాలకవర్గంలో ఒకడయ్యాడు. రోజీ అడ్రస్ మీద విదేశాల నుంచి ఉత్తరాలు వస్తాయి. ఎక్కడెక్కడో సువార్త సభలు జరుపుతున్నట్టు, వాటి ఫోటోలతో సహా రోజి దొరలకు ఉత్తరాలు పంపేది. సంవత్సరానికోసారి సువార్త కూటాలంటూ పెద్ద ఎత్తున సభలు జరిగేవి. ఆ సభలకు దొరలు వచ్చేవాళ్ళు. రూబేనుకు వందనం, రోజీ ఆశ్చర్యకరమైన వ్యక్తుల్లా కన్పించేవాళ్ళు. మిషన్ ఆస్తుల పంపకం మిషన్ పాలకవర్గం మొదలెట్టింది. రాజకీయ అధికారం వున్న రెడ్లు, చౌదర్లు మిషన్ ఆస్తుల మీద రాబందుల్లా వాలారు. నెల్లూరు, కర్నూలు, కనిగిరి, ఒంగోలు వకటేమిటి మిషన్ ఆస్తులు వున్న ప్రతి చోటా అదే తంతు మొదలైంది. ఇది

దుర్మార్గమన్నాడు రూబేను. తన క్రైస్తవ గుండె ఈ దారుణాన్ని చూస్తూ తట్టుకోలేదని వాపొయ్యాడు. ఆ దారుణంలో తన అల్లుడూ కూతురూ భాగమైనందుకు తట్టుకోలేక పోయింది రూతు. వాళ్ళు కారు కూడా కొన్నారు. యిద్దరు పిల్లల్ని మద్రాసు కాన్వెంట్‌లో వుంచారు. పెద్దాడు విక్టర్. చిన్నది రూబి.

రూబేను కూతురుతో అల్లుడితో సంబంధాలు తెంచుకొన్నాడు. యిస్కారియేతు యూదాకు వీళ్ళకు తేడా లేదన్నాడు. రోజీ యింటికొచ్చినా రూబేను మాట్లాడడు. రూతు మాట్లాడినా ఆ పిల్ల తెలివితేటల ముందు స్వేచ్ఛగా మాట్లాడటానికి సిగ్గుపడుతుంది.

రూబీ మాత్రం తాత దగ్గర కొస్తుంది ఆ పిల్లతో మాట్లాడానికి రూబేను యిష్టపడతాడు. శశిరేఖ అట్టా వుండేదని ఎన్నెలదిన్ని వాళ్ళు ఎవరో అన్నారు. బహుశా అందుకే కావచ్చు. అమ్మొచ్చింది రూతూ అని అనేవాడు రూబీ వస్తే. కూతురు యింటితో ఎదన్నా సంబంధమున్నదంటే అది రూబీ మాత్రమే. అది ఎట్టాంటి విషయమో అర్థంకాదు కాని రూబీ తల్లి దగ్గర కన్నా తాత అమ్మమ్మ దగ్గిరే సెలవలంతా గడిపేస్తుంది.

పచ్చాకు పందిరిలో పాట జోరందుకొన్నట్టుంది. రాత్రి చల్ల గాలిలో ఆ పాట రూతుకు వూరటనిస్తోంది. జెస్సీ కేసి చూసింది. వొదిగి తాత కడుపులో జొరబడ్డాడు. పొన్నంగి పిట్ట.

కళ్ళముందే తెల్లారుతోంది. కర్రల కాంపొండు గేటు శబ్దమైతే అటుగా చూసింది.

యిమ్మానుయేలు.

గేటు తీసుకొని లోపలకొచ్చాడు. ఎప్పుడొచ్చారంటో దగ్గరకొచ్చాడు. బిడ్డకన్నా ముందు బిడ్డ నవ్వు గుండెల్ని తాకింది. రెండు రోజులు అక్కడే వున్నారు. ఆ రెండు రోజులూ తండ్రితో మాట్లాడేటప్పుడు తప్ప యిమ్మానుయేలు ఎప్పుడూ యింట్లోలేడు.

ఆ రెండు రోజులు ఎన్నెలపిట్టకి తోడు పొన్నంగిపిట్ట. వాడు మాటల పుట్ట. మాటలేకాదు. పాటలూ పాడేవాడు. వాడి గొంతు చాలా అద్భుతంగా వుంటుంది. అట్టాంటి గొంతు ఆ యింటి వారసత్వమే అని అనుకొంది రూతు. పాటకు అడుగు వేసేవాడు. ఎల్లన్న అట్టా వేసి వుంటాడు అని రూబేను అంటో మురిసిపొయ్యాడు. రెండో రోజు రాత్రి వాడు పాట పాడాడు. చుక్కల్ని చూస్తో పాడాడు.

రూబేను ఆశ్చర్యంగా చూశాడు. మొదటి చెరణం ఎత్తుకొన్నప్పుడే ఆశ్చర్యపోయాడు.

సూబద్ర యినవే.

సూరుకింద నీళ్ళు సిట్టెలుక తాగే.

సూబద్ర యినవే.

ఆశ్చర్యం నుంచి యింకా రూబేను తేరుకోలేదు. పాట సాగిపోతూనే వుంది. చాలా సహజంగా. గుండెల నిండా జాలి. యుగాల ఆవేదన. అట్టా సాగి సాగి మొదటి చరణం దగ్గర ఆగింది. రూబేను కళ్ళ నిండా నీళ్ళు.

ఎవరు నేర్పారు ?

"అమ్మ."

"యిమ్మానుయేలు రోజూ పాడతాడు. అట్టా నాకు పాట మొత్తంగా వచ్చింది. ఆ పాటంటే యిమ్మానుయేలుకు చాలా యిష్టం వీడు నన్ను పాట నేర్పమన్నాడు. పాడి వినిపించాను. నేర్చుకొన్నాడు."

పిచ్చి రూబేను. ఎంత పిల్లాడు నిజంగా. మళ్ళీ మళ్ళీ పాడించుకొని విన్నాడు పాత మనిషి. బొత్తిగా పాత మనిషి.

మూడో రోజు బయల్దేరుతూ వాడ్ని మాతో తీసుకెళ్తాంరా అన్నాడు రూబేను. యిమ్మానుయేలు కాదనలేదు. మేరీని కూడా వో వారం వుంచుకుని పంపిస్తామంది రూతు మేరీ రానంది. బతిమాలాక కాదనలేదు. ఒంగోలు వచ్చిందే కాని మనసంతా ఆవలపాడు లోనే వుంది. వచ్చేప్పుడు సినసుబరాయుడు లేడు. ఎంకాయితో చెప్పింది. యిమ్మానుయేలు వుత్తరం రాశాడు, సినసుబరాయుడు అడిగానని చెప్పమన్నాడని.

యిమ్మానుయేలు దగ్గర్నుంచి మరో ఉత్తరం వచ్చింది. తాను ఎక్కడికో పనిమీద వెళ్తున్నట్టు తాను వచ్చేంతవరకు మేరీ సువార్తని అక్కడే వుండమని, వచ్చాక తీసుక వెళ్తానని.

ఎక్కడికి వెళ్ళినట్టు. మేరి సువార్త తెలీదంది.

నెల దాటింది. యిమ్మానుయేలు నుండి కబురు లేదు. ఆ తర్వాత తెలిసింది. యిమ్మానుయేలును అరెస్టు చేశారు.

యిమ్మానుయేలూ !

ఎందుకట్టా. ఎందుకురా తండ్రీ. అట్టా నీకోసం ఎదీ మిగుల్చుకోకుండా ... రూతు పదే పదే ఆ మాట అనుకొంది.

అంతా వింతగా చెప్పుకోవటం మొదలెట్టారు. చర్చిలో కూడా ఆదేమాట.

ఏమంది ?

రోజీ ఏమంది. రోజీ మొగుడు ఏమన్నాడు ?

"ఎక్కడ విన్నా వక్కటే మాట. పాస్టర్ గారి కొడుకేంటి అరెస్టు కావటం ఏంటి. తల కొట్టేసినట్టుంది."

యూదాలు.

యిస్కారియేతు యూదాలు.

క్రీస్తును వీళ్ళే పట్టించారు.

వాళ్ళు తలెత్తుక తిరగలేక పొయ్యారేమో. కాని రూబేను తలెత్తుక తిరిగాడు.

వాడితో ఏమన్నాడు 'ఆ సి.ఐ.తో ఏదన్నాడు.' వాడు ఆ చార్లిస్, సి.ఐ. చార్లిస్, "అట్టాంటి బిడ్డని కన్నందుకు రూబేనూ, క్రైస్తవుడిగా నువ్వు సిగ్గుపడడంలేదూ" అని అన్నాడు. ఏమన్నాడు రూబేను, అందుకు ఏది అన్నాడు.

"గర్వ పడుతున్నాను. అట్టాంటి బిడ్డ నా కడుపున పుట్టినందుకు యేసేబు కన్నా మిన్నగా గర్వపడుతున్నాను. మేరీ కన్నా రూతు అదృష్టవంతురాలు... ..." అని అన్నాడు.

వాడి మొహం మీద. ఆ సి.ఐ. మొహం మీద. ఆ చార్లిస్ మొహం మీద నెత్తురు చుక్కలేదు. పిలాతు చేతులు కడుక్కొన్న నీళ్ళు మొహం నిండా చిలకరించుకొన్నట్టు వాడి మొహమంతా చమటలు. ఖాకీ చెమటలు. మనిషి వాసన కాదు. మట్టి వాసన కాదు. వంచన అట్టాంటి సెంట వాసన కొడుతుంది. చివరకు వోడిపోవటం యిష్టం లేక మతం ముందుకు తెచ్చాడు. విశ్వాసం మాట ఎత్తాడు. అందుకేమన్నాడు రూబేను.

"క్రీస్తు నా విశ్వాసం. పోరాటం నా అవసరం శతాబ్దాల సంఘర్షణకి ప్రతిరూపం నా బిడ్డ. నా బిడ్డ పోరాటం. ఓ మాలాడికి, మాదిగాడికి అది అలంకారం కాదు. అది ఆదర్శం కాదు. అవసరం. అంటరాని వాడిగా పుట్టాను. సెంటు భూమి లేనివాడిగా పుట్టాను. విసిరేయబడ్డాను. వెలివేయబడ్డాను. అన్నిటికీ నా బిడ్డ జవాబులు వెతికి ముందుంచాడు ... నీ మెడలో ఆ సిలువ తీసేయ్. నువ్వు సిలువ మోసేవాళ్ళ వేపు లేవు. సిలువ వేసే వాళ్ళ కాపలాలో వున్నావు. నా బిడ్డని నేను కలవటానికొచ్చాను. నీ ప్రసంగం వినడానికి కాదు" అట్టాగే అన్నాడు. ఎర్రబడ్డ కళ్ళు. ఎగిసిపడే భుజాలు. ఎంత తిరస్కారం ఆ చూపుల్లో. చార్లెస్‌ని పురుగులా చూసే ఆ చూపులు రూబేనుకు ఎంత హుందాతనం యిచ్చాయి. అట్టా వుంటేనే చూపులు బాగుంటాయి. ప్రేమించే చూపులకే అంత హుందాతనం వుంటుంది.

యిమ్మానుయేలు అరెస్టు అయ్యాక ఆవలపాడులోని యిల్లు ఖాళీ చేశారు. అక్కడి పుస్తకాలు. అవి కేవలం పుస్తకాలు కావు. నెత్తుటి అక్షరాలు చదివింది. నిన్ను కమ్యూనిస్టు బూతం పట్టిందన్నాడు రూబేను నవ్వుతూ.

బిడ్డ బూతం కాదు.

యిమ్మానుయేలును వెతుకుతూ చదివింది.

అట్టా చదువుతూనే ఎదురుచూసింది. బిడ్డకోసం. రోజులు లెక్కబెట్టుకుంటూ మేరీతోపాటు, రూబేనుతో పాటు, జెస్సీతో పాటు. ఎట్టా దాచుకోవాలి ఆ జ్ఞాపకాన్ని. ఎట్టా రాసుకోవాలి ఆ గుండె కోతని.

బిడ్డ వస్తాడనుకొంది.

కాని,

బిడ్డ అమరత్వం గుండెల్ని తాకుతుందనుకోలేదు. వస్తాడనుకొన్న బిడ్డ వక్కడే రాలేదు. వందలాదిమందిని తోడు పెట్టుకొని వచ్చాడు. వాడు మాట్లాడలేదు. వందలాది గొంతులు తనని మాట్లాడేలా చేశాడు. బిడ్డ మరణించాడని నమ్మలేకపోతోంది.

"నాకు దేవుని బిడ్డల్ని పంపటం మాత్రమే తెలుసు. జనం బిడ్డల్ని ఎట్టా పంపాలో నాకు తెలీదు."

వందనం ఏర్పాట్లను గూర్చి మాట్లాడినప్పుడు రూబేను అన్నాడు. అట్టాగే చూస్తో. ఎందుకు లేవు కళ్ళల్లో నీళ్ళు. ఎందుకట్టా వెర్రిగా, ఏమీలేనట్టు వుట్టిగా వుండి పొయ్యాయి.

రూబేను మౌనంగానే వుండిపొయ్యాడు. కాకపోతే ఆ పక్కమాట మాత్రమే అన్నాడు వందనం వెళ్ళిపొయ్యాడు. రోజీతో మాట్లాడుతున్నాడు.

మేరీ సువార్తని వోదార్చే శక్తిలేదు. అసలు రూతు తనని తాను వోదార్చుకోలేదు. జెస్సీ కోసం వెతికింది. వాడు వాళ్ళ నాన్నకేసే చూస్తున్నాడు. వాడి పక్క రూబీ.

జనం. యిసుకవేస్తే రాలని జనం. ఒక మరణం అట్టా కదిలిస్తుందని వూహించలేదు. అందరి కళ్ళల్లో విషాదం. ఎందుకట్టా విషాదం అ మొహాల్లో. ఏ బంధం అది. ఏమౌతాడు యిమ్మానుయేలు వాళ్ళకి. కొడుకు, అన్న, తమ్ముడు, మిత్రుడు ..... ఏమౌతాడు. కామ్రేడ్ ! ఆ పదం ఏ అర్థాన్ని చెబుతుంది ?

ఎట్టా చూస్తున్నారు చుట్టూతా మూగిన వేలాది జనం యిమ్మానుయేలును. శ్రీకాకుళం యిమ్మానుయేలును. కామ్రేడ్ యిమ్మానుయేలును. తనబిడ్డని.

వాళ్ళు తన బిడ్డని ప్రేమించారు.

వాళ్ళు తన బిడ్డని అర్థం చేసుకొన్నారు.

వాళ్ళు తన బిడ్డ జీవితంతో అనుభూతి చెందారు.

తన బిడ్డ వో ఆచరణ. తన బిడ్డ పోరాటం. ప్రేమించడానికి, అర్థం చేసుకోడానికి, అనుభూతి చెందడానికి, ఆచరించడానికి ఎంత తేడా వుంది.

తన బిడ్డ నిజంగా ఆచరణే. అట్టా కాకపోతే వేలాది మందిలో తన బిడ్డ మీద ప్రేమ వుండదు. తన బిడ్డని అర్థం చేసుకోవటం, అనుభూతి చెందటం వుండదు.

ఏది చేశాడు యిమ్మానుయేలు. చేసిందల్లా ఒక్కటే. ఈ భూమ్మీది ప్రతి విప్లవకారుడు ఏది చేశాడో అదే చేశాడు. ఏది అవసరమో అదే వెతికాడు. అవమానకరమైన బాధల మీద, దారుణమైన దోపిడీ మీద, దగాకోరు సంస్కృతి మీద విల్లు సారించి ఎక్కుపెట్టాడు. ఆ పని గిరిజనుడు చేశాడు. వాడు చేసిన ఆ పనినే తన ఆయుధంగా మలుచుకొన్నాడు. నాగావళి నడకలోకి, వంశధార వురకల్లోకి, సువర్ణముఖి సందడిలోకి హృదయంతో చూశాడు.

నిజం. హృదయంతోనే చూశాడు.

హృదయంతో చూడటం ఎంతమంది చేస్తారు. తన బిడ్డ అట్టా చూశాడు. అట్టా చూశాడు కాబట్టే శ్రీకాకుళంలో ఓ భవిష్యత్తుని చూశాడు.

ఆ భవిష్యత్తు చాలా సహజంగా ముందుకొచ్చింది.

తాను తన బిడ్డని చదువుతో తెలుసుకొన్న వెంపటాపు సత్యాలు, కైలాసాలు, భాస్కరాలు, గణపతులు, పాణిగ్రహి సుబ్బారావులు, చినబాబులు, కృష్ణమూర్తులు, నిర్మలలు, అంకమ్మలు చాలా సహజంగానే పోరాడారు. వాళ్ళ పోరాటంలో ఎక్కడా కుట్రలేదు.

జనం జోహార్లంటున్నారు. సినసుబరాయుడు యిమ్మానుయేలూ అంటున్నాడు. ఆవలపాడు అంతా యిక్కడే వుంది. మేరి సువార్త పక్కనే ఎంకాయి. మేరీ సువార్త

ఆవలపాడు జనం మధ్య వుంది. ఎర్ర దనంతో అలంకరించిన ట్రాక్టర్ జండాలు. ఎర్ర జండాలు

యిమ్మానుయేలు సాగిపోతున్నాడు.

జోహార్ కామ్రేడ్ యిమ్మానుయేలు.

జోహార్ !

వేల గొంతులు, వేల హస్తాలు, రెపరెపలాడే జండాలు -

జెస్సీ చేతిలో జండా.

రూబీ చేతిలో జండా.

జండా లేనిది తన చేతిలో. జండా లేనిది రూబేను చేతిలో. జెండాలు లేనిది కూతురు, అల్లుళ్ళ చేతుల్లో. జెండాలు లేనిది కొద్ది మంది చేతుల్లో. చర్చికొచ్చే చాలా మంది చేతుల్లో జండాలు.

యిమ్మానుయేలు సాగిపోతున్నాడు.

రూబేను మౌనంగా నడుస్తున్నాడు. అతనిలోకి చూసింది.

అతని కళ్ళలోకి చూసింది. ఎందుకట్టా పొంగుతున్నాయి యిప్పుడు అతని కళ్ళల్లో నీళ్ళు. యిప్పటి దాకా ఎందుకు ఆగాయి. ఏ గుండె గొంతుక తెగి అట్టా పారుతున్నాయి.

నిజం చెప్పు రూబేనూ. నువ్వు కామ్రేడ్ యిమ్మానుయేలు జోహార్ అని గుండె గొంతుకతో అంటున్నావు. లోలోనే. నీలోనే. చాలా బలంగా. అందుకే ఆ కన్నీళ్ళు. అవును కదూ.

నువ్వు అబద్ధం చెప్పవు. చెప్పు నిజం చెప్పు.

తనలోనే తానే రూబేనును అడుగుతోంది. అట్టా ఘర్షణ పడుతూ తన మౌనాన్ని పక్కకు తోస్తో 'జోహార్' అని అంది. రూబేను తనకేసి చూశాడు. అన్నది. తన బిడ్డకి జోహారన్నది. ముసలి గుండె రూబేను. చెట్టంత బిడ్డని ఈ సైతాను రాజ్యానికి బలిచ్చిన గుండె. ఆమె చెయ్యి గట్టిగా నొక్కాడు.

యిమ్మానుయేలు సాగిపోతున్నాడు.

ఊరేగింపు సాగిపోతోంది.

యిద్దరూ ఆగారు.

అప్పుడు అరచాడు రూబేను. శతాబ్దాల వెనుకటి అంటరాని వాడి తొలికేక. ఎన్నెల పిట్టని అరచినట్టు. తన పుట్టుకని, తన బతుకుని తన భవిష్యత్తుని దుర్మార్గంగా చిత్రించిన ఈ వ్యవస్థ మీద తిరగబడ్డ తన నెత్తుటి కోసం రూతుకి మాత్రమే విన్పించేంత నిస్సత్తువతో. అట్టా అరుస్తో ఏడ్చాడు. అంతలో ఏదో గుర్తొచ్చినట్టు ఊరేగింపు కేసి చూశాడు. అది నడకకాదు. పరుగు. ఊరేగింపులో చేరారు ..

## 18

ఓ దృశ్యం మాసిపోయి మరో దృశ్యం ముందు నిలుస్తుందంటారు. అది నిజం కాదంటుంది రూతు. అన అనుభవాల్లో కొచ్చిన దృశ్యం ఏది మాసిపోలేదు దృశ్యం తర్వాత దృశ్యం ప్రతిదీ చాలా స్పష్టంగా కళ్ళ ముందు నిలుస్తోంది. కాలం అట్టా ప్రవహిస్తోంది. దృశ్యంలా ప్రవహిస్తోంది. జ్ఞాపకంలా ప్రవహిస్తోంది.

తెల్లారకట్ల వెలి మబ్బులు. అర్ధరాత్రి పొడుచుకొచ్చే చుక్కలు. దూరం నుంచి, చాలా దూరం నుంచి అడవి పూలను తాకి వీచే గాలులు. రుతువు మారినట్టుంది. వసంతం వచ్చినట్టుంది. వెళ్ళిపొయ్యే ఉదయాలు. వెళ్ళిపొయ్యే సాయంత్రాలు. బద్ధకంగా సాగిపొయ్యే రాత్రులు. వసంతం వెళ్ళిపోయినట్టుంది. ఇంటి ముంగిట శిశిరం తిష్టవేసింది.

రూబేనుకు నిద్ర పట్టదు. ఏదో జామున లేస్తాడు. పుట్టినే బయట తిరుగుతాడు. బల్లముందు కూర్చొంటాడు. ఏదో పుస్తకం తెరుస్తాడు. మనస్సు కుదరదు. విసుగు. వెలితి. దేనికోసమో దేవులాట. వెనుకటి ధైర్యంలేదు.

"మంచినీళ్ళు తాగుతావా"

"అఖ్ఖర్లేదు"

"టీ పెట్టనా"

"వద్దు"

"అయితే నిద్ర పో"

"రాదు ....'

రూబేనుకే కాదు. రూతుకూ అంతే. నిద్ర రాదు. ఆకలి కాదు. కాలం ప్రవహించిన సంఘటన యిమ్మానుయేలు. ఉద్యమంగా సాగాడు. ఊరేగింపుగా వెళ్ళాడు. బిడ్డ చనిపోలేదు. ఈ భూమిలోంచి వాడి స్పష్టమైన గొంతు వినిపిస్తూనే వుంది. నిద్ర రాని కళ్ళముందు నిండు వెన్నెల్లా వాడి చూపులు కన్పిస్తూనే వుంటాయి. అప్పుడు కన్నీళ్ళు తుడుచుకోవాలనిపించదు.

కాని కోడలు కోసం కళ్ళు తుడుచుకొనేది. మనవడికోసం కళ్ళ నీళ్ళు కన్పించకుండా చేసుకొనేది. గుండె రాయిలా మారిపోయింది. మొత్తం గడ్డకట్టిపోయింది. కళ్ళు చెమ్మగిల్లటం మానేశాయి. వయసు మళ్ళిన శరీరానికి బరువుమోసే శక్తి లేదు. బతకాలి. కోడలి కోసం. మనవడి కోసం. బతకాలి. బతికి తీరాలి.

ఆ ముసలి గుండెలతో ఆడుకుంటూనే జెస్సీ పెద్దవాడయ్యాడు. వానలో తడిసే ఎఱ్ఱ క్రోటన్లకేసి తండ్రిలాగే అట్టాగే చూసేవాడు. వాన ఎక్కువైతే యిల్లు వురిసేది. కప్పించుకొనే శక్తిలేదు. రోజీ కప్పిస్తానంది. అది సైతాను డబ్బన్నాడు రూబేను. కారే చోట రూబేను పళ్ళాలు, డీసులు, బిందెలు వుంచేవాడు. జెస్సీ అవి అందిస్తూ వుండేవాడు. డీసులు నిండేవి. ఆ నీళ్ళలో కాయితప్పడవ వుంచేవాడు జెస్సీ. అది సుడులు తిరిగేది. అట్టా తిరిగే పడవని తాతకి చూపేవాడు. ఆ యిద్దరికీ అదో ఆట. యిల్లు వురుస్తుందనే దిగులు లేదు. వానాకాలం ఆ ఆటతో గడిచిపోయేది ఆ యిద్దరికీ.

యిక్కడే తన జ్ఞాపకం ఎట్టా ముందు వుంచుకోవాలో తెలీదు రూతుకు. అది జ్ఞాపకం కాకపోవచ్చు. అది అనుభవం కావచ్చు. ఈ జ్ఞాపకాన్ని, ఈ అనుభవాన్ని రాసుకోలేదు. యిమ్మానుయేలును పూర్తిగా రాయాలని చాలాసార్లు ప్రయత్నించింది. కాని అజ్ఞాపకమే, ఆ అనుభవమే గుండెల్ని తోడేస్తుంది. బ్రద్దలు చేస్తుంది. రాసుకోలేదు. ఆట్టే ఆలోచించుకోలేదు. తప్పుకోవాలనిపిస్తుంది. వెంటనే మర్చిపోవాలనిపిస్తుంది.

రూబేను చెప్పిన ప్రతిమాటా గుర్తుతెచ్చుకొంటుంది. ఓ మహోన్నత గ్రంధం చదివినట్టు ముందుంచుకుంటుంది. అదంతా కదిలించే అనుభూతి. అందుకే కావచ్చు ప్రతి చిన్న అంశం పొందుపర్చుకోగలుగుతుంది. తాను వెళ్ళిపోయినా రూబేను పంచిన జ్ఞాపకమంతా మిగిలి వుంటుంది.

యిమ్మానుయేలు అట్టాకాదు. జ్ఞాపకానికి అడ్డొస్తాడు. రాతకి అడ్డొస్తాడు తల్లి పేగు ఉండలు తిరుగుతుంది. తల్లి గుండె అప్పుడు చాలా బలహీనమౌతుంది.

నిజానికి యిమ్మానుయేలును జెస్సీలో చూస్తూ బాధను మర్చిపోయింది. రూబేనూ అంతే వీలైన ప్రతి చిన్న పనీ జెస్సీతో కలిసి చేస్తో బిడ్డని మర్చిపోతున్నాడు.

కాలం అట్టాగే ఆగిపోదు. అట్టాగే సాగిపోదు. దాని యిష్టాలు దానివి. దాని మలుపు దానిది. అది పెదాలపై చెరగని నవ్వు కావచ్చు. గుండెల్ని చించే బాధ కావచ్చు. కాలం ఓ సుదీర్ఘశ్వాస. ఆగిపోవటం మాత్రం జరగదు. ఈ పచ్చని నేలమీద నిండు వెన్నెల కురుస్తుంది. కటిక చీకటి కప్పేస్తుంది. కాలం అట్టా వుంటుంది. జీవితం అట్టా వుంటుంది. జీవితం జ్ఞాపకం. జీవితం అనుభవం. జీవితం వాస్తవం. రూతుకు యిబ్బందల్లా అదంతా యిమ్మానుయేలు అయినప్పుడే. అదంతా జెస్సీ అయినప్పుడే. రూబీ అయినప్పుడే.

మాతయ్యని, నారిగాణ్ణి, ఎల్లన్నని, సీమోనుని చూసినట్టు యిమ్మానుయేలును చూడలేదు. జెస్సీని చూడలేదు. దగ్గరి బంధం. ఆ వడిలో పెరిగిన బంధం. బిడ్డ గుర్తొస్తే చాలు తట్టుకోలేదు. మనవడు గుర్తొస్తే చాలు వెంటనే వాణ్ణి కలవాలనుకొంటుంది. అక్కడితో ఆ జ్ఞాపకం ఆగిపోతుంది. ఆ అనుభవం ఆగిపోతుంది. యిక్కడా మనిషి జీవితమే సమాధానం. కాలం అంటే ఏదో కాదు మనిషి ఆగకుండా నడిచిన నడక. ఓ మహాప్రస్థానం... ఆ ప్రస్థానంలో మాతయ్యలు, నారిగాళ్ళు, ఎల్లన్నలు, మార్టిన్‌లుశివయ్యలు ఎవరి వొంతు అడుగులు వాళ్ళు

వేశారు. వాళ్ళ పద్ధతుల్లో వాళ్ళు వేశారు. యిమ్మానుయేలు ఆ అడుగుల్ని సాయుధం చేశాడు జెస్సీ అంతే. ఆ సాయుధ పోరును కాస్త ముందుకు, యింకాస్త ముందుకు జరపడానికే నడుస్తున్నాడు.

ఆ నడక అట్టా సాగుతోంది. ఆ నడక రూతు ముందు నిలుస్తోంది.

రూతు కళ్ళముందు వానాకాలం. ఎడతెరిపి లేని ముసురు జ్ఞాపకం.

జెస్సీ .... రూబీ .....

జెస్సీ యిప్పుడు పిల్లాడుకాదు. ప్రపంచాన్ని తన కళ్ళతో చూడగలడు. తన హృదయంతో చదవగలడు. స్పదించటం కొత్తకాదు తన యింట అది ఎప్పుడో పరిచయమైన పదం. దీని తాలూకూ త్యాగం జెస్సీ తండ్రి ఆ స్పందన పరిచయమే కావచ్చు ఆ త్యాగం స్వభావమే కావచ్చు. జెస్సీని కుదురుగా వుంచడం లేదు. ఆలోచనలు. చిన్ని చిన్ని నిర్ణయాలు. వెతుకులాట. కొంత అర్థమౌతోంది. కొంత అర్థం కావటంలేదు. ఒక్కటి మాత్రం నిజం. తనముందు తన తాతల తెగింపు నిలుస్తోంది. తన తండ్రి త్యాగం కదలాడుతోంది. ఈ భూమ్మీద అది తిరిగి ప్రాణం పోసుకుంది క్లాసులో చదవాల్సిందే కాదు, మనిషిగా యింకా చదవాల్సింది చాలా వుందన్నట్టు అనిపిస్తోంది.

ఆకలి,

అంటరానితనం,

దోపిడి,

దౌర్జన్యం,

ఎల్లన్న మొదలు యిమ్మానుయేలు దాకా. సుభద్ర మొదలు మేరీ సువార్త దాకా. చూడాల్సిన పదాలు. కారణాలు వెతకాల్సిన పదాలు. తన తండ్రి పాఠాలు చెప్పేవాడు. తాను చెప్పే పాఠాల్లో ఆ పదాల్ని వివరించ లేననుకొని వుండొచ్చు. ఆ పదాలు పాఠాల పరిధి దాటి వున్నాయని ఆయనకన్పించి వుండొచ్చు. అందుకే కావచ్చు పాఠశాల వదిలాడు. ఆ నాలుగు గోడలు వదిలాడు. జీవితంలోకి వెళ్ళాడు. అది వుండే మనుషుల్లోకి వెళ్ళాడు. వాళ్ళలో కలిశాడు. ఓ విశాలమైన బతుకు బడిలో ఆకలి, అంటరానితనం, దోపిడి, దౌర్జన్యం ఆ పదాల అర్థాల్ని వెతికాడు. వాటి పరిష్కారాలు వెతికాడు. అట్టా నిలిచాడు. అట్టా నడిచాడు. ఆయన నడక ఆగకూడదు ....

జెస్సీలో అవే ఆలోచనలు. అవే సంఘర్షణలు. ఓ జాముదాకా యింటికొచ్చేవాడు కాదు ఎక్కడ తిరిగేవాడో తెలీదు. ఒక్కోసారి యింటిదాకా వచ్చి గేటుకు ఆవతల చెట్టు నీడలో యిద్దరు ముగ్గురు మిత్రుల్తో మాట్లాడుతూనే వుండేవాడు.

మాటలు. ఆలోచనలు. సమావేశాలు. అంతా దాహమే. అంతా ఆకాంక్షే. అంతా కదలికే. అంతా అలజడే. అంతా ఆందోళనే. తిరగటబడటానికి సంసిద్ధతే. అట్టా కన్పించేవాడు జెస్సీ.

అప్పుడప్పుడూ అతని మిత్రులు యింటికొచ్చేవాళ్ళు. వాళ్ళ మాటలు సూటిగా వుండేవి.

గురిపెట్టిన బాణాల్లా వుండేవి. వాళ్ళ మధ్య ఎంతో వాదన జరిగేది. ఎక్కడో వొకమాట రాజీ కుదరినట్టు ఆగేవాళ్ళు. రూబేను వాళ్ళని ఆశక్తిగా వినేవాడు. వాళ్ళు మాట్లాడుకొనేప్పుడు ఏదో గుర్తొచ్చినట్టు, ఏదో వెతుకుతున్నట్టు గదంతా తిరిగేవాడు. యిమ్మానుయేలు గుర్తొస్తున్నాడని పించేది. కాని అది నిజంకాదనిపించేది. ఆకుర్రాళ్ళ మాటల మీద రూతుతో రహస్యం చెప్పినట్టు మాట్లాడేవాడు. చాలా శ్రద్ధగా వినేవాడు.

వాళ్ళను చూస్తుంటే రూతుకు కదిలే ప్రపంచం కళ్ళ ముందు నిలిచేది ఒక్కోసారి రాత్రి కూర్చొనేవాళ్ళు. వాళ్లతోపాటు రూబీ కూడా. వాళ్ళని చూస్తే రాత్రి చీకటి గది మూలలకు జారుకొన్నట్లనిపించేది. వాళ్ళు కొత్త రూపాల్లా కన్పించేవాళ్ళు. కొత్త సహచరుల్లా అనిపించేవాళ్ళు.

"ఈ ప్రభుత్వాలు పతనంలో కూరుకుపోతున్నాయి. వీటి మెదళ్ళని సామ్రాజ్యవాద దేశాలు కొనేశాయి. ఈ దేశంలో ప్రతి అడుగు తాకట్టుకు గురౌతుంది. మన రాష్ట్రం ఆ విషయంలో చాలా ముందుకెళ్ళింది. ప్రపంచ బ్యాంక్ ముద్దుబిడ్డ మన ప్రభుత్వం. దీనికి ప్రజల మీద నమ్మకం లేదు. వాళ్ళ భవిష్యత్తు మీద గురిలేదు. వీళ్ళకు మిగిలింది పోలీసులు. మిగిలింది సైన్యం. ప్రజల్ని వేటాడడానికి. ప్రజా ఉద్యమాల మీద దాడి చెయ్యడానికి ప్రజల బిడ్డల్ని ఎన్‌కౌంటర్ల పేరుతో చంపడానికి. ప్రజల డబ్బును అందుకే వినియోగిస్తారు. ప్రసార సాధనాల్ని అందుకే వాడుకొంటారు."

అట్టా సాగుతాయి వాళ్ళ చర్చలు... ఆ మాటలు విన్నప్పుడు రూబేను రూతుకేసి చూస్తాడు. టీ చేస్తావా అంటాడు. టీ తాగాలంటాడు. రూతు అందరికీ సరిపడా టీ పెడుతుంది. టీ తాగేప్పుడు వాళ్ళ మధ్య కూర్చొంటారు. వాళ్ళతో కలిసిపోతారు. తాగాక వాళ్ళ మాటల్ని వాళ్ళకి వదిలేసి మళ్ళీ తన గదిలో కూర్చొంటాడు.

"యిక్కడ కంప్యూటర్లు వుంటాయి. ఆదాయ వ్యయ పట్టికలుంటాయి. బహుళజాతి కంపెనీల గ్రూపులుంటాయి. అదే ప్రగతి అంటున్నాయి ఈ ప్రభుత్వాలు. వాటికోసమే ప్రణాళికల్ని రాస్తున్నాయి. మన ముందు వుంది అవికాదు. అట్టడుగు దరిద్రుల బతుకులు. వాళ్ళకి గోసె పాతంత నేల లేదు. పాత గుడ్డంత ఉద్యోగం లేదు. పల్లెబతుకుకు భద్రత లేదు. పట్టణం పేదలకు మనుగడ లేదు. సొంత పొలం, సొంత యిల్లు, సొంత ఉద్యోగం ఏవీ లేవు. అంతా చీకటి గుహ బతుకు. నూరేళ్ళ వయస్సు నిన్న పుట్టి ఈ రోజు చస్తుంది."

ఎంత చిన్ని మాటల్లో రాష్ట్రాన్ని, ఈ దేశాన్ని మాట్లాడుతున్నారు వీళ్ళు. యిరవై దాటని వయస్సు. మహా వుంటే యిద్దరికి దాటి వుండొచ్చు. ఎవరు నేర్పారు వీళ్ళకి ?

అంతా వెళ్ళిపొయ్యాక జెస్సీ తాతానానమ్మల దగ్గరకెళ్ళేవాడు. చిన్న పిల్లాడిలా ఆ యిద్దరి మధ్యా పడుకొనేవాడు. ఏ కలలు కంటాడో ఆ యిద్దరికీ తెలీదు. మధ్య మధ్యలో కలవరించేవాడు. కలవరించినప్పుడల్లా రూతు నిద్ర లేసేది. జెస్సీని తట్టిలేపేది. ఏంట్రా కలవరిస్తున్నావనేది. నవ్వి నిద్రపొయ్యేవాడు. రూతుకు నిద్ర వచ్చేది కాదు. చూపు ఎక్కడికో వెతుక్కొంటో వెళ్ళేది. ఫలానా అని చెప్పలేని భావం ముందు నిల్చేది. కళ్ళు మూస్తే కళ్ళ ముందు సముద్రం. ఎగిసి

పడే అలలు, తీరం తాకుతో, తీరం యిసుకను శుభ్రం చేస్తో. ఎందుకట్టా అన్పిస్తుంది. ఆ దృశ్యం అట్టాగే వుంటుంది. తెల్లారేదాకా అట్టాగే వుంటుంది.

అట్టా ఆ మాటలు, ఆ సమావేశాలు, ఆ కలలు, కలవరింతలు, అర్థరాత్రి మేలుకోవడాలు కెరటాల సముద్రం యింకా ఎంతో కాలం దగ్గర వుండదని వూహించలేదు రూతు.

కాని

నేర్చుకోవటం నిషేధమైంది. మాట్లాడటం నిషేధమైంది.

నిషేధం,

జ్ఞానం మీద, మాట మీద, కదలిక మీద, ఊపిరి మీద, ఉద్యమం మీద ... రాష్ట్రం ఓ చీకటి కొట్టులా మారిపోయింది.

ఓ వర్షపు రాత్రి - వర్షపు ముసురు రాత్రి.

జెస్సీ తన నిర్ణయం చెప్పాడు.

"నేను మీకు చెప్పే వెల్దామనుకొంటున్నాను."

ముగ్గురి ఎదురుగా కూర్చొని నోరు విప్పాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. వానలో తడ్చుకొంటూ రూబీ వచ్చింది. ఆ పిల్ల అప్పుడు ఎందుకొచ్చిందో తెలీదు. రావటం కూడా మంచిదే అన్పించింది.

"నాన్న మీకు దూరమయ్యాడు. నాకు తెలుసు. నన్ను చూసి మీరు ఆయన్ని మర్చిపొయ్యే ప్రయత్నం చేస్తున్నారని."

రూబీ జెస్సీకేసి అట్టాగే చూస్తోంది.

"మీరు కాదనరనే నమ్మకంతోనే మీతో మాట్లాడుతున్నాను. ఎల్లన్న దేనికోసం తపించాడో, శివయ్య దేన్ని చూసి భయపడ్డాడో, రూబేను ఎందుకోసం అంత అన్వేషణ చేశాడో, యిమ్మానుయేలు దేనికోసం తన ప్రాణాన్ని యిచ్చాడో అది నెరవేర్చాల్సి వుంది. యిమ్మానుయేలు మట్టిలో కలిసిపోలేదు. మొక్కగా మొలిచాడు. అదీ మీ పెరట్లోనే మొలిచాడు."

ఆట్టా మాట్లాడాడు. ఏం మాట్లాడాలో రూబేనుకు పాలుపోలేదు. రూతుకూ అంతే. మేరీ సువార్త వింటూ కూర్చుంది. చాలా మాట్లాడాడు. అంత పెద్ద మాటలు ఆ కుర్రాడు మాట్లాడుతాడనుకోలేదు. మాట్లాడాడు. ఆ ముసురులోనే గుడ్డల సంచి బుజాన వేసుకొని వెళ్ళాడు.

అట్టా వెళ్ళాడు వాడు. కలల్ని మూట కట్టుకొని. పోరాటం చేసేందుకు. తన ప్రజల్ని విముక్తి చేసేందుకు. అట్టా వెళ్ళాడు. వాడు వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయింది రూబీ. నిజానికి వర్షం తడుపుతోంది జెస్సీ శరీరాన్ని కాదు, రూబీ హృదయాన్ని.

నలమల కొండలు యిక్కడికి చాలా దూరం. వెళ్ళి కలిసే శక్తిలేదు. వాడు వచ్చే అవకాశమే లేదు.

క్రిస్మస్ వచ్చివెళుతోంది. క్రిస్మస్ చెట్టు వంటరిగా వుండిపోతోంది. కాండిల్సు వెలుతురు పంచుకొనేది ఆ యింట్లో ముగ్గురే. రూతు, రూబేను, మేరీ సువార్త. అంతే. తోడుగా రూబీ వస్తుంది. చర్చిలో రూబేను గొంతు విన్పించటం మానేసింది. ప్రతి క్రిస్మస్ రోజూ అనుకుంటారు. జెస్సీ వస్తే బాగుండు. వాడు వస్తే బాగుండు అని. అట్టా అనుకొన్నప్పుడు దిగులు పుడుతుంది. రాత్రంతా దిగులుగా, నిరాశగా గడిచిపోతుంది. కాని ఎందుకీ దిగులు. ఎందుకీ నిరాశతో గడిపే రాత్రులు. వాడు ఏది చేశాడని. తాత ప్రేమని, నానమ్మ ప్రేమని తల్లి ప్రేమనీ, తనని కోరుకొనే దాని ప్రేమని అన్నీ కాదని వెళ్ళాడావాడు ? ఆ ప్రేమంతా భ్రాంతి అనుకొంటో సర్వసంగ పరిత్యాగిలా వెళ్లాడావాడు ? అట్టా వెళ్ళలేదు. కళ్ళనిండా ప్రేమని నింపుకొనే వెళ్ళాడు. ప్రేమని శాశ్వతంగా ఈ భూమ్మీద వుంచాలనే వెళ్ళాడు ? అనేక కోట్ల రూబేన్లకోసం, రూతుల కోసం, తల్లుల కోసం వెళ్ళాడు. వాళ్ళ శరీరం శాశ్వతంగా అంటరానిదిగా వుంచకూడదనే వెళ్ళాడు. వాళ్ళు నడిచే భూమ్మీద వాళ్ళకి యింత హక్కు కల్పించాలనే వెళ్ళాడు. అట్టా వెళ్ళాడు జెస్సీ. వీరుడి బిడ్డ. వీరుడిలా వెళ్ళాడు. వెళ్ళి దూరం కాలేదు. దగ్గరయ్యాడు. దూరంకాని వాడికోసం ఎందుకీ దిగులు. ఎందుకీ ఎదురుచూపులు. అట్టా అన్పిస్తుంది. ఆ ముగ్గురికీ అన్పిస్తుంది. అప్పుడు ఎక్కడో, ఏదో మూల మమత చాటున, బిడ్డమీద ప్రేమ చాటున దాగిపోయిన గర్వం ముందుకొస్తుంది. తమాషా. ఆ గర్వంలోనూ అన్పిస్తుంది. ఈ గర్వం వాడితో పంచుకోవాలని. అప్పుడు అన్పిస్తుంది. వాడు వస్తే బాగుండు అని. వాడితో చాలా చెప్పుకోవాలనిపిస్తుంది. చాలా వినాలనిపిస్తుంది.

ఓ రోజు ......

"వాడు ఈ రాత్రి వస్తే బాగుండు" అని కోడలితో అంది. అప్పుడే రూబీ వచ్చింది. ఎవరే ఆ వచ్చేది అని అంది.

"నా పొన్నంగి పిట్ట"

"అట్టా అని కబురు పంపాడా"

"వస్తే బాగుండు"

ఆ రాత్రి రూబీ తనతోనే వుండిపోయింది. వస్తే బాగుండు. తన కోసం కాకపోయినా. రూబీ కోసం. రూబీ కోసమైనా ....

రాడని తెలుసు. తెలిసినా అట్టాగే ...

రూబీ కాలేజీలో చదువుతోంది. ఆ పిల్లకోసం వాళ్ళ నాన్న అమెరికా సంబంధాలే తెస్తున్నాడు. చేసుకోనంది. చేసుకొంటే జెస్సీనే చేసుకుంటానంది. "నలమల కొండల్లో ఏ కొండ రాసిస్తానన్నాడే" వాడు అని వందనమన్నాడు. వ్యంగ్యంగా అన్నాడు. అమెరికా అతనికి అట్టాంటి వ్యంగ్యం బోలెడు నేర్పింది. తర్వాత తిట్టి పోశాడు. నీ వంశానికి అసలు బతకటం చేతనౌనా అని రోజీని తిట్టి పోశాడు. విచిత్రం రోజీకి కోపం రాలేదు. నవ్వుతూ

ఆ మాటలు వింది. రూబేనుకు బతకటం చేతరాదు. రూతుకు బతకటం చేతరాదు. యిమ్మానుయేలుకు, మేరీ సువార్తకూ అంతే. జెస్సీకి రాదు. కానీ రోజీకి బతకటం చేతనౌను. చాతకాకపోతే వందనంతో కలిసి వుండేది కాదు.

ఆ రాత్రి వుట్టినే కూర్చోలేక రూబీ ఓ కవిత రాసింది. దానికి నా ప్రియుడి కోసం నేను ఎదురు చూస్తున్నాను అని పేరు పెట్టింది కవిత రాశాక చదువుతాను వినమంది. రూబేనును కూడా వినమంది

*చుక్కలు పూచే వేళ*
*అతనొస్తాడు, గుండె తలుపులు తడుతో*
*అతనొస్తాడు*
*మంచు జారేవేళ*
*అతనొస్తాడు, కంటి తడి తుడుస్తో*
*అతనొస్తాడు*
*కారు నల్లని రోడ్డు గుండెల మీద*
*అతనొస్తాడు*
*ఓ సమష్టి దుఃఖంలా*
*గుండె లోతులు వెతుకుతో*
*అతనొస్తాడు*
*ప్రజా యుద్ధ సైనికుడు, నా ప్రియమైనవాడు వస్తాడు.*
*అతనొస్తాడు*
*ఓ సుదీర్ఘ రాత్రి మొదలైన తొలి ఘడియల్లో*
*నవ్వునీ దుఃఖాన్ని పెదాలలో బంధించి*
*అతనొస్తాడు, వస్తో నా గుండెల్లోకే నేరుగా ప్రయాణం చేస్తాడు.*
*ఓ విత్తనం నేలలోకి చొచ్చుకపోయినట్టు*
*బతకటం కోసం చావుని ఖాతరు చెయ్యనివాడు, నా ప్రియమైనవాడు*
*వస్తాడు, అతనొస్తాడు*
*వస్తానని చెప్పలేదు అయినా వస్తాడు,*
*తన అడుగుల సవ్వడిని నా గుండెల స్పందనగా చేస్తో*
*వాడు, నావాడు, వస్తాడు నా స్నేహితుడు, నా ప్రియుడు*
*వస్తాడు, అతనొస్తాడు*
*అట్టా అని కబురు లేదు అయినా వస్తాడు*
*కురిసేవానలో తడుస్తో ఎర్రెర్రని క్రోటన్ పూలు*
*వాన చినుకు తగలకుండా అతనొస్తాడు*

*జీవితం కన్నా దీర్ఘమైన వాడు, ప్రేమకన్నా గాఢమైనవాడు*
*వస్తాడు నిజంగా వస్తాడు*
*కన్ను మూస్తే కల,*
*కలంతా ఆలివ్‌గ్రీన్*
*అతనొస్తాడు, భుజం మీది తుపాకీతో*
*వస్తానని చెప్పకపోయినా అతనొస్తాడు*
*ఆకాశమంత విశాలమైనవాడు, జలపాతమంత స్వచ్ఛమైనవాడు*
*పక్షులంత స్వేచ్ఛ అయినవాడు, వస్తాడు*
*వస్తానని చెప్పలేదు, అయినా వస్తాడు*
*అతనెప్పుడూ అంతే, అట్టాగే వస్తాడు, చెప్పకుండా తలుపుతడుతో.*

కవిత విన్నాక రూతుకు మాటలు రావటంలేదు. మౌనం దుర్మార్గంగా వున్నట్టనిపిస్తోంది. ఏది మాటాడాలో అర్థం కావడంలేదు. రూబేను కళ్ళ నిండా నీళ్ళు.

మేరీ కేసి చూసింది. మేరీ కళ్ళముందు యిమ్మానుయేలు వుంటాడు. జెస్సీ వుంటాడు. ఒకడు కట్టు కొన్నవాడు. ఒకడు కడుపు చించుకు పుట్టినవాడు. ఒకడు అనంత దూరాలకు వెళ్ళాడు. ఒకడు అతను నడిచిన దారి వెతుక్కొంటో వెళ్ళాడు. ఒకడు ఎరుపయ్యాడు. ఒకడు ఆ ఎరుపును మోసుక తిరుగుతున్నాడు. ఎందుకట్టా అయ్యారు. తనకు తెలుసు. తన కోడలికి తెలుసు. మనవరాలికీ తెలుసు. తెలిసినా ఎప్పుడోవకసారి దృశ్యం యిట్టా వుంటుంది. ఈ మాటలు. ఈ గుండెకోతలు. ఎవరి మీదో కొరవలు. ఆశంతా నింపుకొని ఎదురు చూడటాలు.

ఆ యిద్దరిని వొడిలో పడుకోబెట్టుకోవాలనిపిస్తోంది. ఆ గుండెల్ని ముద్దాడాలనిపిస్తోంది. నిద్రొస్తే నిద్రపొండి. కలలొస్తే కంటో గడపండి. మీరు కోరుకొన్నవాళ్ళు అట్టాంటి వాళ్ళు. వాళ్ళు కలలు కంటారు. కలలు లేకపోతే అది జీవితం కాదంటారు.

యిమ్మానుయేలు అట్టా కలలు కన్నాడు.

జెస్సీ అట్టాగే కలలు కంటున్నాడు.

బహుశా తాను అడుగుపెట్టిన యింటిలో తను చూడగలిగే చివ్వరి తరం జెస్సీ రూబీలే కావచ్చు. వాళ్ళతోనే తన ఎదురు చూపు ఆగిపోవచ్చు. అట్టా ఆగిపోవటాన్ని కూడా తాను కోరుకొంటోంది.

జెస్సీ తన కడుపులో తలదూర్చి నిద్రపొయ్యేవాడు. రూబీ కుళ్ళుతో చూస్తూ కూర్చొనేది. దగ్గరికి తీసుకొంటే దూరంగా జరిగేది. ఎందుకో ఆ పిల్లకి అక్కడే వొదిగి పడుకోవాలనిపించేది. పెద్దవాళ్ళయ్యారు. కళ్ళముందే ఎదిగారు. ఎన్నిసార్లో తిట్టుకున్నారు. అన్నిసార్లూ కొట్టుకొన్నారు. రూబీకి రూబేను సపోర్టు. జెస్సీ తన అండ చూసుకొనేవాడు. అట్టా కూడా మర్చిపొయ్యారు యిమ్మానుయేలును. ఆ యిద్దరితో ఆడుతూ మర్చిపొయ్యారు.

అప్పుడప్పుడూ ఆ యిద్దరే ఒక చోట బుద్ధిగా కూర్చొనేవారు వాళ్ళకి వెన్నెలంటే యిష్టం. అక్కడే అట్టాగే కూర్చోవటం యిష్టం. చుక్కలకి ఈ వంశానికి బోలెడు అనుబంధం వుంది. జెస్సీకైతే చెప్పలేనంత యిష్టం. అట్టాగే చూస్తాడు. ఆకాశంలోకి. అక్కడ మెరిసే పరుగెత్తే చుక్కల్లోకి. అప్పుడు కవిత్వం మాట్లాడేవాడు. కథలు చెప్పేవాడు. ఒక్కోసారి పాట వాడి గొంతులోంచి మంచు జారినట్టు జారేది ఎంత పిచ్చో ఆ పిల్లకి. వాడి మాటలు వింటో కూర్చొనేది. పాటలు వింటో తలవూపేది. అట్టా వింటూ వాడి కళ్ళలోకి చూసేది. అట్టా తలవూపుతో వాడి భుజాల మీద వాలి పొయ్యేది.

జెస్సీ యింటికి వస్తూపొయ్యే రోజులనాటి మాట. ఓరోజు నీ మనమడు చాలా దుర్మార్గుడే రూతూ అని అంది. కోపం వస్తే అమ్మమ్మా అని అనదు. రూతూ అనే అంటుంది. అత్తయ్యా అని అనదు. ఆ మేరీ సువార్త అంటుంది. కాకపోతే నీ కోడలు ఏమందో తెలుసా అంటుంది. అట్టా అన్నదంటే కోపంతో వున్నట్టు లెక్క. ప్రేమ ఎక్కువైనా అంతే ఒరే రూబేనూ అంటుంది అదో రకం పిల్ల. ఏమైందో చెప్పమన్నాను. మామూలుగా చెప్పుకపోతోంది. నవ్వొచ్చింది. ఆ పిల్ల అట్టా నవ్వొచ్చేలాగే చెప్పింది. వాడు వెళ్ళి వారమైంది. పాటలు పాడుతూ వెళ్ళాడు. యింకా రాలేదు. అంతే పితూరీ. కాని ఆ పితూరిలో యిష్టం వుంది. ఈ పిల్ల వాడ్ని యిష్టపడుతోంది. రూబీ అట్టా అన్న రోజు వెన్నెల రాత్రి. పున్నమి వెన్నెల కథలు చెప్పకుండా, కవిత్వం మాట్లాడకుండా, పాట పాడకుండా వెళ్ళిపోతోంది. అది అట్టా వెళ్ళటం రూబీకి యిష్టంలేదు. అందుకే ఆ మాట అంది.

జెస్సీ వెళ్ళాడు. పాటని మోసుకొనే వెళ్ళాడు. వారం అయింది. యింకా రాలేదు. ఈ రూబి ఎదురుచూసే పున్నమి రాత్రి కూడా పాడుతూనే వుంటాడు.

యిప్పుడు రూతు కళ్ళముందు పున్నమి రాత్రి లేదు. ఆ రాత్రి ముంగిట జెస్సీ, రూబీల చిత్రమైన అనుభూతులు లేవు. వెతుక్కోవటాలు లేవు.

జులై 17 ముందు నిలుస్తోంది. 1985 జులై 17 కళ్ళ ముందు ప్రత్యక్షమౌతోంది. జెస్సీని మరోవైపు నడిపించిన సంఘటన ముందు నిలుస్తోంది. కారంచేడు మాదిగపల్లె, భూస్వాముల మారణాయుధాల దాడి ముందు కదులుతోంది. అదే పాడుతుంటాడు జెస్సీ యిప్పుడు. కారంచేడు పోరాట కథ వాడు పాడుతుంటాడు. వాడి పాటలో కంచికచర్ల వుంటుంది. ఆర్యాల వుంటుంది. బెల్చి వుంటుంది. పదిరికుప్పం వుంటుంది. కీలవేన్మణి వుంటుంది. అట్టా మొదలై కారంచేడు దగ్గర ఆగుతుంది. జులై 17 మనుషులపై మృగాలు చేసిన దాడి ఆ పాటలో మొదలౌతుంది. మాదిగ పల్లెలోని ముత్తయ్యని, మోషేని, యెహోషువాని, యాకోబుని, రమేష్‌ని, వందనాన్ని భూస్వాములు గొడ్డళ్ళతో నరికిన దారుణం వాడి గొంతులోంచి విషాదంగా విన్పిస్తుంది. ఆక్రందన ముందు నిలుస్తుంది. కూల్చిన యిళ్ళు, చెరచబడ్డ స్త్రీలు, ఎగరేయబడ్డ కత్తికి ఎరగా మారిన పిల్లలు అంతా వాడు పాడుతూ వుంటాడు.

జెస్సీ అట్టా పాడుతూ వెళ్ళాడు. ఎల్లన్న జవాబు దొరకక ఎన్నెలదిన్ని వదిలి వెళ్ళాడు. జెస్సీ అట్టాకాదు. జవాబుతోనే వెళ్ళాడు. కారంచేడు బాధితుల శిబిరంలో వున్నాడు. వాడు రాడికల్సుతో కలిశాడు అని వో రోజు రోజీ అంది కారంచేడు శిబిరం నుంచి తిరిగొచ్చాక జెస్సీలో చాలా మార్పు వచ్చింది. ఇంత చిన్న వయస్సులోనే తన జీవితం గమ్యం గుర్తించినట్టు ప్రవర్తిస్తున్నాడు. పాటలు పాడుతూ వూళ్ళు తిరుగుతున్నాడు. ఎల్లన్నలా వంటరిగా కాదు. తనలాగే పాడే పదిమందితో తిరుగుతున్నాడు. పల్లెటూరి నుంచి చర్చికొచ్చే వాళ్ళు చెప్పారు. జన నాట్యమండలి ప్రోగ్రాంలు వాళ్ళ వూళ్ళలో జరుగుతున్నాయని, అందులో జెస్సీ ముఖ్యుడని. వాడి జీవితంవాడు మలుచుకొన్నాడు. యిమ్మానుయేలు మలుచుకొన్నట్టు. యిమ్మానుయేలు మట్టిలో కలిసి మొలిచాడు.

రూబేను ఒంటరి అయిపోతున్నాడు. తన గదిని దాటి రావటం లేదు. తిరగాలను కొన్న వూళ్ళు తిరిగి జెస్సీ యింటి కొచ్చిన రోజు నవ్వుతూ కన్పిస్తాడు. మనవడితో ప్రతి క్షణం గడపాలని ఆరాట పడతాడు. యిమ్మానుయేలుకు దూరం కాలేకపోతున్నాడు.

జెస్సీ యింటికి వస్తూ పోతూ వున్నాడు. వచ్చినప్పుడు రూబీ వాడి దగ్గరే వుంటోంది. వాడు రాసుకొన్న పాటలు మంచి నోట్సులో ఎత్తిరాసేది. తాను రాసిన పాటలు వాడి చేత పాడించుకొని వినేది. అట్టా ఎంతో కాలం జరగలేదు. ఆ వర్షపు రాత్రి తన నిర్ణయం చెప్పి వెళ్ళాడు జెస్సీ. బొత్తిగా యింటి రావడమే మానేశాడు. రూబీ కూడా వేరుగా కన్పిస్తోంది. వంటరిగా వుండంలేదు. ఆమె కోసం యిద్దరు ముగ్గురు ఆడపిల్లలు వచ్చి పోతున్నారు. కాలం తన పద్ధతిలో తాను వెళ్ళిపోతోంది.

"నా బిడ్డని నాకు కాకుండా మీరే చేస్తున్నారు" ఓ రోజు వందనం రూబేనును నిలేశాడు. వందనం ఎందుకట్టా మాట్లాడుతున్నాడో మొదట అర్థం కాలేదు.

"వాడు వాడి అబ్బలాగే మారాడు. వాడికి దీన్ని కట్టబెట్టడానికి మీరు దీన్నీ ఆ వూబిలో దింపారు."

అర్థమౌతోంది. ఎందుకట్టా మాట్లాడుతున్నాడో అర్థమౌతోంది. రూబేను వింటూ కూర్చొన్నాడు.

"ఏమిటీ మహిళా సంఘాలు. తలదించుకోవాల్సి వస్తోంది. అట్టా తిరగొద్దని ఎప్పుడన్నా మందలించారా."

వందనం అన్ని మాటలంటున్నా రోజీ అతన్ని అట్టా అనొద్దని అనలేదు. అట్టా అనటం తనకీ యిష్టమన్నట్టుగానే ప్రవర్తిస్తోంది. రూబీ ఏవో కాగితాలు సర్దుకొంటూనే వుంది. అదంతా తనకి సంబంధం లేని సందర్భంగా ప్రవర్తిస్తోంది.

"మీకు చెబుతున్నాను. మీరు ఎంత చేసినా దాని పెళ్ళి జెస్సీతో జరగదు. అది గుర్తుంచుకోండి." ఆ మాటలంటూ వెళ్ళబొయ్యాడు. కూర్చొని వున్న రోజీ కూడా వెళ్ళటానికి పైకి లేచింది.

"ఒక్కమాట"

ఆ మాట రూబీ అంది వందనం ఆగాడు. రోజీ బిడ్డ కేసి ఆశ్చర్యంగా చూసింది

"రూతు రూబేనుల కొడుకు బిడ్డ జెస్సీకి, కూతురు బిడ్డ రూబీకి పెళ్ళి జరిగిపోయింది.

వందనం బిత్తరపోయి చూశాడు. రోజీ అయోమయంగా చూసింది రూబేనులో అర్థం కాని ఉద్వేగం ఎది విన్నారు వీళ్ళంతా. ఎది విన్నది తాను ఆ రోజు.

"మీరు ఆశ్చర్యపడొద్దు. అయోమయంలో వుండొద్దు. వినాలనుకొంటే ప్రశాంతంగా వినండి. మా పెళ్ళికి రూబేను కుట్ర చెయ్యలేదు. రూతు నాటకం ఆడలేదు. మేరీ సువార్తలో మీరు వెతికినా స్వార్థం కన్పించదు. మేమే చేసుకొన్నాం. మా అంతట మేమే జీవితాంతం కలిసి వుండాలని ప్రమాణం చేసుకొన్నాం మీరు దీన్ని స్వీకరిస్తారో, తిరస్కరిస్తారో అది మీ యిష్టం. మీ యిష్టం ఎట్టావున్నా మేము ఆలోచించేది లేదు."

అన్ని మాటలు రూబి చాలా మామూలుగా చెప్పింది. వందనం తనని తాను మర్చిపొయ్యాడు. ఆ గొప్ప భక్తుడు బండ బూతులు తిట్టడం మొదలెట్టాడు. తిట్టీ తిట్టీ వెళ్ళిపొయ్యాడు. రోజీ వెళ్ళలేదు. అక్కడే కుప్పకూలినట్టు కూర్చొంది. ఎందుకు ఏడుస్తుందో తెలీదు. ఏడుస్తోంది.

"ఎందుకట్టా ఏడుస్తావ్. నా యింట్లో అట్టాంటి ఏడ్పులు నాకు గిట్టవు. ఏడ్వాలనుకొంటే నీ యింట్లో ఏడ్వు."

ఏమంటోంది రూబీ. నాయింట్లో..... నా యింట్లో..... అప్పుడు గాని తట్టలేదు రూతుకు. అవును కదూ. యిది జెస్సీ యిల్లేకదూ. ఈ పిల్లలు చిన్నవాళ్ళు కాదు. ఎంత సూటిగా, ఎంత స్పష్టంగా ప్రకటిస్తారు తమ హక్కుని. రూబీకేసి అట్టాగే చూస్తున్నాడు రూబేను. వాళ్ళ అమ్మ కన్పిస్తూ వుంటుంది. అన్ని మాటలూ ఆమే మాట్లాడుతూ వుంటుంది. చాలా చిన్న పిల్లాడు. రూబేను, చాలా పాతపిల్లాడు. బంధాలు, అనుబంధాలు మాత్రమే తెలిసినవాడు. అట్టాగే తన మనవరాలిలోకి చూస్తో, తన తల్లిని వెతుక్కొంటున్నాడు. పాత మనిషి. బొత్తిగా పాత మనిషి.

రూబీ, తల్లిని అట్టా అనటం మేరీ సువార్తకు నచ్చినట్టులేదు. యిమ్మానుయేలు రోజీని ఎప్పుడూ అట్టా అనలేదు. రోజీ దగ్గర కెళ్ళింది. ఆ పిల్ల మాటలు పట్టించుకోకు అని అంది. మేరీ సువార్త ఎట్టాంటిదో రోజీకి తెలుసు. అందుకే మౌనంగా వుండిపోయింది. ఈ పెళ్ళి ఎప్పుడు జరిగింది. ఎట్టా జరిగింది. రూతు అదే ఆలోచిస్తోంది.

ఆ రాత్రి రోజీ అక్కడే వుండిపోయింది. ఎందుకో గాని ఆమెకు బిడ్డను వదిలివెళ్ళాలని లేదు. బిడ్డ తనకి చాలా దూరమైనట్లనిపించింది. రూబీ అసలు విషయం చెప్పింది. జెస్సీ రూబీలు ఎన్నెలదిన్నిలో కలిశారు. ఆ యింట్లోనే పెళ్ళాడారు. పెళ్ళికి అయిదుగురు మిత్రులు మాత్రమే వున్నారు.

"నీ యింటి తాళం దొంగిలించానే రూతూ. నీ మనవడు నా చేత దొంగతనం కూడా చేపించాడు."

"దొంగబుద్ధి నీది. వాడేం చేస్తాడు."

ఆ మాటకు నవ్వింది రూబీ. ఆ పిల్ల కళ్ళముందు వో అద్భుత ప్రపంచం నిలిచినట్టుంది. తేలిపోతున్నట్టు కన్పించినా చాలా సహజంగా చెప్పింది.

"మేమిద్దరం అట్టా కలిశాము. మా ముందు వో గమ్యం వుంది. అక్కడికి చేరడానికి కలిసి నడవాలనుకొన్నాం. అంతే. పెళ్లి జరిగాక వారం రోజులు కలిసున్నాం. మళ్ళీ కలిసే రోజులకోసం ఎదురుచూద్దాం అని అనుకొంటో విడిపొయ్యాం. ఎన్నెలదిన్ని పొలిమేరల వద్ద వాడు అటు వెళ్ళాడు. నేను యిటు వచ్చాను."

ఈ ఆలోచన చిన్నది కాదనుకొంది రూతు. ఈ మార్పు తాను వూహించలేదు. రూబీకోసం ఆడపిల్లలు వస్తుంటే మామూలు కాలేజీ పిల్లలనుకొంది. కాని వాళ్ళు మహిళా సంఘం కార్యకర్తలని యిప్పుడు తెలుస్తోంది.

జెస్సీ లోపల....

రూబీ బయట....

అట్టా అయ్యారు వాళ్లు. వాళ్ళ జీవితాన్ని కఠినంగా మార్చుకొన్నారు. వాళ్ళు వేసే ప్రతి అడుగూ ఒక్కోసారి రూతును భయానికీ ఆందోళనకీ గురిచేసేది. మరోసారి ఎంతో గొప్ప సాహసిలా గర్వపడేది.

మేము అడుగులేస్తున్నాం ఆ మాత్రం మీకు తెలిస్తే చాలు అన్నట్టు వుంటాయి వాళ్ళ మాటలు, వాళ్ళ పద్ధతులు.

వాళ్ళ మాటల్లో గాఢత వుంది.

వాళ్ళ పద్ధతిలో స్పష్టత వుంది.

వాళ్ళు యుద్ధం చేస్తున్నారు.

యిప్పుడు ఈ క్షణం వాళ్ళు బ్రతికే వున్నారు. ఆ తర్వాతి క్షణమంటారా అది వాళ్ళ చేతుల్లో లేదు. కాని ఎంతో భవిష్యత్తు వాళ్ళ ప్రతి అడుగులో వుంది. వాళ్ళు జీవించే ప్రతి క్షణంలో వుంది. ఈ దేశం పేదలు స్వేచ్ఛగా బతకటానికి మేము చనిపోయినా ఫర్వాలేదంటారు వాళ్ళు. వాళ్ళ స్వార్థం అట్టా వుంటుంది. చనిపోయిన వాళ్ళకంటే బతికివున్న వాళ్ళు ఎంతో గొప్ప జీవితాన్ని చూడాలంటారు వాళ్ళు.

నీ మనవడు 'పార్టీ' లో వున్నాడటగా !
అడగటాలు. అవును అనగలిగేచోట అవును అంటుంది. వద్దు అనుకొన్నచోట మౌనంగా వుంటోంది.

నీ మనవరాలు ప్రజాసంఘాల్లో వుందటగా !
ఎందుకట్టా అడగటం పొద్దాక. అది వూరూరూ తిరుగుతోంది. వేదిక లెక్కి మాట్లాడుతోంది.

జెస్సీ నుంచి అప్పుడప్పుడూ ఉత్తరాలు వచ్చేవి. ఉత్తరం వచ్చినప్పుడు నా పొన్నంగి పిట్ట చిన్న గుండె ఎన్ని మడతల్లో వచ్చింది అని అనుకొనేది రూతు. గుండె తలుపులు తెరుచుకుని లోపలికి వెళ్లటం వీడికి బాగా తెలుసు అని అనేవాడు రూబేను ఉత్తరం చదివాక.

అట్టా వుండేవి జెస్సీ ఉత్తరాలు పరుచుకొన్న పొలాల్ని పిల్లగాలి తాకినట్టు. తాకుతో మురిసిపోయినట్టు. అక్షరాల నిండా ప్రేమ. అవన్నీ యుద్ధభూమి నుండి ఎగిరివచ్చే ప్రేమలేఖలు. ప్రియమైన ఎన్నెల పిట్టా అంటో మొదలౌతాయి అవి. ప్రియమైన తాతకు అంటో మొదలౌతాయి. తాతకు ఏ పిట్ట పేరూ పెట్టలేదు. ఎత్తయిన కొండల మీద పడుకొని అట్టా ఆకాశంలోకి చూస్తానంటాడు. ఎల్లన్నలాగే చుక్కల్ని యిష్టంగా చూస్తాడు. ఎల్లన్న చుక్కల్లో సుభద్రని చూశాడు. జెస్సీ అదే చుక్కల్లో అమరుల్ని అమరత్వాన్ని చూశాడు.

"ఎత్తయిన కొండలమీద యిట్టా పడుకొని అట్టా ఆకాశంలోకి చూస్తే ఎన్ని చుక్కలు. ఆ చుక్కలకు మా అమరుల పేర్లు పెట్టుకొంటాం మేము. ఆదమరిచి నిద్రపోయినా ఆ చుక్కల వెలుతురు మామీద కురుస్తూనే వుంటుంది."

ఆ ఉత్తరాలు, పదే పదే చదువుకొంటుంది రూతు. రూబేనూ అంతే. చాలా యిష్టంగా చదువుతాడు.

నిజానికి ఆ ఉత్తరాలే మిమ్మల్ని నిలబెడుతున్నాయి కదూ అని మేరీ సువార్త రూతుతో అంది. నిజం అంతే కావచ్చు. అట్టా కాకపోతే రూబేను మరోలా వుండొచ్చు. దేన్నో వెతుకుతున్నట్టు, పోగొట్టుకొన్నది దొరకనట్టు, అది దగ్గర లేనట్టు గడిపేవాడు. రూబేను అట్టా వున్నాడని రూతు అనుకొంటుంది గాని తన పరిస్థితి కూడా అంతే.

కాని ఎంతదూరం. అట్టా ఎంతకాలం.

ఓపిక లేదన్నాడు రూబేను. తిరిగే వోపిక లేదన్నాడు. వెతికే వోపిక లేదన్నాడు. ఓ రోజు అన్నాడు. జెస్సీని చూసొస్తానన్నాడు. ఆశ్చర్యంగా చూసింది. నేనూ వస్తానంది రూతు. ఆ మాట నవ్వు ఆపుకొంటూ అంది. నువ్వు నడవలేవన్నాడు. రూతుకు నవ్వు ఆగలేదు. వోపికంతా తెచ్చుకొని నవ్వింది. ఎందుకట్టా నవ్వుతావన్నాడు. మేరీసువార్తను పిలిచాడు. నేను వాడి దగ్గరకు వెళ్ళొస్తానంటే ఈ అమ్మాయి వస్తానంటుంది. నడవగలదా. చెప్పు అని అన్నాడు. మేరి కళ్ళల్లో నీళ్ళు. ఆ నీళ్ళు నవ్వుతున్నామో, ఏడుస్తున్నామో తెలీదు.

గాలిలో మార్పు వస్తోంది.

కిరణాలు కొండల్లో దాగిపోవటానికి అట్టే సమయం లేనట్టుంది.

రూబేను

అందమైన రూబేను. అద్భుతమైన రూబేను. ఎంత ముద్దెట్టింది ఆ వంటిని. పదే పదే విసుగు పుట్టేంతవరకు.

జ్ఞాపకాలు

నిశ్శబ్ద జ్ఞాపకాలు. ఆకులు రాలుతున్న శబ్దాలు. ఎండిన ఆకు ఎటో కొట్టుకపోవడానికి ముందు చేసే సందడి జ్ఞాపకాలు.

ఆ రోజు. సందె చీకట్లు కురిసే వేళ.

రూబీని అడిగాడు. జెస్సీని అడిగాడు. పదే పదే అడిగాడు. వాడి ఉత్తరాలు తీసుకురమ్మన్నాడు. అవి తన పక్కనే వుంచమన్నాడు. వాడు వస్తే బాగుండు అని అన్నాడు.

ఆ రాత్రి

తన పక్కనే కూర్చోమన్నాడు. పక్కనే కూర్చొంది.

"నిద్రపో రూతూ" అని అన్నాడు.

నిద్ర రావటం లేదంది.

"నాకొస్తోంది పడుకో నా రూతూ" అని అన్నాడు.

ఆ మాట ఏడ్పించింది.

"పడుకొంటా రూతూ" అని మళ్ళీ అన్నాడు

అట్టాగే చూసింది. ఆ వళ్ళంతా ముద్దాడింది. పెదాలపై సన్నని నవ్వు. కళ్ళలో బలహీనమైన కన్నీటి ధార.

పాత మనిషి. బొత్తిగా పాతమనిషి. ప్రేమనీ, మమతనీ, బంధాన్ని అనుబంధాన్ని అంత తొందరగా తెంచుకోలేని పాతమనిషి. బొత్తిగా పాతమనిషి.

హనుమకొండ వచ్చాడు. అప్పుడు తనకోసం రాలేదు. తాత పాట కోసం వచ్చాడు. పాటతోనే ఆగలేదు.

ఎంత నిశ్శబ్దంగా వచ్చాడు తన జీవితంలోకి

ఎంత నిశ్శబ్దంగా వెళ్ళిపోతున్నాడు.

ఏ సద్దూ లేదు. చూస్తూనే వెళ్ళాడు. నిద్ర వస్తుందంటూనే వెళ్ళాడు.

అట్టాగే చూస్తూ కూర్చొంది రూతు. తెల్లవారిందాకా. అట్టానే. ఇంట్లో వున్న మేరీ సువార్తకు కూడా తెలీదు రూబేను ఆ రాత్రే వెళ్ళిపొయ్యాడని.

ఓ చిరుజల్లు

ఆ తర్వాత

సూర్యాస్తమయం

ఓ జ్వాల

జీవితం ఎంత భీకరమైన పోరాటం.

జీవితం నిజంగా ఓ యుద్ధభూమి. రూబేను అదే చెప్పి వెళ్ళాడు. జెస్సీ అదే చెబుతో పోరాడుతున్నాడు.

జ్ఞాపకాలు..... వాస్తవాలు .....

నిన్న తన మనుషులు చేసిన యుద్ధం తాలూకూ జ్ఞాపకాలు. ఈ రోజు తన బిడ్డలు చేస్తున్న యుద్ధం తాలూకూ వాస్తవాలు. మలుపు మలుపుకు పూసిన జ్ఞాపకాలు. పూసిరాలిన జ్ఞాపకాలు రాలిమొలిచిన వాస్తవాలు.

కథలు మలుచుకొన్న జ్ఞాపకాలు.

కవితలు అల్లుకొన్న జ్ఞాపకాలు.

కల్లోలం సృష్టించుకొన్న వాస్తవాలు.

అంతా యుద్ధమే.

ఈ వల్సూ, యిల్సూ, ఆకలి, చెట్టూ, చేను.... అంతా..... అంతా.....

అంతా.... అంతా యుద్ధమే.

ప్రాణం గుప్పెట్లో పెట్టుకొని పరుగు తీసిన ఎల్లన్న మొదలు ప్రజలకోసం సాయుధమైన జెస్సీదాకా.

మడవమీద కాలుపెట్టి పారపైకెత్తిన సుభద్ర మొదలు నీళ్ళలో చేపలా జనంలో కలిసిపోయిన రూబీదాకా.

అంతా యుద్ధమే. ఓ సుదీర్ఘ పోరాటమే.

ఏది జరుగుతోంది యిక్కడ ఏది ఎట్టా ముందు నిలుస్తోంది యిక్కడ.

జీవితం అనే పదానికి ఈ మనుషులు యిన్నేళ్ళ అనుభవం ఏ అర్థాన్ని ముందు వుంచింది.

యుద్ధం. కేవలం యుద్ధం. తవ్వాల్సింది పూడ్చాల్సింది చాలా వుందన్న చంద్రప్ప మాట చెప్పాడు రూబేను. తవ్వినా యుద్ధమే. పూడ్చినా యుద్ధమే. ఈ నేల మీద పొద్దు పొడిచి పొద్దుకూకే దాకా. అంతా యుద్ధమే.

రూతు అట్టాగే అనుకొంటుంది.

రూబేను వెళ్ళిపొయ్యాక. ఒంటరిగా కూర్చొన్నప్పుడు.

ఒంటరి చుక్కలోకి చూస్తున్నప్పుడు. మేరీ సువార్త కళ్ళల్లోకి చూస్తున్నప్పుడు. సహస్రాబ్ది అంచున కూర్చొని. ఈ శతాబ్దిని ముందు వుంచుకొని.

అట్టాగే అనుకొంటుంది.

తాను అనుకున్నది పంచుకోడానికి రూబేను లేడు. మేరీ సువార్తకు చెప్పుకోవాలనుకుంటుంది. చెప్పుకోవచ్చు. వింటుంది. తాను ఏది చెప్పినా జాగ్రత్తగా వింటుంది. కాని మాట్లాడదు. యిమ్మానుయేలు ఆమెకు దూరమైనప్పటి నుంచీ అంతే. రూబీతో పంచుకోవచ్చు. కాని తనతో మాట్లాడే సమయం రూబీకి వున్నట్లు లేదు. చివ్వరికో నిర్ణయానికొచ్చింది. జెస్సీకే చెప్పాలనుకొంది. తన మనసులో మాట తన మనవడికే రాయాలనుకొంది. బహుషా అదే తాను రాస్తున్న చివ్వరి ఉత్తరం కావచ్చు అని అనుకొంది.

కాయితం కలం తీసుకొని కూర్చుంది. రూబేను రాసుకొనే టేబుల్ ముందు కూర్చొంది. కిటకీలోంచి చూస్తే చుక్కల ఆకాశం. ముద్దల మనవడికి అని రాసింది. నచ్చలేదు. రూబేను రూతుల ముద్దుల మనవడు అని రాసింది. ఆ మాట రాసేప్పుడు ఆవలపాడులో తన కడుపులో తలపెట్టి రూబేను గుండెలపై కాళ్ళుపెట్టిన జెస్సీ గుర్తొచ్చాడు. పొన్నంగిపిట్ట. ఎన్నెలదిన్నిలో యిద్దరి మధ్యా వాలిన పొన్నంగి పిట్ట. అందమైన చిన్ని చిన్ని రెక్కల పిట్ట. నవ్వు తన్నుకొచ్చింది. గుండెలనిండా నవ్వు. కళ్ళనిండా నవ్వు. ప్రియమైన పొన్నంగి పిట్టకు అంటో మొదలెట్టింది.

ప్రియమైన పొన్నంగి పిట్టకు,

ఈ ఉత్తరం రాస్తున్నప్పుడు మీ అమ్మ నా పక్కనే వుంది. అడిగానని చెప్పమంది. నీ ప్రేమపావురం మాత్రం ఎక్కడ ఎగురుతోందో నాకు తెలీదు. కలిసి చాలారోజులైంది.

సమాధుల వనంలో నీ తండ్రికి ఆ వైపున నీ తాత నిద్రపోతున్నాడు. నాకూ అట్టాగే అన్పిస్తోంది. ఈ వైపు జాగా వుండనే వుంది.

నిజానికి నా ప్రయాణం చిన్నది కాదు. మీ తాతే నాకన్నా కాస్తముందు అలసిపొయ్యాడు. కాస్త ఆగవయ్యా నేనూ వస్తానన్నాను. నీకు వో ఉత్తరం ముక్క రాసి పడేసి వస్తానన్నాను. వినలేదు.

మీ నాన్న యింటిని విడిచి వెళ్ళినప్పుడు మా జీవితం నిండా విషాదం అలుముకుంది. వాడి ప్రాణం వాడి శరీరాన్ని వదలి ప్రజల్లో కలిసిపోవటం చూసినప్పుడు అంత విషాదంలోనూ గర్వమే తొంగి చూసింది మాలో.

మేము వాడికి ఏ వారసత్వం యివ్వాలో తేల్చుకోకముందే వాడే మాకు వారసత్వాన్ని యిచ్చాడు. వాడు నమ్ముకొన్న పోరాటం తల్లిదండ్రులకు బిడ్డలు వారసత్వాన్ని యిచ్చేలా చేసింది. తనని కన్నవాళ్ళకి వారసత్వాన్ని యిచ్చాడు. తాను కన్నవాళ్ళకీ వారసత్వాన్ని యిచ్చాడు.

మీరంతా పోరాటాన్ని జీవితంగా ఎంచుకొన్నారు. యిక్కడ ఈ భూమ్మీద మనిషి హృదయంలో మంచి భవిష్యత్తు మీద విశ్వాసాన్ని పెంచేందుకు మీరు కదిలారు. అట్టా పెంచటం మీ బాధ్యతగా భావించారు. మీ కర్తవ్యం అని ప్రకటించారు.

అందుకు ఎన్ని కష్టాలు వచ్చినా సహిస్తారు మీరు. భరిస్తారు మీరు. వాటిని అధిగమిస్తారు. అవసరమైతే ప్రాణం యిస్తారు. అట్టా మీరు గెలుస్తూనే వుంటారు. పోరాడేవాడు వోడిపోయేందుకు పోరాటం చెయ్యడు. అతన్ని అంతం చెయ్యటం జరిగే పని కూడా కాదు. అతన్ని లేకుండా చెయ్యటం ఎవ్వరివల్లా కాదు. మీ జీవితం మొలిచే మొక్క లాంటిది. పండే పంట లాంటిది. అద్భుతమైన ఆకాశ నక్షత్రం పంచే వెలుతురు లాంటిది. శాశ్వతమైంది.

మీరు నూతన మానవుణ్ణి కల కంటున్నారు. నూతన సమాజాన్ని కలకంటున్నారు. ఆ చారిత్రక సత్యంకోసం సర్వ కాలాల్లో, సకల దేశాల్లో పోరాడే వాళ్ళంతా కలలు కంటూనే వుంటారు. ఆ కలలన్నీ వో విప్లవ సంకలనం. ప్రేమ, పోరాటం, త్యాగం ఆసంకలనం నిండా గీతాల్లా వుంటాయి. విజయాన్ని చవిచూస్తారు మీరు. నా విశ్వాసం చిన్నది కాదు. ప్రపంచాన్ని జయిస్తారు మీరు. నా నమ్మకం వమ్ముకాదు.

నేను పుట్టినా, పుట్టకపోయినా, నేను బతికినా, బతకకపోయినా, నేను మరణించినా, మరణిస్తున్నా, ఈ దేశంలో పట్టించుకొనే దెవరు అని ఒకప్పుడు అనుకొనేదాన్ని. కాని యిప్పుడా నిరాశలేదు. నన్ను పట్టించుకొనేందుకు మీరున్నారు. ఈ వంటిని, ఈ ఆకలిని, పట్టించుకొనేందుకు మీరు వున్నారు. ప్రేమ, కరుణ, దయ మీ మాటల్లో వున్నాయి. మీ హృదయం నిండా అవి విన్పిస్తుంటాయి. అదో సామూహిక మానవ ప్రేమ. ఆ ప్రేమే మీరు చేసే పోరాటం. అది సాహసోపేతమైది. మనిషి పక్షాన దృఢంగా నిలబడే చారిత్రక బాధ్యత అది.

నేను యింత సుదీర్ఘ ప్రయాణం చేసింతర్వాత కష్టజీవుల సమాజ విలువల కోసం మీరు చేసే నిరంతర కృషిని చూసి ఉత్తేజం పొందుతున్నాను. పోరాటం వీరుల్ని, కొత్త తరహా మానవుల్ని సృష్టిస్తుందనే మాటని నూటికి నూరుపాళ్ళూ నమ్ముతున్నాను. నా జీవితం మొత్తంలో అనేక సామాజిక ఘటనలు చూశాను. చారిత్రక పరిణామాలూ చూశాను. అన్నిటికీ నా జీవితం స్పందిస్తూనే నడిచింది. ఆ స్పందనే నన్ను మీలో కలిపింది.

ఈ సహస్రాబ్ది అంచున కూర్చొని నేను విన్న ఈ శతాబ్ది తొలిదినాల్ని గుర్తు తెచ్చుకొంటున్నాను. నేను పాల్గొన్న ఈ శతాబ్ది మధ్య దినాలని ముందుంచుకొంటున్నాను. వీరుల త్యాగాల్ని, క్రూరుల దుర్మార్గాన్ని ఈ శతాబ్దం చివ్వరి రోజుల్లో చూస్తూనే వున్నాను. ఈ సందర్భంలోనే మనిషి పోరాట క్రమం దశల చిత్రణ ముందు నిలుస్తోంది.

గతిస్తున్న శతాబ్దాన్ని మీ త్యాగానికి, రాబోయే శతాబ్దాన్ని మీవిజయానికి అంకితం చేస్తున్నాను.

వుంటానురా నా ప్రియమైన పొన్నంగి పిట్టా. వుంటాను. మీ తాత వుండమన్నా వుండకుండా వెళ్ళాడు. వెళ్ళినవాడు వూరుకోడు. యింకా రాలేదేం ఈ అమ్మాయి అని ఎదురు చూస్తుంటాడు. ఆ అబ్బాయి నాకు బాగా తెలుసు. నిజంగా ఎదురు చూస్తుంటాడు. యిక వుంటాను.

నీ ప్రియమైన
ఎన్నెలపిట్ట

గమనిక : ఈ ఉత్తరం నీకు అందుతుందో లేదో నాకు తెలీదు. అందినా ఎప్పుడు అందుతుందో. మడతల్లో దాగివచ్చే నీ చిన్ని గుండె చదివే అవకాశం నాకు వుంటుందో వుండదో. అందుకే ఒక్క చిన్నకోర్కె కోరుతున్నాను. నా సమాధిమీద ఈ క్రింది మాటలు నాలుగు మాటలు చాలు. రాసేలా చూడు.

**"ఆమె జ్ఞాపకం యుద్ధంలో విశ్రమించింది."**

---

# చివరి మాట

జీవితాన్ని ఎన్ని పేజీల్లోనైనా రాయొచ్చు 'అంటరాని వసంతం' ఈ కొద్ది పేజీలలో పూర్తయ్యే జీవితం కాదు నిజానికి పూర్తి కాలేదు కూడా. యిమ్మానుయేలును, జెస్సీని, రూబీని యింకా చెప్పాల్సి వుంది ఆ ముగ్గురి పూర్తి జీవితం రూతు చెప్పలేక పోయింది. యిమ్మానుయేలు తన బిడ్డ. గుర్తొస్తే జ్ఞాపకానికి అడ్డొస్తాడు జెస్సీ మనవడు. గుర్తొస్తే పరుగెత్తి మనవణ్ణి కలవాలనిపిస్తుంది అందుకే వాళ్ళని పూర్తిగా చెప్పలేకపోయింది నవలలో దాదాపు మౌనంగా వుండిపోయిన మేరీ సువార్త వుంది. చిన్న మనిషి కాదు భర్తని, బిడ్డని ఉద్యమానికి అంకితం చేసింది. ఆమె మౌనాన్ని పోగొట్టితే చాలు యిమ్మాను యేలు, జెస్సీ, రూబీ సంపూర్ణంగా ముందు నిలుస్తారు
విశ్రమించింది రూతు జ్ఞాపకం మాత్రమే మేరీ సువార్తను కదిలించాల్సి వుంది కదిలిస్తే అంటరాని వసంతం మరో భాగం మొద లౌతుంది అప్పుడు జీవితం యిన్ని పేజీల్లోనే యిమిడి వుంటుందని చెప్పలేం